# శ్రీమలయాళ సద్గురు గ్రంథావళి

## ఎనిమిదవ సంపుటము

### లోకోద్ధారకము

ప్రకాశకులు

**శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘము**

**శ్రీ వ్యాసాశ్రమము**

చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

2001

శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘ ప్రచురణ - 2001 సం
ప్రతులు : 2000

వెల :-

ప్రతులకు :
మేనేజర్, శ్రీవ్యాసాశ్రమం
వ్యాసాశ్రమం పోస్టు, ఏర్పేడు మార్గం
చిత్తూరు జిల్లా - ఆంధ్రప్రదేశ్ - 517621

ముద్రణ
**శ్రీపారాశర్య ముద్రణాలయము**
శ్రీ వ్యాసాశ్రమం, చిత్తూరుజిల్లా

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం ప్రచురిస్తున్న ఆధ్యాత్మిక గ్రంథాలు పాఠకలోకానికి సుపరిచితాలే. ఈ గ్రంథాలను భక్తులు మిక్కిలి శ్రద్ధతో పఠిస్తున్నారు. ఆధ్యాత్మిక సారస్వత ప్రచారం ద్వారా సాటి లేని సేవ చేసే సంస్థగా ఆశ్రమం ప్రసిద్ధి వహించింది.

మహర్షి - సద్గురు శ్రీ మలయాళస్వాములవారు స్వయంగా రచించిన గ్రంథాలు ఆశ్రమప్రచురణలలో అత్యంత విశిష్టమైనవి. అవి పలు సార్లు ముద్రణ పొంది అనన్య సామాన్యమైన ప్రచారం పొందాయి. జిజ్ఞాసు జనానీకంలో జడత్వాన్ని తొలగించి చైతన్యం కల్గించడంలో విజయం సాధించాయి.

శ్రీవారి రచనలు ప్రస్తుతం వివిధ పరిమాణాలలో నానాగ్రంథాలుగా ముద్రింపబడివున్నాయి. వీటినన్నింటిని ఒకే పరిమాణం కల గ్రంథ రాశిగా 'శ్రీమలయాళ సద్గురు గ్రంథావళి'' అన్న పేరుతో ముద్రించడం మంచిదని అభిజ్ఞులు సూచించారు. ఈ సూచనను పూజ్యశ్రీ విద్యానందగిరి స్వాములవారు ఆమోదించారు.

శ్రీవారు గోగర్భములో తపస్సు చేసే సమయం 1919లో రచించిన సప్తవేదాంత తమోభాస్కరం ఇందులో మొదటి సంపుటమవుతుంది. ఇంచుమించు ఆగ్రంథాన్ని పోలిన పరిమాణంలోనే తక్కిన సంపుటా లుంటాయి. ఇలా ప్రచురిస్తే ఒక్కొక్కటీ సుమారు నాలుగువందల పుటలు గల సంపుటాలు ఇరువదికి పైగా సిద్ధమవుతాయి.

2001వ సంవత్సరంలో జరుగనున్న శ్రీవ్యాసాశ్రమస్వర్ణజోత్సవ

శుభసందర్భంలో పై సంపుటాలను విడుదల చేయాలని శ్రీస్వాములవారి సమ్మతితో వజ్రోత్సవ నిర్వాహక సంఘం వారు నిర్ణయించారు. ఈ సంపుటాల క్రోడీకరణ, ముద్రణ శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారి సంపాదకత్వం క్రింద జరుగుతున్నది.

భగవదనుగ్రహంతో, శ్రీసద్గురుదేవుల ఆశీర్వాదంతో, భక్తుల ప్రోత్సాహంతో ఈ గ్రంథ ప్రచురణ ప్రణాళిక విజయవంతం కాగలదని ఆశిస్తున్నాము.

శ్రీ వ్యాసాశ్రమం
1-3-2000 ప్రకాశకులు

# ధర్మ వాక్యములు

1. మానవుని ఉచ్ఛ్వాసనిశ్వాసములు సరిగా నడచుచుండిన యేలాగున జీవితము సుఖముగా జరుగునో, ఆలాగున తన నియమములను సరిగా ఆచరించువాడు గూడ ఇహపరసౌఖ్యముల నొందును.

2. సృష్ట్యాదినుండి సూర్యాదిగ్రహములు తమ నియమములను తప్పక యేలాగున సంచారమును చేయుచున్నవో, దానివలనే భూలోకము సుఖముగా నుంటున్నదో, ఆలాగున తమ కేర్పడిన కార్యములను కాల సమయములు తప్పక జేయువారు గూడ ఈ జీవితము లోనే పరసుశాంతిని పొందగలరు.

3. సస్యములను సరిగా పోషించిన యేలాగున ఫలముల నిచ్చువఱకు చెట్లు, పైర్లు నిలిచియుండునో, ఆలాగున మానవుల కేర్పడిన కృత్యములను సరిగా ఆచరించుచు వచ్చినచో ఈ జన్మములోనే మోక్షఫలము నొసంగువఱకు శరీరము నిలుచును.

4. కర్ణధారుడులేని పడవ యేలాగున గమ్యస్థానమును జేరక చెడిపోవునో ఆలాగున తురీయజ్ఞానము లేని వాడు (చుక్కానిలేని ఓడ వందంబున) సరిగా గమ్యస్థానమును చేరజాలడు.

5. గ్రహావేశము గలవారు తమ నిజస్వరూపమును తెలియనొల్లక భూతముల స్వభావమును గల్గియుందురు. ఆలాగున అవిద్యాదోషముండువఱకు మానవులు తమ దైవస్వభావమును తెలిసికొనజాలరు. గ్రహవిముక్తి గల్గిన వెంటనే నిజస్వరూపమును తెలిసికొను నటుల అవిద్య తొలగునప్పుడు తమ దైవస్వరూపము గోచరమగును.

6. దైవసాక్షాత్కార జ్ఞానము గలుగువఱకు తమ కేర్పడిన పని పూర్తి అయినదని తలంచి అజాగ్రత్తపడకూడదు.

7. సకాలమున వర్షము కురిసిన సస్యములు సమృద్ధిగా పండి జనులు ఏలాగున సుఖమును పొందగలరో ఆలాగున మీ కేర్పడిన కార్యములను సకాలమున నిర్వహించెదరేని మీ జీవితమంతయు సౌఖ్యముగా నుండగలదు. ముక్తియున్ను సులభముగా సిద్ధించును.

8. జ్యేష్ఠపుత్రుడు తక్కిన పిల్లల నందఱిని ఏలాగున తండ్రివలె సంరక్షణ జేయవలసియున్నాడో, ఆలాగున జీవ జంతువులన్నిటిలోను మనుజుడు దైవమునకు జ్యేష్ఠపుత్రుని వంటివాడు కాన మానవుడు తక్కిన జీవరాశిని తండ్రివలె సంరక్షింపవలెను. ఇట్టి భావముతో నడుచువాడు దైవసదృశుడగును.

ఓం

# పీఠిక

దైవాత్మ స్వరూపులగు ఆత్మసోదరీసోదరులారా! ఈ గ్రంథస్థ బ్రాహ్మణ బ్రాహ్మణేతర సంవాదము శ్రీ పింగళనామ సంవత్సరములో మాఘశుద్ధ త్రయోదశి మొదలుకొని కొద్ది రోజులు జరిగెను. అప్పటినుండియు దీనిని గ్రంథ రూపముగా జేయుటకు పలు సార్లు సంకల్పము గలిగినను, అనేకులు జాతి యొక్క వినికిడిని గురించి, ఒక్క గ్రంథము వ్రాయవలయునని కోరుచుండినను, అనేక స్థలములలో అనేకులీ విషయమై ప్రశ్నించుచుండినను, దానియందు ప్రవేశించుట బాగు లేదని తలంచి వర్ణాశ్రమములను గురించియు, మతముల గురించియు ఏమియు చెప్పదలంచలేదని అందరికిన్ని సమాధానము ఇచ్చుచు ఆ విషయములో తటస్థముగా నుండుటయే నా యాశయమని తెలుపుచునే వచ్చితిని. సాధువులై సన్న్యాసులై యుండువారే నిజమును దెలుపక పోయిన ఇక బద్ధులై గృహస్థులై యుండువారా ధర్మమును బోధించుట యని కొందరు అప్రీతితో వచించుచుండిరి. జాతియొక్క నిర్ణయము కులము ననుసరించియా లేక గుణము ననుసరించియా అనియే పై జెప్పిన వారందరియొక్క యాశయమై యుండెను. ఈ యుపాధికి ఈశ్వర కృపవల్ల మతవైషమ్యము గాని, జాతిద్వేషము గాని జన్మనా గలిగి యుండలేదు. మరియు శ్రీ వ్యాసాశ్రమమునకు సంబంధించిన భక్తులలో చాతుర్వర్ణ్య స్త్రీపురుషులే గాక, హరిజనులలో గల పురుషులు, స్త్రీలు గూడ గలిగియున్నారు. అంతేగాక మహమ్మదీయులలోను, క్రైస్తవులలోను, ఆత్మ సదృశ సోదరులగు మిత్రులుగూడ చాలమంది యున్నారు. అట్టి యీ సర్వజన సోదరభావము గల సంఘమున ద్వేషము ఉత్పత్తి అగునేమో యని సందేహముతో నింతవరకును ఈ విషయము పుస్తకరూపముగా జేయకుండుటకు కారణమైనది. అయినను మరల మరల ఆత్మ మిత్రులు ప్రేరణజేయుచుండినను మనస్సును సమాధానపరచుచునే వచ్చితిని. ఏలన జాతిని గురించి నిర్ణయించునపుడు అనేకులకు అభిప్రాయ భేదము గలుగుట నైజముగానే యుండును. అయితే ఆత్మలోగల సత్యమును చెప్పకపోయిన అదిన్ని ఒక దోషమే యగును. చెప్పినచో కొందరికి అనిష్టము గూడ గలుగవచ్చును. ఈ విషయమై సర్వేశ్వరుడిచ్చిన బుద్ధికి తగిన శాస్త్ర పరిశోధన జేయుట బాగని తలంచి

ఈ గ్రంథములో కనపరచిన పుస్తకములను చూడడమైనది. మరియు ఈ పుస్తకములో నిరూపించిన మతముల యొక్క ఆవిర్భావమున్ను, తిలకించడమైనది. అప్పుడు శ్రీ యోగవాసిష్ఠమున ఈ శ్లోకము కనిపించెను.

యుక్తి యుక్తముపాదేయం వచనం బాలకాదపి।
అన్యత్తృణ మివ త్యాజ్య మప్యుక్తం పద్మజన్మనా ॥

యుక్తి యుక్తమై చెప్పెడు వాక్యము, బాలకుడు వచించినను అది గ్రహించదగినది. అట్లు యుక్తియుక్తముగాని వచనము బ్రహ్మదేవుడు చెప్పినదైనను తృణీకరింప వలయునని యుండుటవల్ల ఇది వ్రాయుటకు నిశ్చయించడమైనది.

అట్లుండియు, మరల పలు సార్లు ఈ గ్రంథము రచించుటవల్ల కొందరిపై రాగమును, కొందరిపై ద్వేషమున్ను ఆత్మలో గలుగునా యనియు, కొందరికి ప్రీతియు, మరికొందిరి కప్రీతియు, ఈ యుపాధియందు నుత్పత్తి యగునా యనియు పలు మార్లు యోచించడమైనది. అట్లుండు కాలమున ఒక రోజున ఒక సమయమున రాగ ద్వేషములకు లోబడక, నిజాత్మ భావములో నిలుకడ గలిగి సత్యమని తోచిన దానిని లోకమునకు తెలుపుట ధర్మమను ఒక భావము హృదయమందావిర్భవించెను. అప్పటినుండి దీనిని వ్రాయుటకు బూనడమైనది. దీని యొక్క ఆదినుండి అంత్యము వఱకు, ఒక జాతియందు ద్వేషమున్ను, ఒక జాతియందు ప్రీతియున్ను గలుగనీయక స్వకల్పితమునుదేమాత్రము ఆధారపడక సాధ్యమైనంతవఱకు శాస్త్రమందుగూడ నాధారపడి, యిది గ్రంథరూపముగా వ్రాయబడినది. సమత్వబుద్ధి లేనివారికి ఆత్మయందు సదా సమాధాన పరమగు శాంతియు, ప్రసన్నతయు, సర్వాత్మైక బుద్ధియు గలుగదు. ఈ కారణమే యిన్ని సంవత్సరముల నుండి దీనిని వ్రాయకపోవుటకు కారణమైనది. దీనికి సంబంధించిన విషయములన్నియు, ప్రథమకాండము లోనే తెలుపబడి యున్నవి. సర్వమత సమన్వయము, సర్వజన సోదరభావము ఈ వ్యక్తికి ఎల్లప్పుడున్ను పరమానందదాయకమై యుండును. ఇక దీనియందు ప్రమాదవశమున ఏదైన గలిగియుండినచో, సత్య దృష్టియు ఆత్మ నిష్ఠయుగల మహాశయులు దెలిపినచో వందనపూర్వకముగా నందుకొని తెలిపినవార్లపై కృతజ్ఞత గలిగి, మరు ముద్రణమునందు ఈ గ్రంథమున చేర్చేలాగున యత్నము గలిగి

యున్నది. కేవలము శాస్త్ర దృష్టితో మాత్రము చూడక ఆత్మదృష్టితోను చూడవలసియుండును. ఏలన శాస్త్రములు బహు ముఖములను సంగతి విజ్ఞులెరిగియే యున్నారు. దానికి గల కారణమును ప్రథమకాండమందే నిరూపించడమైనది. శాస్త్రము లనేకముఖములు కానిచో, ఇన్ని మతములు లోకములో ఏర్పడుటకు కారణముండదు. ఒక సనాతన మతములోనే యిన్ని మతము లేర్పడుటయున్ను, ఒక గ్రంథమునకే ఒక్కొక్క మతమువారు ఒక్కొక్క భావముతో అర్థము వ్రాయుటయున్ను శాస్త్రదృష్టిలో అనేకత్వమును నిరూపించుచున్నది. ఈ విషయములున్ను ప్రథమకాండమునందే శక్తిగొలది సత్యమునకున్ను, దైవమునకున్ను, ఆత్మవిశ్వాసమునకున్ను దూరము పోకుండా యుండేలాగున ఇది వ్రాయడమైనది.

కావున విజ్ఞులు ఏదైన అభిప్రాయము తెలుపవలసి యుండిన ఈ గ్రంథము నా మనోవీరామాగ్రముగా సత్యదృష్టితో చదివిన బాగుండును. రక్త, కృష్ణ, పీతవర్ణములుగల అద్దముల ద్వారా చూచువారికి, దర్పణము రంగుల ననుసరించి దృశ్యము కనుపించునేగాని, వస్తువుయొక్క నిజ స్వరూపము గోచరింపదు. స్వచ్ఛమైన దర్పణముద్వారా చూచువారికే వస్తువుల యొక్క యెరుపు, నలుపు, పసుపు రంగులు స్పష్టముగా గోచరించునట్లు ఏ మతముతో గాని, యే కులముతో గాని సంబంధింపక, శుద్ధమై, స్వప్రకాశమై వెలుగుచుండు నాత్మలో నిలుకడ గలిగి చూచువారికే నిజము గోచరించును. ఇక ఈ విషయమై విస్తారముగా వ్రాయబూనలేదు. విజ్ఞులగు బ్రాహ్మణ బ్రాహ్మణేతరులగు సోదరుల సంభాషణములు గ్రంథరూపముగా జేయవలసి వచ్చినందుచే కొన్నింటిని త్యజించుటయు, మరికొన్నిటిని గ్రహించుటయు గలిగియున్నది. లేనిచో గ్రంథ రూపముగా జేయుటకు అనుకూలపడునది గాదు. ఒక్కొక్క సమయమున వారుభయులలో ఒక్కొక్కరికిన్ని కొన్ని కోపావేశ వాక్యములు గలిగినవి. వానిని మాత్రమే త్యజించడమైనది. గ్రంథపూర్తికొరకు కొన్నిటిని చేర్చుటగూడ సంభవించెను. అంతేగాని యుభయుల లక్ష్యము నుండి యేమాత్రమైన చలింపకనే ఇది పూర్తి జేయడమైనది.

లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు.

తవ చరాచర సుఖాభిలాషి
శ్రీ మలయాళ స్వామి

# విషయ సూచిక

ఓమ్

# లోకోద్ధారకము

## శ్రుతికాండము



ఉ. ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్। ఆనన్దాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే। ఆనన్దేన జాతాని జీవన్తి। ఆనందం ప్రయన్త్యభిసంవిశన్తీతి। సైషా భార్గవీ వారుణీ విద్యా।పరమే వ్యోమన్ ప్రతిష్ఠితా। య ఏవం వేద, ప్రతితిష్ఠతి। అన్నవా నన్నాదో భవతి। మహాన్ భవతి ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన। మహాన్ కీర్త్యా ॥

టీ॥ ఆనందః = ఆనందము, బ్రహ్మేతి = బ్రహ్మస్వరూపమని, వ్యజానాత్= తెలిసికొనెను, ఇమాని = ఈ, భూతాని = భూతములు, అనన్దాద్ధ్యేవ = ఆనందమునుండియే, జాయన్తే ఖలు = పుట్టుచున్నవిగదా! జాతాని = పుట్టిన భూతములు, ఆనందేన = ఆనందముచేత, జీవన్తి = బ్రతుకుచున్నవి, ఆనందం= ఆనందమును గూర్చి, ప్రయన్తి = పోవుచున్నవి, అభిసంవిశన్తి = అంతట ఆనంద స్వరూపమునే ప్రవేశించుచున్నవి, (ఆనంద స్వరూపమే యగుచున్నవి) ఇతి= సమాప్తము, వారుణీ = వరుణునిచేత జెప్పబడిన, భార్గవీ = భృగువు చేత దెలిసికొనబడిన, సా = ఆప్రసిద్ధమగు, ఏషా = ఈ, విద్యా = పరబ్రహ్మవిద్య, పరమే = శ్రేష్ఠమగు, వ్యోమన్ = ఆకాశమందు, (అనగా హృదయాకాశ గుహయందు, పరమానందాద్వైతమునందు) ప్రతిష్ఠితా = ఉంచబడి యున్నది. ఆ పరబ్రహ్మ విద్య (అన్నమయమగు నాత్మను అధిష్ఠానము జేసికొని ప్రవర్తించునది) యః = ఎవడు, ఏవం = ఈ ప్రకారము, (ఈ పూర్వము జెప్పిన తపస్సాధనము చేత ఈ క్రమమునే అనుసరించి ప్రవేశించి ఆనంద స్వరూపమగు పరబ్రహ్మమును) వేద = తెలిసికొనుచున్నాడో, సః = వాడు, (ఈ ప్రకారము పరబ్రహ్మ విద్యా ప్రతిష్ఠాపనము వలన, ఆనందమగు

పరబ్రహ్మమునందు ) ప్రతితిష్ఠతి = ఉంటున్నాడు ( స్థితిని పొంది బ్రహ్మస్వరూపమగుచున్నాడు.) అన్నవాౕ = అన్నము గలవాడును ( అన్నము గలవాడు) అన్నాదః = అన్నమును భుజించువాడును, ( అన్నమునిచ్చువాడును) భవతి= అగుచున్నాడు, ప్రజయా = సంతానముచేతను ( శిష్యులచేతను) పశుభిః = గవాశ్వాది పశువులచేతను, బ్రహ్మవర్చసేన = బ్రహ్మతేజస్సు చేతను, ( శమ, దమాది నిమిత్తమగు తేజస్సుచేత) మహాౕ = గొప్పవాడును, కీర్త్యా = ఖ్యాతి చేతను, మహాౕ = అధికుడును, భవతి = అగుచున్నాడు.

తా॥ ఆనందమునుండియే సమస్త భూతములు బుట్టి, ఆ పుట్టిన భూతములు ఆనందముచేతనే జీవించుచు, అంతమునందు ఆనందమునుగూర్చి పోయి, తామంతటను ఆనందస్వరూపమై ప్రవేశించి ఆనందమే యగుచున్నవి. కనుక ఆనందమే పరబ్రహ్మస్వరూపముగా దెలిసికొనెను. ఇట్లు భృగువు తపస్సుచేత పరిశుద్ధాంతరంగుడై ప్రాణాదులయందు సంపూర్ణముగా 'యతో వా ఇమాని ' అను శ్రుతిచే జెప్పబడిన బ్రహ్మలక్షణమును చూడనివాడై, మెల్లమెల్లగా నంతరమునందు బ్రవేశించి, అంతర తమమగు, ఆనంద స్వరూపమైన పరబ్రహ్మమును తపస్సనెడి సాధనము చేతనే దెలిసికొనెను. ఇట్లు భృగువుచేత తెలిసికొనబడిన, వరుణునిచేత జెప్పబడిన, ఆ ప్రసిద్ధమగు ఈ పరబ్రహ్మవిద్య శ్రేష్ఠమగు హృదయ గుహయందలి పరమాకాశము నందుంచబడియున్నది. ఈపరబ్రహ్మ విద్యను ఈ పూర్వము జెప్పిన తపస్సుచేత, నీ ప్రకారముగా దెలిసికొనినవాడు శ్రేష్ఠమై ఆనందస్వరూపమగు బ్రహ్మమునందు స్థితిని జెంది పరబ్రహ్మ యగుచున్నాడు. ఇట్టి బ్రహ్మవేత్తకు దృష్టఫలమేమి యనిన ఆ బ్రహ్మవేత్త అన్నము గలవాడును, అన్నమును దానము జేయువాడును, తేజోవంతుడును, పుత్రాది సంతానముచేతను, శిష్యాదులచేతను, గవాశ్వాది పశుసంపత్తిచేతను, శమ దమాదులవలన పుట్టిన తేజస్సుచేతను, లోకమునందలి ఖ్యాతిచేతను మిక్కిలి శ్రేష్ఠ డగుచున్నాడు.

బ్రహ్మనిష్ఠులకు దృష్టాదృష్టములగు రెండు ఫలములు గలవు. దృష్టఫలమనగా ప్రస్తుతము గనుపించెడు అన్నదానము, ఉత్తమ శిష్యసమూహము, గవాదిపశువులు, గొప్ప యశస్సు మొదలగునవి యగును. అదృష్టఫలము నిరతిశయానందమగు ముక్తిపదము. ప్రపంచ విద్యవలన దృష్టఫలమగు సంపత్తులు గలుగును. తైత్తిరీయము భృగువల్లి– దీనియందు "య ఏవం వేద" అని యుండుటచే, ఎవడైన తపస్సు మొదలగు సాధన లుండినచో, బ్రహ్మవిద్య కర్హుడని తెలియదగినది. అట్టివారెవ్వరైనను అందరికిని పైజెప్పిన దృష్టాదృష్టఫలములు గలుగుచుండును. ఐ. సి. యస్. పరీక్షలో నుత్తీర్ణులైనచో ఉద్యోగమున్ను, దానివలన గలిగెడి అధికారమున్ను, వేతనమున్ను సమానముగానే యుండునుగదా! ఎవరైనను ఏవృక్షమును పెట్టి పోషింతురో, పోషణ ననుసరించి ఫలమున్ను అందఱికిని సమానముగానే కలుగుచుండును. ఇదే సర్వేశ్వరునియొక్క సత్యమైన న్యాయమని తెలియనగును.

అతిపుణ్యభూమియు, సిద్ధిక్షేత్రమును, శ్రీ వేంకటాచల దివ్యభూమియు నగు శ్రీ గోగర్భ పావన ప్రదేశమున, అశ్వత్థవృక్షమూలమున కట్టియుండు అరుగుపై ప్రతిష్ఠించియుండు శ్రీ విష్ణుపాద సమీపమున సత్యార్థమును బ్రకాశింపజేసెడు లోకోద్ధారకమైన యీ బ్రాహ్మణాబ్రాహ్మణ సంవాదము శ్రీ పింగళనామ సం॥ మాఘశుద్ధ త్రయోదశి పుణ్యదినమునుండి ప్రారంభింపబడెను. ఇది రామకృష్ణశర్మయను బ్రాహ్మణునకును, శివరామకృష్ణయ్య అను బ్రాహ్మణేతరునకును జరిగిన సంభాషణ విషయము. వీ రుభయులును బ్రహ్మచారులే. సంస్కృతభాషయందు బాగుగా విజ్ఞానము గలవారలే. ఇరువురును బాల్యదశను దాటి యౌవనదశారంభకాలము గలిగి యుండినవారలు. దేహము యొక్క వర్చస్సులోను, ఆకృతిలోను ఇద్దరున్ను ఒకరికొకరు దీసిపోవువారు గారు. ఆకృతిని బట్టి యితడు బ్రాహ్మణుడు, ఈయన బ్రాహ్మణేతరుడని వేఱుపరచుట కెవరికిని సాధ్యముగాని స్థితిలోనుండిరి. బ్రాహ్మణేతర ద్వేషము బ్రాహ్మణునియందు గాని,

బ్రహ్మద్వేషము బ్రాహ్మణేతరునియందు గాని లేశమాత్రమైనను గలిగియుండువారు గారు. లోకము యొక్క క్షేమోద్దేశముగలవారై, యథార్థమైన సోదరవాక్యము జెప్పునట్లు క్రియలో గూడ నుండవలయునని యుభయులును సంకల్పము గలవారలే. శాంతియు, కరుణయు, ఉపశమనము, ఉభయులున్ను గలిగియుండువారు. ఇరువురును బ్రహ్మచర్య వ్రతనిష్ఠ గలిగియుండువారే. ముఖ్యముగ భారతదేశోద్ధరణ గావలయునని పవిత్రోద్దేశము గలిగియుండువారలు.

అయితే, జాతి యనునది జన్మించిన కులమున నుసరించి యేర్పడినదా? లేక గుణముచే నేర్పడినదా ? అను సందేహ మిరువురకును ఉండెను. ఇద్దరును పాదచారులై లోకముయొక్క తత్త్వమును దెలిసికొనవలెనని నిర్మలాశయముతో భరతఖండమంతయు తీర్థయాత్రజేయువారలు. చాలవఱకు ఇంద్రియ నిగ్రహమున్ను, మిత భాషణమున్ను, నియమపాలనమున్ను, రెండు సంధ్యలలోను ధ్యానాద్యనుష్ఠానములున్ను గలవారై యుండిరి. వీరిలో బ్రాహ్మణేతరుడగు శివరామకృష్ణయ్య పాండవక్షేత్ర, గోగర్భతీర్థమున స్నానమాచరించి పై జెప్పిన శ్రీవిష్ణు పాదసమీపమున గూర్చొని శ్రీమద్భగవద్గీతా పారాయణమొనర్చి సమాప్తి జేయు కాలమున వేదముయొక్క ప్రాణమగు ప్రణవమును షోడశావర్తికొలది దీర్ఘముగ ధ్యానించి, శ్రీభగవద్గీతా పుస్తకమునకు మంత్రపుష్పమును పఠించి, పుష్పముల సమర్పించి కూర్చొను సమయమునకు కొంచెము ముందుగానే బ్రాహ్మణుడగు రామకృష్ణశర్మగారును వచ్చి కూర్చొనిరి. ఆయన బ్రాహ్మణేతరుడగు శివరామకృష్ణయ్యగారియొక్క గీతా పఠన శబ్దస్ఫుటత్వమున్ను, ప్రణవ ధ్యానము యొక్క పవిత్రభావమునున్ను మంత్రపుష్పోచ్చారణ యొక్క ప్రస్ఫుటస్వరమునున్ను జూచియు, వినియు మిక్కిలి సంతోషముగలవాడై శ్రీగీతాపారాయణము ఇంత నిర్మలభక్తితో జేయువాడు బ్రాహ్మణుడా ! లేక బ్రాహ్మణేతరుడా యని సందేహము గలిగి

మిక్కిలి ప్రేమతో బ్రాహ్మణేతరునితో తన పూర్వాశ్రమమెద్ది యని యడుగగా బ్రాహ్మణేతరుడు మిక్కిలి శాంతముతోను, ప్రసన్నతతోను, 'తాను బ్రాహ్మణేతరుడ నని' మిక్కిలి ప్రేమతో జెప్పుచు సంస్కృతమును కొంతవఱకు జదివి లోకజ్ఞానమునున్ను, ఆత్మవిజ్ఞానమునున్ను దెలిసికొను నిమిత్తమై పుణ్యతీర్థ, పుణ్యక్షేత్రముల స్నాన దర్శనాదుల జేసికొని, సిద్ధక్షేత్రమగు శ్రీ శేషాచలమందుగల మహనీయుల దర్శనము జేసికొని, జీవితమునంతయు నైష్ఠిక బ్రహ్మచర్యమునందే కాలము గడువ నిశ్చయించుకొని యిచ్చటి కేతెంచితినని ప్రసన్నభావముతో జెప్పెను. అంతట శాంతభావముతోను, ప్రసన్నహృదయముతోను ఆ బ్రాహ్మణు డిట్లు వచించెను. ''అయ్యా ! మీరు పఠించిన మంత్రపుష్పము వేదభాగము. దానిని బ్రాహ్మణేతరుడు పఠించవచ్చునా! అని సందేహము గలిగి మీతో నడుగుచున్నానుగాని వేఱువిధమగు ఏభావముతో నడుగుట లేదు'' అనిచెప్పగా దానిని విని –

అబ్రాహ్మణుడు:– అయ్యా ! శాస్త్రములో జన్మముచే జాతి యేర్పడునని కొన్నిటిలోను, కొన్నిటిలో గుణముచేతనే జాతి నిర్ణయమగు ననియు గలదు. కావున మీరు ఈరెండింటిలో దేనిని ఆధారము జేసికొని అడుగుచున్నారు?

బ్రాహ్మణుడు :– అయ్యా ! మీరిపుడు ఏయాశయమును దెలిపితిరో అదే విధముగ కొన్ని శాస్త్రములందు జన్మచే జాతి యేర్పడుచున్నదనియు, మఱికొన్ని శాస్త్రములందు ఏజాతిలో జన్మించినను గుణమే ప్రధానమనియు, అందుచే గుణముచేతనే జాతియొక్క నిర్ణయము జేయవలెననియు గల భాగములో నాకున్ను సందేహము గలదు.

ఈవిషయమై కొందరు పెద్దల నడుగగా, వారిలో కొందఱు

జ్ఞానభాగావలంబులు గుణమే ప్రధానమనియు, కర్మభాగప్రవర్తకులగు కొందరు కులమే ప్రధానమనియు జెప్పిరి. ఉభయులును అనేక శాస్త్రప్రమాణములను జూపిరి. అయితే యిదమిత్థమని నిర్ణయింపజాలరైరి. అప్పటినుండి నా మనస్సులో ఈసంకల్పము గలిగియుండెను. ఆ సందేహము గళాంతర్భాగములో గొప్ప వ్రణమువలె, సర్వదా నన్ను బాధించుచునే యున్నది. అంతేగాక, కులమునకే జాతి నిర్ణయము శాస్త్రసమ్మతమైనచో, శాస్త్రాతిక్రమణము దోషమని గొప్పభయము హృదయములో గలుగుచున్నది. లేక గుణముచేతనే జాతి యేర్పడుచున్నదను వాక్యము నిజమైనచో, ఎన్నియో కోట్లజనులు బ్రాహ్మణేతరులు గలరు. వారు వేదమును, వేదార్థమును, సకల దుఃఖములను రహితమొనర్చి నిరతిశయానంద మొసగు వేదాన్తార్థమున్ను దెలియక దుఃఖసాగరమును దాటజాలక సంసారసాగరములో మునిగి యపార దుఃఖమును బొందుచున్నారు. ఇదియే నాయొక్క యథార్థమగు అభిప్రాయము. దానిని ఏమాత్రమును మరుగుపరచక జెప్పడమైనది. దీనియందు నాకు హృదయమును దెరచి జెప్పుటలో ఏలాటి ద్వేషముగాని, అసహనము గాని, కళంకము గాని లేదు. ఉండే విషయమును నిష్కళంకముగా సరళ హృదయముతో జెప్పడమైనది, ఇదియే నా చరిత్రయొక్క నిజార్థము.

అ :- విశాలహృదయా ! విశ్వప్రేమైక నిలయా ! మీరు జెప్పులాగున నాకును ఈ విషయములో గొప్ప సందేహముగలిగి అనేకమంది పండితుల నడిగితిని. వారును తమరు చెప్పులాగున, గుణములకే యాధిక్యమని కొందరును, కులమునకు ఆధిక్యమని మఱికొందరును దెలిపిరి. దీనికి సంబంధించినశాస్త్రములను ప్రామాణికవాక్యములను నిరూపించిరి. తమరు చెప్పులాగున శాస్త్రాతిక్రమణమున నాకును భయము గలదు. అయితే శాస్త్రముయొక్క నిర్ణయమును జూడబూనిన, ఎవరు విద్యాధిక్యము, ప్రజ్ఞయు గలిగియున్నారో! వారి వాదము బలము గల న్యాయవాదుల విజయము

వంటిదేగాని దీనియందు సత్యము లేదని నిశ్చయించుకొంటిని. ఆ వాదము క్రింద కోర్టుల తీర్మానమును, పై కోర్టువారు విచారించి న్యాయమని తోచినదానిని స్థిరపరచెదరు. న్యాయము కాదని తోచిన కొట్టివేయుదురు. ఈ లాగున కోర్టులయొక్క అంతవ౹ుఁవఱకు జరుగుచుండును. కాన దీని వలన నిజమేర్పడదు. దీనిలో అనవస్థాదోషము గలదు. మతము లన్నియు నీలాగున ఏర్పడినవి.

ఈ మనుజులలో గల జాతి యెపుడేర్పడినది ? ఎవరేర్పరచిరి ? ఎందుకేర్పరచిరి ? ఎపుడు మనుష్యజాతి పుట్టినది ? ఈనాలుగు ప్రశ్నలు నా యంతరాత్మలో గలిగినవి. వీటియొక్క నిజార్థము గనుగొనిన మాత్రమే యీ సమస్య పరిష్కరింప దగును. కాని వేరేవిధమైన యుపాయమున్ను గనుపించుట లేదు. విశాలహృదయులకును, నవీన విద్యాభ్యాసముచే లోకజ్ఞానము బాగుగ గలిగినవారికిని, ప్రపంచ యాత్రజేసి నానాదేశములను, నానామతములను, నానాజాతులను జూచినవారందఱికి నీసందేహము గలదు. శాస్త్రము దైవనిర్మితమనియు, దైవాజ్ఞ నుల్లంఘించిన దైవకృప గలిగి మోక్షమెట్లు గలుగుననియు వారందరికి సందేహము గలిగియున్నది. అందరును దైవకృప గలిగి ముక్తిని బొందవలయునను ఆశయము గలవారలే. ముఖ్యముగా వారందరును తత్వశాస్త్రమును అనగా విజ్ఞానశాస్త్రమును (సైన్సు) జదివినవారలు. వారు ఎపుడో యెవరో జెప్పిన ప్రత్యక్షానుభవము లేనిదానిని, యుక్తియుక్తముగాని దానిని, అనుభవము లేనిదానిని ఎవరో కొన్ని శ్లోకములను వల్లించినంత మాత్రమున నమ్మువారు గారు. మొదటనే ఆ ప్రమాణముల నెవరు వ్రాసిరి ! ఎచట వ్రాసిరి ! ఏ కాలమున వ్రాసిరి ! మీరు వచించు ప్రమాణముల యందు మీకేదేని యనుభవము గలదా ! కలిగినచో అదేది అని సభామధ్యలో నిర్భయులై అడుగుదురు. వారు క్రూరులు గారు. నాస్తికులును గారు. సత్యమును దెలిసికొన వలయునను భావముతో అడుగుచున్నారే గాని, వేఱొక దుర్భావముతో అడుగదలచువారు గారు. వారు

సరళహృదయులు. వీరిలో ఎక్కువమంది యువకులు. మనస్సు చాంచల్యము గలదగుటచే అది గుమ్మడి సొరతీగలవలె నుండును. దేనిని పట్టుకొనినను విడువక దాని నాధారము జేసికొని యెక్కిపోవుచుండును. యౌవన కాలములో మనస్సు దేనిపై పోవుచుండునో దానిని పట్టుకొని ప్రాకులాడుచుండును. లతలకు, తాము పట్టుకొనెడివృక్షము మంచిదా! చెడ్డదా! అను వివేక శక్తి యెటుల లేకుండునో, సామాన్యుల మనస్సనెడు లతయు గుణాగణముల వివేచన జేయలేదు. తోటమాలి, యే కంపలోనికిని, ముళ్ళచెట్ల లోనికిని తీగను బోనీయక పందిరి కెట్లు యెక్కించునో, లేక మంచిమార్గములోనికి త్రిప్పుచుండునో, అలాగున విజ్ఞానవంతులగు యువకుల మానసిక వల్లికలను, సన్మార్గ ధర్మహృదయమనెడు పందిరిపైకిగాని, జ్ఞానమార్గమునకుగాని ద్రిప్పినచో వారి జన్మమున్ను ధన్యము గాగలదు. మఱియు దేశక్షేమమునకు నుపయోగపడును. ఇదివఱలో జెప్పినదాని సారమేమన! జాతి యెపుడేర్పడెను? ఎవరిచే నేర్పరచబడినది ? దేనికొరకు ? ఎచ్చట? ఈ సమస్య యేర్పడిన తక్కిన కార్యము లన్నియు సులభముగ నిర్ణష్టముగ జేసికొనవచ్చును.

బ్రా:- సోదరా ! ధర్మమూర్తీ! దీనియొక్క నిర్ణయము వేదమే నిరూపించు చున్నది. చూడుడు "బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్! బాహూ రాజన్యః కృతః। ఊరూ తదస్య యద్వైశ్యః। పద్భ్యాగ్ం శూద్రో అజాయత ।"

అ:- ప్రవిమల హృదయా! విజ్ఞానమూర్తీ! ఈ శ్రుతివాక్యమునకు ఏమి అర్థమును జెప్పెదరు?

బ్రా:- దీనియొక్క అర్థము సామాన్యముగ అందఱికిని దెలిసియే యున్నది. వేద పురుషుని, అనగా సర్వేశ్వరుని ముఖమునుండి బ్రాహ్మణుడున్ను, వక్షఃస్థలమునుండి క్షత్రియుడును, ఊరువులనుండి వైశ్యుడును, పాదములనుండి శూద్రుడును బుట్టెను.

అ:- దయామయా! ప్రశ్నయొక్క భావము ననుసరించియే యుత్తర ముండును. ''ముఖం కిమస్య, కౌ బాహూ, కావూరూ పాదావుచ్యేతే ''ఈ ప్రశ్నయొక్క అర్థమును బాగుగ ఆలోచించిన ''ముఖం కిం అస్య'' ఈ విరాట్ పురుషునకు ముఖమెద్ది? ''కౌబాహూ'' కరములెవ్వి? ''కౌ ఊరూ'' తొడలెవ్వి? ''పాదావుచ్యేతే''= పాదములెవ్వి? యని చెప్పబడును. ప్రశ్న యిలాగుననున్నది. ముఖము నుండి యెవడు పుట్టెను! బాహువులనుండి యెవడు పుట్టెను! అని ప్రశ్న యుండినచో, తమరు చెప్పినట్లు ముఖ, బాహు, ఊరు, పాదములనుండి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు బుట్టినట్లు గ్రహింపదగును. ఈ శ్రుతివాక్యమున ఆర్యసమాజ స్థాపకులగు శ్రీ దయానంద సరస్వతీస్వామివారు సత్యార్థప్రకాశికయందు వ్రాసియుండు అర్థమే సరియైనదని గోచరించుచున్నది. అదేమన! ఈశ్రుతి విరాట్ పురుషుని గుఱించి వర్ణనము జేసి నటులు ఇతర సూర్య, చంద్ర, స్వర్గ, భూలోకముల గుఱించి వర్ణన జేసియుండుటచే యిది విరాట్పురుషుని గూర్చి చెప్పినట్లుండెనని నిస్సందేహముగ దెలిసికొనవచ్చును. ఈ విరాట్పురుషునకు ముఖము బ్రాహ్మణులనియు, బాహువులు క్షత్రియులనియు, ఊరువులు వైశ్యులనియు, పాదములు శూద్రులనియు దెలిపిరి. జ్ఞానేంద్రియములు కంఠముపై కర్ణము, స్పర్శము, రూపము, రసము, గంధము లనెడు పంచభూతముల జ్ఞానాంశముల గ్రహించుటకు ఆకాశతత్వము, శబ్దము, వాయుతత్వము స్పర్శము, అగ్నితత్వము రూపము, జలతత్వము రసము, పృథివీతత్వము గంధము వీటిని గ్రహించుటకు ''కర్ణాది'' అయిదింద్రియములు ముఖమునందుండుటచే వేదపురుషునకు ముఖము బ్రాహ్మణుడని చెప్పడమైనది. వేదము నుచ్చరించుటకు ముఖమే కారణ మగుటచే వేదమునకు బ్రాహ్మణమని పేరుగూడ గలిగినది. జ్ఞానేంద్రియములలో స్పర్శేంద్రియమొకటి మాత్రము దేహమంతట వ్యాపించియుండును గాని, పాణి, పాద, పాయూపస్థలనెడు నాలుగు

కర్మేంద్రియములున్ను గళమునకు క్రింది భాగముననున్నవి. ముఖమునందు వాక్కగు కర్మేంద్రియ మొకటి గలదు. తక్కిన నాలుగున్ను జ్ఞానేంద్రియములే. సంరక్షణ జేయుటకు కరములు ముఖ్యములై యుండుటచే అవి క్షత్రియత్వముగ వర్ణించబడినవి. సుస్థిరముగ గూర్చుండి శాంతిని బొందవలసియుండిన ఊరువులు దృఢముగా నుండవలసి యుండుటచే, అవి వైశ్యత్వముగ నిశ్చయింపబడవలసి వచ్చినది. పై మూడు భాగములను భరించునవి పాదములగుటచే వాటిని శూద్రత్వముగ వర్ణించడమైనది. కావున పరమ పురుషుని యొక్క వర్ణన యని చెప్పుటలో సంశయము గలుగదు.

లేక ముఖాది పాదములనుండి నాలుగు వర్ణములు ఏర్పడినవని చెప్పినను చెప్పుదురు గాక! అట్లయినను భగవంతుని నుండి యుద్భవించినవారగుటచే భగవత్స్వరూపులని చెప్పుటలో సందేహింప నవసరము లేదు, పంచదారచే జేయబడిన బొమ్మయొక్క శిర, కర, ఊరు, పాదములనుండి దేనిని తీసినను అది మధురముగానే యుండును. కాని, వేఱొక విధముగ నుండుట కవకాశమే లేదు. అట్లు గాక ముఖము తీపు, బాహువులు పులుపు, ఊరువులు వగరు, పాదము చేదు. ఈలాగున నుండునని జెప్పినచో వేదపురుషుడు గూడ త్రిగుణములతో గూడినవాడై యుండవలయును. అది వేదమునకు విరుద్ధము. ''ఆదిత్యవర్ణం తమసస్తు పారే'' అని పరమాత్మనుగుఱించి వేదముద్ఘోషించు చుండగా, మూడుగుణములతోను, మిశ్ర గుణములతోను గూడినవాడు భగవంతుడని యేమతమున్ను అంగీకరింప జాలదు. సచ్చిదానందమయుడనియు, ప్రకృతి యగు చీకటికి పరమై సూర్యునివలె ప్రకాశించుచుండువా డనియు, అమృత స్వరూపుడనియు, జ్ఞాన ఘనీభూతుడనియు వేదములే యుద్ఘోషించు చుండగా, ఆ పరమ పురుషునియందు ప్రాకృత గుణముల నారోపించుటకన్న మరి పాప మేమి గలదు? మఱియు పనస, అత్తి, సీమచింత మొదలగు వృక్షములలో మొదలునుండి కొన వరకును కాయలు గలవు. అవి యన్నియు ఒకే రకముగా,

ఆకార వర్ణ రుచులు గలిగి యుండునేగాని పైన నుండునవి మధురముగాను, మధ్యనుండునవి పులుపుగాను, దాని క్రింది భాగమున నుండునవి వగరుగాను, అడుగున నుండునవి చేదుగాను కనుపించుట లేదు. ఒకవేళ ముఖాది నాలుగు స్థానముల నుండి, నాలుగు వర్ణములు గలిగినవని అంగీకరించినను, వారందరును భగవత్స్వరూపులే. సంశయింప నవసరములేదు.

మఱియు ముఖ, బాహు, ఊరు, పాదములను నిశ్చయించినపు డది యొక మూర్తిమంతమై యుండవలయును. అట్టిదానికే ఏకదేశత్వము సిద్ధించును. ఏకదేశమందుండుదానికి వ్యాపకత యుండదు. మూర్తిమంతమునకు సర్వచరాచర ప్రాణికోట్ల హృదయములో ప్రవేశము గలుగదు. ఎపుడు వ్యాపకత్వము లేదో, దానికి సర్వజ్ఞత్వముండదు. అంతేగాదు. అది కాలమునకు లోబడుటచే దేశమునకును, స్థలమునకును లోబడవలసియుండును. అప్పుడు కాలాతీతుడని పరమాత్మను గుఱించి స్తోత్రముజేసెడు వేదవాక్యములకే అనర్థకత సంభవించును. మఱియు పార్థివ పదార్థమునకు మాత్రమే మూర్తి యేర్పడును. పరమాత్మ అమూర్తిమంతమగుటచేతనే ''అణోరణీయాన్ మహతో మహీయాన్ ఆత్మాஉస్య జంతో ర్నిహితో గుహాయామ్'' అని యుపనిషత్తులే యుద్ఘోషించుచున్నవి. అమూర్తము గానిచో, అణువులో అణువుగాను, మహత్తులో మహత్తుగాను ప్రాణికోట్ల హృదయములో నివసించుట యెట్లు సాధ్యమగును? కావున అమూర్తమై, జ్ఞానమయమైయుండు పరమేశ్వరునకు, మూర్తిమత్త్వము కల్పించగూడదనియే వేదముపదేశించుచున్నది. అంతేగాదు; మూడుగుణములతో గూడి యుండినచో జీవులలో గూడ బద్ధజీవుడగునే గాని ముక్తజీవుడైనను గాజాలడు. ఏలన! మూడు గుణములనుండి ముక్తిని బొందునపుడే జీవన్ముక్తుడగు శుద్ధాత్ముడగును. కావుననే క్రైస్తవ, మహమ్మదీయ, ఆర్యసమాజ, బ్రహ్మసమాజస్థులు, సర్వేశ్వరునకు

మూర్తిమత్త్వము గల్పించగూడదనియు, అది ఈశ్వరాపచారమనియు జెప్పుదురు. అయితే సనాతనులలో కొందరు పై జెప్పిన అప్రాకృతమగు పరమాత్మను సామాన్య బుద్ధిగల జనులు దెలిసి కొనజాలరని తలచి మూర్తిపూజలచే అందఱికిని బొందుటకు సాధ్యమని చెప్పుదురు. మూర్తులు జడపదార్థములైనను సర్వేశ్వరునియొక్క పవిత్ర నామములచే యుచ్చరించుట వలన పావనత్వము గలుగుట కవకాశము గలదని తెలుపుదురు. అయితే, వారును ఇది యుత్తమ పక్షముగాదనియు, సామాన్యజనులకొర కేర్పరచబడినదనియు అంగీకరించెదరు. ఈ విషయమంత గొప్ప సమస్య గానందుచే విడచెద. గొప్ప విజ్ఞానవంతులకు గూడ జీవుల యొక్క ఉత్పత్తిని గూర్చి సందేహము గలిగియున్నది. శాస్త్రములు బహుముఖముగ జెప్పుటచే ఆ విషయమై 'ఇదమిత్థమ' ని నేటి వరకు సర్వజన సమ్మతమగు నొక నిర్ధారణ నెవరును జేసియుండలేదు. ఇది దురూహ్యమగుట చేతనే, కొందరి మతి నాస్తికత్వములోనికి బ్రవేశించుటకు గారణమైనది. ఈ గ్రంథ ప్రథమున మంగళాచరణముగ ప్రారంభించిన, తైత్తిరీయశ్రుతి జెప్పినదే నిజముగ అంగీకరింపవచ్చును. అది బ్రహ్మ మానందమనియు, అట్టి ఆనందమునుండియే జీవులు బుట్టిరనియు, అంత్యమున ఆ యానందములోనే జేరుచున్నవనియు వచించెను. ఆభాగము నంగీకరించినచో దుర్ఘటమగు ''బ్రాహ్మణోఽ స్యముఖమాసీత్'' అని మొదలగు సామాన్యార్థముల వలన గలిగెడు సంకటము లేమియు గలుగవు. శైవమతస్థులు శివునుండియే యీ జీవులు బుట్టిరనియు, వైష్ణవమతస్థులు విష్ణువు నుండియే యీ జీవకోట్లుద్భవించిన వనియు పలువల విధములుగా వివిధమతస్థులు జెప్పుచున్నారు. పైజెప్పిన శైవ, వైష్ణవుల దైవములకు స్థలములు ఆకారములు, ఆభరణములు, ఆయుధములు మొదలైనవన్నియు గలవు. అయితే సామాన్య జనుల కొరకట్లు నిరూపించడమైనదని యిదివరలోనే వారు దెల్పియుండుటచే ఈ విచారణ యిపుడవసరము లేదు.

ఇంకను పైపై ఆలోచించిన ఈశ్వరాంశ స్వరూపులే జీవులనియు, అనేక పాత్రలలో జలమునుంచిన సూర్యునియొక్క ప్రతిబింబ మన్నిటిలో నుండునట్లు, అంతఃకరణ దైవ ప్రతిబింబములే జీవులనియు, మణులలోపల సూత్రమువలె చరాచరములలో నంతర్యామియై వెలుగుచుండు వా డీశ్వరు డగుటచే, అట్టి యీశ్వరుడే హృదయములోనుండు వాడనియు, సాక్షాత్ యీశ్వరుడే జీవరూపుడై యుంటున్నాడనియు, అంతయు యీశ్వరమయమే, దైవమయమే, బ్రహ్మమయమే అయియుంటున్నదనియు బహువిధములుగ జెప్పుటవలన జిజ్ఞాసులకు మనోనిశ్చలత లేకపోవుటచే అనేక మతము లేర్పడుటకు కారణమైనది. మఱియు "బ్రాహ్మణోఽస్యముఖ మాసీత్" అను వేద వాక్యమునకు మామూలుగ జెప్పుచుండెడిది యర్థమైనచో, జీవు లనాదులనియు, సనాతనులనియు జెప్పెడు శ్రుతివాక్యముల కన్నిటికిని అడ్డు గలుగును. అంతేగాక యీశ్వరుడే తన దేహమునుండి ఉత్తమ, మధ్యమ కనిష్ఠాధమ జీవులను సృష్టించి నట్లేర్పడును. అపుడు జీవులు జేయుచుండు మంచిచెడుగుల కీశ్వరుడే కారణకర్తగా అంగీకరింపవలసి యుండును. అట్లయిన జీవులు జేయుచుండు కృత్యములగు పాపపుణ్యముల ఫలములగు నరక స్వర్గముల కీశ్వరుడే బాధ్యత వహింపవలసియుండును. అట్లయిన జీవు లనాదులనియు, వారి సంసారము లనేకములనియు సంస్కారము ననుసరించి ప్రవర్తించు చున్నవనియు, కర్మములయొక్క శుభాశుభముల ననుసరించి ఫలమును గలుగజేయువా డీశ్వరుడనియు, తాను సాక్షిమాత్రుడనియు వచించెడు శాస్త్రముల కన్నిటికిని ఆటంకము గలుగును. అంత మాత్రము గాదు. దేని కాదిగలదో దానికి తప్పక అంతమున్ను గలుగును. అట్లయిన ముఖ బాహూరుపాదముల నుండి బుట్టిన జీవులన్నియు, ఒక కాలమున గిట్టుట సత్యము కావున యీ భావములన్నిటిని త్రోసివేసి "తైత్తిరీయ" శ్రుతి జెప్పిన "ఆనందమే బ్రహ్మమనియు" దాని నుండి పుట్టిన జీవులన్నీ బ్రహ్మాంశములనియు, ఆనందము స్వభావమగుటజేతనే సమస్తబ్రహ్మాది

స్థావరాంతముగల ప్రాణికోట్లన్నియు నిరతిశయానందమును గోరుటకు కారణమనియు జెప్పుట సమంజసముగానే యున్నది. ''ముండక'' శ్రుతియు దీనినే బలపరచుచున్నది. ఈ భావము చాల పవిత్రమైనది. సోదరభావమునకు ఏలాటి బాధకమున్ను లేదు. అట్లుగాక ముఖపాదాదులనుండి జీవులు పుట్టినవని జెప్పునప్పుడు గూడ భేదబుద్ధి కవకాశము గలుగుచున్నది. ఎచ్చట భేదము గలుగునో, అచ్చట బాధయున్ను తప్పక గలుగును. ఈ శ్రుతులు రెండును జీవులయొక్క యేకత్వ స్వభావమును జెప్పుటవలన, పరమ ప్రేమైక రూపమగు సోదరత్వమునకు దోహదమొసంగుచున్నవి. ఇట్టి పవిత్రబోధలు మొదటినుండి చేయువారుండినచో ఈ జాతిభేద ద్వేషాగ్ని యింతవరకు జ్వలించుచుండదు.

ఉ॥ ''తదేతత్సత్యం యథా సుదీప్తా త్పావకా ద్విస్ఫులింగా స్సహస్రశః
ప్రభవన్తే సరూపాః తథాక్షరాద్వివిధాః సోమ్య భావాః
ప్రజాయన్తే తత్ర చైవాపి యన్తి''

ఆ యీ చెప్పబోవు అక్షరవిషయము సత్యమైనది. (సత్యమనగా భూత భవిష్యద్వర్తమానకాలములయం దేకరూపముగ నుండుట). బాగుగా మండుచున్న అగ్నినుండి వేలకొలది సమానమయిన రూపములుగల అగ్నికణము లే విధముగ బుట్టుచున్నవో, ఆ ప్రకారమే సాధుస్వభావముగల ఓ శౌనకుడా! నాశరహితమగు పరబ్రహ్మమునుండి నానావిధములగు జీవులు పుట్టుచున్నారు. ఆ యక్షరమగు పరబ్రహ్మమునందే లీనమగుచున్నారు.

బ్రా :- ప్రశాంతాత్మా! ఈ జాతియొక్క విషయమై మాలో కొందఱిని అంతరాశయము దెలుపవలయునని యేకాంతమున నడుగగా, వారిట్లు జెప్పిరి. అందువలన నాకు జన్మనా జాతి గలదను దృఢవిశ్వాసము పూర్తిగ తొలగిపోలేదు. అదేమన! ఈశ్వరుడు అందఱిలోను సమానముగ నుండునది సత్యము. లేక యీశ్వరాంశులే జీవులు అయినను అగుగాక! ఆకాశమునుండి వర్షించెడు జలము అతి పవిత్రమైనదని అందఱికిని దెలియును. అయితే

శుభ్రప్రదేశములో కల జలము మాత్రము పానార్హము కాని, అశుభ్రమై దుర్వాసన గలదైయుండు మురికి నీటిని ఎవరైన పానము జేయగలరా! జాతియొక్క స్థితియు నాలాగుననే ఉండునని చెప్పిరి. ఈ విషయమై మీ అభిప్రాయమేమి?

అ :– విశ్వప్రేమైక నిలయా ? ఈయుక్తి విశాలభావముతో గూడినది గాదు. చాల సంకుచితమైనది. ఇదే దృష్టాంతము నాతోను అనేకమంది విప్రులు జెప్పిరి. వారిని ఈలాగున అడిగితిని. ''అయ్యలారా! మీరు జెప్పినది ఆత్మను గుఱించిన భాగము గాదు. హృదయముయొక్క సత్వ, రజ, స్తమో మిశ్రమముల గుఱించియే యుండును. ఇది యందరును నంగీకరింపదగినదే. బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు, శూద్రులకు ఒక ప్రదేశమున భూమి గలదని అనుకొనెదము. అయితే బ్రాహ్మణుల భూమి శుభ్రముగ నుండవలయునని గాని, బ్రాహ్మణేతరుల భూమి అశుభ్రముగ నుండవలయునని గాని నియమము గలదా! ఎవరి భూమి శుభ్రముగ నుండునో, యెవరి భూమి అశుభ్రముగ నుండునో, అని యిట్టి విచారణయే జేయవలసియుండునేగాని, జాతి ననుసరించి భూమిగూడ శుద్ధాశుద్ధములుగ నుండునని యే దేశమునగాని యెచ్చటనైన గలదా! అదే ప్రకారము సత్త్వగుణము గల హృదయము శుద్ధముగాను, అశుద్ధముగల హృదయము అశుభ్రముగాను నుండుననియే యిచట గ్రహింపవలయును. అపుడు శుద్ధహృదయము గలవారు బ్రాహ్మణులనియు, అపరిశుద్ధ హృదయము గలవా రబ్రాహ్మణులనియు గ్రాహ్యమగుచున్నది. ఇదియే పరమార్థ సత్యము. ఇది జాతినిగుఱించి జెప్పుట లేదు. గుణమును గూర్చియే తెలుపుచున్నది. అట్లుగాక బ్రాహ్మణుల భూమిలో త్రవ్విన ఉప్పునీరు బడినను దానినే త్రాగవలయుననియు, బ్రాహ్మణేతరుల భూమిలో నిర్మించిన కూపమునందలి జలము స్వచ్ఛమైనను, దానిని త్రాగకూడదని చెప్పుట మూర్ఖ లక్షణమే యగును. ఇదియే మనదేశ మధః పతిత మగుటకు కారణము.

బ్రా:- పవిత్రాశయా! కఠోపనిషత్తునందలి యీ వాక్యమును జాతివిషయమై కొందఱు వచించిరి. అగ్ని శుద్ధమైనదైనను, హోమాగ్ని యెంత పవిత్రమైనదో పూజ్యమైనదో, శ్మశానాగ్ని యెంత అపవిత్రమైనదో యెట్లు అస్పృశ్యనీయమైనదో, జాతియొక్క స్థితియు నాలాగున నుండునని తెలిపిరి. ఇదియు నాలోచించిన సరిగా నున్నట్లే దోచుచున్నది.

ఉ. అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ।
ఏక స్తథా సర్వభూతాన్తరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ॥

ఒకటి యగు నగ్ని యే ప్రకారము లోకమునందు ప్రవేశించి యాయా రూపమునకు సమాన రూపము గలది యాయెనో, ఆప్రకారముగానే యొకటియగు నాత్మ, ఆయాభూతములయందు ప్రవేశించి బైట వాని రూపములకు సమాన రూపములు గలది యగుచున్నది.

అ:- ప్రబుద్ధాత్మా! ఈశ్రుతి వాక్యముగూడ గుణమునే నిరూపించుచున్నది గాని జాతినిగురించి కాదు. అగ్ని శుద్ధమైయున్నట్లు జీవుడుగూడ శుద్ధుడే కాని, అంతః కరణ ధర్మాధర్మముల ననుసరించి శుద్ధుడుగాను, అశుద్ధుడుగాను అగుచుండునను అర్థమే దీనివలన గోచరమగుచున్నది. యజ్ఞమున కుపయోగించెడి అగ్నినే శ్మశానములో నుపయోగించుచున్నారు. అయితే యజ్ఞశాలయందు వేదికలో ప్రతిష్ఠించిన అగ్నియందు పవిత్రహోమద్రవ్యమగు హవిస్సును, ఘృతమును మంత్రపూతముగ హోమించుచున్నారు. దానివలన ఆ యగ్నికి పవిత్రత గలిగెను. శ్మశానవాటికయం దుంచబడిన అగ్నియందు సామాన్యములగుకట్టెల పై శవమును ప్రేతమంత్రముతో దహింపజేయుచున్నారు. అలాగున ఎవరి హృదయవేదికయందు పవిత్రమగు దైవచింతన గలిగి సాత్వికమున్ను,

ధర్మాన్వితమునునగు అన్నమును, శుభ్రతీర్థమును, ఆహారపానీయములై యుండునో వారి హృదయములో గలిగెడు జ్ఞానము స్వచ్ఛమైయుండును. అట్లుగాక పాపబుద్ధిగల హృదయులై మద్య మాంసాద్యాహారము గలిగియుండు వారి మనసులో జనించెడు నీచమైన అజ్ఞానమేది గలదో అది శ్మశానాగ్నివంటిది. ఇదియు జాతిని గుఱించి చెప్పుట లేదు. గుణమును గుఱించియే చెప్పబడుచున్నది. ఇచట గూడ నిర్మలహృదయము, సాత్త్వికాహారము, దైవచింతన గలవారెవరైనను వారే శుద్ధాత్ములని గోచరించుచున్నది. అశుద్ధాహారము, అశుద్ధ సంకల్పము గలవారే నీచులని వ్యక్తమగుచున్నది.

బ్రా :- పావన హృదయా ! పైజెప్పిన శ్రుతివాక్యము ననుసరించి, యింకొక శ్రుతిని పండితులు బలికిరి. దానిని గూడ వినునపుడు దీర్ఘాలోచన జేయకపోవుటచే సరిగా నుండునని దలంచితిని. దాని సారమేమన ! స్వచ్ఛమగు వాయువు ఎంత ఆరోగ్యదాయకమో, అశుద్ధమగు దుర్వాసన గల గాలి యెంత అనారోగ్యకరమో, బ్రాహ్మణుల యొక్కయు, బ్రాహ్మణేతరుల యొక్కయు స్థితి యీలాగున నుండునని యెఱింగించిరి.

ఉ ॥ **వాయుర్యథైకో భువనం ప్రవిష్టో**
**రూపం రూపంప్రతిరూపో బభూవ ।**
**ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా**
**రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥**

ఒకటియగు వాయువు లోకమందు ప్రవేశించి యే ప్రకార మాయా రూపములకు సమానరూపము గలది ఆయెనో, ఆప్రకారమే ఒకటియైన, సర్వభూతములయందుండు నాత్మ ఆయా భూతములకు సమానాకృతి గలది యగుచున్నది.

అ :- వివేకశీలా ! ఈ శ్రుత్యర్థమున్ను పైనుదాహరించిన దాని ననుసరించియే యున్నది. కాని అంతట నొకటియేయైనను,

శుద్ధప్రదేశమునుండి వచ్చునది శుద్ధముగాను, అపరిశుద్ధప్రదేశమునుండి వెడలునది అపరిశుద్ధముగాను నుండును. ఇదియు జాతిని గుఱించి చెప్పుటలేదు. గుణమును గూర్చియే యుపదేశించుచున్నది. శాంతము, కరుణ, విరక్తి, భక్తి గల హృదయముగలవారి యాశయ మతి పవిత్రమై యుండుననియు, అదియే ఆనందదాయకమనియు దెలుపుచున్నది. అదే రీతిగ క్రౌర్యము, కాఠిన్యము, దయారాహిత్యము, తామసిక స్వభావము గలవారి సంకల్పములు అతి నీచములై యుండుననియు, అట్టిదనారోగ్యము గలుగజేసి జీవులను నరక గాములుగా నొనర్చుననియు పైనుదాహరించిన యుపనిషత్తాత్పర్య మగును. పైజెప్పిన శుద్ధా శుద్ధ గుణముల ననుసరించియే నిజమైన జాతి నిర్ణయము గావలయుననియే వివేకవంతు లందఱియొక్క ఆశయము. ఈ యర్థమునే ఈక్రింది వాక్యము దెలుపుచున్నది.

ఉ॥ సూర్యో యథా సర్వలోకస్య చక్షు
ర్న లిప్యతే చాక్షుషై ర్బాహ్యదోషైః ।
ఏకస్తథా సర్వభూతాన్త రాత్మా
న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః ॥

సూర్యుడే ప్రకారము సమస్త లోకమునకు, నేత్రదృక్కునకు సహాయము జేయువాడై ఆ నేత్ర సంబంధములగు వెలుపలి యపరిశుద్ధ వస్తువు యొక్క కూడికవల్లనైన దోషములను స్పృశింపడో, ఆ ప్రకారము ఏక స్వరూపడగు పరమాత్మ సర్వభూతములకు నంతరాత్మ యైనను బాహ్యమందలి శరీర సంబంధములైన, జరామరణాది ప్రాపంచిక దుఃఖములను స్పృశింపడు. లోకదుఃఖము ఆత్మకు బైటనున్నది. ఈ వాక్యము ఆత్మయొక్క నిస్సంగత్వమును, నిర్మలత్వమును, అమృతత్వము నుపదేశించుచున్నది. ఇట్టి ఆత్మదృష్టి గల్గియుండవలయునని యుపదేశించుచున్నది. ఇచట అతఃకరణ శుద్ధాశుద్ధములను గూడ దాటిపోయినది. సూర్యుడాకాశమున

ప్రకాశించుచుండియు ఎటుల భూమిలో గల శుద్ధాశుద్ధముల నంటక యుంటున్నాడో, ఆలాగున చిదాకాశమున సాక్షియై జ్ఞానస్వరూపమై యుండు ఆత్మలో నిలకడ గలిగి యుండవలయుననియు, అంతఃకరణ శుభాశుభములను జూడగూడదనియు అతీత వాక్యముపదేశించుచున్నది.

విజ్ఞానదృష్టియనియు, జ్ఞాన దృష్టి యనియు, అజ్ఞానదృష్టి యనియు, దృష్టి మూడు విధములు. పాత్రము, పాత్రలో గల జలము, జలములో గల సూర్యప్రతిబింబము. పాత్రదృష్టి అనగా పుట్టినజాతిని గుఱించి మాత్రము గల దృష్టి. ఇది అజ్ఞానదృష్టియే యగును. జాతిలో నెవ్వరైనను వారి మంచిచెడుగులను జూచి గ్రహించెడు దృష్టి పాత్రలో గల జలమువంటిదగును. ఇది జ్ఞానదృష్టి యనబడును. ఈ యుపనిషత్తులో జెప్పబడిన దృష్టి విజ్ఞానదృష్టి యగును. పాత్రమునకున్ను, జలమునకున్ను విలక్షణమైయుండు సూర్యప్రతిబింబమువలె కులమునకును, గుణమునకును, విలక్షణమై స్వప్రకాశమైయుండు ఆత్మదృష్టి విజ్ఞానదృష్టి యనబడును. విజ్ఞానదృష్టి మనకు గలుగకపోయినను, అజ్ఞానదృష్టి గలిగియుండరాదుగదా? జ్ఞానదృష్టినైన నవలంబింపవలసియున్నది గదా? ఇది కులమును పాటింపక గుణమునైన గ్రహించులాగున జూడవలయునని యాదేశించుచున్నది. ఇక ఆత్మయొక్క శాంతియు, నిరతిశయానందమున్ను గలుగవలసియుండిన దానిని బోధించుచున్నది.

ఉ ॥ ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా,
ఏకం రూపం బహుధా యః కరోతి।
తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్॥

ఏయాత్మ సమానాధికములు లేనిదై, బీజభూతమైన యవ్యక్తమగు తనను, నామరూపభేదములచేత అనేకవిధముల జేయు చున్నదో, బుద్ధి గుహయం దుంచబడిన యా పరమాత్మను ప్రత్యక్షము జేసికొనిన జ్ఞానులకు

నిత్యమగు బ్రహ్మానంద సుఖము గలుగుచున్నది. జ్ఞానము లేనివారి కట్టి సుఖము గలుగదు. ఇదే యర్థమును దెలిపెడు మఱియొక శ్రుతివాక్యము గలదు.

ఉ ॥ నిత్యో నిత్యానాం, చేతనశ్చేతనానా
మేకో బహూనాం యో విదధాతి కామాన్।
తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా
స్తేషాం శాన్తి శ్శాశ్వతీ నేతరేషామ్॥

ఏ పరమాత్మ సర్వజనులకు, వారి వారి కర్మ ఫలానుగుణ్యముగా ఫలమునిచ్చుచు, నశించువానిలో నశింపనివాడై, బ్రహ్మాది స్తంబపర్యంతముండు జీవులకు, చేతన స్వరూపుడై యుండునో, అట్టి యీబుద్ధి గుహయందుండు పరమాత్మను మరలింపబడిన సర్వేంద్రియ వృత్తులు గలవారై యే జ్ఞానులు జూచుచున్నారో, వారికి నిత్యమును, సర్వదుఃఖోపశమనము నగు శాన్తి (ఉపరతి) గలుగు చున్నది. ఇట్లే జ్ఞానము లేనివారికి శాశ్వతమైన శాంతి (మోక్షము) గలుగదు.

బ్రా :- పరమప్రేమైక స్వరూపా! మీరు ఎన్నివిధములుగ జెప్పినను చిరకాలమునుండి దేహధ్యానము అనగా జన్మనా జాతి గలదను భావము దొలగకనే యున్నది. వస్త్రము స్వయముగా తెలుపు వర్ణము గలదైనను నలుపు మొదలగు రంగులతో గూడియుండినందుచే వస్త్రముయొక్క శుభ్రత అంతర్ధానమై, నల్లని రూపమై మారునట్లు, ఆత్మయొక్క అమృతత్వము మరుగుబడి మృతరూపమగు దేహమే జాతియని రూఢి పడినది. ఆకాశ, వాయు, అగ్ని, జల, పృథివ్యాదులగు పంచభూతములు శుద్ధములైనను, యీ పంచభూతముల వలననే సకల ఓషధులు ఏర్పడుచుండినను బీజముయొక్క స్వభావము ననుసరించి కొని మధుర ఫలములుగాను, మరికొన్ని పులుపువండ్లుగాను, కొన్నిచేదైన ఫలములుగాను యేలాగున సృష్టిలో నైజముగ యేర్పడియున్నవో, అట్లుండగా మధురమగు మామిడిపండ్లను భుజింపక చేదైన

ముషిణి పండ్లను భుజించులాగున, మీ రుపదేశము జేయుచున్నారా! సృష్టిలో ప్రత్యక్షముగ అనేక వృక్షములు, వేఱు వేఱు మంచి చెడ్డ పండ్లు గలుగజేయుచుండగా బ్రాహ్మణాది జాతు లెట్లు వేఱు వేఱుగా లేవని వచించెదరు?

అ :- సూక్ష్మ విచారము జేసెడు మహాశయా ! వినుడు. సూక్ష్మాసూక్ష్మ విచారణ జేయక పోవుటచేతనే తమకు సందేహమింకను వదలకయున్నది. వస్త్రములో గల యెటువంటి రంగైనను ద్రావకములో పుడకబెట్టి యుతికినచో శుభ్రమగును. అలాగున తత్త్వవిచార మాత్మదృష్టి గలవారివద్ద జేసినచో కల్పితములగు భ్రాంతులన్నియు వదలి, అకల్పితమగు ఆత్మ నెఱుగగలము. పృథివి, జల, సూర్య, వాయు, ఆకాశాదులగు పంచభూతములచేతనే సమస్త ఓషధులేగాక, చరాచర ప్రాణికోట్ల ఉపాధు లేర్పడుచున్నవి. అయితే మధురామ్లకట్వాది ఫలభేదములు పంచభూతములచే నేర్పడినవి అయినను, బీజములు భిన్నము లగుటచే, అట్టిమార్పు గలుగుచుండును. ఈ విధానము సస్యములకే గాక మనుష్యులకు కూడ గలదు. కావుననే సాత్త్విక,రాజస, తామసిక ప్రకృతి గల మనుష్య లేర్పడుటకు గారణము. దీనికి పంచభూతములు నిమిత్తమాత్రములే గాని జన్మాంతర సంస్కారములగు బీజములే ముఖ్య కారణములు. ఆలాగున బీజములు సత్త్వ రజస్తమస్సులగు గుణములతో నుండుటచేతనే, తీపి, పులుపు, చేదులైన ఫలములు గలుగుటకు కారణము. ఇదియు సత్త్వాది గుణముల పరిణామమే గాని సూర్యునివలన, జలములవలన, భూమివలన, వాయువువలన, ఆకాశమువలన గలిగిన భేదము గాదు. అవి అన్నిటిలోను సమానములుగానే యుంటున్నవి. ఇవన్నీ మనుజులకు ఏర్పడిన అంతఃకరణ సంస్కార బీజములవల్ల యేర్పడినవే గాని, ఆత్మయొక్క భేదము గాదు. నాటు మామిడివిత్తనమునకు మంచి తీపుమామిడిచెట్టు కొమ్మతో అంటుగట్టిన యేలాగున శ్రేష్ఠమగు మధురఫలము గలుగుచుండునో ఆలాగున నిదివఱలో

గలిగియుండు దేహాధ్యాసమును వదలి ఆత్మాభ్యాస మలవరచి వచ్చిన మఱల నిరతిశయానంద ప్రదమగు దైవభావమే గలుగును. లేక వస్త్రములో గల నలుపురంగును తొలగించి మఱియొక యెఱుపుగాని, పచ్చగాని యైన రంగులో ముంచిన ఏలాగున పూర్వపు నలుపు బోయి, క్రొత్తగ నేర్పడిన వర్ణము గలదగునో, అభ్యాసము యొక్క మార్పున్ను యీలాగున గలుగును.

బ్రా :- కారుణ్యాత్మ స్వరూపుడవగు మిత్రమా ! ఈ విషయమై కొందఱు పండితవరుల నడుగగా వారిటుల దెలిపిరి. జాతి జన్మనా యేర్పడు విషయమై ''బీజాంకుర న్యాయము'' ను వారు నిరూపించిరి. ఎంత అభ్యాసము గలిగినను వారివారి జాతియొక్క బీజము పోదని చెప్పుచు, ముష్టి విత్తనమునుగాని, వేప విత్తనమునుగాని, మంచిశుద్ధమగు భూమిలోబెట్టి పాలతో గాని, పన్నీరుతోగాని పోషించినను, ఆ వృక్షములయొక్క నైజమగు చేదు బోవునా? ఈ లాగున చింతచెట్టును, పనసచెట్టును జూపి ప్రత్యక్షముగ సృష్టిలో ఇంతభేదము గనపడుచుండగా జాతి లేదు, ఒకే జాతి యని యెట్లు జెప్పెదవని నాతో తర్కించిరి. ఈ కారణము వలన నాకు సందేహము గలిగియే యున్నది.

అ :- పావనహృదయా ! ఓహో ! ఎంత అపవిత్రమైన స్థూల దృష్టిని నిరూపించితిరి. ఇది జడదృష్టి గదా ! వృక్షాదులు జడములు. వాటి కేర్పడియుండు స్థూలాది ప్రమానులకన్న అనగా బీజములకన్న ఆత్మ మఱియొకటి గలదను వ్యవహారము లేదు. మనుజు లన్ననో అట్లు గాదు. వారి దేహము వేఱు. దేహియగు ఆత్మ వేఱుగ నుండుననియే సిద్ధాన్తము. జడమైన వృక్షము తన యిష్టానుసారముగ, తనదేహమగు వృక్షమును నడుపజాలదు. మనుజుడో అట్లు గాదు. ఆత్మ యొక్కయిష్టానుసారము మనసును, ఇంద్రియములను, దేహమును నడుపగలుగు చున్నాడు. వృక్షములకు పాపపుణ్యములననుసరించి స్వర్గనరకములు గలుగునని యెవరును జెప్పియుండలేదు. మానవున కట్లు గాదు. పుణ్యపాపముల ననుసరించి స్వర్గనరకములు గలవు. కావున ఆత్మ

దేహమునకు భిన్నము. అంతేగాదు, దుఃఖములనుండి తప్పించుకొనెడు భావము వృక్షమునకు లేదు. ఒకవేళ సూక్ష్మాతి సూక్ష్మమై ఆత్మ అన్నిటిలోను గలదని అంగీకరించినను, మానవాత్మవలె అది యింకను వికాసమునకు రాలేదు. మానవుని ఆత్మకూడ ఎంతకెంతకు వికాసము నొందునో, అపుడు సామాన్యమనుజులకు గల బాహ్యదుఃఖ నివృత్తియు, బాహ్య సుఖప్రాప్తియు గలుగులాగున నుండ తలంపు మాత్రమే గాక, మనసుచే గలిగెడు సుఖమును సంపాదించుటకు అట్టియాత్మ యత్నించును. ఇపుడు విజ్ఞాన యుదయించిన దానికి గుఱుతుగ నుండును. ఇత్తఱి అట్టి ఆత్మ సాధనపరుడై యుండు లాగున యత్నించును. ఇంకను అతని ఆత్మ వికాసస్థితి నొందుకొలది మనస్సు మొదలగు నింద్రియములకుగూడ నాధారమైనది మూలావిద్యయని కనుగొనును. వృక్షమునకు బీజ మేలాగున మూలకారణమో, అలాగున అజ్ఞానమను నీ సంసారవృక్షమునకు మూలము అవిద్య, అజ్ఞానము, ప్రకృతి, మాయ అని కనుగొనును. అత్తరి సంపూర్ణ వాసనాక్షయ మనోనాశములు గలుగ యత్నించునదే గాక, అవిద్యయొక్క సమూలోన్మూలన మొనర్చుటకై యత్నించును, అట్టి జీవి అవిద్యచే గలిగెడు దుఃఖము నేమియు బొందనొల్లక పోవుటయే గాక నిరతిశయానందప్రదమగు ముక్తిపదమును బొందగలుగును. వృక్షముల నానాత్వమునకు బీజములే కారణమైనట్లు జీవుల అనేకత్వమునకు గూడ ఆత్మయే కారణమని జెప్పునపుడు నామనస్సు చాల సంకటపడుచున్నది. ఏలన! జడమగు వృక్షముతో విజ్ఞానానంద ఘనీభూతుడగు మనుజుని పోల్చుట యెంతటి పాపము? ఎంతటి వివేకశూన్యమగు జడదృష్టి? మానవుల అనేకత్వమునకు అంతఃకరణ సంస్కారములే కారణములు గాని, ఆత్మ గాదు. ఆ సంస్కారములన్నియు వర్షఋతువు, హేమంత ఋతువు, వసంతఋతువు, గ్రీష్మఋతువువలె ధ్యానాద్యనుష్ఠానములచే మారుచుండును. ఏఋతువులోను ఆకాశము మార్పులేక, యేఋతువుల ధర్మములతోను సంబంధింపక యెల్లపుడు ఏమార్పును లేక యేకరూపమై ఎట్లుండునో, అట్టిదే యాత్మ యని

దెలియందగినది. పైజెప్పిన సూర్య, అగ్ని, వాయువుల గుఱించి శ్రీకరోపనిషత్తును ఈతత్త్వమునే బోధించుచున్నది. ఇచట దేహమునకు వృక్షమున్ను, బీజములకు అంతఃకరణ సంస్కారములునని మాత్రమే గ్రహింపవలయును. గీతాది శాస్త్రములలో, పరమాత్ముడే బీజరూపముగ నుంటున్నాడని అనంత ముఖములతో ఉపదేశింపబడినది. ఆ విషయమంతయు స్మృతికాండలో వివరింపబడును. ఇయ్యది శ్రుతికాండ మగుటచే నిచట నిరూపించబడుట లేదు. ఈ శ్రుతులలో గూడ పరమాత్మయే బీజభూతుడగు జీవుడుగా విస్తారముగ దెలుపబడి యున్నది. మఱియు వృక్షదృష్టాంతము సరియైనది గాదు. ఏలన! ఒక్కొక్క వృక్షమున్ను ఒక్కొక్క ఆకారమును, ఒక్కొక్క పత్రమును, ఒక్కొక్క పుష్పమును, ఒక్కొక్క ఫలమును గలిగి యున్నవి. అనగా మామిడి, పనస, చింత, ఉసిరి మొదలగు వృక్షము లన్నియు వేఱు వేఱు పత్రములను, పుష్పములను, ఫలములను గలిగియున్నవి. అదేరీతిగ నిజముగ ఈశ్వరసృష్టిలో బ్రాహ్మణాది వర్ణము లుండినచో, జననము చేతను, మరణము చేతను, ఆయుః పరిమితిచేతను, మానవుల రంగులచేతను, అవయవముల చేతను, విజ్ఞానము చేతను ఏదైన కొంచెమైనను మార్పుజేయుటకు సృష్టి కర్తకు శక్తి లేకపోయినదా? అనంతములగు సస్యములను వేఱు వేఱుగ సృష్టించిన అనంత శక్తి గల సర్వేశ్వరునకు ఈ మానవులలో వర్ణాశ్రమభేదము గలిగి యుండినచో నేల కొంచెమేని మార్పుచేయగూడదు : అట్లు కానరామిచే మానవులందఱు ఒకేజాతి యనియు, గుణముచే మాత్రము భేదము గలదనియు విజ్ఞానులు నిశ్చయించుటకు కారణమైనది. ఇక యీ విషయమై వజ్రసూచికోపనిషత్తున దెలిపిన దానిని జూడుడు. ఇది అష్టోత్తర శతోపనిషత్తులలో నొకటియగును.

ఓమ్. వజ్రసూచీం ప్రవక్ష్యామి శస్త్రమజ్ఞాన భేదనమ్।
దూషణం జ్ఞానహీనానాం భూషణం జ్ఞానచక్షుషామ్॥

టీ. అజ్ఞానభేదనం =అజ్ఞానమును ఖండించెడి, శస్త్రం = ఆయుధమంయినటువంటిన్ని, జ్ఞానహీనానాం = జ్ఞానహీనులకు, దూషణం= దూషణముగానూ, జ్ఞానచక్షుషాం = జ్ఞానులకు, భూషణం= భూషణముగాను ( ఉండునట్టి ) వజ్రసూచీం = వజ్రసూచిని ( అనెడి యుపనిషత్తును ) ప్రవక్ష్యామి = చెప్పుచున్నాను.

ఉ. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రా, ఇతి చత్వారో వర్ణాస్తేషాం వర్ణానాం బ్రాహ్మణ ఏవ ప్రధాన ఇతి వేద వచనానురూపం స్మృతిభిరప్యుక్తం, తత్ర చోద్యమస్తి, కోవా బ్రాహ్మణో నామ, కిం జీవః, కిం దేహః, కిం జాతిః, కిం జ్ఞానం, కిం కర్మ, కిం ధార్మిక ఇతి.

టీ. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రా ఇతి = బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనెడి, చత్వారః = నాలుగు, వర్ణాః = వర్ణములు (అనియు ), తేషాం = ఆ, వర్ణానాం = వర్ణములలో, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, ఏవ = మాత్రమే, ప్రధానః = ముఖ్యుడు, ఇతి = అనియు, వేద వచనానురూపం = వేద వాక్యములకు సరిగానే, స్మృతిభిరపి = స్మృతులచేతను గూడ, ఉక్తం = చెప్పబడినది, తత్ర = ఆ విషయములో, చోద్యం = విచారించదగినది, అస్తి = ఒకటి కలదు, ( అది ఏమనగా;) బ్రాహ్మణః = బ్రాహ్మణుడు ( అనెడి) నామ = పేరు ( గలవాడు) కోవా = ఎవడు? కిం జీవః = ( అతడు ) జీవుడా?, కిం దేహః= దేహమా? కిం జాతిః= వర్ణమా? కిం జ్ఞానం = జ్ఞానమా? కిం కర్మ = కర్మా? కిం ధార్మికః = ధర్మము జేసెడివాడా?

ఉ. తత్ర ప్రథమో జీవో బ్రాహ్మణ ఇతి చేత్తన్న, అతీతానాగతానేక దేహానాం జీవస్యైక రూపత్వాత్, ఏకస్యాపి కర్మ వశాదనేక దేహ సంభవాత్సర్వ శరీరాణాం జీవస్యైక రూపత్వాచ్చ, తస్మాన్న జీవో బ్రాహ్మణ ఇతి॥

టీ. తత్ర = పై జెప్పబడిన వానిలో, ప్రథమః = మొదట జెప్పబడిన, జీవః = జీవుడు, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, ఇతి చేత్ = ఇట్లు అంటిరా, తత్= అది, న = కాదు, ( ఎందువల్ల ననిన ) అతీతానాగతానేక దేహానాం = (౧) ఇదివఱకు వచ్చిపోయిన, ముందు రాబోయెడి అనేక దేహములయొక్క, జీవస్య= జీవునికి, ఏకరూపత్వాత్ = ఒకటే రూపము గనుకను, ఏకస్యాపి = (౨) ( జీవుడు) ఒక్కడై నప్పటికిని, కర్మవశాత్ = కర్మాధీనమువలన, అనేక దేహసంభవాత్= అనేక శరీరములలో పుట్టుచున్నాడు గనుకను. ( జీవుడు బ్రాహ్మణుడు గాడు ) సర్వ శరీరాణాం = ( ౩ ) సమస్తదేహములయొక్క, జీవస్య = జీవునికి, ఏకరూపత్వాత్ = ఒక్కటే రూపము కనుకను, తస్మాత్ = ఆపైనజెప్పబడిన కారణము వలన, జీవః = జీవుడు, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, న = కాడు.

ఉ ॥ తర్హి దేహో బ్రాహ్మణ ఇతిచేత్తన్న, ఆ చండాలాది పర్యన్తానాం మనుష్యాణాం పాంచ భౌతికత్వేన, దేహస్యైకరూపత్వాజ్జరామరణ, ధర్మాధర్మాది సామ్య దర్శనాత్ । బ్రాహ్మణశ్శ్వేతవర్ణః క్షత్రియో రక్తవర్ణః వైశ్యః పీతవర్ణః, శూద్రః కృష్ణవర్ణః ఇతి నియమాభావాత్ । పిత్రాది శరీర దహనే పుత్రాదీనాం బ్రహ్మ హత్యాది దోషసంభవాచ్చ। తస్మాన్న దేహో బ్రాహ్మణ ఇతి॥

టీ ॥ తర్హి = అయితే, దేహః = దేహము, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, ఇతిచేత్ = అంటిరా, తత్ = అది, న = కాదు, (ఎందువల్లననిన) పాంచ భౌతికత్వేన = (౧) ( దేహము) పంచ భూతములతో మిశ్రమమగుటవలనను. ఆ చండాలాది పర్యన్తానాం = చండాల ప్రభృతి అంతము వరకు, మనుష్యాణాం= (సమస్త) మనుష్యులయొక్క, దేహస్య = దేహము (లు), ఏకరూపత్వాత్ = ఒకటే రూపము గలదౌటవలనను, జరామరణ ధర్మాధర్మాది సామ్యదర్శనాత్ = (౨) వృద్ధాప్యం, చావు, ధర్మం, అధర్మం మొదలయినవి ( అందరికిని) సమానము అగుటవలనను,

బ్రాహ్మణః= బ్రాహ్మణుడు, శ్వేతవర్ణః = తెల్లనివాడు, క్షత్రియః= క్షత్రియుడు, రక్తవర్ణః= ఎఱ్ఱనివాడు, వైశ్యః = వైశ్యుడు, పీతవర్ణః = పచ్చనివాడు, శూద్రః= శూద్రుడు, కృష్ణవర్ణః = నల్లనివాడు, ఇతి = అనెడి, నియమాభావాత్ = నియమములేదు గనుకను, పిత్రాదిశరీరదహనే = తండ్రి మొదలయిన వారి యొక్క శరీరమును (కొడుకులు) దహనముచేయునెడల, పుత్రాదీనాం = కొడుకులకు, బ్రహ్మహత్యాది దోషసంభవాత్ = బ్రహ్మహత్య మొదలయిన దోషములు సంభవించుపవలసి వచ్చును గనుకను, తస్మాత్ = ఆ (పైన చెప్పబడిన) కారణము వలనను, దేహః = దేహము, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, న = కాదు.

ఉ॥ తర్హి జాతిర్బ్రాహ్మణఇతి చేత్తన్న। తత్ర జాత్యన్తరేష్వనేకజాతి సంభవాత్। మహర్షయో బహవస్సన్తి। ఋష్యశృంగో మృగ్యాః। కౌశికః కుశాత్। జాంబూకో జంబుకాత్। వాల్మీకో వల్మీకాత్। వ్యాసః కైవర్తకన్యాయాం। శశపృష్ఠాద్గౌతమః। వశిష్ఠ ఊర్వశ్యాం। అగస్త్యః కలశే జాత ఇతి శ్రుతత్వాత్। ఏతేషాం జాత్యా వినాఽప్య గ్రే జ్ఞాన ప్రతిపాదితా ఋషయో బహవస్సన్తి। తస్మాన్న జాతిర్బ్రాహ్మణ ఇతి॥

టీ॥ తర్హి = అయితే, జాతిః = వర్ణము, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు (అని) ఇతిచేత్ = అంటిరా, తత్ =అది, న = కాదు (ఎందువల్లననిన), జాత్యన్తరేషు = ఒక వర్ణములోనే, అనేకజాతి సంభవాత్= అనేక వర్ణములు ఉన్నవి గనుక (వర్ణము బ్రాహ్మణత్వమునకు ముఖ్యకారణం గాదు), బహవః = అనేకమంది, మహర్షయః = గొప్పఋషులు, సంతి = వున్నారు, (వారిజననమెట్టిదనిన) ఋష్యశృంగః = ఋష్య శృంగుడు, మృగ్యాః= ఆడుజింకకు బుట్టినవాడు, కౌశికః = కౌశికుడు, కుశాత్ = దర్భవలన (పుట్టినవాడు), జాంబూకః = జాంబూకుడు, జంబుకాత్ = నక్కవలన (పుట్టినవాడు), వాల్మీకః = వాల్మీకుడు, వల్మీకాత్= పుట్టలోనుండి

(పుట్టినవాడు) వ్యాసః = వ్యాసుడు, కైవర్త కన్యాయాం = చెంబడి స్త్రీ యందు (పుట్టినవాడు) గౌతమః=గౌతముడు, శశపృష్ఠాత్ = కుందేటి వెనుకటి భాగము వలన (పుట్టినవాడు) వసిష్ఠః = వసిష్ఠుడు, ఊర్వశ్యాం = ఊర్వశి యందు (పుట్టినవాడు) అగస్త్యః=అగస్త్యుడు, కలశే = ఘటము నందు, జాతః= పుట్టినవాడు, ఇతి= అని, శ్రుతత్వాత్ = మనము వినుచున్నాముగనుకను, ఏతేషాం = వీరలకు, జాత్యా వినాపి = బ్రాహ్మణవర్ణం కాకపోయినప్పటికిని, అగ్రే = ముందుకాలమునందు, జ్ఞాన ప్రతి పాదితాః = జ్ఞానము గలుగజేసెడి (వారుగానుండిరి) ఋషయః= ఈలాటి ఋషులు, బహవః = అనేకమంది, సంతి = కలరు(గనుకను), తస్మాత్= అందువలన, జాతిః = వర్ణము, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, న = కాదు.

ఉ. తర్హి జ్ఞానం బ్రాహ్మణ ఇతి చేత్తన్న। క్షత్రియాదయోఽపి పరమార్థ దర్శినోఽభిజ్ఞా బహవస్సన్తి।తస్మాన్నజ్ఞానం బ్రాహ్మణ ఇతి॥

టీ. తర్హి = అయితే, జ్ఞానం = జ్ఞానము, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, ఇతిచేత్ = అని అంటిరా, తత్ న = అది గాదు, (ఎందువల్లననిన), క్షత్రియాదయః = రాజులు మొదలయిన (వారలలో), అపి = గూడ, పరమార్థ దర్శినః = యథార్థమును దెలిసికొన్నట్టి, అభిజ్ఞాః= జ్ఞానవంతులయిన, బహవః = అనేకమంది. సంతి = కలరు, తస్మాత్ = ఆకారణమువలన, జ్ఞానం = జ్ఞానము, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, న = కాదు.

ఉ. తర్హి కర్మ బ్రాహ్మణ ఇతి చేత్తన్న। సర్వేషాం ప్రాణినాం ప్రారబ్ధ సంచితాగామి కర్మసాధర్మ్య దర్శనాత్।కర్మాభిప్రేరితాస్సన్తో జనాః క్రియాః కుర్వన్తీతి।తస్మాన్న కర్మ బ్రాహ్మణ ఇతి॥

టీ. తర్హి = అయితే, కర్మ = కర్మము, బ్రాహ్మణః =

బ్రాహ్మణుడు, ఇతిచేత్ = అని అంటిరా, తత్ =అది, న = కాదు, సర్వేషాం= సమస్త, ప్రాణినాం = జీవులయొక్క, ప్రారబ్ధ సంచితా గామి కర్మసాధర్మ్య దర్శనాత్ = ప్రారబ్ధవము, సంచితవము, ఆగామి అనెడి పేళ్ళుగల కర్మములయొక్క సామ్యములను జూచు చున్నాము గనుకను, అనగా నీ కర్మలు అందఱియందును సామాన్యముగా నున్నవి గనుకను,( కర్మము బ్రాహ్మణుడు గాడు). కర్మాభిప్రేరితాస్సన్తః =కర్మచేత ప్రేరేపింపబడిన, జనాః = జనులు, క్రియాః = ( ఆకర్మకు తగ్గ ) కార్యములను, కుర్వన్తి = చేయుచున్నారు, తస్మాత్ = కనుక, కర్మ = కర్మము, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, న = కాదు.

ఉ. తర్హి ధార్మికో బ్రాహ్మణ ఇతి చేత్తన్న క్షత్రియాదయో హిరణ్యదాతారో బహవస్సంతి ।తస్మాన్న ధార్మికో బ్రాహ్మణ ఇతి॥

టీ॥ తర్హి = అయితే, ధార్మికః = ధర్మము చేసెడివాడు, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, ఇతిచేత్ = అని అంటిరా, తత్ = ఆమాట, న = (సరి )కాదు, హిరణ్యదాతారః = డబ్బును ఇచ్చెడి, క్షత్రియాదయః = క్షత్రియులు మొదలగు గా గలవారలు, బహవః = అనేకమంది, సంతి = కలరు, తస్మాత్ = అందువలన, ధార్మికః = ధర్మము జేసెడివాడు, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, న = కాడు.

ఉ॥ తర్హి కోవా బ్రాహ్మణోనామ ।యః కశ్చిదాత్మానమద్వితీయం జాతి గుణ క్రియాహీనం షడూర్మి షడ్భావేత్యాది సర్వదోషరహితం సర్వజ్ఞానానంతానంత స్వరూపం స్వయం నిర్వికల్ప మశేషకల్పాధార మశేషభూతాంతర్యామిత్వేన వర్తమాన మంతర్బహిశ్చాకాశవదను స్యూతమఖండానంద స్వభావమప్రమేయ మనుభవైకవేద్య మపరోక్షతయా భాసమానం కరతలామలక వత్సాక్షాద పరోక్షీ కృత్య కృతార్థతయా కామరాగాది దోషరహితశ్శమాది సంపన్నో భావమాత్సర్యతృష్ణాశా

మోహాదిరహితో, దంభాహంకారాదిభి రసంస్పృష్ట చేతా వర్తతే, ఏవముక్త లక్షణోయస్స ఏవ బ్రాహ్మణ ఇతి శ్రుతి స్మృతి పురాణేతిహాసా నామభిప్రాయః। అన్యథా బ్రాహ్మణత్వసిద్ధిర్నాస్త్యేవ । సచ్చిదానంద మాత్మాన మద్వితీయం బ్రహ్మ భావయే దాత్మానం సచ్చిదానందం బ్రహ్మ భావయే దిత్యుపనిషత్ ॥

టీ ॥ తర్హి = అయితే, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, (అనెడి) నామ= పేరు (కలవాడు), కోవా = ఎవడు అంటిరా, యః = ఎవడయితే, అద్వితీయం = ఒకడయినట్టి, జాతిగుణక్రియా హీనం = జాతి, గుణం, క్రియలు లేనటువంటి, షడూర్మి షడ్భావేత్యాది సర్వదోషరహితం = జరా, మరణ, శోక, మోహ, క్షుత్పి పాసలను షడూర్ములును, పుట్టుట, ఉండుట, వృద్ధిపొందుట, మాఱుట, చిక్కుట, నశించుట అను షడ్భావములును లేనటువంటి, సత్య జ్ఞానానందానన్త స్వరూపం = సత్యము, జ్ఞానము, ఆనందము, అనంతము, స్వరూపముగా గలిగినటువంటి, స్వయం నిర్వికల్పం= సంకల్పమందు అన్యథాపత్తి లేనటువంటి, అశేషకల్పాధారం = అన్ని కల్పములకు అంతర్యామి అయి ఉండునట్టి, అంతః = లోపలను, బహిః= బయటను, ఆకాశవత్ = ఆకాశమువలె, అనుస్యూతం = వ్యాప్తంగా నుండునట్టి, అఖండానందస్వరూపం = అవిచ్ఛిన్నమైన ఆనందం గలిగినటువంటి, అప్రమేయం = అసంఖ్యేయుడయినటువంటి, అనుభవైకవేద్యం= అనుభవంచేతనే దెలిసికొనబడదగినటువంటి, అపరోక్షతయా = ప్రత్యక్షముగా, భాసమానం =ప్రకాశించునట్టి, ఆత్మానం= భగవంతుని, కరతలామలకవత్= అరచేతిలోనుండెడి ఉసిరికాయవలె, సాక్షాత్ అపరోక్షీకృత్య = ప్రత్యక్షము జేసికొని, కృతార్థతయా = కృతకృత్యుడయి, కామరాగాదిదోషరహితః = ఆశమొదలయిన దోషములు లేనివాడయి, శమాది సంపన్నః = శాంతి మొదలయిన గుణములు గలవాడయి, భావమాత్సర్యతృష్ణాశా మోహాదిరహితః = మోహం మాత్సర్యము మొదలయిన దోషములు లేనివాడయి, దంభాహంకారాదిభిః = అహంకారం డంబము మొదలయిన

వాటిచేత, అసంస్పృష్టచేతాః = తాకబడని మనస్సు కలవాడై, వర్తతే = వుంటున్నాడో, ఏవం = ఈప్రకారం, ఉక్తలక్షణః = చెప్పబడ్డ లక్షణములు గలవాడు, యః = ఎవడో, సః = వాడు, ఏవ = మాత్రమే, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, ఇతి = అని, శ్రుతిస్మృతి పురాణేతిహాసానాం = వేదముల, స్మృతుల, పురాణాల, ఇతిహాసముల యొక్క, అభిప్రాయః = అభిప్రాయము, అన్యథా = (పైన జెప్పబడ్డదానికి)వేఱుగా, బ్రాహ్మ త్వసిద్ధిః = బ్రాహ్మణ త్వసిద్ధి, నాస్త్యేవ = లేనేలేదు, ఆత్మానం = భగవంతుని, సచ్చిదానందం = సత్తు చిత్తు ఆనందం స్వరూపముగా గలవాడుగాను, అద్వితీయం = ఒక్కడుగాను, బ్రహ్మ = పరబ్రహ్మముగాను, భావయేత్ = తలంపవలయును, ఉపనిషత్ = ఉపనిషత్తు, ఇతి = సమాప్తము.

పవిత్రాత్మా : శ్రుతి శిరస్సగు ఉపనిషత్తున జాతియొక్క నిర్ణయమును విన్నారు గదా !

బ్రా :- నిర్మలాత్మా ! ఈ వేదసారమగు వజ్రసూచికోపనిషత్తు మొదలగు శ్రుతులనేకముల చదివినవారు గూడ నాతో ఇట్లు వాదించిరి. అదేమన! గో సూకరాది జంతువు లనేకములు గలవు గదా ! అవి యన్నియు ఒకే రకముగ ఎటు లుండుట లేదో, అలాగే మానవులలోను భేదము గలదు.

అ :- విజ్ఞానమయా ! ఏల సామాన్య మనుజుల వలె జెప్పు చున్నారు? అజ, అశ్వ, గజ, గో, మహిషాది జంతువులు సర్వేశ్వరుని సృష్టిలోనే వేఱు వేఱు ఆకారములు, వర్ణములు, స్వరములు, జీవితభేదములు (ఆయుఃపరిమితి) గలిగియున్నవి. అదేరీతిగా మానవులలో ఏదైనా భేదము నిజముగా గలిగియుండిన సృష్టికర్త ఒక భేదమును జేసి యుండగూడదా ! పశ్వాదులను ఇది యేజాతి యని అడుగకనే తెలిసికొనుటకు తగిన సృష్టి వైచిత్ర్యము గలదు. అట్లుండిన, ఒకరిని గురించి మీరెవరు ! ఏ వర్ణస్థులు ! అని అడుగ బని లేదు గదా! అనంతములగు భేదములతో అనంత

జంతుజాలములుండగా మనుష్యులలో యథార్థముగ భేదముండినచో, రంగులలో గాని, ఆయుఃపరిమితిలో గాని, ప్రజ్ఞావిశేషములో గాని, శబ్దోచ్చారణములో గాని, గర్భములో నివసించెడు కాలమును బట్టి గాని, మరణించెడు అంతిమావస్థను గూర్చి గాని యేదేని నొక చిహ్నమును మాత్రము గలిగి యుండరాదా? ఇంత మాత్రమేని ప్రజ్ఞ మానవులకు లేకపోవుట విచారకరము.

బ్రా :- పుణ్యాధిక్యము చేత బ్రాహ్మణుడయి పుట్టుననియు, పుణ్యము యొక్క హెచ్చుతగ్గుల ననుసరించియు, పాపము యొక్క మిశ్రమముతో క్షత్రియ వైశ్య శూద్రాదు లుద్భవించెదరని చెప్పుటకు మీరేమి సమాధాన మిచ్చెదరు?

అ :- ధీమంతుడా ! పుణ్యము యొక్క స్వరూపము సుఖము, ఆరోగ్యము, జ్ఞానము. పాపము యొక్క స్వరూపము దుఃఖము, రోగము, అజ్ఞానము. పుణ్యము చేతనే బ్రాహ్మణుడయి పుట్టుట నిజమైనచో పై చెప్పిన సుఖారోగ్య జ్ఞానములు జన్మనా గలిగియుండవలయును. తక్కిన క్షత్రియ వైశ్య శూద్రాదులు పుణ్యక్షయము ననుసరించి దుఃఖరోగాజ్ఞానములు గలిగియుండవలయును. దీనిని మీరు సృష్టిలో ఎచ్చటేని జూచియున్నారా ! మనుష్య లందరిలోను కొందరు సుఖము, ఆరోగ్యము, జ్ఞానము గలవారున్నారు. అలాగున దుఃఖము, రోగము, అజ్ఞానము గలవారు గూడా గలరు. ఈధర్మము బ్రాహ్మణులలోను, అ బాహ్మణులలోను, ఇతర మతస్థులలోను గనపడుచునే యున్నది. పుణ్యముచేతనే బ్రాహ్మణుడయి పుట్టుననుదానికి ఈ బాహ్యార్థము గాదు. ''బ్రహ్మజ్ఞానము గలవాడే బ్రాహ్మణుడ'' ని శాస్త్రము యొక్క యథార్థ తత్వమగును. అట్టి బ్రహ్మజ్ఞానము, అనేక జన్మలలో ఫలాపేక్షారహితుడై చేసిన పుణ్య విశేషము చేతను, చిరకాల మనన్య భక్తితో పరమేశ్వరుని ఆరాధించుట చేతను మాత్రమే

గలుగును. ఇదే బ్రాహ్మణ జన్మము యొక్క నిజమైన అర్థము. తక్కిన వన్నియు స్వాభిమాన పూర్వక ఆత్మస్తుతులు మాత్రమే యగును. మఱియు ఆకాశములో సంచరించెడు విహంగములలో గూడ శుక, పిక, మయూరాది పక్షివర్గము లనంతములు గలవు. వీటికిని సృష్టిలోనే ఆకారము, స్వరము, ఆయుఃపరిమితి మొదలగునవి సర్వేశ్వరుడు ఏర్పరచి యున్నాడు. అదే విధముగ మానవులలో చతుర్వర్ణముల భేదము లేవైన యుండినచో, సృష్టిలోనే వ్యక్తమై యుండును. తక్కిన గొప్పతనమంతయు స్వాభిమాన కల్పితమనియే విజ్ఞులు దలంతురు. ఇంకను వినుడు. జలజంతువులలో గూడ కచ్ఛప, మత్స్య, తిమి, తిమింగిలాది మీనవర్గము లసంఖ్యాకములు. వాటికిని సర్వేశ్వరుడు సృష్టిలోనే అవయవభేదములను, వర్ణభేదములను, జీవితభేదములను, ఉత్పత్తిభేదములను గల్పించెను. మనుష్యులలో అట్టిభేదము లేవైన యుండిన ఏల యభివ్యక్తములు గాకుండును? ఇట్టి జగత్కర్తయొక్క సృష్టిని పరిశోధన జేయక పోవుటచేతనే, అంధకారబంధురమగు నిట్టి మూఢభావము జనులకు గలుగుటకు కారణము. ఇపుడు స్థావరములగు వృక్షాదులును, జంగమ మూలములగు పశ్వాదులును, ఖేచరములగు పక్షులును, జలచరములగు మత్స్యాదులును ప్రత్యక్షముగ నిరూపింప బడినవి. ఇవి అన్నియు సత్యదృష్టితో లోకోద్ధరణ భావముతో, ధర్మబుద్ధితో దెలుపడమైనది.

బ్రా :- అత్యన్త ఆత్మమిత్రుడవగు సోదరా ! మీరు చెప్పిన యీ దృష్టాంతములన్నియు నేను చిరకాలము చింతన జేసితిని. అయినను మావారు ఇదివఱలో జెప్పిన దృష్టాంతములనే గాక యింకను గొన్నింటిని నిదర్శనముల దెలిపిరి. అవి యెవ్వియన? కాకిని కాశికి తీసికొనివెళ్ళి గంగాస్నానము జేయించినను, అది హంసమువలె శుభ్రమగునా ! ఇలాగున శ్వానమును భాగీరథి స్నానమొనర్చిన అది యెప్పటికేని గోవు గాగలుగునా? ఆలాగున జన్మముతో నేర్పడిన జాతి శ్మశానాగ్ని అగు అంతిమ స్థితివఱకు గలిగియేయుండును. ఒకవేళ యీ జన్మలో పుణ్యకార్యములు విశేషముగ

జేసినచో, మరు జన్మలో బ్రాహ్మణ కులములో బుట్టవచ్చునే గాని, యీ జన్మలో ఎటుల మార్పు గలుగును?

అ:- మేధానిధీ ! ఆహా ! చిరకాలమునుండి యేర్పడిన వాసనావిశేషము యొక్క మహిమ నేమని జెప్పవచ్చును! లేనిచో ఇన్ని ధర్మవాక్యములు వినియు మఱల నిట్టి వాక్యముల నుడువుచున్నారే . ఒక దృష్టాంతము జెప్పినపుడు కొంత వఱకేని సంబంధముండవలదా ! అంధకారప్రకాశముల కెట్లు సమన్వయము జేయగలము? దైవాసురులను యెట్లు సమన్వయపరుపగలము ! విషమునకును, అమృతమునకు ఎట్లు సామాన్య ధర్మము కుదురును ! మీరు దెలిపిన యుక్తులన్నియు నీలాగుననే యున్నవి. పవిత్రావయవాకారము చేతను, స్వరముచేతను, గమనముచేతను, కాకికిన్ని, హంసమునకును వ్యత్యాస మెట్టి మూఢమతికైన కనుపడుచుండును గదా! కాకి నలుపువర్ణముగలిగి హీన స్వరూపముతోగూడి చిన్నఆకారము గలిగియుండును. రాజహంసమో, శుభ్రమగు తెల్లని వర్ణముగలిగి సుందరమగు స్వరముతోగూడి, కాకి కన్నపెద్ద ఆకారము గలిగియుంటున్నది. అలాగున చాతుర్వర్ణ్యస్థులలో ఇట్టి భేదమును సృష్టిలో నేమనుజుడైన జూపగలుగునా ! అలాగున కుక్కయొక్క శరీరాకృతియు, దీర్ఘ శబ్దము ప్రత్యేకముగా కనబడుచున్నవి, గోవో అతిమనోహరమగు వర్ణముతోగూడి శునకమునకన్న నెన్నియోరెట్లు గొప్పగాను, శబ్దములో అంబా ! అను ప్రేమోచ్చార ముతోను గోచరమగుచున్నది.

శ్వానముయొక్క మూత్ర పురీషాదులు ఏదైన దైవకార్యమున కుపయోగించునా ! కామధేనువుయొక్క గోమూత్ర గోమయాదులెంత పవిత్రము లైనవి. పాప విమోచనముజేసి పావన మొనర్చెడు క్రియ లన్నిటికిని వీటిని వినియోగపఱచెదరు. అలాగున మనుజులలో, ఏజాతిలో జన్మించినవారైనను వారి మలమూత్రముల నెవరైన యజ్ఞాది దైవకార్యములలో

పవిత్రార్థమున వినియోగపఱచెదరా ! ఇంత మాత్రమేని ఆలోచింపక, ఆత్మజ్ఞాన గంధములేని పామరుల మాటల నాధారము జేసికొని మీబోటి మనీషావంతు లెట్లు చెప్పుటకు సాహసించుచున్నారు!

బ్రా :- శాస్త్రములో తెలుపువర్ణము గలవారు బ్రాహ్మణు లనియు, ఎఱుపు వర్ణము గలవారు క్షత్రియులనియు, పసుపు వర్ణము గలవారు వైశ్యులనియు, నలుపు వర్ణము గలవారు శూద్రు లనియు జెప్పియుండలేదా!

అ :- ఇట్టి విధి ననుసరించిన మంచిది. ఏలాటి వివాదములకు నవకాశము లేదు. ఇటులుండుట సత్యమైనచో, జాతిభేదము గలదని నిశ్చయించుటలో ఏ విధమైన సందేహమున్ను లేదు. అట్లయిన బ్రాహ్మణులందఱు తెలుపు రంగుగలవారుగను, క్షత్రియులందఱు ఎఱుపు వర్ణము గలవారుగను, వైశ్యులందఱు పసుపువర్ణము గలవారుగను, శూద్రులందరు నలుపు వర్ణము గలవారుగ నుండవలయును. ఇది సత్యమైన అర్థమైనచో బ్రాహ్మణులలో గల నల్లని రంగుగలవారిని, శూద్రులలో గల తెల్లనిరంగుగలవారిని విభాగము చేయవలసియుండును. అట్లయిన బ్రాహ్మణులలో గల తెలుపు వర్ణము గలవారిని మాత్రము బ్రాహ్మణులనుగా జేసి, తక్కిన క్షత్రియవైశ్య శూద్రులలోగల తెలుపురంగు గలవారిని బ్రాహ్మణులలో జేర్చవలసియుండును. అలాగున క్షత్రియులలోగల, శుక్ల, పీత, వర్ణములు గలవారిని వేఱుపఱచి తెలుపువారిని బ్రాహ్మణులలోను, పసుపువర్ణము గలవారిని వైశ్యులలోను, నలుపురంగు గలవారిని శూద్రులలోను జేర్చి వర్ణాశ్రమ సనాతనధర్మము యొక్క ప్రతిష్ఠాపనము జేయవలసి యుండును. ఈలాగున వైశ్యుల లోను, శూద్రులలోను, యేయేరంగులవారిని, ఆయా వర్ణములలో గలుపవలయును. అపుడు వర్ణాశ్రమములు సత్యములని ప్రతివారు నంగీకరింతురు. ఇట్లు జేయువారు సృష్టిలో నెవ్వరైన గలరా ? అట్లుగాని వాక్యములు చాల భాషితములనియే విజ్ఞులు

దలంతురు. మఱియు నీ రంగులను గుఱించియే జాతియొక్క నిర్ణయము సత్యమైనచో ఇపుడు పాశ్చాత్యులే తెలుపువర్ణము గలిగియున్నారు. వారిలో రష్యావారు మిక్కిలి తెల్లనివారు. దానికి కారణము యూరోపు ఖండమునకన్న రష్యాదేశము అత్యంత హిమముతో గూడిన దగుటచే, అట్టి రంగుమార్పు గలుగుటకు కారణమని శాస్త్రజ్ఞులు నిర్ణయించియున్నారు. మఱియు అరబ్బీ దేశస్థులు మిక్కిలి యెఱుపురంగు గలవారైయున్నారు. చైనా, జపాన్‌దేశనివాసులు పసుపురంగు గలిగి యున్నారు. భారత ఖండములో అధిక జనులు నలుపు రంగు గలవారలే. అట్లయిన అట్టివారిని ఏజాతి తరగతిలో జేర్చవలయునో మీరే యోచించుకొనవలయును. అట్లుగాక మేము శ్రేష్ఠులము, మేమే శ్రేష్ఠులయు అను వాక్య మును శ్రేష్ఠగుణములు లేనివారై చెప్పుట కర్థమే లేదు. జర్మనీయులు మానవ దృష్టిలో వారే శ్రేష్ఠులనియు, వారి పాలనక్రిందనే భూలోకమంతయు నుండవలయుననియు, అదేరీతిగ ఇంగ్లీషువారును, అట్లే ఇటలీవారును, అదేరీతిగ జపాన్‌వారును జెప్పుచున్నారు. భారతీయులు మేమే ఆర్యులమనియు, భారతభూమియే పుణ్యక్షేత్రమనియు వచించుచున్నారు. ఈ వాక్యము లన్నిటికి నేమి యర్థము గలదో ఆలాటి అర్థమే మీరు జెప్పుదానిలో గూడ నిగూఢమై యున్నది. ఉత్తమశాస్త్ర మీలాగున పుట్టిన కులము ననుసరించి వారు శ్రేష్ఠులని గాని, వీరు శ్రేష్ఠులని గాని వచింపక, శ్రేష్ఠగుణములగు సత్యము, శాంతము, కరుణ, దైవజ్ఞానము, పరోపకారబుద్ధి యెవరియందు గలిగి యుండునో వారే శ్రేష్ఠులని చెప్పుచున్నది. ఇదే సత్యము. దీనిని ప్రతివారు నంగీకరింపవలయును. దీనియం దెట్టి ప్రశ్నోత్తరములు గలుగవు. జాతియొక్క శ్రేష్ఠత్వ మొకరి కుపకారము జేయుటలోనే వ్యక్తమగుచున్నది. ఆలాగున జాతి యొక్క నికృష్టత్వ మితరుల కపకారము జేయుటలోను వ్యక్తమగుచుండును. బాహ్యామైన శుభ్రవస్త్రధారణము, దేహశుచిత్వము మాత్రము గలిగియుండిన శ్రేష్ఠత్వము గలుగదు. అంతఃకరణములో గల నిర్మలత, దైవజ్ఞానము మొదలగు గుణములే

శ్రేష్ఠత్వమునకు కారణములగును. ఆలాగున ఒక జాతినిగాని ఒక దేశమును గాని, అన్యాయముగా జయించుటలో శ్రేష్ఠత్వము లేదు. గోవులు మొదలగు అతి పావన జంతువులను, క్రూరములగు వ్యాఘ్రాదులు వధించుచున్నవి. దీనివల్ల ఆవులకన్న శ్రేష్ఠత్వము పెద్దపులులకు గలుగునా ! ఈ తత్త్వములన్నింటిని బోధించెడు మహాత్ములు వర్తమానయుగములో జన్మించి ధర్మోద్ధరణము జేయకపోవుటచేతనే పైజెప్పిన స్వమతాభిమానులై, గర్వులై, తమ ఆత్మకును, తాము జన్మించిన దేశమునకును, భూలోకమునకు నేలాటి మేలును జేయశక్తి లేని వారగుటకు కారణమైనది. ఒకడు అసత్యమునుండి సత్యముయొక్క సమీపమున కెంతకెంతకు జేరుచుండునో, అతడు అజ్ఞానము నుండి సత్యస్వరూపుడై వెలుగుచుండు సర్వేశ్వరుని జేరుచుండును. ఇదే శ్రేష్ఠత్వము యొక్కయు, నికృష్టత్వము యొక్కయు సారము. ఒకడు విజ్ఞాన బుద్ధితో తనయొక్క బాహ్యసౌఖ్యములకు కారణమగు ఇంద్రియములను నిరోధించుచో, అతడు శాశ్వతమగు తనయొక్క ఆత్మసుఖమును బొందుటే గాక, సుఖమును గోరుచుండు అనేక జీవుల కిహ పరసౌఖ్యముల నిచ్చుటకు శక్తి మంతుడగును.

ఇతడు ప్రకృతి వికారములకు దూరుడగును. ఎవడు బాహ్యసౌఖ్యముల కొఱకు ఇంద్రియములను బహిర్ముఖములుగ త్రిప్పియుండునో, అతనికి అనేక జీవుల సౌఖ్యము నపహరించినను, అనగా జీవుల బాధించినను తనకు పూర్తి సౌఖ్యము గలుగకపోవుటయే గాక, దైవమునుండి దూరుడై వికారమగు ప్రకృతిలో పడిపోవును. ఈయొక్క వాక్యములోనే ధర్మసార మంతయు నిమిడియున్నది. ఇపుడు నారద పరివ్రాజకోపనిషత్తునందు ఈవిషయమై గల రెండు వాక్యములు దెలిపెద

ఇంద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛత్యసంశయః ।
సన్నియమ్య తు తాన్యేవ తతస్సిద్ధిం నిగచ్ఛతి ॥

ఇంద్రియములు ఇంద్రియార్థములలో ప్రవర్తించుటచేత దోషమును

బొందుట నిక్కము. అనగా దుఃఖము గలుగును. సంశయము లేదు. అట్టి యింద్రియములను నియమించుట వలన మోక్షసిద్ధిని పొందగలుగును.

ఇంద్రియాణాం నిరోధేన రాగద్వేష క్షయేన చ ।
అహింసయా చ భూతానామమృతత్వాయ కల్పతే ॥

ఇంద్రియములయొక్క నిగ్రహము వలనను, రాగద్వేషముల నాశము చేతను, ప్రాణికోట్లపైనగల దయచేతను, అమృతత్వము గలుగుచున్నది. ఇక మైత్రేయ్యుపనిషత్తు నందుగల కొన్ని వాక్యములను దెలిపెద.

శబ్దస్పర్శమయా యేఽర్థా అనర్థా ఇవ మే స్థితాః ।
యేషాం సక్తస్తు భూతాత్మా న స్మరేచ్చ వరం పదమ్ ॥

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు అర్థములుగ నగుపడినను, అనర్థములే ఎందుకనగా ! ఆ యర్థముల యందాసక్తి గలిగిన మనుజుడు పరమమైన పదమును స్మరించుట లేదు.

వర్ణాశ్రమాచారయుతా విమూఢాః కర్మానుసారేణ ఫలం లభన్తే ।
వర్ణాదిధర్మం హి పరిత్యజన్తః స్వానంద తృప్తాః పురుషా భవన్తి॥

బ్రాహ్మణాది వర్ణభేదమును, గృహస్థాద్యాశ్రమ భేదమును, దేహాభిమానముగలవానికే గలుగును. వాడే కర్మఫలములగు సుఖదుఃఖముల ననుభవించును. అద్యంతములు గల యీ ధర్మములం దాసక్తి లేనివారు ఆత్మానంద పూర్ణు లగుదురు.

వర్ణాశ్రమం సావయవం స్వరూప
మాద్యన్తయుక్తం హ్యతికృచ్ఛ్రమాత్రమ్ ।
పుత్రాది దేహేష్వభిమానశూన్యం
భూత్వా వసేత్సౌఖ్యతమే హ్యనంతః ॥

మిగుల కష్టముల నిచ్చు సాంగములగు ఆద్యంతములు గల వర్ణాశ్రమాచారముల పుత్రాది దేహాభిమానముతో గూడ పరిత్యజించి, పరమానందాత్మ నిరతుడు కావలయును.

అభేదదర్శనం జ్ఞానం ధ్యానం నిర్విషయం మనః ।
స్నానం మనోమలత్యాగః శౌచమింద్రియ నిగ్రహః ॥

వర్ణాది భేదరహితమే నిజమైన జ్ఞానము. మనస్సు నిర్విషయస్థితి గలిగియుండుటయే నిజమైన ధ్యానమగును. విషయాది మాలిన్యమును హృదయమునుండి తొలగించుటయే నిజమైన స్నానమగును. ఇంద్రియములు విషయమాలిన్యములో ప్రవర్తింపక నిరోధము గలిగి యుండుటయే నిజమైన శౌచమనబడును.

శుద్ధ శౌచమితి ప్రోక్తం మృజ్జలాభ్యాంతు లౌకికమ్ ।
చిత్త శుద్ధికరం శౌచం వాసనాత్రయనాశనమ్ ॥
జ్ఞానవైరాగ్యమృత్తోయైః క్షాలనాచ్ఛౌచ ముచ్యతే ॥

మృజ్జలములచేనైన శౌచము లౌకికము, అనగా బాహ్య శౌచమగును. దేహవాసన, శాస్త్రవాసన, లోకవాసనలను విడచుట యనెడి శౌచము చిత్తశుద్ధికరము. జ్ఞానవైరాగ్యములనెడి మృజ్జలములచేనైన శౌచము సర్వోత్త శౌచమగును. ఇదియే అంతరంగశౌచమగును. ఇట్టి ఆత్మశుద్ధి లేక దేహశుద్ధిమాత్రము గలిగిన వంటపాత్రయొక్క బాహ్యప్రదేశమును శుభ్రముగా కడిగి, మాలిన్యముగల లో భాగమును గడుగ నట్లేయుండును.

ఏకమేవాద్వితీయం యద్గురోర్వాక్యేన నిశ్చితమ్ ।
ఏతదేకాన్తమిత్యుక్తం న మఠో న వనాన్తరమ్ ॥

సజాతీయ, విజాతీయ స్వగతభేదములు లేని వస్తువెద్దియో, అదియే

యేకాంతస్థలమని శ్రీ గురువులచే నిర్ణయింపబడినది. ఇట్టి యవస్థలు గలుగని మఠముగాని, వనముగాని యేకాంతము గాదు.

కర్మత్యాగాన్న సన్న్యాసో న ప్రేషోచ్చారణేన తు ।
సంధౌ జీవాత్మనోరైక్యం సన్న్యాసః పరికీర్తితః ॥

విహితకర్మములను మానుటవలన గాని, 'సన్న్యస్తం మయా' అను ప్రేషోచ్చారణ వలనగాని సన్న్యాస మేర్పడదు. ప్రత్యగభిన్న బ్రహ్మాత్మైక్యజ్ఞానమే సన్న్యాస మనబడును.

అనుభూతిం వినా మూఢో వృథా బ్రహ్మణి మోదతే।
ప్రతిబింబితశాఖాగ్రఫలాస్వాదనమోదవత్ ॥

అనుభవము లేని మూఢుడు శాస్త్రవాక్యముల మాత్ర ముచ్చరించుట, నీటిలో ప్రతిఫలించిన కొమ్మమీదనున్న పండ్లను రుచి చూచి సంతసించునట్లు వ్యర్థమే.

కఠోపనిషత్తు జూడుడు.

యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ।
మృత్యోస్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి॥

ఇహలోక మందున్నపుడును, పరలోక మందున్నపుడును ఆత్మ ఒకటియే. ఎవడు ఈ పరమార్థ తత్వమునందు భేదమును జూచుచున్నాడో వాడు మృత్యువువలన మరణము నొందుచున్నాడు. అనగా జీవుల్లయందు భేదకల్పనము జేయువా డెల్లప్పుడును, జనన మరణములతో గూడియుండునే గాని జన్మరాహిత్యము నొందజాలడు. మఱియు జీవుడు ఈ దేహాంతమున ఏస్థితి గలిగియుండునో, పరమందును నదే స్థితిలోనే యుండును. పరమం

దేస్థితి గలిగియుండునో మఱల జన్మము వచ్చునప్పుడున్ను అదే స్థితిలోనే యుండును. కావున ఈ దేహముతో గూడియున్న పుడే శుద్ధాత్ముడగుటకు ప్రయత్నింప వలయును. లేనిచో మూడు జన్మములను చెరపినవా డగును.

మనసై వేదమాప్తవ్యం నేహ నానాఽస్తి కించన ।
మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి ॥

ఈ యాత్మ శుద్ధమనస్సుచేతనే పొందదగినది. దీనియందు, కొంచెమైనను భేదము లేదు. ఎవ డాత్మయందు భేదము చూచుచున్నాడో, వాడు మరణము బొందుచున్నాడు. అనగా ఆత్మప్రాప్తి మననముచేత పొందదగినదే గాని, వేఱు ఉపాయము లేదు. అట్టి మననము గలవాడే ముని యనబడును.

పరాఞ్చిజ్ ఖాని వ్యతృణత్స్వయంభూ స్తస్మాత్పరా జ్పశ్యతి నాన్తరాత్మన్।
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షదావృత్త చక్షురమృతత్వమిచ్ఛన్ ॥

బ్రహ్మ యింద్రియములను ఇతరముల గుఱించి ప్రకాశింపజేయు వాటినిగా ( అనాత్మ భూతములగు శబ్దాది విషయముల గుఱించి) హింసించెను లేక సృష్టించెను. ఆ కారణమువలన అవి ఇతరములగు శబ్దాది విషయములను జూచుచున్నవి. అంతరాత్మను జూచుట లేదు. ఒకానొక జ్ఞాని మరణము లేకపోవుటను గోరినవాడై, మరల్పబడిన చక్షురాదీంద్రియ సమూహము గలవాడై, ప్రత్యక్పరమాత్మను చూచెను. చూచుచున్నాడని భావము.

పరాచః కామా ననుయన్తి బాలాస్తే మృత్యోర్యన్తి వితతస్య పాశమ్ ।
అథ ధీరా అమృతత్వం విదిత్వా ధ్రువ మధ్రువేష్వివహ న ప్రార్థయన్తే॥

అల్పప్రజ్ఞాలు బహిర్గతములైన కామములను గోరి, జనన మరణాదిరూపమైన యనర్థ సమూహమును బొందుచున్నారు. వారు వ్యాప్తమైన

అడ్డు లేని యాజ్ఞగల యమునియొక్క బంధనమును బొందుచున్నారు. తదితరులగు జ్ఞానులు ముక్తతను శాశ్వతమైన దానినిగా దెలిసికొని, యీ సంసారమండల మందలి అనిత్య పదార్థములయందు దేనిని గోరరు. ఆత్మయందు భేదదృష్టి గలవారు యమపాశముచే బద్ధు లగుచున్నారు. అభేదజ్ఞానము గలవారు విముక్తు లగుచున్నారు.

ఏష సర్వేషు భూతేషు గూఢోஉஉత్మా న ప్రకాశతే ।
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥

ఈ పురుషరూపమంగు సమస్తమైన (బ్రహ్మ మొదలు తృణపర్యన్తమున్న) భూతములయందు ఆవరింపబడిన ఆత్మ (బాహ్యములైన దర్శన శ్రవణాదులచే మఱుగైనది) ప్రకాశించుట లేదు. సూక్ష్మవస్తువును జూచువారలచే (పూర్వమందు జెప్పబడిన యింద్రియాద్యాత్మ లన్నింటికంటే, ఆంతరమై సూక్ష్మమైన యాత్మవస్తువును జూచు స్వభావము గలవారిచేత) ఏకాగ్రత గల సూక్ష్మవస్తు నిరూపణము నందాసక్తి గల బుద్ధిచేత ప్రసిద్ధముగా జూడబడుచున్నది. ఆత్మ తానై యుండియు, లేక తనలో నుండియు, దేనిచే గోచరము కాలేదో, ఆ విషయము ఈ శ్రుతివాక్యముచే దెలుపబడినది.

నావిరతో దుశ్చరితా న్నాశాన్తో నా సమాహితః।
నా శాన్తమానసోవాపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్ ॥

చెడు నడతవలన చాలించనివాడు ఈ ఆత్మను బొందడు. విషయసుఖమువలన శాంతి బొందనివాడును బొందడు. ఏకాగ్రచిత్తము లేనివాడును బొందడు. వ్యాప్తమైన చిత్తము గలవాడును పొందడు. జ్ఞానముచేత నీయాత్మను బొందును.

నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన

**యమేవైష వృణుతే తేన లభ్య**
**స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్ ॥**

ఈ ఆత్మస్వరూపము వేద స్వీకారము చేత బొందశక్యమైనది గాదు. ధారణాశక్తిచేతను బొందదగినది గాదు. విశేషముగా శాస్త్రశ్రవణము జేయుటచేతను బొందదగినది గాదు. ఈ సాధకు డేయాత్మను ప్రార్థించుచున్నాడో ఆ సాధకునిచేత బొందదగినది. అట్టివానికి ఈ యాత్మ స్వకీయమైన పారమార్థిక స్వరూపమును ప్రకాశింప జేయుచున్నది.

**అశరీరం శరీరేష్వనవస్థితేష్వవస్థితమ్ ।**
**మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి ॥**

జ్ఞాని అనిత్యములైన దేహముల యందున్నటువంటి, శరీరము లేని గొప్పదగు వ్యాపించి యున్న ఆత్మను దెలిసికొని దుఃఖింపడు.

**తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం**
**గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్ ।**
**అధ్యాత్మయోగాధిగమేన దేవం**
**మత్వా ధీరో హర్షశోకౌ జహాతి ॥**

చూడనలవి గాని, కప్పబడియున్న, సర్వభూతముల ననుసరించి ప్రవేశించియున్న, బుద్ధి గుహయందుంచబడిన, అతిసంకటమందున్న, అనాదియైన, ఆప్రసిద్ధమగు పరమాత్మను జ్ఞానయోగప్రాప్తిచేత (విషయముల నుండి మనస్సును మరలించి ఆత్మయందు జేర్చుట అధ్యాత్మయోగము. ఆ యోగము యొక్క పొందికచేత) తలచి, జ్ఞాని, సంతోష దుఃఖములను విడుచుచున్నాడు.

శ్రవణాయాపి బహుభి ర్యో న లభ్యః
శృణ్వన్తో౽పి బహవో యం న విద్యుః।
ఆశ్చర్యో వక్తా కుశలోస్య లబ్ధా
ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః ॥

అనేకులచే నే ఆత్మ వినుట కొఱకును పొందనలవి గానిదో, వినిన వారైనను అనేకులు ఏ ఆత్మను దెలిసికొనలేకపోయిరో, అట్టి యీ ఆత్మను నిపుణుడగు చెప్పువాడరుదు. నిపుణుడగు నాచార్యునిచేత శిక్షితుడగు దెలిసికొనువాడును అరుదు.

ఇట్టి స్థితి గలిగి యుండుటచేతనే బ్రహ్మవిద్యలో సామాన్య జనులకు ప్రవేశము గలుగుటకు అనుకూలపడక పోవుచున్నది. ప్రపంచములో గల సమస్త విద్యల గ్రహించవలసి యుండిన అంతఃకరణ శుద్ధి, చిత్తై కాగ్రత, విషయ విరక్తి కావలయునని నియమము లేదు. ఈ బ్రహ్మవిద్యయందు సంపూర్ణ విషయవిరక్తి గలిగిన వారికిని, ఇంద్రియములన్నిటి యొక్క యేకాగ్రత గలవానికిని, బుద్ధిశుద్ధమైన వానికిని మాత్రమే ప్రవేశము గలదు. అందువల్లనే పండితులు, మహారాజులు గూడ పైచెప్పిన లక్షణములు గల బ్రహ్మనిష్ఠుల పాదాక్రాంతులగు చున్నారు. ఇట్టి విషమ స్థితి యీ ఆధ్యాత్మ విద్యలో నుండుట చేతనే, యితర విద్యల వలె నిది వ్యాపకమునకు రాకుండుటకును కారణమగుచున్నది. అంతే గాదు. ప్రారంభములో దీనిచే గలిగెడు బాహ్యసంబంధ ఫలమేమియు కనుపించక పోవుటచేతను, దీనియందు జనులకు ప్రవేశము లేక పోవుచున్నది. అయితే కొంతకాలము అనుష్ఠానము గలిగి రాగారాగా ఇతర విద్యల కన్న ఎన్ని యో రెట్లు దృష్టఫలము గలుగుచుండును. మఱల అదృష్టమగు ఫలమనంతము, నిరతిశయసుఖ మక్షయము, మఱియు జన్మాంతర సుకృత విశేషము చేతను, ఈశ్వరభక్తి చేతను, తపస్సు చేతను, అంతఃకరణము శుద్ధము గావలసి యుండును. అదియు దీని కొక ముఖ్యకారణము.

సోదరోత్తమా! సర్వజనులకు వారి గుణానుసారముగ అన్ని విద్యలలో ప్రవేశము లేకపోవుటచేతనే, కామధేనువులచేతను, చింతామణులచేతను ప్రకాశవంతమై హిమాచల సేతు పర్యంతము విస్తరించి యుండు ఈ మహాభూఖండము పరుల కధీనమై యీ దేశవాసులు బానిసలై పోవుటకు కారణమైనది. గజనీమహమ్మదు దండెత్తి ప్రప్రథమమున భరత ఖండమునకు వచ్చినపుడు విశేష సైన్యముతో రాలేదు. ఆ సేనలకన్న భారతదేశ వాసులు ఎన్నో కోట్ల రెట్లధికముగా నుండిరి. ధనుర్విద్యయందు క్షత్రియు లెంత తక్కువగా నుంటున్నారో అపుడు నాలాగుననే యుండిరి. యుద్ధనైపుణ్యము గలవారు కొలది క్షత్రియులు మాత్ర ముండుటచేతనే మహమ్మదీయ సైన్యము వీరిని జయించుటకు కారణమైనది. అలాగున బ్రహ్మవిద్య యందు బ్రాహ్మణులకు మాత్రమే అధికారము కలదు. ఇపుడు గూడ బ్రాహ్మణజనసంఖ్య ఇతర జనసంఖ్యకన్న ఎంతతక్కువగ నున్నదో, అపుడు నాలాగున నుండెను. విరక్తులకు మాత్రమే బ్రహ్మవిద్య యందు ప్రీతి గలుగుటచే ఇపుడువలె అప్పటి బ్రాహ్మణులలోగూడ చాల కొద్దిమంది మాత్రమే విరక్తులుండియుందురు. ఈకారణము వలననే బ్రహ్మవిద్యా ప్రచారము లేకపోయెను. ఆలాగున వైశ్యులు వ్యాపారము జేయుచుండిరి. బలిష్ఠులును, ప్రజ్ఞావంతులును నగు బ్రాహ్మణేతరులు అధికముగా నుండియు, అధికారనిరోధ పాపము గలిగియుండుటచే వారికి ధనుర్విద్యయందును, బ్రహ్మవిద్య యందును ప్రవేశము లేకపోయెను. ఈ మహాదోషము చేత భరతఖండ మడుగంటిపోయెను. పరుల పాదాక్రాంతమాయెను. ఈ యొకవిచారము దీర్ఘకాల మాలోచించిన ఎట్టివాని మనస్సుగూడ నీరై కరుగకమానదు. ఇపుడేలాగున దేహబలము, మనోబలము గలవారు ఏ జాతిలో నుండినను అట్టి వారిని సైన్యములో జేర్చుకొనుచున్నారో, అందువలన గదా! శత్రుదాడుల నరికట్టుటకే గాక అట్టివారిని పారదోలుటకు గూడ ప్రభుత్వమునకు శక్తి గలిగినది. అయితే పరమఋషుల పాద ధూళిచే

పునీతమైన దేశము భరతఖండమగుటచే దీనికి వినాశము గలుగదు. సనాతనముగానే నిలుచును. దీని కొఱకే సర్వేశ్వరానుగ్రహము వలన, గాంధీగారు మొదలగు నాయకులు ఏర్పడి, స్వదేశ సంరక్షణ మంత్రోపదేశము వలన నిపుడు అన్ని జాతులలో గల ప్రజ్ఞావంతుల నందఱిని యాకర్షింప గలిగిరి. ఇట్టి రహస్యతత్త్వ బోధము గలిగి నందుననే మాతృదేశ సంరక్షణ కొఱకు జనులు ప్రవర్తించుచున్నారు. ఇది ఒక గొప్ప శుభసూచన యనియే గ్రహించవలయును. జాత్యైక్యము లేకపోవుటే, భారతదేశ పతనమునకు కారణమైనదని నిర్మల జీవులందఱు ఇపుడు గ్రహింపగలిగిరి. ఇపుడేలాగున గుణమునకే ఆధిక్యము గలుగుచున్నదో, యిదే నిజమైన సత్యయుగము యొక్క ఆవిర్భావ సూచకమని గ్రహింపవలయును.

ఇప్పుడు గూడ స్వరాజ్యమిచ్చు విషయములో, పాశ్చాత్యామాత్య ప్రభృతులు భారతీయులతో మీకైకమత్యము లేదు, మీరందఱును ఏకీభవించిన మీకు మీ స్వరాజ్యము నిచ్చెదము, అట్లు గానిచో మీలో మీకు పోరు పెరిగి పతితు లగుదురు. లేక యే విదేశీయులైన మీ దేశము నాక్రమింపగలరు అని చెప్పు వాక్యములలో అర్థము లేదని తలంచకూడదు. ఇదియు ఒక దైవశక్తి యనియో, దైవకరుణ యనియో తలంపవలసి యుండును. ఏలన, ఇట్లయిన జాతిద్వేషము నశించి సర్వజనులకు వారివారి గుణానుసారముగ యోగ్యత గలుగును. అదే నిజమైన సత్యమగును.

బ్రా:- గుణము ననుసరించియే జాతి నిర్ణయము జేయవలసి యుండిన, బాల్యకాలములో నుండువారికి సత్త్వ, రజస్తమో మిశ్రగుణములలో ఏ గుణము గలిగియుండెనని యెట్లు నిశ్చయింపబడును? అపుడు సత్త్వగుణము గల వారందఱిని బ్రాహ్మణులనుగా ఎట్లు చేయగలుగుదుము? ఒకవేళ అప్పటి స్థితిలో సత్త్వగుణము గల వారిని బ్రాహ్మణులనుగా జేసినను తరువాత రజస్తమో గుణములు గలుగునపుడు వారిని క్షత్రియులలో గాని,

శూద్రులలో గాని జేర్చవలసియుండును గదా! అపుడు ఒకజన్మలోకి కొంతకాలము బ్రాహ్మణుడుగాను, మరికొంత కాలము క్షత్రియుడుగాను, మఱికొంత కాలము శూద్రుడు గాను జేయవలసి యుండును గదా! ఈలాటి విభాగము నెవరు చేయగలరు? కావున ఏదైన నొక జాతి నిర్ణయము పుట్టిన కులము ననుసరించి యుండే తీరవలయును.

అః– పవిత్రాత్మా! ఇది మంచి ప్రశ్నగా నున్నది. బ్రహ్మజ్ఞానమున కెపుడైనను బ్రాహ్మణ లక్షణము గలిగి యుండవలెననియే యిదివరలో జెప్పినదానియొక్క సారము. అట్టి శమాదిగుణములు గలవారు బ్రాహ్మణ జన్మమున కువచ్చిన వారగుటచే, వారెవరైనను బ్రహ్మజ్ఞానమున కర్హులనియే యిదివరలో జెప్పిన వాటి అన్నిటి యొక్క ముఖ్యాంశము. అట్లు గాక బ్రాహ్మణకులములో బుట్టినవారే అర్హు లనియు, తక్కిన వర్ణములలో బుట్టిన వారనర్హులనియు గల భావము దొలగవలయును. అంతే యాశయము. పూర్వము ఈసత్త్వ రజస్తమో గుణముల ననుసరించియే చాతుర్వర్ణ్య మేర్పడినట్లు భారతమందు, భృగు భారద్వాజ సంవాదమున స్పష్టపఱచి యున్నారు. ఆ భాగ మువచ్చినపుడు దాని గనదగును. సత్త్వగుణము గలవారిని బ్రాహ్మణులనుగా పరిగణించినను, ఆ కాలములో గాకపోయినను, మఱి యొక కాలములోనైన రజస్తమో గుణములు గలవారు ఏర్పడుదురని మీరే తెలిపిరి. అట్లయిన రజస్తమో గుణములలో నుండువారిలో ఆ కాలములో గాని, మఱియొక కాలములో గాని సత్త్వగుణము గలవారేల పుట్టగూడదు? ఇపుడు బ్రాహ్మణులలో అందఱును సత్త్వగుణోపేతులుగా నుంటున్నారా?

బ్రాహ్మణేతరులలో సత్త్వగుణాన్వితులు లేరని యెవరు జెప్పగలరు? జన్మతః బ్రాహ్మణులు శ్రేష్ఠులనియు, అదే రీతిగా జన్మముతోనే బ్రాహ్మణేతరులు నికృష్టు లనియు నుండుభావము పోవలయును. ఒకవేళ జాతి యనునది నిమిత్త మాత్రముగ ఒకటుండినను వ్యవహారములో గుణము ననుసరించి యేర్పాటు

గావలయును. ఇందువలన బ్రాహ్మణ, బ్రాహ్మణేతర మిశ్రవివాహ మిశ్ర భోజనములు గావలయునని మా తలంపు కాదు. గుణము ననుసరించి అట్లు చేసినను అయ్యది పాపమని తలంచను. ఇపుడు లోకములో అనేకము లా లాగున జరుగుచున్నవి. ఆ విషయమై నాకు వివాదము లేదు. గుణముననుసరించి ఆత్మోన్నతి మార్గములో అడ్డు దగుల కూడదని మాత్రము నా యాశయము. తక్కినవి వారివారి యిష్టాను సారముగ వదలివేయడమైనది. క్రైస్తవ మతమును గాని, మహమ్మదీయ మతమును గాని, ఆర్యమతమును గాని, సిక్కుమతమును గాని ప్రారంభించుటకు ముందు మత నియమము ననుసరించి వర్తించు శ్రేష్ఠులను జేర్చుకొని యుందురు. కాలాంతరముచే మూడుగుణముల గల వారున్ను ఏర్పడి యుందురు. అదే ప్రకారము బ్రాహ్మణ, బ్రాహ్మణేతరులతోను గనపడుచున్నది.

అయితే క్రైస్తవ, మహమ్మదీయ, సిక్కు, ఆర్యమతములలో నుండువారలలో ఈ చాతుర్వర్ణ్య విభాగము లేనందుచే వారు సత్త్వాదిగుణములలో ఏ గుణముగల వారైనను వారు క్రైస్తవులనియో, మహమ్మదీయులనియో, సిక్కులనియో, ఆర్యులనియో జెప్పుదురు గాని హిందూమతములోనుండు వారివలె నాలుగు వర్ణములు గల వారిలో బుట్టిన వారని జెప్పరు. మఱియు పై జెప్పిన మతములలోనన్నిటిలోను, జన్మించినవారి యోగ్యత ననుసరించి సర్వ కార్యములలోను సమానాధికారము గలదు. అలాగుండవలెననియే నా తలంపు. అప్పుడే ఆ మతము ఆసంఘము శాశ్వతముగ నభివృద్ధి గలిగియుండును. పుట్టిన జాతి ననుసరించి యుచ్చనీచావస్థల కల్పించి నందుచే ఆ ఉభయజాతులకున్ను పతనము గలుగుటకు కారణమైనది. శ్రేష్ఠజాతిలో బుట్టినంత మాత్రము చేతనే యుత్కృష్ట గుణములు లేకపోయినను, తాను శ్రేష్ఠుడునని తలంచుట పతనమునకు గారణమగును. అలాగున తక్కువ కులములో జన్మించిన కారణముచే మాత్ర ముత్కృష్ట గుణములు గలిగియుండినను యున్నతస్థానమునకుబోవ అర్హత లేనందుచే ఈజాతియు పతనమగుటకు కారణము. ఇట్టి భేదము కలుగనీయక చూడవలయుననియే నా యాశయము గాని తుచ్ఛములగు భోజన, వివాహాదులలో

సమత్వము గావలయునని గాదు. ఇపుడు బ్రాహ్మణులలో గూడ కొన్ని తెగలవారు గలరు. వారికి మిశ్ర వివాహ, భోజనాదులు లేవు. అయినను బ్రాహ్మణత్వ కార్యము లన్నిటిలోను సమానాధికారము గలిగియున్నారు. అదే రీతిగా యుండిన జాలును. అపుడే లోకమున్నత స్థితికి రాగలుగును.

బ్రా:- దయార్ద్రహృదయా! ఉపనయనాది సంస్కారములచే, వేదాధ్యయనాదులయం దధికార మేర్పడును. మీరు పైన జెప్పిన బ్రాహ్మణుల వాక్యములలో వారిలో గల భేదములు కొన్నింటిని గలిగియున్నను, అందఱికిని ఉపనయనాది సంస్కారములు గలవు. బ్రాహ్మణేతరులకు ఉపనయనాది సంస్కారములు లేనందుచేతనే వేదాధ్యయనాదుల కధికారము లేదని జెప్పుటకు కారణమైనది.

అ:- మిత్రమా! ఉపనయనాది సంస్కారములు జన్మనా యెవరును గలిగి యుండలేదు. తరువాత జరుగుచున్నవి. అలాగున బ్రాహ్మణేతరులకు గూడ ఉపనయనాది సంస్కారము లేల జేయగూడదు? ఆర్యసమాజస్థులు మొదలగు కొందఱు మతకర్తలు బ్రాహ్మణేతరులకు గూడ ఉపనయనాది సంస్కారముల జేసి వేదవిద్యల నభ్యసింపజేయుచున్నారు. అలాగున నేల జేయకూడదు?

బ్రా:- బ్రహ్మజ్ఞానము జన్మాంతర పుణ్యవిశేషముచే గలుగవలసినదేగాని దానికి బ్రాహ్మణుడై యుండవలయునని నియమము లేదు. అంతేకాదు బ్రహ్మజ్ఞానము గలుగునపుడు, మాయాకల్పితమగు, ఈ జాత్యభిమానము నశించునేగాని, మీరు చెప్పులాగున జాతిలోగూడ ఆధిక్యము కావలయునని యేల వ్యర్థముగ వాదము బెట్టుకొని ద్వేషమును గలుగజేయవలయును? జనకుడు, గొప్ప బ్రహ్మ వేత్త అయ్యు స్థూల దేహసంబంధ బ్రాహ్మణుడు గావలయునని వాదించెనా? అట్లే విదురుడు మహాజ్ఞాని యయ్యు, లోకమున గల బ్రాహ్మణుడను గావలయునని చెప్పనా?

జ్ఞానులందఱు ఆలాగుననే యుందురు గాని, నేను ఎక్కువ జాతివాడను గావలయునని వాదమునకు దిగరు.

అ: – ఆత్మ మిత్రమా! జ్ఞానులలో కొందఱు, మీరు జెప్పులాగున జనక విదురులవలె నిరభిమానులై యుందురు. విశ్వామిత్రులుమాత్ర మేల క్షత్రియుడై యుండియు బ్రాహ్మణత్వమును బొందెను? అట్లు బ్రాహ్మణుడైన ఎక్కువ ఆధిక్యము గలుగునని తలపుతో విశ్వామిత్రుడు జేసి యుండలేదు. జాతి యనునది కులము ననుసరించినది గాదనియు, గుణము ననుసరించినదే యని తెలుపుట కట్లు జేసెనే గాని మఱొక విధముగా గాదు. ఇపుడు గూడ గుణము ననుసరించి సర్వజనుల కున్నత మార్గమునకు అవకాశము గలుగవలయునని యాశయము మాత్రమేగలదు గాని, వేఱువిధముగ ఏ యాధిక్యము గావలయునని తలంపు లేదు. ఇపుడు గూడ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యశూద్రాదులలోను, నిమ్నజాతులలోను గలవారనేకులు స్వాతంత్ర్యము నుద్దేశించియు, క్షేమము నుద్దేశించియు క్రైస్తవ, మహమ్మదీయ, బౌద్ధ, ఆర్యబ్రహ్మ సమాజ మతములలో జేరుచున్నారు. మఱికొందఱు మాత్రము ఏ మతమైనను, మతి మాత్రము మంచిదిగ నుండిన చాలునని తలంచి, జనక విదురాదుల వలె పుట్టిన జాతిలోనే యుంటున్నారు. కాని అందఱు ఆలాగుననే యుండిరని నిశ్చయింప వీలులేదు. కపిలుని యొక్క సాంఖ్య మతములో ఆకాలములో గూడ అనేకులు జేరిరి. జినుడు పుట్టినప్పటికి జైన మతముండలేదు. అప్పుడుండు లోక పరిస్థితిలో, సర్వ జనులకు స్వాతంత్ర్యము లేదని దలంచి, మహాత్ముడగు జినముని క్రొత్తగా ఏర్పరచిన మతములో జేరిన వాదందఱు జైనులైరి. తరువాత శ్రీ బుద్ధదేవుని కాలమున హింసాది కృత్యములు విశేషముగ గల యాగములు, లోకమందు నిండి యుండుటచే, కరుణాసముద్రుడగు శ్రీ బుద్ధుడొక మతమును నిర్మించెను. దానియందు సర్వజనులలో నుండి చేరినవారిని బౌద్ధమతస్థులని బిలువ నారంభించిరి. ఆలాగున క్రీస్తు జన్మించినపుడు, పర్సీలగు జూద్ మతస్థుల

క్రూరకృత్యములు మహా భయంకరములుగా నుండెను. అపుడు ఈశపుత్రుడగు యేసు నవీన మతము నొకదానిని యేర్పఱచెను. దానిలో జేరిన వారందఱిని క్రైస్తవులని పిలువసాగిరి.

అదే రీతిగ శ్రీ మహమ్మదు, శ్రీ జోరాష్ట్ర, శ్రీ గురునానక్, శ్రీ దయానంద, శ్రీ రాజారామమోహనరాయి మొదలగు పుణ్యజీవులు లోకులకు దయా సత్యాది ధర్మములు బోధించినను, అందఱు నంగీకరింపమిచే ప్రత్యేక సంఘముల నేర్పాటు గావించుకొని, మహమ్మదు ప్రవక్త మతమును నమ్మినవారు మహమ్మదీయులైరి. ఆలాగున జోరాష్ట్ర మతమును నమ్మినవారు పార్సీయులైరి. శ్రీ గురునానక్ మతమును నమ్మిన వారు సిక్కు మతస్థులైరి. దయానంద మహర్షి సత్తముని మతమును నమ్మిన వారార్యులైరి. కృపానముద్రుడగు రామమోహన్‌రాయి మతముల నాశ్రయించినవారు బ్రహ్మసామాజికులైరి. శ్రీ శంకరాచార్య మతము నంగీకరించినవా రద్వైతులైరి. శ్రీ రామానుజ మతము నవలంబించిన వారు విశిష్టాద్వైతు లయిరి. అట్లే శ్రీ మధ్వాచార్యుల నాశ్రయించినవారు మాధ్వులైరి. ఈ మతము లన్నియు ఏలాగున నేర్పడి వచ్చినవో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాదులున్నూ, ఈలాగున నేర్పడినవారే గాని మఱే విధముగ నేర్పడినవారు గారు. ఇదివఱలో నిప్పటికి ఎన్ని మతము లేర్పడినవో, యింకను అట్లే భావికాలమున నెన్నియెూ మతము లేర్పడగలవు. మహాకల్పాంతము వఱకీలాగుననే జరుగుచుండును.

ఇట్టి భావమును విశాల హృదయముతో నవలోకింపక యీశ్వరుని యొక్క ముఖ, బాహూరు పాదముల నుండి, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాదులు జన్మించిరని జెప్పుటకన్న అంధ విశ్వాసము మఱొకటి గలదా! ఒకవేళ ఈ నాలుగు జాతులు ముఖాది స్థానముల నుండి బుట్టిన బుట్టు గాక! హిందువులవలె పురాతన కాలము నుండి యేర్పడి యుండు క్రైస్తవులు,

మహమ్మదీయులు, చైనీయులు, జపానీయులు, బాబిలోనీయులు మొదలగు ఖండ ఖండాంతరములలో నుండు జనులు ఎచ్చటి నుండి బుట్టిరి! ఎవ్వరైనా చెప్పగలరా? ఈ భారతదేశమున గల చాతుర్వర్ణ్యస్థులను మాత్రము ఈశ్వరుడు సృష్టించినాడుగాబోలు, భూఖండములో గల దేశ దేశాంతరము లందు గల జనులను సృష్టించిన ఈశ్వరుడు హిందువులు సృష్టించిన యీశ్వరుడు గాక, మఱొకరో, యిద్దరో, ముగ్గురో, అనేకులో యీశ్వరులు గావలసి యుందురు గదా! కావున విశ్వైక్య దృష్టితో నవలోకనము జేయకపోవుట చేతనే యీ సంకుచితభావము తొలగక యింకను అంటుకొని యుండుటకు కారణమగుచున్నది. భారతదేశము పుణ్యభూమి యనియు, సృష్టిలో భారతీయులే శ్రేష్ఠులనియు ఆత్మస్తుతి జేయుటచే నిసుమంతయు లాభము లేకపోవుటే గాక దేశాభివృద్ధికి నష్టమే గలుగును. ఈ దేశీయులు ఇతర దేశీయులను తక్కువగా తలంచునట్లు, ఆ దేశీయులు ఈ దేశీయులు అనాగరికులనియు, అస్పృశ్యులనియు గూడ జెప్పుచున్నారు. దక్షిణాఫ్రికా మొదలగు కొన్ని పాశ్చాత్య దేశములలో ఆ దేశీయులు ప్రయాణము జేయు రైళ్ళలో గూడ వీరు ప్రయాణము జేయ గూడదు. ఆ శ్వేత జాతులుండు వీథులలో వీరు నడవగూడదు. ఆ తెల్లవారుండు ప్రదేశము లందు నివాసమునైన చేయరాదు. ఇంకను ఎన్నో విధములైన ప్రతిబంధము లీ భారతీయులకు గలవు. ఆ దేశమునకు వెళ్ళి సంచరించివచ్చిన వీరే శ్రేష్ఠులనెడి దుర్మత మడగి పోవును. అంతే గాదు, ఒకరి పాలన క్రింద అణగి బానిసలై యుండువారు శ్రేష్ఠులనియు, వీరిని పాలించువారు శ్రేష్ఠులు కారనియు ఎట్లు జెప్ప గలిగిరి? ఈ దురుద్దేశములన్నియు వదలిపోయి గుణమున కాధిక్యము ఎపుడు గలుగునో అపుడు మాత్రమే యీ భారతలోక ముద్ధరింపబడును. ఈ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాది జాతుల నెవరేర్పఱచిరి! ఎపుడేర్పఱచిరి! ఎందుకేర్పఱచవలసి వచ్చినది! అను మూడు ప్రశ్నలకెచ్చటను, ఎవరును తగు సమాధానము నిరూపించియుండలేదు. శ్రీ మహాభారతము నందు జెప్పబడిన

మార్గము సత్యమైనదిగా దోచుచున్నది, అట్లు కలుగుట కవకాశము గూడ గలదు. దాని ప్రమాణ శ్లోకములు భారతమును గుఱించి వ్రాయునపుడు నిరూపింపబడును. దాని యొక్క సంగ్రహమేమన! మానవసృష్టి యేర్పడిన కాలములో అందఱును బ్రాహ్మణులై అనగా ఆర్యులై యుండిరి. దయానంద సరస్వతి మొదలగు వేదాంతు లీలాగుననే అంగీకరించియున్నారు. అట్టి ప్రాథమిక మనుష్య సృష్టి ''టిబెట్టు'' నందేర్పడినదని చెప్పుచున్నారు. అపుడు, బ్రహ్మధర్మములగు తపః స్స్వాధ్యాయములు వారిలో ముఖ్యు లేర్పఱచిరి. వాని నవలంబించిన వారు బ్రాహ్మణులైరి. బ్రహ్మ నవలంబించినవారు లేక వేదము నాశ్రయించినవారు బ్రాహ్మణులని పిలువబడిరి. తపస్స్వాధ్యాయ యోగాద్యనుష్ఠానముల పూర్తిగా ననుష్ఠింపజాలక, చాల వఱకు విడచినవారై జన సమూహమును సంరక్షించుటలో, బలిష్ఠకాయము గలవారై, రజోగుణము గలిగినవారు క్షత్రియులైరి. తపఃస్స్వాధ్యాయ యోగాదులలో అధికభాగము ననుష్ఠింప జాలక దేహ పటుత్వము కొంత తగ్గినవారై జనసమూహమునకు కావలసిన సామానుల సమకూర్చి క్రయ విక్రయములను ప్రారంభించువారు కొందఱు మిశ్రగుణములతో గూడిన వారగుటచే వారిని వైశ్యులని పిలుచుచుండిరి. వేదమార్గములో జెప్పినటు లాచరణ జేయజాలక సత్య శౌచ, దయాదులు లేనివారై ఆర్యజనసమూహమునకు కావలసిన పనులు జేయువారలై, తమోగుణముతో గూడిన వారిని శూద్రులను నామధేయముతో బిలువసాగిరి. ఇదియే సత్యమైన చాతుర్వర్ణ్యముల విభాగమని తోచుచున్నది. ఇది వర్తమాన యుగమున బ్రాహ్మణులలోను గనుపించుచున్నది.

కొందఱు వైదిక నిష్ఠాపరులై యుండువారును, ఉద్యోగస్థులై యుండువారును, కొందఱు వ్యాపారస్థులై యుండువారును, కొందరు శ్రీమంతులును, ఉద్యోగస్థులునగు బ్రాహ్మణుల యిండ్లలో పనులు జేయువారును గలరు గదా. కావున ఈ మహాభారతమున జెప్పిన విధానమే సరియైనదని తోచుచున్నది! ఇదే గుణకర్మల ననుసరించి, చాతుర్వర్ణ్య

విభాగము గలదను వాక్యము యొక్క నిజార్థమగును. ఏలన! సత్త్వాది గుణములు జీవుల యందనాదిగా నుండుటవలన, ఏ యే గుణములు గలవారు దానికనుగుణమగు కార్యములో ప్రవర్తించుట సృష్టియొక్క తత్త్వమై యున్నది. ఒక బ్రాహ్మణజాతిలోనే నాలుగు జాతులు పై జెప్పిన ప్రకార మేర్పడినవో ఆలాగున క్షత్రియులలో సత్త్వ గుణాధిక్యము గలవారు, తపః స్వాధ్యాయాధ్య నుష్ఠానము గలవారుగను, రజోగుణము గలవారు ఉద్యోగస్థులుగను, మిశ్ర గుణము గలవారు కృషివ్యాపారాదులు గలవారుగను, ఈ మూడింటి యందు శక్తి లేనివారు: ఇతరములగు పనుల జేయువారలునునై జీవించుచున్నారు. ఇదే విధమున వైశ్య శూద్రులలోను పైన జెప్పిన నాలుగు మార్గములలోను ప్రవర్తించువారు గలరు. ఇదే సరియైన చాతుర్వర్ణ్య విభాగము యొక్కతత్త్వము. అట్లుగాక ఒక కాలమున, ఒక జన సంఘములో, ఒక జాతిలో గలవారిని కొందఱిని బ్రాహ్మణులుగాను, మఱి కొందఱిని క్షత్రియులుగాను, ఇంక కొందఱిని వైశ్యులుగాను, కొందఱిని శూద్రులుగాను విభజించిన ఎవరును అంగీకరింప జాలరు. అంతే గాక అది పొసగదు.

ఏలన! ఇపుడుగూడ బ్రాహ్మణులలో బ్రహ్మనిష్ఠాపరులను మాత్రము మీరు బ్రాహ్మణులనియు, ఉద్యోగము జేయువారిని మీరు క్షత్రియులలో జేరవలయుననియు, వ్యాపారము జేయువారిని మీరు వైశ్యులలో గలియ వలయుననియు, వంటపని, నీళ్ళుమోయుట పనులు జేయువారిని మీరు శూద్రులలో జేరవలయుననియు జెప్పిన ఎట్లంగీకరింపజాలరో, పూర్వమున్ను అలాగుననే యుండియుండును. కావున ఒకజాతిని నాలుగు జాతులుగా విభజించడమైనదని చెప్పినది సరిగానుండదని దోచుచున్నది. మఱియు ఇంకొక విధముగా జాతి విభాగము ఉండవచ్చును. ఆర్యులలో ఒకరు గొప్పజ్ఞానవంతులై యుండి ఆర్యులందఱు నిట్లుండవలయునని ఒక నియమము నిదివఱలో జెప్పినట్లు చేసి యుండవచ్చును. దాని నంగీకరించిన వారార్యులైరి. తక్కిన వారందఱు ఒక సంఘముగా నుండునపుడు, గురునానక్, సిక్కు మతమును

స్థాపించినట్లు: ఆ ఆర్యసంఘములో కొంత కాలమున కొకరేర్పడి, క్షాత్రధర్మము నేర్పఱచి యుండవచ్చును. దానిలో జేరినవారు క్షత్రియులుగా నేర్పడియుందురు. మఱల మిగిలియుండు జనసమూహమున మఱియొకరేర్పడి వ్యాపార ధర్మమున కనుగుణముగా ఒక ధర్మము నేర్పాటు జేసియుందురు. దానిలో జేరినవారు వైశ్యులుగా నేర్పడుటకవకాశము గలదు. ఈసంఘములోను కొన్ని దైవనియమము లేర్పడియుండుటచే దేనిలోను జేరక ధర్మదూరులై, శౌచాచార రహితులయి యుండు వారిని శూద్రులుగా పరిగణించి యుందురు. తక్కిన ముప్పరికి, ఉపనయనాది సంస్కారములు గలవు, శూద్రుల కేలాటి సంస్కారమును లేనందుచే, వీరు పైజెప్పిన సంస్కారముగల మూడు వర్గములలోను జేరక మిగిలినవారుగ నుండుట కవకాశము గలిగినది.

దీనిపై జెప్పిన భాగములో విరాట్పురుషుని ముఖ బాహూరు పాదములనుండి నాలుగు జాతులేర్పడినను, కాలాంతరముచే త్రిగుణముల పరిణామము గలిగి యుండునని జెప్పబడినది. ఇదియు అంత నమ్మదగినది గాదు. సత్త్వగుణము ముఖముగాను, రజోగుణము బాహువులుగాను, మిశ్రగుణము ఊరువులుగాను, తమోగుణము పాదములుగానుండి ఆయాస్థలమున పుట్టినవాడైనచో ఆయాగుణముల కెపుడును మార్పు గలుగ గూడదు. అట్లు గనుపింపనందుచే ఈ వాక్యము సత్యముతో గూడినది గాదు. ఏలన! సృష్ట్యాదినుండి యేర్పడిన మధుఫలములనిచ్చు మామిడియు, పులుపు పండ్లనిచ్చు చింతయు, వగరుకాయలనిచ్చు ఉసిరికయు, చేదు పండ్లనిచ్చు ముష్టిచెట్టును్ను ఇంతవరకు ఆదిలో నుండిన గుణములుగల ఫలములనే యిచ్చుచున్నవి. అదేరీతిగా సత్త్వ గుణములో పుట్టినవారు బ్రాహ్మణులైనచో, వారెల్లపుడును సాత్త్విక గుణములు గలవారుగనే యుండవలయును. అలాగున క్షత్రియులు రజోగుణమున బుట్టిన వారైనచో యెల్లరును రాజసగుణము గలవారైయే యుండవలయును. ఆలాగున వైశ్యులందరు మిశ్రగుణము

గలవారుగను, శూద్రులందరు తామసగుణము గలవారుగా నుండవలయును. అట్లు కనుపించనందుచేతను, అన్ని జాతులలోను, సత్త్వ, రజో, మిశ్ర తమోగుణములు గలవారుండుటచే, ముఖ బాహ్వాదుల నుండి బ్రాహ్మణ, క్షత్రియాదులు పుట్టిరని చెప్పుటలో ఏలాటి అర్థమున్నూ లేదు.

మఱియు స్వభావమునకు, పుట్టిన కులము ననుసరించిన కర్మయే చేయవల యునని చెప్పుట విరుద్ధ ధర్మము. గుణముననుసరించిన కర్మయే యుండవలయు ననుట సత్యమగును. అట్లుగానిచో, బ్రాహ్మణులందఱు బ్రహ్మనిష్ఠాపరులును, క్షత్రియులందఱు రణవీరులుగాను, వైశ్యులందఱు వ్యాపారులుగాను, శూద్రులందఱు శుచ్యాచార రహితులై సేవకవృత్తి యందుండవలయును గదా! అలాగున నేజాతిలోనైన నెవరైన ఉంటున్నారా! అన్ని జాతులలోను బ్రహ్మజ్ఞానులు, యోధులు, వ్యాపారస్థులు, సేవకవృత్తి గలవారు గలరు. కావున గుణమునకే జాతినిర్ణయముండుట యీశ్వర సృష్టి యగును. తక్కినది మనుష్య కల్పితము. మఱియు సత్త్వాది గుణములు, ముఖాదిస్థానములలో గలవని చెప్పినది నిజమైనచో ఆయాస్థానములలో నుండి బుట్టినవారు ఇప్పటికిని అదే గుణముగల్గి యుండవలయును. సృష్ట్యాదినుండి గోవులు సత్త్వగుణవముతోను, వ్యాఘ్రాదులు రజోగుణవముతోను, భల్లూకాదులు మిశ్రగుణముతోను, సూకరాదులు తమోగుణములతోను గూడియున్నవి గదా! వాటికేల మార్పు గలుగలేదు? అలాగున సత్త్వగుణముగల హంస పక్షులును, రజోగుణముగల గరుడపక్షులును, మిశ్రగుణముగల క్రౌంచపక్షులును, తమోగుణముగల కాకములును సృష్ట్యారంభము నుండి యిప్పటివఱ కదేప్రకారముగనే గనబడుటచే ముఖ, బాహు, ఊరు, పాదములు సర్వేశ్వరునికి సత్వరజో మిశ్ర తమో గుణములు గలిగియున్నవని చెప్పుటలో నెలాటి సత్యమున్ను లేదు. ఇది "బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్" అను శ్రుతి విరాట్ పురుషుని వర్ణన యని గ్రహించక పోవుటచేతనే యిట్టి విపరీతస్థితి గలుగుటకు కారణమైనది.

ఒకవేళ ముఖ బాహూరు పాదములనుండి చాతుర్వర్ణ్య మేర్పడినను యేర్పడుగాక! భగవచ్చరణారవింద మంత నికృష్టమా! పరమ భక్తులందఱును, యోగీశ్వరులందఱును, జ్ఞానులందఱును, మహాత్ములందఱును పరమాత్మ చరణారవిందములనే ధ్యానించుచుందురు. భగవత్పాదకమలములలో నైక్యము గావలయుననియే గోరుచుందురు. అట్టి పావనమగు స్థలమునుండి పుట్టిన జీవులెంత పుణ్యజీవులో, యెంతటి పరమపావనులో అని యేల గ్రహింపరాదు? బ్రహ్మాది దేవతలు, సనకాదిసిద్ధులు, నారదాది పరమభక్తులు సదా ధ్యానించెడు, పూజించెడు భగవచ్చరణారవింద మెంత పవిత్రమైనదో గదా! అట్టి భావన జేసినను బ్రాహ్మణేతరుల నింత నికృష్టముగ ఏల జూచుచున్నారో దెలియుట లేదు. ఇక ఉత్కృష్టవేదాన్త శాస్త్రములలో జీవులు ఒకే కాలమున ఒకేస్థలమునుండి పుట్టలేదనియు, ఈశ్వరుడేలాగున పుట్టుకలేక సనాతనుడై యున్నాడో, జీవులున్ను అలాగున అనాదులనియు, సనాతనులనియు దెలుపబడియున్నది. ఇదివఱకు జెప్పినవాటి యన్నిటిలోను ఈభావమే చాలవరకు విశ్వసనీయమైనది. ఏలన! దేనికి పుట్టుకగలదో దానికి గిట్టుట ధర్మమైయున్నది. జీవులు ఎపుడు పుట్టిరని అంగీకరింతురో, అపుడు వాటికి వినాశమున్ను తప్పక అంగీకరించి తీరవలయును. ఈ బాధ గలుగునని తలంచియే, సనాతన సంబంధ శైవ, వైష్ణవాది మతస్థు లందఱును, జీవులనాదులనియు అంగీకరించుటకు గారణమైనది. అట్లయిన ఈశ్వరుడు సృష్టికర్తయని యేల చెప్పవలెనని సందేహము కొందఱకు గలుగవచ్చును. జీవులయొక్క సత్వ రజస్తమో గుణములను బట్టియు, పుణ్య పాప మిశ్ర కర్మముల బట్టియు, ఆయా కర్మఫలము ననుభవించుటకొఱకు, స్థూల, సూక్ష్మ కారణ శరీరముల మాత్రమే సర్వేశ్వరుడు సృష్టించెనని ఆ శాస్త్రములలోనే సమాధానము జెప్పడమైనది. ఇది సరియైన యుక్తిగానున్నది. కావున, గుణకర్మల స్వభావమును బట్టియే చాతుర్వర్ణ్యసృష్టి యేర్పడినదని జెప్పుటలో నేలాటి సందేహమున్ను లేదు. ఈ భాగము శాస్త్రములలో, కొంత లోభాగమున

గనందగును. ఇక మధ్వ మతమును గుఱించిన వింతయగు నొక సిద్ధాంతము గలదు. ముక్తి యోగ్య జీవులు, పుణ్యయోగ్యజీవులు, పాప యోగ్యజీవులు అనాదిగా గలరనియు, వారిలో ముక్తియోగ్య జీవులకు మాత్రమే మోక్షము గలదనియు, పుణ్యకర్మ యోగ్య జీవులు తత్ఫల మనుభవించుటకు స్వర్గాది లోకముల బొంది, మఱల భూలోకమున జన్మించి పుణ్యకర్మల చేయుచుందురనియు, పాపకర్మ యోగ్యజీవులు పాపములనే చేయు చుందురనియు, పాపఫలమగు నరకమునే పొంది మఱల భూలోకమున జన్మమెత్తి పాపకర్మములనే చేయుదురని వారి యభిప్రాయము. వారిది ద్వైతమతము, భేదమతము. ''జీవ జీవ భేదః'' వారుచెప్పు అయిదు భేదములలో, జీవజీవ భేదమున్ను ఒకటి యగును. జీవులలో ఇపుడు కనిపించెడు భేదమేలాగున నుంటున్నదో అది యెల్లపుడు నుంటున్నదనియు, దానికి మార్పుగలుగ దనియు జెప్పుదురు. అయితే జీవులు మాత్ర మనాదులని అంగీకరింతురే గాని, పరమపురుషుని ముఖ, బాహు, ఊరు, పాదములనుండి పుట్టినవారని జెప్పరు. ఒక్కొక్క మతమును పరిశోధించిన, వారి వారి యభిప్రాయము స్థాపించుట కెన్నియో యుక్తులను, ఎన్నెన్నియో దృష్టాంతములను, దాని కనుగుణములగు శాస్త్రములను నిరూపించుచుందురు.

కనుకనే యనేక మతములు ఏర్పడుటకు కారణమైనది. మాధ్వమతస్థులు తప్ప శైవ, వైష్ణవాది మతస్థు లందఱును, జీవులందఱు నొకే యీశ్వర స్వరూపు లనియు, ఒకే యీశ్వరాంశులనియు, ప్రస్తుతము కాన్పించెడు సత్వ రజ స్తమో గుణభేదములు జీవులకు నైజములు గావనియు, అవి ఆగంతుకములనియు, సత్త్వాది గుణత్రయముల కార్యముల జేయుటచే గలిగినవనియు, దైవభక్తిచేతను, ధ్యానయోగముచేతను, జ్ఞానముచేతను ఆ మూడు గుణములు నశించుననియు, అపుడు జీవుడు ముక్తుడగుననియు,

ముక్తజీవికి మఱల జన్మము గలుగదనియు, ఆ జీవులు నిరతిశయానంద సుఖస్వరూపులనియు వచింతురు. ఎట్లన! వస్త్రము తెల్లనిదై యుండినను, యెఱుపు, పసుపు, నలుపు మొదలగు రంగుల సంయోగముచే గలిగిన, రక్త, పీత, కృష్ణవర్ణములు ఆ శుద్ధవస్త్రమునకు మొదట నుండి యుండలేదనియు, అందువలననే ద్రావకాదులలో సబ్బు చౌడు మొదలగునవి వేసి వుడకబెట్టి యుతికినచో, రంగులు వదలిపోయి శుభ్రవస్త్రమగుననియు, జీవులయొక్కయు స్థితి ఆలాగుననుండునని వచించిరి. అట్లు దీపముయొక్క కాంతి స్వచ్ఛమైనను, శుక్ల రక్తపీత నీలవర్ణములు గల చిమ్నీలవలన అనేక రంగులు గలదిగా గనుపించినను, జ్యోతి యేలాగున స్వప్రకాశమై యుండునో, ఆలాగున ఆత్మయు గుణపరిణామముచే అనేక విధములుగా గనుపించినను అది ఆత్మకు నైజ స్వభావముగాదనియు, కర్మవిశేషముచే గలిగినదనియు జెప్పుదురు. ఈభావములో చాలవఱకు సహోదర భావమున కవకాశము గలదు. మాధ్వులు జెప్పునట్లు సత్వ, రజస్తమో గుణములు జీవులకు స్వభావమనియు, జీవులలోనే జీవులకు భేదము గలదనియు జెప్పుటచే ఆ మతము గలవారికి సోదరభావము, ప్రేమభావము, కరుణాభావము గలుగుట దుస్తరము. ఎపుడు భేదము శాశ్వతమని తలంపు గలుగునో అపుడు తనకు సమానముగా ఇతరులను ప్రేమించుట కవకాశము గలుగదు. అద్వైతమతము పైజెప్పిన ద్వైత, విశిష్టాద్వైత, శైవ, వైష్ణవాది మతముల కన్న నతీతమైనది. అది అంతయు నొకే శుద్ధ బ్రహ్మమనియే బోధించుచున్నది. ఇది సోదరభావమున కన్న మించినది. అంతయు ఒకే స్వాత్మభావనయే గలిగియుండవలయునని తెలుపుచున్నది. ఈ కానుపించెడు నానాత్వభేదము లన్నియు మాయచే కల్పితము లనియు, ఇవి యన్నియు మాయలో గలిగియున్నవనియు, తన యాత్మయందు ఈమాయయా కల్పితము లెవ్వియు లేవనియు, అది ''ఆనందము, అమృతము, శివమని''యు బోధించుచున్నది. దీనిని ఉపదేశించునదే వేదముయొక్క శిరస్సగు వేదాంతము. అనగా ఉపనిషద్భాగము.

తక్కినవన్నియు కర్మమును ప్రతిపాదించెడు వేదములో గలవు. కావున అభేద ఏకైక దైవజ్ఞానము గలుగవలసియుండిన వేదాన్తమున ప్రవేశింపవలయును. అపుడే శాంతియు, సౌఖ్యము గలుగును.

బ్రా :- బ్రహ్మనిష్ఠచే ప్రకృతిదోషము నశించి, అతయు నొకే దైవభావముగా తలంచవలసిన మీబోటి జ్ఞానులకు ఏల యీజాతి భేదమును గుఱించిన వ్యవహారములు? ఇట్టివారెచ్చటనో, ఏకాంతముననుండి, నిర్విషయానందమనుభవించు చుండవలసినవారు గదా? అట్లుగాక మాయలోగల జాతినిగుఱించి, వాదమును ప్రారంభించి రాగద్వేషములను, కలహములను, ఏల బొందవలయును?

ఆ :- ప్రసన్నాత్మా! ప్రేమతోను, ధర్మముతోను, సందేహమును నివృత్తి జేసికొనవలయునని ప్రారంభములోనే నిశ్చయించుకొనియున్నాము. మఱల ఏల రాగద్వేషములను, కలహములనుగుఱించి తలంపు గలుగవలయును? అట్టివారుండిన నుందురుగాక, మనకు మాత్రము రాగద్వేషకలహముల భావము ఏమాత్రమున్ను గలుగకూడదు. సత్యము నెఱింగినవారు, నిజమైన జ్ఞానముగలవారు, అన్యాయమును, అధర్మమును, అసత్యమును జూచి సహింపజాలరు. సాధ్యమైనంతవఱకు, అట్టి పాపనివృత్తికొఱకే ప్రయత్నింతురు. అట్టి జ్ఞానులుగాక, అజ్ఞానులైనవారు ప్రపంచములో నేమి జేయగలరు? జ్ఞానులైనవారు మౌనము ధరించి, యేకాంతమున నుండుటయే ధర్మమైనచో, శ్రీరామకృష్ణాది అవతారపురుషులు ఏల అధర్మ నివృత్తికొఱకును, ధర్మస్థాపనకొఱకును అవతరించవలయును? ధర్మాధర్మముల నిరూపణ యందేల ప్రవర్తించవలయును? రావణాదులతో యుద్ధములనున్ను, కంసాది వినాశములనున్ను, ఏల అట్టి భగవత్స్వరూపులు జేయవలయును? మఱియు శ్రీ బుద్ధదేవుడేల హింసాది ధర్మములతోను, వర్ణాదిజాతులతోను దుఃఖములో మునిగియుండు లోకము నుద్ధరించుటకు

ప్రయత్నించవలయును? అలాగున శ్రీ యేసు, శ్రీ మహమ్మదు ప్రవక మొదలగు దివ్యపురుషులెన్నియో బాధల సహించియు అధర్మజనులనుండి ధర్మజీవులను రక్షించుటకు ఏలయత్నించిరి? అదేరీతిగ శ్రీ గురునానక్, శ్రీ శంకరాచార్యులు, శ్రీరామానుజాచార్యులు, శ్రీ మధ్వాచార్యులు మొదలగు లోకోత్తర మహాపురుషులు, ధర్మమార్గ స్థాపనము కొఱకును, అధర్మము నణచుకొఱకును, ఎన్నియో ప్రయత్నముల జేసిరి. అలాగున, ఆర్యసమాజ స్థాపకులకు శ్రీ దయానందస్వామివారును, బ్రహ్మసమాజస్థాపకులగు రాజా రామమోహన్‌రాయ్ గారును ఎన్నియో విధములుగ ప్రయత్నించిరిగదా! కులముచే అస్వతంత్రులై బంధింపబడియుండు జీవులను అట్టి స్వకపోల కల్పితజాతి శృంఖలలనుండి విమోచనము జేయుటకు జీవితము నంతయు వినియోగపఱచిరి.

వీరందఱు జ్ఞానులు గారా! సత్యము నెఱింగినవారు గారా! నేత్రములు గల వారు చీకటిలోనుండు జనులను ప్రకాశములోనికి తీసికొనిరా బ్రయత్నింతురుగాని, గ్రుడ్డివారికి ప్రకాశమును, అంధకారమును నొకే విధముగ నుండగా, వారు తమస్సులోనుండు జనులను ప్రకాశమున కెట్లు దీసికొని రాగలరు? సామాన్యముగ తాము జెప్పులాగున జ్ఞానులకు, భక్తులకు, తపస్వులకు లోకముతో నేమి సంబంధము? లోకమెట్లయిన పోనీ – అని యుండుటయే గొప్ప స్థితియని తలంతురు. అది సత్యమైనచో, పైన బేర్కొనిన, శ్రీయేసు, బుద్ధ, శ్రీశంకరాచార్యాదులు జ్ఞానులు కాకపోవలసియుందురు గదా! కావున నిదే సరియైన భావమని తలంపక, శంకరాచార్యాదులు జేసిన లోకోద్ధారక కార్యమే మహత్తరమైనదని మరువకూడదు. అట్టి దైవశక్తి, జ్ఞానశక్తి, దివ్యశక్తి లేనివారు మాత్రము తమరు జెప్పులాగున యేకాంతమున మౌనముతో నుండవచ్చును, కాని అది గొప్పస్థితి యని మాత్రము తలంచుట పొరబాటు.

బ్రా :- విశ్వ ప్రేమైకస్వభావము గల సోదరోత్తమా! తాము జెప్పినది గొప్ప స్థితి యైనను, అనేక ప్రశ్నలకు సమాధానమిచ్చుట, అనేకులు వాదములకు, వివాదములకు వచ్చినపుడు వారితో వాదములు చేయుట మొదలగు ప్రాపంచిక విషయములలోనికి దిగవలసియుండిన మనశ్శాంతి యెట్లు గలుగును! మనశ్శాంతి కొఱకు గదా సమస్తమును త్యజించి వేదాన్త విచారము జేయవలసి యున్నది.

అ:- శుద్ధాత్మా! తమరు జెప్పినది కొంత నమ్మదగిన విషయమే గాని పూర్ణమైన ఆత్మజ్ఞానము గలిగినవారి యొక్కయు, సత్యజ్యోతిలో నిలుకడ గలిగిన వారియొక్కయు స్వభావము గాదు. ధర్మకార్యము లాచరించునపుడు కలిగిన దూషణ భూషణాది ద్వంద్వముల సహించి తన కర్తవ్యమును నిర్వహించుటయే సుస్థిరమైన జ్ఞానము గలదానికి గుఱుతని గీతాచార్యులగు శ్రీకృష్ణభగవాను లుపదేశించి యున్నారు. గాలి లేనపుడు శుష్కపత్రములున్ను, గొప్ప శిలయున్ను ఒకే విధముగ నిశ్చలముగానే యుండును. సుడిగాలి వచ్చినపుడు ఎండిన ఆకులన్నియు నెగిరిపోవుచుండును. గుండురాయి మాత్రము చలింపకనే యుండును. ఆలాగున, ప్రకృతి యుద్ధము వచ్చినపుడు, ఆత్మజ్ఞానమున నిలకడలేనివారు నిలువ జాలరు. ఆత్మజ్ఞాన నిష్ఠలో నిలకడ గలవారు చలింపరు. ఇదే దానికి గుఱుతు.

ప్రపంచములో నెవ్వరైనను, ఏ మంచికార్యమునేని జేయ ప్రారంభించిన దానికెవ్వరైన అసహనాత్ములు ఒక నిందయో, యవమానమునో, ప్రశ్నలనో జేయు చునేయుందురు. శ్రీ యేసు, మహమ్మదు, బుద్ధుడు మొదలగు మహాపురుషులు, చేయు లోకోద్ధారక కార్యములలో గూడ ఇప్పటికిని ఎన్నియో ఖండనమండనములు జరుగుచున్నవి. ఆలాగుననే శ్రీశంకరులు స్థాపించిన అద్వైతము పైనను, శ్రీరామానుజాలు స్థాపించిన విశిష్టాద్వైతము పైనను, శ్రీమధ్వులు స్థాపించినద్వైతము పైనను నేటికిని వాదప్రతివాదములు,

ప్రశ్నోత్తరములు, ఖండనమండనములు జరుగుచునే యున్నవి. అంతమాత్రము గాదు. ఆర్యసమాజముపై, బ్రహ్మసమాజముపై దివ్యజ్ఞాన సమాజము పైనను ఎన్నియో వాద ప్రతివాదములు, ప్రశ్నోత్తరములు జరుగుచునేయున్నవి. మఱియు సృష్టిలో నేటి వఱకు గల ప్రతిమతమునకును ఖండన గ్రంథముల వ్రాసినవారు గలరు. ఇది యొక వింతగాదు. శ్రీ కపిలముని యొక్క సాంఖ్యము పైన, శ్రీ పతంజలి యొక్క యోగముపైన, శ్రీ జైమిని యొక్క పూర్వమీమాంస పైనను, శ్రీ వ్యాసులయొక్క ఉత్తర మీమాంసయగు వేదాంతము పైనను అనేకాక్షేపణలు, సమాధానములు పరమఋషుల కాలములోనే జరిగియున్నవి. ఆవిషయమై ఖండనమండన గ్రంథములు ఆ కాలపు ఋషులు వ్రాసినవి ఇప్పటికిని గలవు. ఇది ప్రకృతి ధర్మము. అట్టి కాలము నుండి నేటివఱకు అనేకజీవులు, ఆయామతములలో జేరి, ఆత్మశాంతిని, దైవప్రాప్తిని పొందినవారు గలరు. కావుననే ''లోకము భిన్నరుచులతో గూడినదని'' పూర్వికులు వచించుటకు కారణమైనది. లోకములో గల సర్వజనులను సమ్మత పఱచెడు ఒక కార్యమును ప్రపంచములో ఏ నరుడును జేసియుండలేదు. ఒకడు భుజించెడు ఆహారమే మఱియొకరికి రుచింపదు. ఇంకొకఱు భుజించెడు అన్నముపై వేఱొకనికి ఇష్టము గలుగదు. కూర్చుండిన దానికొక తప్పు, నిలిచిన యింకొక తప్పు. మాట్లాడిన మఱొక తప్పు, మౌనముగ నుండిన నిదియొకతప్పు, అన్నము దినిన అది యొక లోపము, అపక్వాహారము భుజించిన దానికొక నింద, ఏకాంతముననుండిన దానికొక దోషము, గ్రామములో నుండిన అది యొక పరిహాసము, చదువుచుండిన దానికొక యపహాసము. చదువకయుండిన అదియొక మౌఢ్యము– ఈలాగున దిన రాత్రులవలె, కృష్ణశుక్ల పక్షముల వలె, వర్ష గ్రీష్మ ఋతువుల వలె, ఉత్తరాయణ దక్షిణాయనముల వలె, చంద్రుని వృద్ధిక్షయములవలె, మాయామయమగు నీలోక మనాది నుండి దీర్ఘప్రయాణమును జేయుచునే యున్నది. ఈ గ్రహాది సంచారములచే, ఋతువుల మార్పుచే, ఆకాశ మేలాగున మార్పు గలుగక,

యొకే స్థితిలోనే యుంటున్నదో, ఆలాగున ద్వంద్వములచే చలింపక, ప్రకృతి వికృతులచే వికారము నొందక, సత్యము నుండి జారక, జ్ఞానము నుండి కదలక యుండువాడే నిజమైన యాత్మజ్ఞాని యగును.

బ్రా :- జంతువులు, పక్షులు అనాదిగనుండి ఆయా జాతులకు మార్పు లేనటుల, బ్రాహ్మణాది నాలుగు జాతులున్ను మార్పు గలుగక, సృష్ట్యారంభము నుండి నేటివఱకు వచ్చుచుండుటచే జాతి కల్పితమని యెట్లు చెప్పగలరు?

ఆ :- ఇన్ని ధర్మములు వినియు మఱల ఏల యీలాగున జెప్పుచున్నారు? సృష్ట్యారంభము నుండి నేటి వఱకు అశ్వములు అశ్వములుగాను, గజములు గజములుగాను, అజము లజములుగాను, మహిషములు మహిషములుగాను, గోవులు గోవులుగాను ఎట్లు మార్పు గలుగక యుంటున్నవో అట్లే, జాతి యీశ్వర సృష్టియైనచో యే కులములోను మార్పు గలుగకూడదు. మార్పుజేయుటకు సాధ్యమున్ను గాదు. అట్లయిన బ్రాహ్మణాది నాలుగు వర్ణస్థులున్ను క్రైస్తవు లగుచున్నారు. క్రైస్తవులు హిందువులగుచున్నారు. వీరిలో కొందరు మహమ్మదీయు లగుచున్నారు. మహమ్మదీయులలో కొందఱు బౌద్ధులగుచున్నారు. బౌద్ధులలో కొందఱు హిందువు లగుచున్నారు. హిందువులలో కొందఱు జైనులగుచున్నారు. జైనులలో కొందరు ఆర్యసామాజికు లగుచున్నారు. ఆర్యసామాజికులు కొందఱు బ్రహ్మ సమాజస్థులగు చున్నారు. వీరిలో కొందఱు శైవులగు చున్నారు. శైవులలో కొందఱు వైష్ణవులగుచున్నారు. పై జెప్పిన జంతువుల దృష్టాంతము సరియైనచో, ఈ మనుష్యుల కెట్లు మార్పు గలుగును? అలాగున పక్షివర్గములో జూచిన, శుకములు పికములగుట గాని, పికములు మయూరములగుట గాని, మయూరములు పికములగుట గాని, పికములు హంసలగుటగాని, యే కాలమందును ఎట్లు జరుగుటలేదో, ఆలాగున జాతి

యనునది పుట్టుకతో యేర్పడియుండినచో, దానిని నెవరును మార్పు జేయజాలరు. ఏలన! ఈశ్వరసృష్టిని మార్పుజేయుటకు, ఈశ్వరుని వంటి రెండవవాడు మఱియొకడుండవలెను, అట్లు లేనందుచే నీశ్వరసృష్టిని మరియొకవిధముగ మార్చుటకు శక్తి లేకపోయినది. మనుజులలో గల వర్ణభేదములు, మనుష్య నిర్మితములగుట చేతనే, ఒక వర్ణమును మఱియొకవర్ణముగా మార్చుటకు శక్తి గలుగుచున్నది. మఱియొక రహస్యము గూడ గలదు. ఇది చాల నిగూఢ తత్త్వము. పక్షి వర్గములలో ఒక జాతిపక్షి మఱియొక జాతిపక్షితో మిథునక్రియలు జరుపదు. అనగా పికము శుకముతో గాని, పికము మయూరముతోగాని సంబంధము గలిగి సంతానోత్పత్తిని జేయదు.

అలాగున ఆజము గజముతో గాని, గజ మశ్వముతోగాని గలిసి సంతానము నుత్పత్తిచేయజాలదు. అంతే కాదు. ఒక్కొక్క జంతువు మఱియొక జంతువు నందు రతిక్రీడయు, ప్రీతియు, మోహమును గలిగియుండదు. అది సృష్టి యొక్క వైచిత్ర్యము. అలాగున సృష్టిలోనే అట్టి నియమము గలిగియుండిన, అబ్రాహ్మణ స్త్రీలతో బ్రాహ్మణులకును, బ్రాహ్మణస్త్రీలతో అబ్రాహ్మణులకును రతి క్రీడా విషయమై ప్రీతియు, మోహమున్ను గలుగదు. అట్లు కనుపించుట లేదు. అన్ని వర్ణములలోను అన్నివర్ణములకును సంతానము గలుగుచునే యున్నది. ఈ విధి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు మాత్రమే గాదు. క్రైస్తవస్త్రీల యందు హిందువులకును, హిందూస్త్రీలలో క్రైస్తవులకును, అలాగున ముస్లిములకును, బౌద్ధులకును, వేయేల! మనుష్యజాతులందరికిని పరస్పరము విషయప్రీతియు, మాయామోహమున్ను, సంతానోత్పత్తియు గలుగుచునే యున్నవి. కావుననే మనుష్యసృష్టి యంతయు నొకే జాతియనియు, గుణములచే మాత్రము మార్పు గలిగినదనియు రూఢి యగుచున్నది. మఱల గలుగుచుండు రంగుభేదములన్నియు దేశకాలముల మార్పులచే నేర్పడినవేగాని, మఱియొక విధముగా గాదని విజ్ఞులు

గ్రహింపవలయును. ఒక కుటుంబము గల వారిలో బలిష్ఠుడు తక్కిన వారిని అణచి, కుటుంబ సౌఖ్యానుభవములో సమత్వము లేకుండ పరాధీనులుగ జేసినచో, ఆ కుటుంబములో ధర్మబుద్ధి గలవాడు జన్మించిన, అత డేలాగున ఈ యధర్మమును సహింపజాలక, యీ కుంటుంబ సౌభాగ్యమును అందఱును సమానముగ ననుభవించుటకు తగిన పనిని జేయునో, ఆలాగున విశ్వైక కుటుంబమున మానవ సోదరులు సర్వేశ్వరు డొసంగిన సౌఖ్యమును అందఱును సమానముగ అనుభవింపవలసియుండగా, విద్యాధిక్యముచేత గాని, అధికారాధిక్యముచే గాని మఱియే యొక బలముచే గాని తక్కిన సోదరజీవులను అణగద్రొక్కి, తామే అర్హులమని నిర్ణయించుట, సోదరద్రోహముగాక మఱియేమని చెప్పవచ్చును? జ్యేష్ఠపుత్రుడు కనిష్ఠ సోదరాదులను సంరక్షించుటకు తండ్రి అతనికి అధికారమిచ్చిన, బాల్యావస్థ లోను, అస్వతంత్ర స్థితిలోనుండువారిని అణచివేసి, విద్యాధికార బలములచే తానే యధికుడనని జెప్పుచు కుటుంబ సౌభాగ్యమును తానే యనుభవించుచుండిన యీ దౌష్ట్యమునుజూచి తండ్రి యేలాగున జ్యేష్ఠపుత్రుని అధికారమునుండి తొలగించి, అందఱిని సమానముగ జూచు మఱియొకని కధికారమిచ్చునో ఆలాగున సర్వేశ్వరుండును, సర్వసంతానములకు సర్వజను లకును సమాన సౌభాగ్యము ననుభవించుట కవకాశము నీయనివానిని, స్వస్థానమునుండి పతితునిగాజేసి న్యాయబుద్ధితో అందఱిని బాలించెడు సుస్వభావము గలవానికట్టి యధికారము నిచ్చును. ఇది నిక్కము.

ఒక్కొక్క జాతి యున్నతస్థితికి వచ్చుటకును, ఒక్కొక్క జాతి నిమ్నస్థితికి పోవుటకును నిదియే కారణము. ఈ సత్యమును, ఈ దైవభావమును ఎవరును మరువకుందురుగాక! ''బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్'' అను శ్రుతికి విరాట్ పురుషవర్ణన గాక ముఖబాహూరు, పాదాదుల నుండి బ్రాహ్మణాది నాల్గు జాతులు జన్మించిరని చెప్పినచో ఉత్పత్తిగలదానికి, లయము తప్పక సిద్ధించునను భావమును బ్రహ్మసూత్ర

కర్తలగు శ్రీబాదరాయణ మునియు అంగీకరించి జీవుడు నిత్యుడని నిరూపించుట కొఱకు ఇట్లు చెప్పెను - ద్వితీయాధ్యాయము తృతీయ పాదమున సూత్రము. 16.

చరా చర వ్యపాశ్రయస్తు స్యాత్తద్వ్యపదేశో భాక్త స్తద్భావ భావిత్వాత్.

టీక. చరాచర వ్యపాశ్రయః = జంగమస్థావర రూపములగు శరీరముల నాశ్రయించినదై, తద్వ్యపదేశః = (జీవునియందు) జన్మ మరణములను చెప్పుట, జీవే = జీవుని విషయములో, భాక్తం = అప్రధానమైనది, స్యాత్ = అగును : కుతః = ఎందువల్లననగా, తస్య = ఆజన్మమరణ వ్యపదేశము, తద్భావభావిత్వాత్ = ఆ శరీరముండిననప్పుడే ఉండును గావున.

అవతారికలో చూసిన ప్రకారము శ్రుతి సందర్భములకు పరస్పర విరోధము కలుగునని సంశయింప నవసరములేదు. జీవునిగూర్చి జన్మమరణములను జెప్పు శ్రుతి జీవుని విషయమునందు అప్రధానమైనదని తెలిసికొనవలెను. బాగుగా విమర్శించిన యెడల పుట్టుక, చావు అను వ్యవహారములు శరీరముండుట, లేకపోవుట అను వానిని బట్టి వచ్చుచున్నవి యనుట స్పష్టమగును గదా! ఈ కారణము వలన శ్రుతి చెప్పుచున్న జనన మరణములు, జంగమ స్థావర రూపములగు శరీరములను గూర్చియే చెప్పబడినవిగాని జీవుని గూర్చి చెప్పబడినవి గావు. శరీరమును విడచి కేవల జీవుడు, దేనికిని గోచరుడగువాడు కాడు గదా! కావున అప్రధానములగు జననమరణ ప్రతిపాదక వాక్యముల వలన ''జీవుడు నిత్యుడు'' అని ముఖ్యార్థమును చెప్పు వేదాంత వాక్యమునకు విరోధ మేమియును రాదు - అని తాత్పర్యము.

ఈ క్రింద బ్రహ్మానుసంధాన విషయమై, శ్రీవిద్యారణ్య మునివరుడు రచించిన ''బ్రహ్మవిదాశీర్వాదపద్ధతి'' లో గల కొన్ని ముఖ్య వాక్యములు

నిరూపింపబడుచున్నవి. ఇది శ్రుతికాండమైనను ఈ వాక్యములు శ్రుతివాక్యము లగుటచే నిచ్చట చేర్చడమైనది. ఇట్టి బ్రహ్మాను సంధానము దేహభావన గలవారు ఎట్లు చేయగలరు? ఇచట శరీరభావన మాత్రము విడచిన చాలదు. ఉపాధిగత మగు భావన సహా విడచి బ్రహ్మభావన చేయవలసి యుండును. అది మాత్రమే అమృతత్వమును గలుగజేయును. తక్కిన భావనలన్నియు సంసారమునకు సంబంధించినవే.

**హిరణ్యగర్భాదిస్థావరాన్తేషు శరీరేషు యదేకం చైతన్యమస్తి తదేవాహ మస్మీతి దృఢజ్ఞాన సిద్ధిర్భూయాత్ ।**

చతుర్ముఖ బ్రహ్మమొదలు స్థావరము వఱకు గల శరీరములందు ఏ ఒక చైతన్యమున్నదో అదే నేను అనెడి దృఢజ్ఞాన సిద్ధి కలుగును గాక!

**లయవిక్షేప కషాయ రసాస్వాదేభ్యో రక్షితం**
**మే చిత్త మవిఘ్నేన బ్రహ్మణ్యవస్థితం భూయాత్ ॥**

లయవిక్షేప కషాయ రసాస్వాదముల వలన నుండి రక్షింపబడిన నా చిత్తము విఘ్నము లేనిదిగా, బ్రహ్మమునందు నెలకొనునట్లగుగాక!

**నిత్యనిర్వికారాసఙ్గాద్వితీయ పరిపూర్ణ సచ్చిదానంద**
**స్వప్రకాశచిదేక రసబ్రహ్మానుభవ సిద్ధిర్భూయాత్ ॥**

నిత్యమై, నిర్వికారమై, అసంగమై, అద్వితీయమై, పరిపూర్ణమై, సచ్చిదానందమై, స్వప్రకాశమై, చిదేకరసమై యొప్పు బ్రహ్మానుభవసిద్ధి కలుగును గాక!

**సజాతీయ విజాతీయ స్వగతభేద రహితాఖణ్డ**
**సచ్చిదానందానుభవ సిద్ధిర్భూయాత్ ॥**

సజాతీయం విజాతీయం స్వగత భేదము లేని, అఖండ సచ్చిదానందానుభవ సిద్ధి కలుగును గాక!

**నిత్యశుద్ధ బుద్ధముక్త సత్యపరమా నన్దాఽద్వితీయ**
**బ్రహ్మానుభవ సిద్ధిర్భూయాత్! ॥**

నిత్యమై, శుద్ధమై, ముక్తమై, సత్యమై, పరమానందమై, అద్వితీయమై యుండునట్టి బ్రహ్మానుభవ సిద్ధి కలుగును గాక!

**అసంభావనా విపరీతభావనా రహితత్వేన కరతలామలక వదహం బ్రహ్మాఽస్మీత్యప్రతిబన్ధాఽపరోక్ష బ్రహ్మాత్మ సాక్షాత్కారో దృఢీభూయాత్.**

అసంభావనయు, విపరీత భావనయు లేని స్థితిగా కరతలామలకమువలె, నేను– బ్రహ్మమనెడి ప్రతిబన్ధములేని, అపరోక్ష బ్రహ్మాత్మ సాక్షాత్కారము దృఢమగును గాక.

**వాసనాక్షయ మనోనాశ తత్త్వజ్ఞానా భ్యాసవశాత్**
**జ్ఞానరక్షా తపస్సిద్ధిః సర్వసమత్వం దుఃఖనివృత్తిః**
**సుఖావిర్భావ ఇత్యేతత్పఞ్చ ప్రయోజన సిద్ధిర్భూయాత్॥**

వాసనానాశము వలనను, మనోనాశము వలనను, తత్త్వజ్ఞానాభ్యాసము వలనను, (కలిగిన) జ్ఞానరక్ష, తపస్సిద్ధి, సర్వసమత్వము, దుఃఖనివృత్తి, సుఖావిర్భావము అను నీ అయిదు ప్రయోజనముల యొక్క సిద్ధి కలుగును గాక!

**మైత్రీ కరుణా ముదితో పేక్షేతి సద్వాసనాపాటవేన**
**రాగాది దుర్వాసనాక్షయః సమ్యగ్భూయాత్॥**

మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష అనెడి శుభవాసనల యొక్క దృఢాభ్యాసము వలన, రాగాది మలిన వాసనానాశము చక్కగా కలుగును గాక!

**యతః సర్వత్రావస్థితం ప్రజ్ఞానం బ్రహ్మేతో మయ్యవస్థితం ప్రజ్ఞానం బ్రహ్మైవ ప్రజ్ఞానత్వావిశేషాదిత్యైతరేయమహావాక్యోక్త జీవబ్రహ్మైక్యజ్ఞాన సిద్ధిర్నిరన్తరం భూయాత్ ॥**

దేనివలన సకల స్థలములందుండు ప్రజ్ఞానము బ్రహ్మమో, దానివలన నాయందును, నెలకొనియుండు ప్రజ్ఞానము బ్రహ్మమే, ప్రజ్ఞానత్వముయొక్క అభేదమువలన ననెడి ఐతరేయ మహావాక్యమునందు చెప్పబడిన జీవ బ్రహ్మైక్య జ్ఞానసిద్ధి నిరన్తరము కలుగును గాక!

**సాధనాన్తర నిరపేక్షతయా స్వయమేవ భాసమానత్వాదాత్మా స్వయం ప్రకాశ ఇతి స్వయం ప్రకాశాత్మానుభవః సమ్యగ్భూయాత్॥**

ఇతరసాధనమును గోరక తనంతటతానే ప్రకాశించు స్వరూపము కలది యగుటవలన ఆత్మ స్వయంప్రకాశము అనెడి స్వయం ప్రకాశాత్మానుభవము చక్కగా గలుగుగాక!

ఇక నాల్గువేదముల ప్రాణములనెడు 4 మహావాక్యములును సంగ్రహముగా ఈ క్రింద వ్రాయబడుచున్నవి. దీనిని విస్తరముగా చూడదలంచువారు ప్రశ్నోత్తర మాణిక్యమాల యందు గనందగును. ఇది శుకర హాస్యోపనిషత్తు నందు గలదు. దానిని వేదాంత పంచదశి 5వ ప్రకరణమందు విద్యారణ్య స్వాములవారు విశదముగ వ్రాసియున్నారు.

1. ప్రజ్ఞానం బ్రహ్మ - ఋగ్వేదము. ఐతరేయోపనిషత్తు, లక్షణవాక్యము. ప్రజ్ఞానం బ్రహ్మ - అనుపదములో ప్రజ్ఞానమనియు, బ్రహ్మమనియు రెండు పదములు గలవు. ప్రజ్ఞానమనగా, త్వక్ చక్షుః, శ్రోత్ర,

జిహ్వా ఘ్రాణములనెడు జ్ఞానేంద్రియములద్వారా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను, ఏ ఆత్మ ఈ సర్వేంద్రియములకు సాక్షియై తెలుసుకొను చున్నదో, అదే ప్రజ్ఞానము, రెండవది బ్రహ్మశబ్దము, అనగా ప్రజ్ఞానమే బ్రహ్మస్వరూపము, ఏది చతుర్ముఖ బ్రహ్మ మొదలు పిపీలిక వరకు గల సర్వ ప్రాణికోట్ల యందు చైతన్యముగా వెలుగు చుండునో అదే బ్రహ్మమనం బడును. తన యందుగూడ ఆ చైతన్యము ఉండుటవల్ల దానను చెప్పబడెడు చైతన్యము గూడ బ్రహ్మమే యగును. తానెవడు, అని పంచకోశముల విచారణ చేసిన ఆ సాక్షిచైతన్యమే యగును. దానియందు నిలుకడ గలుగుటయే బ్రహ్మయందు నిలకడగలుగుట యగును.

2. అహం బ్రహ్మ స్మి. యజుర్వేదము. బృహదారణ్య కోపనిషత్తు, అను భవవాక్యము. దీనియందు అహమ్, బ్రహ్మ, అస్మి, అను మూడు పదములు గలవు. వానిలో అహమ్ అనునది దేహ మనోబుద్ధులకు సాక్షియై నేను నేను అనునది యేదో దానిని తెలిసికొన్నచో అది ఈదేహేంద్రియములకు అన్నిటికి సాక్షిగా ఉంటూయున్నది. ఆ, అహమ్ అనునది సామాన్యముగా అనుకొనెడు దేహము గాని, జాతి గాని, పేరు గాని కాదు. అది సద్వస్తువగు ఆత్మయే. ఇక బ్రహ్మఆస్మి అను రెండు పదములున్ను తెలిపెద. స్వయముగా స్వప్రకాశమై ప్రకృతికిపరమై యే చైతన్యము గలదో దానిని బ్రహ్మమనియు, దానియందు గల ఐక్యమును అస్మి యనియు తెలియందగును. ఇచ్చట ఐక్యశబ్దమునకు ఇదివరలో తెలియక యుండిన, సద్వస్తువగు బ్రహ్మము అనుభవము గలిగెనని గ్రహించుకొనవలెను.

3. తత్త్వ మసి. సామవేదము, చాందోగ్యోపనిషత్తు, ఉపదేశవాక్యము. దీని యందు, తత్, త్వం, అసి అను మూడు పదములు గలవు. తత్ అనగా ఏది నామరూపము లేనిదై సృష్టికి పూర్వముగాను, ఇప్పుడు బుద్ధికి సాక్షియై వెలుగుచున్నదో అదే తత్ అను శబ్దమునకు అర్థము. అదియు ఆత్మయే. మరల

త్వమ్, అసి, అను రెండు పదములకు లక్షణావృత్తిచే త్వమ్ పద వాచ్యుడగు జీవుడే, తత్ పదవాచ్యుడగు బ్రహ్మము. ఈ ఉభయుల ఐక్యమును అసి శబ్దమును తెలుపుచున్నది.

4. అయమాత్మా బ్రహ్మ. అధర్వణవేదము, మాండూక్యోపనిషత్తు, సాక్షాత్కారవాక్యము. దీనియందు అయమ్, ఆత్మా, బ్రహ్మ అను మూడు పదములు గలవు. అయమ్ అను శబ్దము ప్రత్యక్షముగా, ఇప్పుడు ఏ ఆత్మ ప్రకాశమై వుంటున్నదో, ఆ ఆత్మయే బ్రహ్మమని లక్షణావృత్తిచే తెలియందగును. ఆ ఆత్మను బ్రహ్మభావనగా చేసుకొనవలెను. ఇదే ఈ నాల్గు మహా వాక్యములు బోధించెడు పరమరహస్యము. ఇది శ్రుతియొక్క సారమగు వేదాంతమను ప్రసిద్ధిగల ఉపనిషత్‌భాగమును తెలుపుచుండును.

ఓమ్.

ఓమ్

# లోకోద్ధారకము

## స్మృతి కాండము

**సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్ ।**
**న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥**

టీ ॥ హి = ఏ కారణము వలన, సర్వత్ర = సకల ప్రాణులయందు, సమవస్థితం = ఉండునట్టి, ఈశ్వరం = పరమేశ్వరుని, సమం = సర్వసమునిగా, పశ్యన్ = చూచుచున్నవాడై, (తెలిసికొనుచున్నవాడై) ఆత్మనా = తనచేత, ఆత్మానం = తనను, న హినస్తి = హింసించుకొనడో, తతః = అందువలన, (తనను హింసించుకొనకపోవుటవలన) పరాం = ఉత్తమమగు, గతిం = గతిని, (మోక్షమును) యాతి = పొందుచున్నాడు.

శ్రీభగవద్గీతయు, స్మృతిలో జేరినదగుటచే మొదటనే వ్రాయుటకు కారణమైనది. ఈ శ్లోకముయొక్క అర్థము చాల యున్నతస్థితిని దెలుపుచున్నది. సర్వజీవరాసులలో నుండువాడు సర్వేశ్వరుడనియు, అందువలన తనయందును నుండువాడు ఆ సర్వేశ్వరుడే యనియు, ఆలాగున అన్నిటిలోను జూడజాలని వాడు ఆత్మహంతకుడనియు శ్రీభగవంతు డుపదేశించెను. ఈ పదమూడవ అధ్యాయమున నిది '' జ్ఞేయం '' భాగమునకు సంబంధించినదగుటచే, '' జ్ఞేయము '' ను బొందినవారును, పొంద దలంచువారును, ఇట్టి యాత్మానుభవము తమకు గలిగినదా ? యని అంతరాత్మలో బాగుగా పరిశీలించుకొన గలుగనిచో, కలుగుటకే ప్రతిబంధము గలదో అద్దానిని తొలగించుటకు ప్రయత్నింపవలయును. లేనిచో ఆత్మహత్య జేసినవాడే యగునని భగవంతు డుపదేశించిన ధర్మవాక్యమును మరచినవారే యగుదురు.

బ్రాహ్మణ :- శుద్ధాత్మా! నేనొక విషయమును చెప్పెద. ఇది సత్యమను దృఢవిశ్వాసము గలిగినందుచే దెలుపుచున్నాను. మఱియొక భావముతో జెప్పితినని తలంపవలదు. అదేమన ! బ్రాహ్మణులకు వేదాధ్యయనము, స్నానము, సంధ్య, అగ్నిహోత్రము, గాయత్ర్యాది జపము మొదలగు నియమము లనేకములు గలవు. అవి లేనిచో మోక్షము గలుగదని శాస్త్రము విధించుచున్నది. బ్రాహ్మణేతరులకో, సులభ మార్గముండగా ప్రయాసకరమగు బ్రాహ్మణత్వమును బొందుట కేల శ్రమ జెందవలయును?

అబ్రాహ్మణ :- విశాల హృదయము గల సోదరోత్తమా! నిష్కళంక హృదయముతో జెప్పెద. దీనియందు ఏదేని పక్షపాతము గలదని తలంచవలదు. జాతియొక్క రహస్యము ఇచటనే యున్నది. ఈ నిగూఢతత్త్వము దెలిసికొనక పోయిన, రైలు ఇంజనును నడుపుట దెలియక రైలు పెట్టెలను పట్టి త్రోయు చుండునటులే, దేశమునున్నత స్థితిలోనికి నడుపదలంచుట యగును. ఇంజనును నడుపు కీలకము దెలిసియుండిన బండియెంత శీఘ్రముగాను, ప్రయాస రహితముగాను, పురోమార్గమునకు వెళ్ళుచుండునో, మతముయొక్క మర్మమున్ను అటువంటిదే. అయితే యీ తత్త్వము కొంత లోతులో దిగి యాలోచించిన మాత్రమే గోచరము గాగలదు. మానవుని యనుష్ఠానమే వానికి ధైర్యమును, ఆత్మవిశ్వాసమును గలుగజేయును. ఎపుడు బ్రాహ్మణేతరులకు ఆత్మసంస్కారమగు అనుష్ఠానమున్ను, అధ్యయనమున్ను, తపస్సును, దివ్య మంత్రోపదేశమున్ను లేక పోయినదో అపుడే ఆత్మశక్తి క్షయించిపోయినది. అంతే గాక అధ్యయనసంస్కారాదులు గలవారితో, తాను ఎట్లు సమానుడ నగుదునని అధైర్యమపుడే గలుగును. బ్రాహ్మణేతరులకు అధ్యయన మంత్రసంస్కారములు మోక్షమున కవసరములు గావు. భక్తి మాత్రము చాలునని చెప్పిన వాక్యము - మహోదయతో గూడి వచించినట్లు పైకి తోచునే గాని, యిది లోపల విషమునుంచి పైకి తేనెబూసిన రీతిగా నుంటున్నది. ఇట్లు జేసిన, బ్రాహ్మణేతరులు స్వయముగానే తమ సంస్కార

విద్యావిహీనతచే తాము హీనులమనియు, సంస్కారానుష్ఠానములు గల బ్రాహ్మణులతో నెట్లు సమానులము గాగలుగుదుమని బ్రాహ్మణులు చెప్పకనే విరే దలంతురు. అపుడు ఈ మహాపాపమునకు బ్రాహ్మణులు కారకులు గాకుండవచ్చును. ఇదియే దీనియందుగల రహస్యము. ఎట్లన! ఫలానపరీక్షలో నుత్తీర్ణులైన వారికి, ఫలాని యుద్యోగము ఈయబడునని గవర్నమెంటువారు ప్రకటించియుండిన, అట్టి పరీక్షలో నుత్తీర్ణులుగాని వారికి ఆ యుద్యోగము కావలయునని అడుగుటకైన నెట్లు సమర్థత లేక పోవునో, దీనియొక్క తత్త్వమును అట్టిదే. కావున సంస్కారాద్యనుష్ఠానములుండిన మాత్రమే మానవులయొక్క దీనభావము దొలగిపోయి సామర్థ్యము గలుగును. ఇది పరమ సత్యము. అట్లు గానందుచేతనే భారతదేశము సహస్ర సంవత్సరముల నుండి బానిసతనము నొందుటకు కారణమైనది. దేశమను భిత్తియందు, మతమను చిత్తరువును చిత్రింపవలసియుండును. భిత్తిలేనిచో యెంత గొప్ప చిత్రకారుడైనను తన యాశయానుసారము చిత్తరువును చిత్రింపజాలడు. అట్టి స్థితి యిపుడు భరతఖండమునకు గలిగెను. కావుననే యిపుడిపుడు తమ యజాగ్రత్తయను గాఢ సుషుప్తి నుండి కొందఱు విజ్ఞులు నేత్రములు నలుపుకొని మేల్కొంచుచున్నారు. దీనికొక కథ జెప్పెద.

ఒక అగ్రహారమునకు అధిపతి యొకడుండెను. అది చాలా మంచిగ్రామము. మంచి జలాశయము, సారవంతమైన భూమి, ఫలవృక్షములతో గూడి మంచితోటలు గలిగియుండెను. కాని గ్రామాధిపతి తన పనులన్నియు జరుగు నుద్దేశ్యముతో ఆ గ్రామమును విద్యావిహీన మొనర్చుట కొఱకెంత పని జేయవలయునో అంతయు జేయుచుండెను. క్రమముగ జనులందఱును విద్యావిహీనులై నందుచే ప్రపంచజ్ఞానమైనను దెలిసికొను శక్తియైన లేనివారైరి. అగ్రహారికుడు మాత్రము వారిచే పనులు జేయించుకొని, గొప్ప ధనమును సేకరించియుండెను. గ్రామస్థులు కొంత విద్యాభ్యాసము జేసికొనుటకు యత్నించినను గ్రామాధిపతి దానిని కొనసాగనీయక శక్తికొలది యత్నము

జేయుచుండెను. ఇందువలన నుభయులకును కొంత వైషమ్యము పెరుగుచుండెను. ఈ రహస్యము బందిపోటు దొంగలకు దెలిసి ఒకరాత్రి దొంగలనేకులు వచ్చి అగ్రహారికుని గృహములో బ్రవేశించి గృహమునందుండు వారినందఱిని కట్టివేసి బాధించి యున్న ధనమంతయు దోచుకొనిపోయిరి. గ్రామవాసులు విద్యావిహీనులగుటచే మనోధైర్యము చాలకయు, ఉపాయము దోచకయు ఎవరును ఏ సహాయమునకు కేని వెళ్ళినవారు కారు. ఇట్టిగతియే భారతదేశమునకు బట్టినది. లేనిచో, సౌభాగ్యసంపదలచే స్వర్గలోక సమానమైన యీ భారతదేశమున అనేకులు దండయాత్రలు నలిపి, సర్వ సౌభాగ్యములు నపహరించుకొని ఆర్యులగు ఈ మానవులను ఇంత దీనావస్థయగు బానిసతనమునకు దెచ్చెదరా? కావున ఈ తత్త్వమును యిపుడైనను బాగుగదెలిసికొన గలిగి జనుల యొక్క, కాయిక, మానసిక యోగ్యత ననుసరించిన కార్యములలో వారిని బ్రవేశపెట్టిన మాత్రమే పతితమైన యీ దేశము మరల నుద్ధరింపబడగలదు. అయితే యిక మీదట నిదివరలో జరిగినటుల జరుగదు. జ్ఞానసూర్యు డుదయించుచున్నాడు. అంధప్రాయమగు రాత్రి అంతమైనది. ఇంక జనులయొక్క యోగ్యత ననుసరించియే అన్ని కార్యములున్ను జరుగగలవు. అదే యధార్థమగు సత్యము. అట్లు కానిదంతయు అసత్యము. మానవుల స్వకల్పితము, అర్థశూన్యము. ఇది యొకరిపై ద్వేషముతో జెప్పినది గాదు. భారతదేశము యొక్క సౌభాగ్యము నుద్దేశించి తెలుపడమైనది. అపుడు భారతీయు లందఱును ఆ సౌభాగ్య సుఖమును సమానముగా అనుభవింపగలరు.

మఱియు ఈ వర్ణములను గురించి జెప్పువారు, సత్యమైన ఆత్మను గుఱించి యొకమాటైన జెప్పకపోవుటయే గాక, జడమైన దేహమును గుఱించిన భావమునే నిరంతరము వచించుచుందురు. అందఱిలోను గల ఆత్మ యొకటి యని గాని, లేక అందఱిలోను ఈశ్వరు డొకడే యుంటున్నాడని గాని యొకవాక్యమైన జెప్పకపోవుట వలన గదా సోదరప్రేమ, ఆత్మవిశ్వాసము

లేకపోయినది. వేదము ఇట్టి జడమును గుఱించియా బోధించుచున్నది? ఇదియా వేదవేదాంగముల తత్త్వ మెఱింగినవారి స్వభావము? కావున సర్వాంతర్యామి యగు సర్వేశ్వరుడు, అందఱిలోను సమానముగా నుంటున్నాడనియు, ఆత్మ సంస్కారము లేనందుచే, ఆ పరమపురుషుని దెలిసికొనజాలక పోవుచున్నారనియు, కావున అందఱును ఆత్మ సంస్కారము గలవారై యుండవలయుననియు బోధించిన యీజనులెంతో బాగుపడగలరు. ఇట్టి దయాదృష్టిని, ప్రేమ గల హృదయమును, విశాలమగు మనస్సును, నిర్మల బుద్ధిని, బోధకులందఱును గలిగియుందురు గాక! మఱియు, మోక్ష విషయములో ఒక వాక్యము జెప్పవలసియున్నది, అది చాల ముఖ్యమైనది. అదేమన! వేదాంతశాస్త్రమగు ఉపనిషత్తుల యొక్క శ్రవణము ద్వారా, మహావాక్య విచారణ వలన మాత్రమే మోక్షము గలుగునని వేదాంతము ఘంటాపథముగ జెప్పుచున్నది. అపుడు వేదాన్తశ్రవణము ఉపనిషద్భాగమగుటచే వేదాధ్యయనాధికారము లేనివారి కెటుల మోక్షము గలుగును? ఈ విషయమై శ్రీ శంకరభగవత్పాదులు వివేక చూడామణి యందు జెప్పినది వినుడు.

**పఠన్తు శాస్త్రాణి యజన్తు దేవాన్ కుర్వన్తు కర్మాణి భజన్తు దేవతాః ।**
**ఆత్మైక్యబోధేన వినా విముక్తి ర్న సిద్ధ్యతి బ్రహ్మశతాన్తరేఽపి ॥**

షట్శాస్త్రములను వ్యాఖ్యాన సహితముగ బఠింతురు గాక! యజ్ఞాది కర్మల వలన నింద్రాది దేవతలను తృప్తినొందింతురుగాక! కామ్యకర్మల నెల్లను జేయుదురు గాక. శివకేశవాది దేవతల భజియింతురుగాక! ఇవియన్నియు భక్తిశ్రద్ధలతో జేయుటచే అంతఃకరణశుద్ధి గలుగును. కాని బ్రహ్మసాక్షాత్కారజ్ఞాన మొక్క దానిచే మాత్రము ముక్తి కలుగును. కావుననే ''జ్ఞానాదేవ తు కైవల్యం'' అని శ్రుతి జెప్పుటకు కారణమైనది. ''నాన్యః పంథా విద్యతేఽయనాయ'' ఈ జ్ఞాన మొకటి తప్ప మోక్షమునకు వేఱు మార్గమే లేదనిగూడ వేదము నిరూపించుచున్నది.

అయితే భక్తిచేత, మోక్షముగలుగునని చెప్పిన వాక్యము వ్యర్థము గాదు. అంతఃకరణమున మల, విక్షేప, ఆవరణ లను మూడు దోషములు గలవు. పుణ్య కర్మల నిష్కామబుద్ధితో జేయునపుడు కతక-రేణువులచే పంకిలిత జలము, నిర్మలమగు నటుల హృదయములోగల పాపమను మాలిన్యము నశించును. దైవోపాసనచే విక్షేపమనెడు చిత్తముయొక్క చలనదోష ముడుగును. వేదాన్త శ్రవణ, మనన, నిధ్యాసనములచే, ఆవరణమనెడు అజ్ఞానము నశించును. ఇది వేదాన్తముయొక్క సిద్ధాన్తము. కావున, భక్తివలనను, పుణ్యకర్మలవల్లను అంతఃకరణము శుద్ధమై, బ్రహ్మవిచారమున క్షర్షత గలుగునపుడు మోక్షము సిద్ధించునని యర్థమే గాని వేఱొకటి గాదు. నిష్కామకర్మవల్లను మోక్షము గలుగునని జెప్పిన దానియొక్క తాత్పర్యమున్ను ఇదియే, వెయ్యేల! యోగ ధ్యాన, వ్రత, భక్తి, నిష్కామకర్మ మొదలగు అన్నిటిలో మోక్షము గలుగునని చెప్పిన దానియొక్క అర్థ మొక్కటియే. లేనిచో బ్రహ్మవిచార మొకదానిచే మాత్రమే ముక్తి గలుగునని చెప్పెడు శ్రుతికి అర్థమే లేకపోవును. మఱియు భక్తిమార్గమందు జీవేశ్వరుల యేకత్వ తత్త్వబోధము లేనందుచేతను, ఉపాస్యోపాసక భేదముండుటచేతను, జీవేశ్వరులైక్యమగు బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము గలుగదు. ఇది వేదవాక్యము.

బ్రా :– విశాలాశయా! మీరు జెప్పిన యీ విషయమై నాకొక సందేహము గలుగుచున్నది. అదేమన ! అందఱును ఆత్మసంస్కారములు గలవారై వేదాధ్యయన, తపో ధ్యానపరులైనచో వీరికి భోజనాదు లెటుల దొరకును ? వ్యవసాయము జేయువారును, పశుసంరక్షణ నొనర్చువారును లేక పోవుదురుగదా! కావున దేహ సంరక్షణకొరకు చాతుర్వర్ణ్య నిర్ణయమే సరియైనదని నా నమ్మకము. కనుకనే శ్రుతి స్మృతులు ఆయా వర్ణోచిత కర్మలనే ఆయా వర్ణములవారు జేయవలయునని చెప్పుచున్నవి.

అ :– ఓ ! పరమమిత్రుడా ! ఇదవఱలో నేను జప్పుచుండడు

వాక్యములను మౌనముగా నుండి, అతి పవిత్రభావముతో వినుచు, ఇపుడు దారుణమగు నీ ప్రశ్న వేసితిరి ! దీని కిదివరలోనే కొంత సమాధానము జెప్పియుంటిని. ఇంకను వినుడు. జీవులందఱును ఒకే జ్ఞాన సంస్కారము గలవారు గారు. జ్ఞానాజ్ఞాన పుణ్యపాప సంస్కారములు గలవారలై అన్ని జాతులలోనూ ఉందురు. వేదాధ్యయనతపోధ్యానాదులు బ్రాహ్మణులకు విధింపబడి యుండినను, దాని కనుకూలవములగు సంస్థ లెన్నియెా యుండినను, బ్రాహ్మణు లందఱును అట్టి వేదాధ్యయన తపోధ్యానపరులై యుంటున్నారా ? లేదు. వారిలోను అనేక సంస్కారవులు గలవారుండుటచేతనే, వారును పలువిధవులగు కార్యవులలో బ్రవర్తించుచున్నారు, ఒకవేళ, బ్రాహ్మణులలో ఆత్మసంస్కారము గలవారు ఎక్కువమంది యుండిన యుండవచ్చును! తక్కిన వారిలో తక్కువమంది యుండవచ్చును. అంతేగాని బొత్తిగలేరని జెప్పదగదు. అదేరీతిగ అందఱికిని, సంస్కారాను గుణ్యముగ, అవకాశము ఉండిన చాలును. అపుడట్టి యేర్పాటును సత్యమగు వేదముగాని, లేక సత్యస్వరూపుడగు యీశ్వరుడు గాని యేర్పఱచి నటుల నమ్మవచ్చును. మఱియు ఇతర దేశములలో నిట్టి చాతుర్వర్ణ్య నియమములు లేకపోవుటచే, అనేక కార్యములన్నియు జరుగుట లేదా ! బుద్ధిని విశాలపరచి ప్రపంచముయొక్క స్థితిగతులను జూచుకొనుడు.

బ్రా :- ఆత్మమిత్రమా! మీరు జెప్పుచున్న వాక్యముల వినునపుడు నా కుద్రేకము గలుగుచున్నది. అయినను సంభాషణ ప్రారంభములోనే రాగద్వేషములను బొందక, ప్రశాంతముగ నుభయులున్ను సంభాషణను జరుపవలయునని ప్రతిజ్ఞ గావించుకొని యున్నందుచే, నాకు గలిగెడు కోపమును అణచుకొంటిని. అంతే గాక శ్రోతలలో ఎవరున్ను మధ్య మధ్య మాట్లాడ గూడదని నియమముండుటచే యిచటుండువారందఱును మౌనముగా నుంటున్నారు. వీరిలో నెవరైన, నేదేని జెప్పవలసి యుండిన, వారివారి పక్షమువారితో, శ్రవణము పూర్తియై వెళ్ళునపుడు గాని,

తిరుగవచ్చునపుడు గాని చెప్పుచుండవలయునని నిశ్చయించినందుచేతను వాగ్బంధితులై యున్నారు. బ్రాహ్మణేతరులలో, విదుర, ఉద్ధవ, సంజయ, సూతాదులు బ్రహ్మజ్ఞాన సంపన్నులై యుండిరి. వారెవరైనను తాము బ్రాహ్మణుల మని గాని, బ్రాహ్మణత్వము గావలయునని గాని చెప్పిరా ! బ్రాహ్మణులపై దండెత్తిరా !

అ :– ప్రసన్నాత్మా ! మీరుగూడ బ్రాహ్మణులపై బ్రాహ్మణేతరులు దండెత్తిరాఅని చెప్పుటవలన నాకును ద్వేష ముత్పన్నమగుచున్నది. నేనును మీరునను, ఏ ప్రతిజ్ఞను ముందుగ జేసికొని యుంటిమో దానిపై ఆధారపడియున్నాను. లేనిచో మన యుభయుల సంభాషణము కలహమను కల్మషముతో గూడియుండును. అట్లయిన పంకిలజల మేలాగున స్నాన పానములకు యోగ్యము గాకపోవునో, అట్లే యీ విజ్ఞులగు శ్రోతలెవరును ప్రేమతో ఈ సంవాదమును వినియుండరు. మఱియు కోపము పాపగుణము. అదియుగాక నది తామసికము. అట్టి నీచగుణము మనబోటివారికి తగదని దలంచి దాని నణచుకొనుచున్నాను. వినుడు, విదుర ఉద్ధవాదులు బ్రాహ్మణులము గావలయునని చెప్పలేదుగాని, బ్రహ్మజ్ఞాన సంపన్నులగుటకెంత విద్యా, ధ్యాన, సంపన్నులు గావలసియుండునో వాటిని మాత్రము జేయక మానినవారు గారు. ఇపుడును నంతే చాలునని యిదివరలో దెలిపియున్నాను. విదురుడెంత పండితుడు అను విషయము విదుర నీతిని జదివినవారి కర్థమగును. మఱియు, విదురుడు ధృతరాష్ట్రమహారాజున కేలాగున, ధర్మోపదేష్ట యగు మంత్రిగా నుండెనో అది యోచింపదగినది. అలాగున శ్రీకృష్ణ కార్యభారము లనన్నిటిని ఉద్ధవుడు ఎటుల నిర్వహించుచుండెనో, శ్రీమద్భాగవతమున ఏకాదశ స్కంధమున శ్రీకృష్ణుడు పరమార్థతత్త్వోపదేశము జేసి, బదరి కాశ్రమమునకు వెళ్ళి తపమొనర్చుటకెటు లుపదేశించెనో చూడుడు. మఱియు శ్రీమైత్రేయమహాముని ఉద్ధవుల సంభాషణమెంత పావనమైనదో, దాని నుపదేశించిన గంగాతీరమెంత

పవిత్రమైనదో యోచింపవలయును. కురుక్షేత్రములో జరుగుచుండు యుద్ధవిశేషముల నన్నిటిని ఎంతో దూరమందుండియు దెలిసికొనెడు జ్ఞానము శ్రీ వ్యాసులు సంజయుని కెటులొసంగెనో, అంతేగాక స్వర్గలోక నివాసులు, ఖేచరులు, సిద్ధులు మొదలగువారు జెప్పువాక్యములను వారి సంకల్పములను దెలిసికొనెడు దివ్యశక్తి యేలాగున వ్యాసానుగ్రహముచే గలిగెనో యోచించుడు. మఱియు సూతుడు ఏలాగున మహా మహర్షిగాను, సర్వజ్ఞుడుగాను లోకగురుడుగాను శ్రీకృష్ణద్వైపాయనుల యనుగ్రహమువలన ఆయెనో, నైమిశారణ్యమునందు బ్రహ్మర్షిమండలియందు అష్టాదశపురాణముల జెప్పగలిగెనో, ఇదియు శ్రీ వ్యాసానుగ్రహము గదా! సూతసంహితయందు జూచిన సూతమునీంద్రునియొక్క వేదవేదాన్తజ్ఞానమున్ను, అతనికి గల పాండిత్యమున్ను మనము దెలిసికొనవచ్చును. అలాగున స్త్రీల విషయమై బృహదారణ్యకశ్రుతి యందు యాజ్ఞవల్క్యగార్గుల యొక్కవాద ప్రతివాదముల జూచిన గార్గి యెంత పాండిత్యమును గలిగియుండెనో అర్థమగును. దీనికెక్కువ యీ విషయమై జెప్పదలచలేదు.

బ్రా: – సూతవిదురాదులకు గలిగిన జ్ఞానము, జన్మాంతర సుకృత విశేషముచే గలిగినదేగాని, యీ జన్మలో గలిగినది గాదనియే విజ్ఞులు జెప్పుచుందురు.

అ: – ఏల అర్థములేని వ్యర్థపు మాటలు బలుకుచున్నారు. అదేరీతిగ నిపుడుగూడ బ్రాహ్మణేతరులలో గాని, స్త్రీలలో గాని, యెవరికైన జ్ఞానము గలిగిన అదియు నేల జన్మాంతరపుణ్య విశేషముచే గలిగినదని నమ్మగూడదు? ఈ జన్మ విశేషముచే జ్ఞానము గలుగునని చెప్పినచో బ్రాహ్మణేతరులు కానివారందఱును, బ్రహ్మజ్ఞానులు గావలసియుందురు గదా! అలాగున నెచటేని జరుగుచున్నదా ! స్త్రీ లననేల? బ్రాహ్మణేతరు లననేల? ఎవరికైనను, బ్రహ్మజిజ్ఞాస గలిగిన, వారందఱికిని జన్మాంతర

పుణ్యవిశేషము గలదనియే తలంపవలయును. అట్లు గానిచో ఏజాతిలో జన్మించినను జ్ఞానము గలుగదనియే శాస్త్రము చెప్పుచున్నది. అట్లు గాక జ్ఞానము గలజాతి యొకటని జెప్పునది సరియైనచో ఆ జాతిలో జన్మించిన వారందఱును జ్ఞానము గలిగియుండవలసియుందురు. ఆలాగున, భూలోకవములో గనపడుటలేదు. సర్వజాతులలోను, జ్ఞానవము ఆ జ్ఞానముగలవారిని జూచుచున్నాము. ఇది లోకప్రసిద్ధము. అయ్యా! ఒక రహస్యము జెప్పెద, ఇయ్యది బ్రాహ్మణులకును, బ్రాహ్మణేతరులకును, స్త్రీలకును ముఖ్యమైనది. మనస్సు ఊర్ధ్వాధోభాగముగ, అతివేగముగ దిరుగుచుండు మహిమాతిశయము గల ఒక గొప్పయంత్రము వంటిది. జీవుడు మధ్యస్థలమగు ఈ భూలోకమునుండి, ఆత్మ విచారము జేయుచు వచ్చినచో, భూ, ర్భువ, స్సువరాది సత్యలోకముల వఱకుగల నేడు లోకముల దాటి, కేవలము శివ స్వరూపుడగును. ఇది జీవుని యొక్క పంచకోశముల విచారణజేసి త్యాగమొనర్చుట చేతను గలుగుచుండును. చతుర్దశలోకములకు నడుమనుండు ఈ భూలోకమునుండి సప్తావరణములలోనికి దిగుటచేతను, ఇంద్రియాది విషయములలోనికి జారుటచేతను, ఆత్మభావనను విడచి దేహాదులగు అనాత్మ పదార్థములలో ఆత్మభావన జేయుట చేతను, అతల, వితల, పాతాళాది దుఃఖకర లోకములలోనికి జారిపడి పశుత్వము నొందుచుండును. కావున దేహముల గుఱించి వర్ణముల నిర్ణయించువారు శివస్వరూపుడగు జీవుని పశుస్వరూపునిగా జేయుచుందురు. దేహాదులను లక్ష్యము జేయక యీశ్వరస్వరూపుడగు జీవునిపై లక్ష్యముంచి ఆత్మగుణముల నుపదేశించి, ఆ జీవుడు భ్రాంతి వలన యిట్టి బంధావస్థలో నున్నాడనియు, బంధవిమోచనము గలిగిన శుద్ధజ్ఞాన స్వరూపుడగు శివుడే యగుచున్నాడనియు బోధించిన, ఎందఱినో బ్రహ్మజ్ఞానులను మనము ఈనేత్రములచే జూడగలము. ఆత్మను గుఱించి చేసిన యుపదేశ మమృతప్రాయమనియు, ఆత్మను మరుపు జేసి, పుట్టిన జాతిని గురించి బోధించుట విషప్రాయమగుననియు మరువకుందురు

గాక! ఈ పరమసత్యము ఒక జాతిని గుఱించి చెప్పినది గాదు. మనుష్యమాత్రులందఱిని గుఱించి జెప్పినదే యగును. ఈ పరమసత్యము చాలామందికి దెలిసియుండినను, జనులందఱిలోను బోధించుటకు తగిన శాస్త్రాభ్యాస శక్తి లేక సంశయపడుచున్నారు. కావున విద్యాబలము, దైవబలము, తపోబలము గలిగిన మాత్రమే నిరాటంకముగ లోకము నందంతటను నీ తత్త్వమును బోధించగలుగు శక్తి గలుగును. ఎట్లనగా కొన్ని గ్రామములలో బలిష్ఠులగు కొందఱు కొన్ని దుష్కార్యముల నొనర్చెదరు. అది స్పష్టముగ గ్రామస్థులందఱికిని దెలిసినను గవర్నమెంటు అధికారులువచ్చి, గ్రామవాసుల నడిగిన సత్యము నెఱింగి యుండియు, దానిని జెప్పిన గ్రామాధికారుల బాధ గలుగునని దలచి, యేలాగున తమకు దెలియదని జెప్పుదురో, ఆలాగున జాతియొక్కయు, ఆత్మ యొక్కయు సత్యము నెఱిగియు, విద్యాబలము, ఆత్మబలము చాలకపోవుటచే, నితరుల తీక్ష్ణప్రశ్న శరముల సహించి వారికి సరియైన సమాధానముజెప్పక పోవుచున్నారు, కావున విద్యా, తపో, ధ్యానాదులలో నిమగ్నులై ఆత్మశక్తి గలవారు మాత్రమే, అట్టి ప్రశ్న శరములను నాగాస్త్రమును గరుడాస్త్రముచే భేదించినటుల భేదింపగలరు.

**యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చ దుస్తరమ్ !**
**సర్వం తు తపసా సాధ్యం తపో హి దురతిక్రమమ్ ॥**

ఏది దుష్కరమైనదో, యేది యూవల దాటరానిదో, ఏది విశ్వామిత్రుని బ్రాహ్మణ్యము వలె బొందనలవి గానిదో, మేరుశిఖరమువలె నేది యెక్కనలవి గానిదో, అట్టిది యెల్ల, తపస్సుచే సాధింప వీలగును. ఇందుచే దుష్కరకార్యము లెల్ల నీ తపంబుచే జేయవీలగును. అట్టి తపం బసాధ్యమైన దానిని గూడ సాధించు శక్తిగలది.

**తపో విద్యా చ విప్రస్య నిశ్శ్రేయసకరం పరమ్ ।**
**తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృత మశ్నుతే ॥**

తపస్సును, బ్రహ్మజ్ఞానమును విప్రునకు మిక్కిలి మేలొనగూర్చును. తపస్సుచే చేసిన పాపము బోవును. బ్రహ్మజ్ఞానముచే మోక్షము నొందుననుట శ్రుత్యర్థమే వివరించెను.

ఇక మనుస్మృతిలో గల భాగములను గ్రహించదగినది.

బ్రా॥ **లోకానాం తు వివృద్ధ్యర్థం ముఖపాదోరుపాదతః ।**
**బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రం చ నిరవర్తయత్ ॥**

భూలోకాభివృద్ధిగోరినవాడై బ్రహ్మ తన ముఖము, బాహువు ఊరువులు, పాదములు వీనినుండి వరుసగా బ్రాహ్మణులను, క్షత్రియులను, వైశ్యులను, శూద్రులను సృజించెను.

అ:– దీనియొక్క నిజార్థము విరాట్పురుషునియొక్క వర్ణన యని యిదివరలో దృష్టాంత దార్ష్టాంతములతో జెప్పబడినది. దానికిందగిన యుక్తియుక్తములను గూడ తెలుపడమైనది. అట్లుగాక బ్రహ్మ, తన ముఖాదులనుండి బ్రాహ్మణాదులను సృష్టించెనని చెప్పినచో నా యా స్థానములనుండి పుట్టినవా రందఱును అట్టి స్వభావమును గలిగియుండవలెను. అట్లు కనుపించుట లేదు. బ్రహ్మజ్ఞానము, తపస్సు, యుద్ధమందు శౌర్యము, కృషి గోరక్షలు, సేవకవృత్తులు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులలోగల వారందరిలోను పై జెప్పిన నాలుగు గుణములు కనుపించుటచే, గుణముల ననుసరించియే జాతియొక్క నిజస్వరూపమని యెట్టి వారికైన గోచరము కాగలుగును. అట్లుగాక మరియొక విధముగా విచారించిన, బ్రహ్మనిష్ఠులను ముఖమునుండియు, యోధులను బాహువులనుండియు, వ్యాపారగుణము

గలవారిని పాదములనుండియు సృష్టించెనని యేల చెప్పరాదు. అట్లయిన నెవ్వరైనను అంగీకరింతురు గదా! గుణము ననుసరించియే జాతియని మనువు చెప్పినది చూడుడు.

**శూద్రో బ్రాహ్మణతా మేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్।**
**క్షత్రియాజ్జాతమేవంతు విద్యా ద్వైశ్యాత్తథైవచ.**

సంస్కారముచే శూద్రుడు బ్రాహ్మణత్వము నొందును. సంస్కార రాహిత్యముచే బ్రాహ్మణుడు శూద్రత్వమును బొందును. ఇట్లే క్షత్రియుడును, వైశ్యుడును గ్రహించ గలిగినది.

బ్రా:- గుణముచేతనే జాతి యను సిద్ధాంతమైనచో నాలుగు జాతులకు నాలుగు ధర్మములు ఏల యేర్పడవలయును ? చూడుడి.

**అధ్యాపనం చాధ్యయనం యజనం యాజనం తథా।**
**దానం ప్రతిగ్రహం చైవ బ్రాహ్మణానా మకల్పయత్॥**

వేదశాస్త్రములను చదివించుటయు, తాము చదువుటయు, యజ్ఞములు చేయించుటయు, తాము చేయుటయు, దానమిచ్చుటయు, దానమును గ్రహించుటయునను ఈ యూరుకర్మలను బ్రాహ్మణులకై యేర్పరచెను.

**ప్రజానాం రక్షణం దాన మిజ్యాఽధ్యయనమేవ చ।**
**విషయే ష్వప్రసక్తిశ్చ క్షత్రియస్య సమాసతః ॥**

ప్రజాసంరక్షణము, దానము, యాగముచేయుట, వేదాధ్యయనము, విషయములయందాసక్తిలేకుండుట, వీనిని క్షత్రియ ధర్మములుగా నియమించెను. విషయాసక్తి గలిగెనేని యాత్మశక్తియు, మనశ్శక్తియు,

దేహశక్తియు నశించును. ఈమూడు శక్తులు లేనిచో క్షత్రియుడు గొప్పకార్యముల జేయజాలడు. అందువలన నియమితకాలమున నియమిత విషయమును మాత్రమే యనుభవించవలయునని తెలుపడమైనది.

**పశూనాం రక్షణం దాన మిజ్యాఽధ్యయన మేవ చ।**
**వణిక్పథం కుసీదం చ వైశ్యస్య కృషి మేవ చ ॥**

గోసంరక్షణము, యాగంబులుచేయుట, వేదాధ్యయనము, నీటిమార్గ మునను, భూమిమార్గమునను వ్యాపారముచేయుట, వడ్డీజీవనమును, వ్యవసాయమును ఇవి వైశ్యులకు ధర్మములుగా నియమింపబడినవి.

**ఏకమేవ తు శూద్రస్య ప్రభుః కర్మ సమాదిశత్।**
**ఏతేషామేవ వర్ణానాం శుశ్రూషామనసూయయా ॥**

బ్రహ్మ శూద్రుల కొకటే ధర్మమును విధించెను. అది యేదనగా పైవారికి అసూయలేక సేవజేయుటయే.

అ:– ఈ నాలుగు విధులను నిరూపించుటచే గుణముచే జాతిగలదని చెప్పెడు దానికి ఆటంకమేమియు లేదు. ఏలనన యెవరేయే గుణములు గలిగియుందురో ఆయాకార్యములలో స్వభావమువలననే ప్రవర్తింతురు. సర్వజనులలోను పై జెప్పిన నాలుగు గుణములు గలవారుండుటయే దానికి తార్కాణము.

**యథా కాష్ఠమయో హస్తీ యథా చర్మమయో మృగః।**
**యశ్చ విప్రోఽనధీయాన స్త్రయ స్తే నామ బిభ్రతి ॥**

కొయ్య యేనుగును, తోలుతో జేసిన మృగమును, అధ్యయనము చేయని విప్రుడును, వీరు ముగ్గురును నామమాత్రధారులే గాని, యా

నామానుసారముగ కార్యములను చెయ్యరు. అనగా ఒకవేళ వర్తమానములో కనుపించెడు బ్రాహ్మణజాతిలో పుట్టినను వేదాధ్యయనము చేయక నామమాత్రమే యగును.

**యస్య వాఙ్మనసీ శుద్ధే సమ్యగుప్తే చ సర్వదా ।**
**స వై సర్వమవాప్నోతి వేదాంతోపగతం ఫలమ్ ॥**

ఎవని వాక్కు అసత్యాలాపాదులచే దుష్టము కాకయు, ఎవని మనస్సు రాగద్వేషాదులచే చెడకయు నిర్మలములై యుండునో, అతడు వేదాంతమందు జెప్పబడిన సర్వజ్ఞత్వ, సర్వేశత్వ రూపమైనఫలమును పొందును. ఇట్లు చెప్పుటచే జాతి ముఖ్యము కాదనియు, మనోవాక్కులు శుద్ధములై యుండుటయే ముఖ్యమనియు, అట్టివారికి మాత్రమే వేదసారమగు బ్రహ్మజ్ఞానము గలుగుననియు స్పష్టముగా మనువే తెలిపెను.

**యోఽనధీత్య ద్విజో వేద మన్యత్ర కురుతే శ్రమమ్।**
**స జీవన్నేవ శూద్రత్వ మాశు గచ్ఛతి సాన్వయః॥**

ఏ ద్విజుడు వేదము నధ్యయనము చేయక, యితర శాస్త్రాదులందు పరిశ్రమ చేయునో, అతడు బ్రతికియుండియు తన వంశ్యులతోగూడ యీ జన్మము లోనే శూద్రత్వము నొందును. ఇట్లు చెప్పుటచే వర్తమాన కాలమున వేదవిద్య నభ్యసింపక యితరవిద్యల నభ్యసించువారు, వంశముతో గూడ శీఘ్రముగా శూద్రత్వము నొందుదురని చెప్పి యుండుటచేతను, కులమే కారణము గాదనియు గుణమే కారణమనియు స్పష్టమగుచున్నది.

**ఉత్పత్తి రేవ విప్రస్య మూర్తిర్ధర్మస్య శాశ్వతీ ।**
**స హి ధర్మార్థముత్పన్నో బ్రహ్మభూయాయ కల్పతే॥**

బ్రాహ్మణుని పుట్టుకయే ధర్మమునకు నిత్యమైన శరీరము. అతడు

ధర్మాచరణము నిమిత్తమే జన్మించినవాడు, అట్టి ధర్మాచరణంబు వలన బ్రహ్మత్వము నొంద గలడు. ఇట్లు చెప్పుటచే బ్రహ్మధర్మమును బోధించువారే బ్రాహ్మణు లగుదురనియు, అట్టి వారి దేహమే ధర్మమనియు గోచరించుచున్నది.

**ఆచారాద్విచ్యుతో విప్రో న వేదఫల మశ్ను తే।**
**ఆచారేణ తు సంయుక్త స్సంపూర్ణఫలభాగ్భవేత్॥**

ఆచారము నుండి తప్పిన విప్రుడు, వేదాధ్యయనాదుల వలన ఫలము నొందడు. ఆచారవంతుడన్ననో సంపూర్ణఫలము నొందును.

**ఏవ మాచారతో దృష్ట్వా ధర్మస్య మునయో గతిమ్।**
**సర్వస్య తపసో మూలమాచారం జగృహుః పరమ్॥**

ఇవ్విధంబున ఆచారములపై ధర్మముండుట నెఱింగి, సకల తపస్సులకు ఆచారమే ముఖ్యమని మునులు తెలిపిరి. ఇదిన్నీ ఆచారమునే (గుణమునే) ముఖ్యముగా చెప్పుటచే ఇదియే ప్రధానమని గ్రహించదగినది.

**స్వాధ్యాయేన వ్రతైర్హోమై స్త్రైవిద్యేనేజ్యయా సుతై ః।**
**మహాయజ్ఞై శ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః॥**

వేదాధ్యయనముచేతను, పవిత్రవ్రతములచేతను, హోమముల చేతను, త్రైవిద్యయను పుణ్యవ్రతము చేతను, యజ్ఞముచేతను, పుత్రోత్పత్తి చేతను, అతిథిపూజ మొదలగు పంచయజ్ఞముల చేతను, నిత్యాగ్ని హోత్రములనెడు యాగముల చేతను ఈ శరీరము బ్రహ్మప్రాప్తి యోగ్యమయినదిగా జేయబడుచున్నది. అనగా పై జెప్పిన సంస్కారములచే బ్రాహ్మణత్వ మేర్పడుచున్నదని స్పష్టమగుచున్నది.

బ్రా ॥ మంగళ్యం బ్రాహ్మణస్య స్యాత్క్షత్రియస్య బలాన్వితమ్।
వైశ్యస్య ధనసంయుక్తం శూద్రస్య తు జుగుప్సితమ్॥

బ్రాహ్మణునకు నామము శుభసూచకమై యుండవలయును. క్షత్రియునకు బలవాచకమై యుండవలయును. వైశ్యులకు ధనవాచకమై యుండవలయును. శూద్రులకు నిందితమైనదిగా నుండవలయును. అనగా బ్రాహ్మణునకు శర్మశబ్దయుక్తమై యుండవలయును. రాజునకు నామము రక్షణయుక్తమై యుండవలయును. వైశ్యుని నామము ధనముతో (భూతితో) గూడియుండవలయును, శూద్రనామము దాస శబ్ద ముపపదమై యుండవలయును. విప్రునకు శుభశర్మ, క్షత్రియునకు బలవర్మ, వైశ్యునకు వసుభూతి, శూద్రునకు దీనదాసుడు అను నిట్లు నామముల నుంపవలయును. పేరులోగూడ నిట్లుండవలయునని మనువు చెప్పుటచే కులము ప్రధానమే గాని, గుణమెట్లు ప్రధానమగును ?

అ :- కారుణ్యాత్మా ! పేర్లలో గూడ నింత యవమానకరముగ విధించువాడు సమబుద్ధియు, లోకక్షేమమును గోరువా డెట్లగును ? శ్రేష్ఠమయిన పేరు గలిగియుండిన శ్రేష్ఠులు అట్టి వాక్యము నుచ్చరించుటచే, వారి వాక్శుద్ధివల్ల నట్టి శ్రేష్ఠత్వమైన గలుగునని తలంచియా యిట్టి యేర్పాటును చేసిరి ? వర్తమాన యుగమున నిట్టి వాక్యము వినిన శూద్రులని తలంచువారు సహింతురా ? ఇదివరలో నాచారము వల్లను, ఆత్మ సంస్కరణమువల్లను జాతి యేర్పడునని తెలిపి, యిప్పుడేల యింత ప్రమాద కరమగు వాక్యము పలుకవలయును. అయ్యో ! బ్రాహ్మణేతరులను ఎంత హీనముగా చేసిరి. అయితే బ్రాహ్మణులు ఇట్టి నీచకార్యము చేయవచ్చునా ?

శూద్రాం శయన మారోప్య బ్రాహ్మణో యాత్యధోగతిమ్।
జనయిత్వా సుతం తస్యాం బ్రాహ్మణ్యాదేవ హీయతే॥

శూద్రస్త్రీని బ్రాహ్మణుడు పాన్పు నెక్కించుకొని యధోగతిని బొందును. ఆ శూద్రస్త్రీయందు సంతతిని బుట్టించి, బ్రాహ్మణత్వమునే గోల్పోవును, బ్రాహ్మణ్యమునుండి పతితుడగునని చెప్పుటచే శూద్రత్వము నొందును. ఇప్పుడు ఇట్టి స్వభావముగల బ్రాహ్మణు లెందరో మీరే యోజించుకొనుడు. ఇదియును మనువు చెప్పినదే.

**దైవపిత్ర్యాథితేయాని తత్ప్రధానాని యస్య తు।**
**నాశ్నంతి పితృదేవాస్తన్న చ స్వర్గం స గచ్ఛతి ॥**

శూద్రస్త్రీతో ఏ బ్రాహ్మణుడు సంబంధము గలిగియుండునో అతడు చేయు దైవికములగు పూజ, హోమాదులు పితృసంబంధములైన శ్రాద్ధాదులు అతిథిపూజాదులు, దేవతలును, పితృదేవతలును గైకొనరు. అట్టి విప్రునకు స్వర్గలోక ప్రాప్తియు లేదు. ఇదిన్నీ మనువు చెప్పినదే కావున దేవతార్చన శ్రాద్ధతర్పణాదులు ఎవరిచేత బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాదులు చేయింతురో అట్టి వ్యక్తిని గురించి బాగుగా యోచించవలయును.

**వృషలీ ఫేనపీతస్య నిశ్వాసోపహతస్య చ ।**
**తస్యాం చైవ ప్రసూతస్య నిష్కృతి ర్న విధీయతే ॥**

శూద్ర స్త్రీ యొక్క యధరపానము చేసిన వానికిని, దాని నిట్టూర్పు సోకిన వానికిని, దానియందు సంతతిపుట్టించిన వానికి గల పాపమునకు శాస్త్రములలో ప్రాయశ్చిత్తమే లేదు. అనగా నది యట్టి మహాపాపమని యర్థము.

**న శూద్రరాజ్యే నివసేత్ ॥**

శూద్రు డేలు రాజ్యమున, బ్రాహ్మణుడుండ రాదని మనువు విధించి యున్నాడు గదా. దానిని ప్రమాణమును చేసుకొనినచో ఇపుడు భూలోకములో బ్రాహ్మణు లెట్లు నివసింపగలరు? ఇట్టివాటి కన్నింటికి ఆపద్ధర్మమని చెప్పుచు,

బ్రాహ్మణేతరులకు మాత్రము వేదాధ్యయన తపస్సులకు అర్హత లేదని యేల చెప్పి సమానసోదరులగు మానవుల కోపమునకు గురి గావలయును?

**యో హ్యస్య ధర్మమాచష్టే యశ్చైవాऽదిశతి వ్రతమ్ ।**
**సోऽసంవృతం నామ తమః సహ తేనైవ మజ్జతి ॥**

ఎవడీ శూద్రునకు ధర్మోపదేశము చేయునో, ఎవడు వ్రతము నుపదేశించునో, వాడాతని తోడనే యసంవృతమను పేరుగల, చీకటియైన చొరరాని నరకము నొందుచున్నాడు. ఆత్మమిత్రమా ! ఒక భగవంతుని యంగములనుండి పుట్టిన బ్రాహ్మణేతరులకు ధర్మోపదేశమైనను, పుణ్యవ్రతమైనను ఉపదేశించిన బ్రాహ్మణుడు, కారుచీకటి గల నరకములో బ్రాహ్మణేతరునితో గూడ పడిపోవునని చెప్పుట యెట్లు ధర్మశాస్త్రమగును? మీరే కొంచెము దయా దృష్టితో ఆలోచించి చూడుడు.

**అతపా స్త్వనధీయానః ప్రతిగ్రహరుచిర్ద్విజః ।**
**అంభస్యశ్మప్లవేనేవ సహ తేనైవ మజ్జతి ॥**

తపస్సు, వేదాధ్యయనము లేని విప్రుడు ప్రతి గ్రహమునందాశ గలిగి యుండెనేని, రాతిబండనెక్కి నదిని తరింపగోరిన వాడా రాతితో, నీట మునిగినట్లు, ఆ దాత యనర్హ ప్రతి గ్రహముతో గూడిన పాపము వల్లను, ఈ ప్రతి గ్రహీతతో గూడ నరకమునందు మునుగుచున్నాడు. ఈ వాక్యము నాధారము చేసికొనియే, దాతలు గూడ దానమును చేయవలయును. వేదాధ్యయన తపస్సులు లేనివారికిచ్చినచో దానము వ్యర్థమై పోవుటయే గాక దాత నరకములో గూడ బడును.

**తస్మాన్న విద్వాన్ బిభీయా ద్యస్మాత్త స్మాత్ప్రతిగ్రహాత్।**
**స్వల్పకేనా ప్యవిద్వాన్ హి పంకే గౌరివ సీదతి॥**

కావున మూర్ఖుడైనవాడు, అల్పద్రవ్య ప్రతిగ్రహమువలన పాపమును పోగొట్టుకొను శక్తిలేనివాడు గాన, నడుసున గోవు కూలినట్లు నరకమున బడును. కనుక నెట్టి ప్రతిగ్రహమును గైకొనకుండవలయును.

బ్రా :– నిష్కళంకాత్మా! మీరు విస్తారవముగా చెప్పిన మనోవేదనకరమగు వాక్యములు వింటిని. చిరకాలమునుండి అట్టి శాస్త్రములనే నమ్మి వచ్చినందుచే, యుప్పులో వేసిన యూరగాయలు లవణమయమై పోయినట్లట్టి స్వభావము గలిగెను. మనువు చెప్పినది చూడుడు.

**శక్తేనాఽపి హి శూద్రేణ న కార్యో ధనసంచయః।**
**శూద్రో హి ధనమాసాద్య బ్రాహ్మణానేవ బాధతే॥**

శూద్రుడు ధన సంపాదనకు సమర్థుడయ్యు, ధనమును సమకూర్చ రాదు. అట్లు ధనమును సేకరించునేని బ్రాహ్మణులగు మాకు సేవ నొనర్పఁడు. ఈ రహస్యము మనువు మా కుపదేశించినందుచేతనే మేము విద్యాజ్ఞానముల శూద్రులకు లేకుండ చేయుచున్నాము. విద్యచేత జ్ఞానము, ధనమును, ఆర్జింప శక్తి గలుగును. అపుడు బ్రాహ్మణులగు మాసేవ చేయరు.

అ :– తేజోవంతుడవగు నో యాత్మ మిత్రమా! పై జెప్పిన శ్లోకము ననుసరించి ప్రవర్తించినందుచేతగదా ! ఇన్ని కోట్ల భారతీయులగు బ్రాహ్మణేతరులు పశుప్రాయులైరి. ఆత్మనాశనముకంటె పాప మేది గలదు ? దీనికన్న ఈ బ్రాహ్మణేతరులు, భూలోకములోనే యుండకూడదని వారి దేహముల నశింపజేసినను యింత పాతకము లేదు. ఏలనన! దేహము నశించినను పునర్జన్మ వచ్చినపుడు మరల యుత్పత్తి యగును. ఆత్మ యన్ననో శుద్ధసంస్కారము పొందనిచో మరుజన్మములో గూడ నట్టి స్వభావము గలిగియే పుట్టును. అట్లయినచో నెన్ని జన్మములకైనను, వీరియాత్మ శుద్ధమై, యెట్లున్నతస్థితికి రాగలుగును ? వారి వంశమునే నశింపజేసిన, పునర్జన్మ మట్టి

జాతిలో పుట్టుటకు లేనందుచే ఇతరజాతిలో పుట్టుట వలన ఆత్మసంస్కారమునకు మార్గ మేర్పడును గదా. కావుననే యేమియో యిదివరలో చేసిన పాపము క్షయించుట కొరకు, పరమేశ్వరుని ప్రార్థన చేయవలయునని మనువే యుపదేశించి యున్నాడు. ఇక యిదే శరణము గాని వేరు మార్గము లేదు.

**యథా యథా మన స్తస్య దుష్కృతం కర్మ గ్గర్హతి।**
**తథా తథా శరీరం త త్తేనాఽధర్మేణ ముచ్యతే॥**

పాపకారి మనస్సెంతగా దానొనర్చిన పాపమును గూర్చి యక్కటా! నేనేల, యీ పాపకృత్యము నొనర్చితినని పశ్చాత్తాపపడునో యంతయంతగా వాని జీవాత్మ పాపమునుండి విడుదల యగును. కోమలహృదయా! ఇట్టి రహస్యము భావికాలపు జనులు తెలుసుకొన గలరని తలంచి యుండవచ్చును. ఈ మనుస్మృతి శాస్త్రము కృతయుగమునకు సంబంధించినదని చెప్పి, త్రేతా, ద్వాపర, కలియుగములకు గౌతమ, శంఖలిఖిత, పరాశరస్మృతు లేర్పడుటకు కారణముగా నుండవచ్చును. అయితే మనువును, తపస్స్వాధ్యాయ బ్రహ్మచర్యవ్రతములచే, బ్రహ్మత్వమును పొందుటకు బోధించిన విషయము లమోఘములు. ఇట్టి యున్నతాశయముల బోధించెడు గ్రంథము మరియొకటి లేదనియే చెప్పవచ్చును. కాని యది బ్రాహ్మణులకు మాత్ర ముపయోగపడే లాగున భద్రపరచినదేగాక, బ్రాహ్మణేతరులు దానిని గురించి యాలోచించుట గూడ పాపమని చెప్పినదేగాక, మహా దండనలగూడ ఘోరముగ విధించెను. అందువలన నిది విషయుక్త క్షీరాన్నము వంటిదయ్యెను. ఈ దోషము దీనియందు లేనిచో ప్రతియుగమందును ప్రతివారును పవిత్రమగు పాయసాన్నమువలె భుజించి యుందురు. అట్టి దూరాలోచనయు, హృదయ పవిత్రతయు లేకుండ చేసినందుచే, తరువాత కొంత యాత్మశుద్ధి గలిగిన గౌతమాది ఋషు లావిర్భవించి, యీ మానవ శాస్త్రమునకు కృతయుగముతోనే ఆయుస్సమాప్తి

చేయుటకు కారణమయినది. అయినను రాజహంసము క్షీరనీరములను వివేచన చేసి, నీరమును త్యజించి, క్షీరమును గ్రహించునట్లు సర్వ సమత్వము లేని వాక్యముల త్యజించి, సర్వజనుల కుపయుక్తములగు ధర్మములను గ్రహించుకొనవచ్చును. వేదాధ్యయనము, తపస్సు, బ్రహ్మచర్యము ఈగ్రంథములో తెలిపినట్లు మరి యే గ్రంథమందును చూడలేదు. అందువలన మనుమహర్షి వంద్యులు, అనగా పూజ్యులు.

ఇప్పుడు గౌతమ ధర్మశాస్త్రము మొదలగు, కొన్ని ధర్మశాస్త్రములలో గల జాతిని గురించిన ముఖ్యవిషయముల దెలిపెద.

**గృహే తావజ్జపః ప్రోక్తః గోష్ఠే శతగుణో భవేత్ ।**
**సహస్రం పుణ్యతీర్థేషు అనంతం దేవ సన్నిధౌ॥**

ఇంటియందు ఎంత జపము చేసినాడో అంత, ఆవును కట్టెడి స్థలమునందు చేసిన జపఫలము నూరింతలు. గంగమొదలైన పుణ్యతీర్థముల యందుచేసిన జపము వెయ్యింతలు ఫలముగలది. దేవాలయములందు చేసిన జపఫలమనంతమగు చున్నది అని గౌతముడు.

**శ్రేయోభ్యుదయ సాధనో ధర్మః॥**

మోక్షమునకును, ఐహికసుఖమునకును సాధకమైనది ధర్మ మనబడును.

**దయా సర్వభూతేషు క్షాంతి రనసూయా శౌచ మనాయాసో**
**మంగళ మకార్పణ్య మస్పృహేత్యాది కుర్యాత్ ॥**

సర్వప్రాణులయందు కనికరము, ఓర్పు, అసూయలేకపోవుట, ఆచారము, అనాయాసము, ప్రశస్తకార్యమును చేయుట, అకార్పణ్యము, సంతోషముతో ప్రతిదినము కొంచెమైన దానముచేయుట, అస్పృహ

(పరవస్తువులయందు అభిలాషలేక పోవుట) ఇవి మొదలైన సామాన్య ధర్మములు ప్రతివారును చేయవలయును – అని బుద్ధధర్మ శాస్త్రము.

**పతిగ్రహేణ శామ్యంతి పావక స్ఫులిలైరివ ।**
**అసమ్మానాత్త పోవృద్ధి స్సమ్మానా త్తపనః క్షయః॥**

సాధకుడు ప్రతి గ్రహముచేత అగ్ని యుదకముచేత క్షయించునట్లు అణగిపోవుచున్నాడు. సమ్మానమును పొందకపోవుటవలన తపస్సుయొక్క వృద్ధి గలుగుచున్నది. సమ్మానము నభిలంషించుటవలన తపస్సుకు క్షయము గలుగు చున్నది అని బృహస్పతి స్మృతి.

**వైశ్వదేవేన యే హీనాః, అతిథ్యేన వివర్జితాః ।**
**సర్వే తే వృషలా జ్ఞేయాః ప్రాప్తవేదా అపి ద్విజాః ॥**

ద్విజాలు వేదవిదులై నప్పటికిని యెవరు వైశ్వ దేవము చేయనివారో, ఎవరు అతిథిపూజచేయనివారో, వారందరును శూద్రులని తెలుసు కొనదగినవారు.

**పరాన్నేన తు భుక్తేన మైథునం యోఽధిగచ్ఛతి ।**
**యస్యాన్నం తస్య తే పుత్రా అన్నాచ్ఛుక్లం ప్రవర్తతే ॥**

ఎవడు భుజింపబడిన పరులయన్నముచేత వృద్ధి బొంది మైథునమును పొందుచున్నాడో, వానికొమరులు యెవరో, వారు అది యెవనియొక్క అన్నమెా వానియొక్క కొమరులగుదురు. అన్నము వలన శుక్లము గలుగుచున్నది.

**అన్నాత్తేజో మనః ప్రాణ శ్చక్షు శ్శ్రోత్రం యశో బలమ్।**
**ధృతిశ్స్మృతి స్తథా శుక్లం పరాన్నం వర్జయేద్బుధః ॥**

అన్నమువలన తేజస్సు, మనస్సు, ప్రాణము, నేత్రము, కర్ణము, కీర్తి, బలము, ధైర్యము, వేదము, అటువలెనే తేజస్సు గలుగుచున్నవి. పరాన్నమును తెలిసిన వాడు విడువవలమును. ఈస్మృతివల్ల పరాన్నము, పాపాన్నము, దోషాన్నము భుజించరాదని బాగుగా జ్ఞాపకముంచు కొనవలయును- అని శంఖ లిఖితస్మృతి.

**ప్రాణాయామై ర్ద హేద్దోషాౕ ధారణాభిశ్చ కిల్బిషమ్।**
**ప్రత్యాహారైరసత్సంగాన్ధ్యానేనానీశ్వరాన్గుణాన్॥**

ప్రాణాయామయోగములచేత దేహమనంబుల దోషములను, ధారణాయోగములచేత పాపమును, ప్రత్యాహారయోగములచేత అసద్విషయ సంబంధములను, ధ్యానయోగముచేత ఈశ్వరగుణంబుల కన్యమగు జీవగుణములను పోగొట్ట వలయును.

**సవ్యాహృతిం సప్రణవాం గాయత్రీం శిరసా సహ।**
**త్రిః పఠేదాయతప్రాణః ప్రాణాయామస్స ఉచ్యతే॥**

సాధకుడు వ్యాహృతితో గూడిన ప్రణవముతో జేరిన గాయత్రిని వేదశిరస్సగు ఉపనిషత్ప్రతి పాదక బ్రహ్మముతో కట్టబడిన శ్వాసముగలవాడై మూడుమారులు పఠింపవలయును. అది ప్రాణాయామ యోగమని చెప్పబడుచున్నది.

**మనసస్సంయమస్త ద్జ్ఞ ర్ధారణేతి నిగద్యతే ।**
**సంహారశ్చేంద్రియాణాం చ ప్రత్యాహారః ప్రకీర్తితః॥**

మనస్సును నిలపడము ధారణాయోగమని యోగశాస్త్రము తెలిసిన వారిచేత చెప్పబడుచున్నది. మఱియు నింద్రియములయొక్క ఉపసంహారము ప్రత్యాహార యోగమగును.

**హృదయస్థస్య యోగేన దేవదేవస్య దర్శనమ్।**
**ధ్యానం ప్రోక్తం ప్రవక్ష్యామి ధ్యానయోగమతః పరమ్॥**

యోగముచేత హృదయమందుండెడు పరమాత్ముని దర్శించుట ధ్యానయోగమని చెప్పబడినది. ఇందుమీదట ధ్యానయోగమును విశేషించి చెప్పుచున్నాను.

**వాసుదేవ స్తమోంధానాం ప్రత్యక్షో నైవ జాయతే।**
**అజ్ఞాన పటసంవీతై రింద్రియై ర్విషయైషిభిః॥**

విష్ణువు అజ్ఞానముచేత అంధులైనవారికి అజ్ఞానమనెడి వస్త్రముచేత కప్పబడిన, శబ్దాది విషయములయందును స్పృహగల మనస్సు మొదలయిన యింద్రియములచేతను ప్రత్యక్షవిషయుడు కానే కాడు.

**సర్వవేదపవిత్రాణి వక్ష్యామ్యహ మతః పరమ్।**
**యేషాం జపైశ్చ హోమైశ్చ పూయంతే మానవాస్సదా॥**

ఏ దివ్యమంత్రములయొక్క జపములచేతను, హోమములచేతను మనుజులు ఎల్లప్పుడు పరిశద్ధులగుచున్నారో (అటువంటి) సర్వవేదములలో జెప్పబడిన పావనమతములను ఇకమీద నేను చెప్పుచున్నాను.

**నిత్యం యోగరతో విద్వాన్సమలోష్టాశ్మకాంచనః।**
**ధ్యానశీలో యతి ర్విద్వా న్బ్రాహ్మణః పంక్తిపావనః॥**

(ఎవడు) ఎల్లపుడు యోగాభ్యాసపరుడో, విద్యావంతుడో, మట్టిగడ్డను, రాతిని, బంగారమును సమానముగా చూచువాడో, ధ్యానశీలుడో, విద్వత్సన్యాసము గలవాడో అట్టివాడు పఙ్క్తిపావనుడు- పఙ్క్తిపావనుడనగా తాను భోజనమునకు కూర్చుండెడు పఙ్క్తిలోగల వారందరినిన్నీ పవిత్రులుగా చేయువాడగునని శంఖ ధర్మశాస్త్రము.

**ధర్మ ఇతి ధర్మేణ సర్వమిదం పరిగృహీతం ధర్మాన్నాతి దుష్కరం తస్మాద్ధర్మే రమంతే ॥**

అన్ని ధర్మవిధులు న్యాయమను ఉద్దేశ్యముతో స్వీకరింపబడుచున్నవి. ధర్మమగు విధిని నిర్వహించుటకంటె కష్టమగు కార్యము మరిలేదు. అట్లయ్యును (ఋషులు) ధర్మములగు కార్యములనే యాచరించుచున్నారు. అది మొదట ఆచరించుటలో శ్రమగా నుండును. అది క్రమక్రమముగా ఆత్మ విశ్రాంతిని గలుగ జేయును. ధర్మమార్గము ఊర్ధ్వగమనమువంటిది. అధర్మము అధోగమన మగును. స్వభావముగా జలము అధోముఖముగా, ఏ ప్రయత్నము లేకనే ప్రవహించుచుండును. దానిని ఊర్ధ్వముఖముగా నడుపవలసి యుండిన యంత్రసహాయ మెట్లవసరమో, ధర్మమార్గము అట్టి యంత్రము వంటిదని, ముముక్షువులు తెలిసి కొనవలయును. దిగువభాగమునకు వెళ్ళెడు జలము క్రమముగ సముద్రములో పోయి చేరును. అందువలన నేయుపయోగమును కలుగదు. యంత్రములద్వారా పైటాంకులోనికి పంపెడు జలము, ఏలాగున జనుల స్నానములకు, భోజనాదులకు, సస్యములకు నుపయోగపడునో, ఆలాగున పరిశ్రమ గలవాని ఆత్మ పవిత్రమగుటయే గాక, పావనమగు మోక్షమును గూడ గలుగజేయును. ఈ విషయమై గీతాచార్యు లుపదేశించినది చూడుడు. గీత స్మృతికి సంబంధించిన దగుటచే నీస్మృతి కాండములో చేర్చుడమైనది.

**యత్తదగ్రే విషమిన పరిణామేఽ మృతోపమమ్ ।**
**తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధి ప్రసాదజమ్ ॥**

ఏదైవకార్యము ముందుగా (అనుష్ఠాన కాలమున) విషమువలె దుఃఖరూపముగ నగుచున్నదో, పరిపాకమందు అమృతముతో తుల్యమైనదిగా మారుచుండునో, పరమాత్మ విషయకమైన బుద్ధియొక్క నైర్మల్యమువలన

గలిగిన యా సుఖము సాత్త్వికసుఖమని చెప్పబడియున్నది.

**విషయేంద్రియసంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్।**
**పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥**

విషయములయొక్కయు, నింద్రియములయొక్కయు చేరికవలన గలిగెడు ఏ సుఖములు అజ్ఞానమువల్ల మొదట అమృతతుల్యమైనదిగా తోచినను పరిణామమునందు (బల, వీర్య, రూప, ప్రజ్ఞా, మేధా, ధన, ఉత్సాహముల యొక్క హానికి కారణమగుటవలన) గరళమువలె అగుచున్నవో, ఆ సుఖములు రాజస తామస సుఖములని గ్రహించదగినవి. తమోగుణ స్వభావము గలవారు శారీరక, మానసిక పరిశ్రమ చేయనొల్లక యూరకుండుట సుఖమని తలంతురు. కాని క్రమక్రమముగా వారి జీవితము మిక్కిలి దుర్భరమగుచుండును. కట్ట కడకు, జీవితమును గడుపుటకు మహాప్రయాసమే గాక, పరలోకమందు గూడ నేసద్గతినైన పొందజాలరు. ఈ జన్మలో సుకృతము చేయకపోవుటచే మరియొక జన్మమునందైన దుఃఖముతోనే జీవితము గడుపవలసియుండును. తామస స్వభావమగు సోమరితనము మూడు జన్మములను చెరచును. ఈ విషయమై పద్మపురాణము నందుగూడ చెప్పబడిన దానిని చూడుడు.

**న సౌఖ్యాల్లభతే పుణ్యం కాయక్లేశా దవాప్యతే ।**
**మంథనేన యథా క్షీరా న్నవనీతం ప్రజాయతే ॥**
**మర్దనా దిక్షుదండానాం రసో యద్వత్ప్రజాయతే ।**
**తద్వ చ్ఛరీరదండేన మహాధర్మః ప్రజాయతే ॥**

శరీర సౌఖ్యమును కోరుచున్నవానికి పుణ్యము లభింపజాలదు. కాయ క్లేశమును సహించిన సత్కర్మానుష్ఠాన పరునకు మాత్రమే సౌఖ్యము గలుగును. క్షీరమును మథింపనిచో నవనీత మెట్లు లభింపజాలదో, చెరకు కర్రను

గానుగలో ఆడనిచో రస మేలాగున లభించదో, పై కార్యములు చేయుటవల్ల నవనీతమును, శర్కరయు ఎటుల లభించుచున్నవో, ఆలాగున దేహమును మంచి అనుష్ఠాన మగు పరిశ్రమలోనుంచిన, ఆత్మధర్మమగు జ్ఞానము లభించును. ఇకను గీతలో చెప్పిన త్రివిధజ్ఞానమును చూడుడు.

**సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే ।**
**అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥**

వేర్వేరుగానున్న సకల భూతములయందు (బ్రహ్మాది స్తంబ పర్యంతములగు) ఎడతెగక యుండునదియును. అద్వితీయమైనదియును, నిత్యమైనదియును అగు పరబ్రహ్మమును ఏ విజ్ఞానము చేత చూచుచున్నాడో, ఆ జ్ఞానము సాత్త్వికజ్ఞానముగా తెలుసుకొనుము.

**పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్ ।**
**వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం విద్ధి రాజసమ్ ॥**

భిన్నభిన్న రూపముగా నున్నటువంటి, సకలములైన భూతముల యందును అనేక జీవులను వేరు వేరు గుణములు గలవారినిగా నేజ్ఞానము తెలుసు కొనుచున్నదో, ఆజ్ఞానమును రాజసజ్ఞానముగా తెలుసుకొనుము.

**యత్తు కృత్స్నవదేకస్మిన్కార్యే సక్త మహైతుకమ్ ।**
**అతత్త్వార్థవదల్పం చ తత్తామస ముదాహృతమ్ ॥**

దేహమే ఆత్మ యనియు, యుక్తిరహిత మైనదియు, తత్త్వార్థహీన మైనదియు, అల్పబుద్ధితో కూడినదియునగు ఏజ్ఞానముగలదో ఆజ్ఞానము తామస జ్ఞానమని చెప్పబడినది. దీనిని గురించి ఆలోచించిన ఇపుడు గుణము ప్రధానము కాదనియు, కులమే ప్రధానమని చెప్పువారి జ్ఞానము సాత్త్వికమా, రాజసమా, తామసమా యని విజ్ఞులు ఎఱుంగగలరు. ఇచట పాత్రము,

పాత్రలో గల జలము, జలములో ప్రతిబింబించు సూర్యుడు అను మూడు విధములుగ భావించదగును. పాత్రలు అనేక లోహములతో అనేక విధములుగా నుండినను, వాటి యందుగల జల మనేకవిధములుగ నుండినను, వానియందు ప్రతిబింబించిన సూర్యుడొకడేయని గ్రహింప శక్తిగల వివేక జ్ఞానము సాత్త్వికజ్ఞాన మనబడినది. పాత్ర లనేకాకృతులు గలిగి యుండినను వాటిలోగల జలము యొక్క శుద్ధాశుద్ధములజూచి గ్రహించుకొను జ్ఞానము రాజసజ్ఞానమని చెప్పబడినది. సూర్య ప్రతిబింబమును జలమును విడిచిపెట్టి, పాత్రయొక్క ఆకారమును చూచి గ్రహించెడు జ్ఞానము తామస జ్ఞానమని యుపదేశించడమైనది. అలాగున సర్వాంతర్యామియగు నాత్మను పరికింపకయు, శుద్ధాశుద్ధ గుణంబులనైనను బరిశీలింపకయు కేవలము పుట్టిన కులమునకు మాత్రము ఆధారమై యుండు దేహమును గ్రహించెడు జ్ఞానము తమోగుణమని శ్రీ కృష్ణుడు తెలిపిన విషయము నైనను తెలియకుండుట కడుంగడు శోచనీయమైనది గదా! ఉత్తమ జ్ఞానము లేకపోయినను మధ్యమజ్ఞానమునయినను సంపాదింపక, అధమ జ్ఞానములో పడియుండువారి కెపు డుత్తమస్థితి గలుగును? జీవన్ముక్త దశ గలుగవలసి యుండిన, సత్త్వగుణ జ్ఞానమును గూడ దాటి విశుద్ధసత్త్వగుణ మగు జ్ఞానము గలుగవలయునని శ్రుతు లుద్ఘోషించుచుండగా మనమెపు డిట్టి స్థితి పొందగలమా యని ముముక్షువులు విచారింపదగినది గదా!

సర్వయోనిషు కౌంతేయ మూర్తయ స్సంభవంతి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా॥

అర్జునా! దేవ, పితృ, మనుష్య, పశు, మృగాద్యనేకయోనుల యందు పుట్టు పలువిధములయిన శరీరములకు మూలా ప్రకృతి తల్లియనియు పరమేశ్వరుడనగు నేను బీజప్రదాతనగు తండ్రిననియు తెలుసుకొనుము దీనివల్ల సర్వ ప్రాణులలోగల ఆత్మ సాక్షాద్భగవంతుడని తెలుపడుచున్నది.

బీజాంకుర న్యాయములను నుపన్యసించువా రీభగవద్వాక్యమును తెలియకుండుటయే దేశపతనమునకు కారణమైనది.

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।**
**క్షేత్ర క్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తర్జ్ఞానం మతం మమ॥**

ఫల్గుణా! బ్రహ్మాది స్తంబపర్యంతములగు నట్టి, సకలోపాధులయందును, పరమార్థజ్ఞానముచేత; నొక్కటియగు పరమాత్మను నేనని తెలుసుకొనుము. పంచ భూతాత్మకమగు క్షేత్రమును, వాని యం దధిష్ఠించెడు క్షేత్రజ్ఞుని నన్నుగా తెలుసుకొనెడు యే జ్ఞానము గలదో అదియే నిజమగు జ్ఞానమని నామతము, ''మతం మమ'' అని ప్రయోగించుటచే క్షేత్రజ్ఞుని భగవంతునిగా తెలుసుకొనెడు జ్ఞానము భగవత్సమ్మతమగును. వీనికన్యముగ జీవుని గురించి వ్యాఖ్యానము చేయువారి జ్ఞానము భగవత్సమ్మతము కాదని గ్రహించు కొనవలయును.

ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మిత్యభిధీయతే।
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥

ఈ శ్లోకమున క్షేత్రజ్ఞు డనగా నెవడో దానిని గురించి చెప్పడమైనది. ఓ కౌంతేయా! ఈ శరీరము క్షేత్రమని చెప్పబడుచున్నది. ఎవడు ఈ క్షేత్రమును తెలుసుకొనుచున్నాడో, వానిని క్షేత్రజ్ఞుడని, క్షేత్రజ్ఞులయొక్క యాథార్థ్యమును తెలిసినవారు చెప్పుచున్నారు. స్థూల, సూక్ష్మ, కారణ శరీరములునూ, వాటియొక్క ధర్మములును, ఏ ఆత్మ తెలుసుకొనుచుండునో, అట్టి తెలివిరూపమగు నేజ్ఞానముగలదో అది దైవరూపముగ నెఱుంగవలయును. భూమియందు పైరు మొదలగు బీజములు పూర్ణఫలముల నిచ్చుటకు ఎట్లు వృక్షరూపము లగుచున్నవో, అందువల్ల దేహమును క్షేత్రముగ వర్ణించడమైనది. దీనియందు బీజరూపముగ నుండు జీవుడు శివరూపముగ వృద్ధిపొందవలసి

యుండును. కావున శరీరమును భూమిగాను, ఆత్మను పరమాత్మగాను ఎఱుంగవలయును. బీజము వృక్షమగునట్లు, జీవుడు ఈ దేహమందుండియే బ్రహ్మనిష్ఠలచేతను, బ్రహ్మవిచారణ చేతను శివుడు కావలసియుండును. పూర్ణజ్ఞానము గలుగువరకు జీవుడనియు, పూర్ణజ్ఞానము గలిగిన పిదప శివుడును అగుచున్నాడని శ్రుతు లనవరతము ఉపదేశించుచున్నవి. కరుణామయుడగు శ్రీకృష్ణుడు దేహదేహుల గురించి యెంత సుందరముగా వర్ణించెను! ప్రకృతియొక్క స్వభావము కారణరూపమునుండి యేర్పడిన కార్యము, మరల కారణరూపముగ మారుచుండును. గొప్ప మఱ్ఱిచెట్టగుటకు కారణరూపము నుండి కార్యరూపముగ నేర్పడిన మఱ్ఱివిత్తనము మహాకారణరూపమగు వృక్షముగా నెట్లు పరిణమించునో, ఆలాగున కారణరూపుడగు ఈశ్వరునుండి యేర్పడిన, కార్యరూపుడగు జీవుడు బ్రహ్మవిచారణ, ధ్యానయోగాదులచే ఈశ్వరత్వము నొందును. అయితే బీజము వృక్షముగా కావవలసియుండిన, పృథివ్యప్తేజోవాయ్వాకాశాది పంచభూతములయొక్క ఆనుకూల్యము గలుగవలయును, ప్రతికూలములుగ పంచభూతములుండిన వృక్షముగా మారజాలదు. శుద్ధమైన భూమి, నిర్మల జలము, శుద్ధమగు ఎండ, శుద్ధమగు వాయువు, ఆకాశమును ఎట్లుండవలయునో, ఆలాగున శుద్ధమైన హృదయము, శుద్ధమైన ఆహారము, నిర్మలమగు ధ్యానము, శుద్ధసంకల్పము, శుద్ధమైన దైవభావమును కలుగవలయును. ఈవిషయమై ముండకోపనిషత్తునందు జెప్పినదాని గాంచుడు.

యథా సుదీప్తాత్పావకాద్విస్ఫులింగాః
సహస్రశః ప్రభవంతే సరూపాః।
తథాఽక్షరా ద్వివిధా స్సోమ్య భావాః
ప్రజాయంతే తత్ర చైవాపి యంతి॥

బాగుగా మండుచున్న అగ్ని నుండి వేలకొలది సమానమయిన

రూపములుగల అగ్ని కణములు ఏ విధముగ పుట్టుచున్నవో, ఆ ప్రకారమే సాధుస్వభావముగల యో శౌనకుడా ! నాశరహితమగు పరబ్రహ్మమునుండి, నానారూపులుగా సమానమయిన జీవులు పుట్టుచున్నారు. అక్షయమగు పర బ్రహ్మమునందే లీనమగుచున్నారు. ఇచటగూడ కారణరూపమగు అగ్ని కుండమునుండి యేర్పడిన కార్యరూపములగు మిణుగురులలో నొకదానిని దూదిలో గ్రహించి చిన్న చిన్న పుల్లలచే వెలిగించి తరువాత పెద్ద పెద్ద కట్టెలను వేసినచో ఏలాగున పూర్వమేర్పడిన మహాగ్ని గాగలుగునో, ఆలాగున విభుస్వరూపుడగు సర్వేశ్వరునినుండి అణుస్వరూపులుగా నేర్పడిన జీవులు తపోధ్యానాధ్యయన జ్ఞానములచే సర్వకారణుడగు సర్వేశ్వర స్థితిని పొందగలరు. శ్రుతి స్మృతులిట్లుద్ఘోషించెడు ధర్మమును జనులకు బోధించువారు లేకపోయిరి గదా! యని విచారము గల్గుచున్నది. ఇకను గీతలో చెప్పినది చూడుడు.

**యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా।**
**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్॥**

ఈశ్వర గుణయుక్తమైనదియును, జ్ఞానయుక్తమైనదియును, ఉత్సాహముతో గూడినదియును అయిన యే యే స్థలము గలదో, లేక అంతఃకరణము గలదో అయా అంతఃకరణము లేక ఆత్మ, అది నాయొక్క తేజోంశమువలన బుట్టినదానిగానే నీవు తెలుసుకొనుము. అనగా నెవరియందు ఈశ్వరగుణములగు , సత్యము, జ్ఞానము, కరుణ, భక్తి గలిగియుండునో, వారిని నా యొక్క స్వరూపులనుగా తెలియుము. అనగా ఈశ్వరునిగా తలంపుము.

**యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున ।**

సకల భూతకారణములకును బీజకారణమును, మాయోపాధికమునైన చైతన్యమును నేనే యగుచున్నాను. అనగా సర్వప్రాణులలో

చైతన్యరూపముగ వెలుగుచున్నది దైవరూపమని తెలియవలయును.

**బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ! సనాతనమ్।**

ఓ ఫల్గుణా! నన్ను సకల భూతములకును శాశ్వతమైన బీజరూపముగ తెలుసుకొనుము. జీవులయందు భేదములను వ్యాఖ్యానము చేయువారు ఇట్టి యీశ్వరవాక్యమును ఏల చూడకపోయిరో విస్మయ మావిర్భవించుచున్నది.

**సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి నప్రియః।**
**యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్॥**

ఓ యర్జునా! నేను సకల ప్రాణులయందును సమానముగా నుంటున్నాను. నాకు శత్రువుగాని, మిత్రుడు గాని లేడు. (శ్రేష్ఠుడు గాని నికృష్టుడుగాని లేడు) ఎవరు నన్ను భక్తితో భజింతురో, అట్టివారు నాయందున్న వారగుదురు. నేనును వారి యందున్నవాడను. ఓహో! ఎంత ప్రేమమయమై, సత్యమయమగు వాక్యమును భగవానుడు పలికెను!

**అచ్ఛేద్యోఽయ మ దాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ।**
**నిత్యః సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః॥**

ఈయాత్మ, ఖడ్గముచే ఛేదింపదగినవాడు కాడు. ఈయాత్మ అగ్నిచే దహింపదగినవాడు కాడు. ఈయాత్మ జలముచే తడుపదగినవాడు కాడు. ఈయాత్మ వాయువుచే నెండింపదగినవాడు కాడు. ఈయాత్మ త్రికాలములయందునుండువాడు, సర్వవ్యాపకుడు, అచలుడు, సనాతనుడు.

ఇక వివేక చూడామణియందు, శ్రీశంకరభగవత్పాదులు బోధించిన, ఆత్మ ధర్మము చూడదగినది. ఇట్టి యమృతమగు ఆత్మతత్త్వమును నుపదేశింపక పోవుటయు, విషముతోగూడిన విషధర్మమగు దేహమును గురించిన

వర్ణధర్మవునను చిరకాలవునుండి బోధించుచువచ్చుటచేతను, ఆర్యసంతానములగు భారతీయులు ఇంత దీనావస్థకు వచ్చిరి. దీనివల్ల స్వదేశము నిలబెట్టుటకైనను సామర్ధ్యము లేక పోయెను. అందువల్లనే దేశపతనముగూడ గలిగెను. ఈవిషయమై అభిప్రాయ విభేదము కొందరికి కలిగి యుండవచ్చును. అట్లు గలుగుట నూతనము గాదు. ఒక్కొక్క రొక్కొక్క నూతనధర్మములను చెప్పబూనినపుడు, దానిపై నాక్షేపము లనాదినుండి వచ్చుచునే యున్నవి. మతములే దానికి తార్కాణము.

**లబ్ధ్వా కథంచిన్నరజన్మ దుర్లభం**
**తత్రాపి పుంస్త్వం శ్రుతిపారదర్శనమ్।**
**యః స్వాత్మముక్త్యై న యతేత మూఢధీః**
**స ఆత్మహా స్వం వినిహ న్త్యసద్గ్రహాత్॥**

పూర్వజన్మార్జిత పుణ్యావశమునను, దైవానుగ్రహము వలనను దుర్లభమగు మనుష్యజన్మము ప్రాప్తించియు దానిలో పురుష శరీరమును దాల్చియు, శాస్త్రజ్ఞానము గలిగియు, ఏ మూఢుడు తన ముక్తికొఱకు ప్రయత్నింపక, అనిత్యమగు ప్రాపంచిక విషయములలోనే కాలము గడుపునో అట్టివాడు దేహాభిమానముచే తన యాత్మను తానే చంపుకొనునట్టి ఆత్మఘాతకు డగును.

**మస్తకన్య స్తభారాదే ర్దుఃఖ మన్యై ర్నివార్యతే ।**
**క్షుధాదికృత దుఃఖం తు వినా స్వేన న కేనచిత్ ॥**

తన శిరముపై నుండు భారము వలనగలుగు దుఃఖమును ఇతరులు నివారింపగలరు. కాని క్షుత్పిపాసాదుల వలన గలిగెడు దుఃఖము స్వయముగ భుజించినగాని నివృత్తి గాదు. ఆలాగున నొకరికి ప్రపంచ ఋణబాధ గలిగియుండినచో నాప్తు లెవరైనను దానినుండి నివారణచేయగలరు గాని,

అజ్ఞానముచే గలిగెడు భవదుఃఖము స్వయముగ తానే విచారణజ్ఞానముచే నివారణ చేసుకొన వలసియుండును.

**పథ్యమౌషధసేవా చ క్రియతే యేన రోగిణా ।**
**ఆరోగ్యసిద్ధి ర్దృష్టాఽస్య నాన్యానుష్ఠిత కర్మణా॥**

వ్యాధిగ్రస్తుడు తాను స్వయముగ నౌషధమును సేవించి పథ్యముచేసిన యెడల వాని కారోగ్యము గలుగును. వానికై యితరులు ఔషధసేవయు, పథ్యమును జేసిన యెడల రోగియొక్కరోగము కుదురునా? కుదురదు, భవరోగము యొక్క స్థితియు నిట్టిదని బుద్ధిమంతులు గ్రహించుకొనవలయును.

**అథ తే సంప్రవక్ష్యామి స్వరూపం పరమాత్మనః ।**
**యద్విజ్ఞాయ నరో బంధాన్ముక్తః కైవల్య మశ్నుతే ॥**

పరమాత్మ స్వరూపమును బోధించుచున్నాను. ఆపరమాత్మ స్వరూపమును యథార్థముగ తెలుసుకొనిన నరుడు, బంధవిముక్తుడై కైవల్యమును బొందును. చూచితిరా! ఆత్మజ్ఞానము గలిగిన మాత్రమే మోక్షము గలుగునని ఆచార్యులే నివేదించియున్నారు.

**శ్రుతిప్రమాణైకమతేః స్వధర్మనిష్ఠా తయైవాత్మ విశుద్ధిరస్య ।**
**విశుద్ధ బుద్ధేః పరమాత్మవేదనం తేనైవ సంసార సమూలనాశః ॥**

శాస్త్రప్రమాణమందు నమ్మకముగల పురుషునకు తాననుష్ఠించవలసిన ధర్మమునందు శ్రద్ధయు, భక్తియు గలుగును. అట్టికర్మానుష్ఠానము వలన బుద్ధి పరిశుద్ధమగును. విశుద్ధబుద్ధి వలన బ్రహ్మజ్ఞానమనెడు అపరోక్షజ్ఞాన మావిర్భవించును. అపరోక్షాత్మజ్ఞానము వలన సంసారదుఃఖము సమూలముగ నశించును.

**దేహోఽహమిత్యేవ జడస్య బుద్ధిర్దేహే చ జీవే విదుషస్త్వహంధీః ।**
**వివేకవిజ్ఞానవతో మహాత్మనో బ్రహ్మాఽహమిత్యేవ మతిస్సదాత్మని ॥**

ఆత్మానాత్మ వివేకశూన్యుడగు జడుడు, దేహమే తానని తలంచును. శాస్త్ర జ్ఞానముమాత్రము గల పండితుడు జీవుడే తాననుకొనును. దృఢమగు నపరోక్షజ్ఞానముగల మహాత్ముడు పరబ్రహ్మమే తాననెడి దృఢనిశ్చయము గలిగియుండును. ఇచట మూడు విధములగు ఆత్మభావన తెలుపబడినది. పుట్టిన జాతిని గురించిన దేహమే తానని తలంచెడు బుద్ధి జడబుద్ధి యగును. కొంత వివేకముచే శాస్త్రజ్ఞానము మాత్రము గలవాడు కూటస్థ చైతన్యాత్మయే తా నని తలంచును. బ్రహ్మవిచారణజేసిన మహాత్ముడు పరమాత్మయే తనయాత్మయను దృఢనిశ్చయము గలిగియుండును. దీని యొక్క దానివల్లమాత్రముననే బంధవిముక్తి గలుగును. మొదటిది కేవల బంధహేతువనియు, రెండవది ముముక్షుత్వమునకు హేతువగు ననియు, మూడవది ముక్తికి కారణమనియు తెలుపడమైనది. కాబట్టి కులమును బట్టి మాత్రము ధర్మమును బోధించువాడేమి బోధించుచుండునో, వివేకవంతులు దీనిని బట్టి గ్రహించుకొన గలరు.

**నిద్రాయా లోక వార్తాయాః శబ్దాదేరపి విస్మృతేః।**
**క్వచిన్నావసరం దద్యాత్ చింత యాత్మాన మాత్మని॥**

జనులారా! అమూల్యమై అతిపావనమగు కాలమును, నిద్రలోను, లౌకిక వ్యవహార సంబంధములలోను, పరాకులోను పోగొట్టక, మీ యాత్మ స్వరూపమెట్టిదో, దానియొక్క తత్త్వము తెలుసుకొనుటలో ప్రయత్నవంతులు కండు. అట్లు జాగ్రత్త గలిగి యనుష్ఠింపని కారణము చేతనే దేహబుద్ధి గలిగి, పశుప్రాయులై యుండుటకు కారణమైనది. ఇకను ఈ విషయమై వేదాంత పంచదశిలో చెప్పినదానిని చూడుడు.

**అనుప్తే రామృతేః కాలం నయేద్వేదాంతచింతయా।**
**దద్యా న్నావసరం కించి త్కామాదీనాం మనాగపి॥**

ప్రాతఃకాలమునుండి రాత్రి నిద్రించువరకును, జన్మించినప్పటి నుండి మరణించువరకును, బ్రహ్మవిచారమందే కాలము గడుపవలయును. అట్లుగాక అనవసరమైన కార్యములలోను, ఇంద్రియాది సుఖములలోను మాత్రము కొంచెమైనను కాలము గడుపక జాగ్రత్తగలిగి యుండవలయును. ఇట్టి యుపదేశ వాక్యములను గ్రహించి, ఆచరణమం దుంచక పోవుటచేతనే శాస్త్రజ్ఞానమును, అనుభవజ్ఞానము గలుగక పోవుటకు కారణము. సోమరిపోతు తనమునకు తిలోదకము విడువనివాడు ఏకాలమునగూడ ఉన్నతస్థితికి రాజాలడు. కర్షకులు వర్షాకాలమున నేలాగున సర్వేశ్వరు డొసగిన వర్షజలమును కొంచెమయినను వ్యర్థముగ బోనీయక కాలువలద్వారా తెచ్చి చెరువులలో భద్రముగానుంచి సంరక్షింతురో, అందువల్ల పంటలు వృద్ధియై సౌఖ్యముగా జీవింపగలుగుచున్నారో, ఆలాగున పరమ కారుణి కుడగు సర్వేశ్వరు డొసగినకాలమును భద్రపరచి యుపయోగించిన, తనజీవితమును ధన్యముగా చేయవచ్చును. అందువలన పరమశాంతియు, పరమసుఖమును అనుభవింప గలుగును. అట్లుగాక కొందరు రైతులు సోమరులై పరస్పరము కలహించి కాలువలను చెరువులను, చక్కపరచనందుచే జలము నిలువక, పంటలు లభింపక పోవుటచే, దారిద్ర్య బాధలను నిరంతర మనుభవించుచుండగా కనులార గాంచుచున్నాముగదా! ఆలాగుననే యెందరో మానవులు పరిశ్రమచేయక పోవుటచేత, విజ్ఞానము నార్జింపక పోవుటచే, నిరంతరము దుఃఖమున బడి కలవరించుట చూచుచునే యున్నాము. ఒకవేళ పూర్వకాలములో బ్రహ్మవిద్యార్జనము కొరకును, ఆత్మజ్ఞానార్జనము కొరకును అనుకూలత లేకపోయినను, ఇపు డాలాటి బ్రతిబంధము లేవియు లేవుగదా. కావున పరిశ్రమపరులై యుండుడు. పరిశ్రమలేనిచో ఎవరును పవిత్రులు కాజాలరు.

**ఆత్మోఽభిమానం త్యజ మాంసపిండే**
**పిండాభిమానిన్యపి బుద్ధి కల్పితే।**
**కాలత్రయాబాధ్య మఖండబోధం**
**జ్ఞాత్వా స్వమాత్మాన ముపైహి శాంతిమ్ ॥**

కావున ప్రథమమున ఈ మాంసపిండమగు నీ దేహమే తాననెడు భావమును విడువవలయును. మరల నీదేహమందుండు కించిజ్జ్ఞుడగు జీవుడే తాననెడు బుద్ధిని త్యజించవలయును, తరువాత త్రికాలాబాధ్యమును, అఖండ బోధ స్వరూపమును అగు నాత్మను తెలిసికొని, అట్టి పరమాత్మయే తాననెడు బోధము గలిగి జీవన్ముక్తి రూప పరమ శాంతిని బొంది సుఖింపుము.

**బాహ్యే నిరుద్ధే మనసః ప్రసన్నతా**
**మనఃప్రసాదే పరమాత్మ దర్శనమ్,**
**తస్మిన్ సుదృష్టే భవబంధనాశో**
**బహిర్నిరోధః పదవీ విముక్తేః ॥**

బాహ్యవిషయచింతనను నిరోధించుటవలన మనస్సునకు ప్రసన్నత గలుగును. ఏకాగ్రతయు సిద్ధించును. మనోనిర్మలతవలన పరమాత్మ సాక్షాత్కార దర్శనము లభించును. అట్టి బ్రహ్మసాక్షాత్కారమువలన భవబంధవిముక్తి గలుగును. కనుక ఇంద్రియముల యొక్క నిరోధమే మోక్షహేతు వనబడును.

**అనాత్మచింతనం త్యక్త్వా కశ్మలం దుఃఖకారణమ్ ।**
**చింతయాత్మాన మానందరూపం యన్ముక్తికారణమ్ ॥**

పాపజనకమును, దుఃఖప్రదము నగు, దేహభావమును విడిచి మోక్షహేతువును, ఆనందస్వరూపము నగు, ఆత్మనే సదా చింతింపుము–

దీనివలన పుట్టిన కులమునకు సంబంధించిన దేహభావమును బోధించుట యెంత పాపకార్యమో, గుణమును బోధించి ఆత్మ తత్త్వము నుపదేశించుట యెంత పుణ్యకార్యమో లోకులు తెలుసుకొనవచ్చును.

బ్రా:- భూతైక హితేచ్ఛగల సోదరా! మీరు వాక్రుచ్చిన వాక్యముల నన్నిటిని సావధానముగా వింటిని. అయితే ధర్మాధర్మములకు సందిగ్ధస్థితి గలుగునపుడు శాస్త్రమే ప్రమాణమని శ్రీకృష్ణభగవాను లుపదేశించి యున్నారు. కావున శాస్త్రము ప్రమాణము గదా! అనగా వర్ణాశ్రమముల ననుసరించి నడువవలయును గదా! శాస్త్రమును ధిక్కరించి స్వేచ్ఛగ ప్రవర్తించువారు నరకగాము లగుదురని స్పష్టముగ గీతలో నుపదేశించియున్నారు, చూడుడు.

**యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః।**
**న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్।**

ఎవడు శాస్త్రమందు చెప్పబడియున్న విధి నిషేధాత్మకమగు ప్రమాణమును విడిచి, తన యిచ్ఛ వచ్చినటుల ప్రవర్తించుచున్నాడో వాడు ఇష్ట సిద్ధిని పొందజాలడు. అంతేగాక యుత్కృష్టమైన గతిని అనగా మోక్షమును పొందజాలడు.

**తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।**
**జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తుమిహార్హ పి ॥**

కావున నీకు ఏది చేయువచ్చును, ఏది చేయురాదు, అను విషయమునందు శాస్త్రమే ప్రమాణము. శ్రుతిస్మృతులలో జెప్పబడిన కర్మను తెలుసుకొని ఆచరించుటకు తగుచున్నావు.

అ:- విజ్ఞాన నిలయా! శాస్త్రము ప్రవృత్తిమార్గమును, నివృత్తి

మార్గమును ఉపదేశించుచున్నది. మఱియు బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, తురీయాశ్రమములను గూడ నుపదేశించుచున్నది. కావున బ్రహ్మచర్యాశ్రమవిధి నెచటనో చూచి అదేరీతిగ నడువవలయునని గృహస్థున కుపదేశించుటయు, గృహాశ్రమధర్మముల నెచటనో చూచి ఋతుకాలగమనము – సన్న్యాసికి నుపదేశించిన నెంత బాగుండును! కావున ఎవరే యనుష్ఠానమందున్నారో వారికిదగిన శాస్త్రవిధి యేదిగలదో అదే యాచరణీయము గాని, తక్కినది కాదు. ఈ విషయమై మనువు చెప్పినది చూడుడు. ధర్మశాస్త్రోపదేష్టలలో మనువు మొదటివాడు.

**సుఖాభ్యుదయికం చైవ నైశ్శ్రేయసిక మేవ చ ।**
**ప్రవృత్తం చ నివృత్తంచ ద్వివిధం కర్మ వైదికమ్ ॥**

ఈ వైదికకర్మ ప్రవృత్తి కర్మమనియు, నివృత్తి కర్మమనియు, నిరుతెఱగులచే భిన్నమైయున్నది. ప్రవృత్తి కర్మము సంసారమును, నివృత్తికర్మము మోక్షమును గలుగజేయును.

**ఇహ చాముత్ర వా కామ్యం ప్రవృత్తం కర్మ కీర్త్యతే ।**
**నిష్కామం జ్ఞానపూర్వం తు నివృత్త ముపదిశ్యతే ॥**

ఈ లోకంబున వర్షము మున్నగువానికి గారణమును, స్వర్గము మున్నగు వాని గలిగించునదియునగు కర్మము ప్రవృత్త కర్మమనబడును. ఇహఫలముగాని అముష్మిక ఫలముగాని లేక, బ్రహ్మజ్ఞానము నలవరించుట వలన సంసారనివృత్తి హేతువగు కర్మము నివృత్త కర్మమనబడును. మఱియు శ్రీకృష్ణభగవానుడు శాస్త్రమందు చెప్పబడిన యజ్ఞాదికర్మలను అనగా సంసార సంబంధకర్మల నెంతదూషించి యున్నాడో చూడుడు–

**యా మిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః ।**
**వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః ॥**

ఓ ఫల్గుణా! ఆత్మశుద్ధి పరమగు ఆచరణ లేనివారై వేదార్థ తత్త్వము నెరుంగజాలక, కర్మశాస్త్రములను జదివి పండితులమని తలంచువారు వేదవాక్య ములయొక్క, అర్థవాదములయం దాసక్తులై విషయ సౌఖ్యము కంటెను, స్వర్గాది సుఖముకంటెను యితరమైనది లేదని చెప్పెడి స్వభావము గలవారగుచు, పామరులకు సంతోషమును గలుగజేయునవియు, వినినపుడు మాత్రము ప్రీతి గలుగ జేయునవియునగు నే వాక్యములను బాగుగ చెప్పుచున్నారో, అట్టివారికి ఆత్మజ్ఞానము నందు నిర్మలమైన బుద్ధి గలిగియుండదు. వారి వాక్యములు పూజ కుపయోగించనట్టియు, ఫలము ఉపయోగము కానట్టియు, చూచుటకు మాత్రము మహారమ్యముగా నుండునట్టి యెర్రబాడిశ పుష్పములవలె నుండునని గ్రహించ దగినది.

**కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్ ।**
**క్రియావిశేష బహులాం భోగైశ్వర్య గతిం ప్రతి ॥**

మరియు నా విద్వాంసులు విషయభోగపరులై యిహమందు స్రక్చందన వనితాది భోగములను, స్వర్గమునందు, రంభాద్యప్సరో విషయ సుఖములను కోరెడు స్వభావముగలవారై, జన్మమనెడి కర్మములయొక్క ఫలమును ఇచ్చు నట్టిదియు, భోగైశ్వర్యములను గూర్చి యనేక కర్మ భేదములు గలదియయిన యేవాక్కును చెప్పుచున్నారో, అట్టివారి కాత్మ నిష్ఠయందు నిశ్చయాత్మకమగు బుద్ధి యుండదు.

**భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్।**
**వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే॥**

ఇట్లు కామాసక్తులై స్వర్గాది సుఖమే ప్రధానఫలమని తలచి విషయసుఖమును గోరి వానియందే చెల్లిన మనస్సుగలవారై అట్టి విషయసుఖములచేత నపహరింపబడిన మలిన హృదయముగలవారై

యుండువారికి ఆత్మజ్ఞాన నిశ్చయమందు ధృఢమైన నిష్ఠగాని, ఆత్మానుభవముగాని గలుగదు. వారి వాక్యములన్నియు ఫలసహితమును, సుగంధమును, పూజార్హమును కానట్టివై చూచుటకు రమ్యములగు మోదుగ పుష్పములవలె నుండును.

**త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవాఽర్జున।**
**నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥**

అయ్యా అర్జునా వేదములు త్రిగుణములతో గూడిన సంసారమే విషయముగా గలవి. కావున నీవు త్రిగుణముల కతీతమగు బ్రహ్మతత్త్వమును బోధించెడు వేదాంతమును ఆలంబనము చేయుము. శీతోష్ణాది ద్వంద్వములు లేని వాడవును, సర్వకాలములయందును సత్త్వగుణము నాశ్రయించిన వాడవును, యోగక్షేమముల నయితము కోరనివాడవును, ఆత్మజ్ఞానము గలవాడవుగను కమ్ము. వివేకవంతుడవగు సోదరా! ఈ చెప్పిన వాక్యములు శాస్త్రప్రమాణములు కావా! శాస్త్రములోగల కర్మమార్గమును, జ్ఞానమార్గమును తెలియనందుచేతనే మీరు చెప్పిన శాస్త్రాతిక్రమణము గలుగునని యేర్పడుచున్నది. ఇదివరలో ఎన్ని శాస్త్రములు మీసమక్షములో తెలుపబడినవో, యవి శాస్త్రములు కావా? అయితే అసచ్ఛాస్త్రీయమగు కల్పితశాస్త్రములను విడిచి, అకల్పితమగు సచ్ఛాస్త్రమును తెలుపడమైనది. అట్లు గానిచో, కేవలము మోహమును కలిగించెడు కర్మశాస్త్రమును విడిచి, నిర్మోహకారియగు జ్ఞానశాస్త్రమును తెలిపితిమి. అంతే గాని శాస్త్రసమ్మతము గాని యొక వాక్యమునైనను తెలిపి యుండలేదు. మఱియు

**తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం**
**క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి।**
**ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా**
**గతాగతం కామకామా లభంతే॥**

స్వర్గమును గోరువా రొకవేళ, పుణ్యకర్మ విశేషముచే కొంతకాలము స్వర్గలోకములో నుండినను, అట్టి సుఖము ననుభవించి పుణ్యము క్షీణించినదగుచుండగా భూలోకమును బొందుచున్నారు. ఇవ్విధముగ గుణత్రయములు ప్రతిపాలింపబడిన కర్మమును ఆశ్రయించినవారై విషయసుఖములను గోరువారు జనన మరణముల బొందుచున్నారు. అనగా ఇహమునుండి పరమునకును, పరమునుండి యిహమునకును కపిలతోలు, త్రాడునందు కట్టబడిన బాన పైనుండి క్రిందకును, క్రిందనుండి పైకిని బోవుచున్నట్లు సదా జననమరణములగు సంసారచక్రములో తిరుగుచుందురు. ఈ యజ్ఞవిషయమై శ్రీబుద్ధదేవుడు, యాజకులతో నొక ప్రశ్న చేసినారు. అదేమన, పాపకరమగు పశుహింసచేసిన పుణ్యమగు స్వర్గమెట్లు లభించును? ఒకవేళ, స్వర్గప్రాప్తి గలిగినా కలుగుగాక! అచటనుండు రంభాది దేవతా స్త్రీలను, మీతండ్రిగాని, గురుడుగాని, యజ్ఞముచేసి పొందియుండినచో వారు మీకు పినతల్లులుగాని, లేక గురుపత్నులుగాని కావలయునుగదా! మాతృగమనము, గురుపత్నీ గమనము ఎట్టి పాపమో, దానిని యోచించుటకైన మికు ప్రజ్ఞ లేకపోయినదా! యని బింబిసారుని యజ్ఞమందు వచించి దీనికి ప్రత్యుత్తరమును చెప్పక, సాధుజంతువులను హింసింపగూడదని ధీరుడై నిలిచెను. బౌద్ధయుగమునుండి, నేటివరకు దీనికి భూలోకమున ఏప్రక్కనుండియు సమాధానము రాలేదు. మఱియు మనము శ్రేష్ఠులైనవారి నెవరినైన యాహ్వానించి భోజన సత్కారము చేయతలచినచో, శ్రేష్ఠతకు తగిన యుత్తమాహారాదులచే సత్కరింపక నీచులు భుజించెడు, నికృష్టాహారాదులచే అవమానపరచ వచ్చునా? అలాగున మనుజులకన్న శ్రేష్ఠులగు ఇంద్రాది దేవతలను వేదమంత్రములచే ఆహ్వానించి అగ్నిముఖము ద్వారా ఆహుతి యిచ్చునపుడు నీచమైన మాంసమును, పాపమైన మద్యమును ఉపయోగపరచవచ్చునా? ఇదియేనా దేవతాహారము? దేవతల కమృతము గదా ఆహారముగా విధింపబడినది.

మద్యమాంసములు రాక్షసుల యాహారములుకావా? ఇంతమాత్రమైన యోచించుటకు శక్తిలేని యజ్ఞకర్తల మనీషా విశేషమేమని చెప్పవచ్చును! దేవతలకన్న తక్కువ జన్మగల మానవులలో గల శ్రేష్ఠపురుషు లెవరును మధుమాంసముల భుజింపరు. నికృష్టులే మధుమాంసముల భుజింతురు. మరియు మానవులకన్న మరింత తక్కువ జన్మములో గల పశువులలో శ్రేష్ఠజాతి యని చెప్పబడు గోవు, అశ్వము, గజము మొదలగు జంతువులు హింసచేయుట గాని, మాంసమును భుజించుట గాని చేయుటలేదు. హీనజంతువులగు కుక్కలు, నక్కలు, తోడేళ్లు మాత్రమే ఇతర ప్రాణుల హింసించుచు మాంసమును భుజించుచున్నవి. అట్లుండగా పశువులకన్నను మనుజుల కన్నను శ్రేష్ఠులగు దేవతల కాపశుహింసా కరమగు మాంసమును, సోమలతా కృతమగు మద్యమును ఇచ్చుచున్నారు. గీతలో నాల్గవ అధ్యాయమున చతుర్దశ విధములగు యజ్ఞములలోను, తైత్తిరీ యోపనిషత్తులో వర్ణించిన యజ్ఞములలోను ఇట్టి పాపకరమగు హింస యేదైన గలదా? వేదఋక్కు యొక్క అర్థమును చక్కగా తెలిసికొనెడు శక్తిలేనివారును, విషయులు నగువారును వేదభాష్యమును చేయుటచేతనే యిట్టి విపరీతార్థము గలిగెను. ఋషులు నిర్మించిన ఋక్కులకు సామాన్య జనులు అర్థము వ్రాయుటచేతనే యనర్థము గలిగినది. ఋషులవంటి నిర్మల ప్రజ్ఞగల వారికే వేద మంత్రమున కర్థము గోచరమగును. దయానందస్వామిగారు వ్రాసిన యర్థము చాల వఱకు మేలైనదనియే పండితుల యభిప్రాయము.

బ్రా:– పూర్వము వేదముల కర్థము వ్రాసినవారు సరిగా తెలియనివారై నను ఇటీవల యేర్పడిన శ్రీ శంకర, శ్రీరామానుజ, శ్రీమధ్వాచార్య, శ్రీవిద్యారణ్య ప్రభృతులు గొప్ప మహాత్ములును, దివ్యపురుషులును గారా! వారు గూడ యజ్ఞయందు పశుహింసను అంగీకరించుచు వచ్చిరి గదా?

అ:– మీరు పేర్కొనిన శ్రీ శంకరాచార్య ప్రభృతులలో అందరును

పశు హింసాపరమగు యజ్ఞము నంగీకరించి యుండలేదు. ఒకవేళ మతాచార్యులు అంగీకరించియున్నారను వాదమును నిలబెట్టుటకు బ్రహ్మప్రయత్నము చేసినను అదిన్ని గొప్ప సంగతి గాదు. ఈ మతాచార్యులు యజ్ఞాది కర్మకాండములను సంస్కరింప బూనలేదు. వారు ఈశ్వర సాక్షాత్కారజ్ఞాన విషయములోగల సందేహములను నివర్తింపజేయుటకే యత్నించిరి. అందువలన వారిపై ఈ దోషమును ఆరోపింపదగదు. ఒకవేళ అంగికరించి యున్నారని చెప్పినను, కొన్ని కొన్ని విషయములు పరంపరగా వచ్చెడివాటిని ఆచరణలో పెట్టుకొని వచ్చుట గలదు.

అది వారి ముఖ్యోద్దేశ్యము గాదు. లేక మూలమునకు మొదట నెవరు అర్థమును వ్రాసిరో దాని ననుసరించి చెప్పుటగూడ లోకములో వాడుకగలదు. వారి వారి ముఖ్యోద్దేశములో మాత్రము దృష్టినుంచి సంస్కరింపదగిన దానిని సంస్కరించి సిద్ధాంతము చేయుచుందురు. శంకరులు యజ్ఞములను నిరసించినారు. రామానుజులు భగవదారాధనకన్న, మరి యే కర్మమును చేయకూడదని విధించిన వారు. మధ్వులు హింసాపరమగు యజ్ఞము పాపమని తలంచి విడిచిపెట్టి పిష్టయజ్ఞముచేయ విధించిరి: ఇందువల్లనే పశుహింసాయజ్ఞము వేదవిరుద్ధమని అర్థమగుచున్నది. అట్లు కాదని వాదించినను బాధకరములేదు. ఏలన! లోకము ''గతానుగతముగ'' వర్తించెడు స్వభావము గలిగియుండును. దీనికొక దృష్టాంతమును దెలిపెద. ఆదిశేషుని సహస్రశిరములలో నొకదానిచేత ఈ భూగోళము ధరింప బడుచున్నదని శాస్త్రములలో చెప్పబడిన వాక్యముపై నాధారపడి, పైజెప్పిన ముగ్గురు ఆచార్యులెగాక, అనేక పండితులుగూడ ఆలాగుననే యంగీకరించి భగవంతుని స్తోత్రములు చేసియున్నారు. ఎన్నియో చిత్రములుగూడ వ్రాయించుచున్నారు. గొప్ప దేవాలయములలోగూడ శ్రీ విష్ణుమూర్తి శయన విగ్రహముల పై ప్రకారము నిర్మించి పూజించుచున్నారు. ఇపుడు ఆదిశేషుడే తన సహస్ర ఫణములలో నొకదానివల్ల యీ భూమిని ధరించుచున్నాడని యెవ్వరైన చెప్పగలరా? చెప్పినను వినువారుందురా? ఏలన,

వర్తమానకాలమున భూగోళమంతయు చుట్టి సంచరించువారు గలరు. అందువల్ల దీనిని నమ్మువారుండరు. భూగోళమంతయు చుట్టి సంచరించి సత్యము నెఱుంగ సాధ్యముగాని కాలమొకటి యుండెను. అందువల్ల ఈ విషయమై ఆలోచింపకపోయి యుండవచ్చును. అంతేగాదు. శ్రీ శంకరాది మతత్రయాచార్యులు దృశ్యమానమగు ఈ ప్రపంచమును గురించి యెక్కువ విమర్శింపబూనలేదు. ఏలన, వారి దృష్టిలో నిది మిథ్యగానే కనబడుచుండెను. వారు శాశ్వతమగు ఈశ్వర విషయములోనే కాలము గడుపు స్వభావముగలవారై యుండిరి.

సర్వేశ్వరుని అనంతశక్తిలో నొక శక్తివలననే యీ భూలోకము ధరింపబడు చున్నదను అర్థమే అనంతుని సహస్రవణములలో నొకదానిచే యీ భూగోళము ధరింపబడుచున్నదని అర్థమగును. ఇచట సర్వేశ్వరు డనంతుడనియు, అనంతశక్తిలో ఏకశక్తివల్లనే యీ జగద్భరణము జరుగుచున్నదనియు గ్రహించదగును. కనుకనే ''నమోఽస్త్వనంతాయ సహస్రమూర్తయే, సహస్రపాదాక్షి శిరోరుబాహవే'' అని వర్ణించుటకు కారణమైనది. ఇదే సమంజసమైన అర్థము. ఇదివరలో చాతుర్వర్ణ్య విభాగమెట్లు ఏర్పడినదను విషయమై భారతములోగల భృగు భరద్వాజుల సంవాదమున వివరించడమైనది. గీతయందు షోడశాధ్యాయమున ఈశ్వర సృష్టిలో ఆర్యులనియు, దస్యులనియు రెండు జాతులు మాత్రమే యుండిరనియు, వీరెనే దైవాసురులుగా శాస్త్రములో వర్ణించిరనియు తెలుపడమైనది. దైవాసుర సంపద్విభాగ యోగమున ఇట్లు వర్ణించుటచే, దైవగుణము గలవారు దేవతలనియు. అసుర గుణము ( రాక్షస గుణము) గలవారు అసురులు, లేక రాక్షసులనియు పురాణములలో వర్ణించిన దానిలో నిక సందేహము లేదు. ఈ దైవగుణమును, అసుర గుణమును గీతలో 16వ అధ్యాయమున భగవంతుడే వర్ణించియున్నాడు. ఆ కాలమున రెండుజాతు లేర్పడుటకు ముందుగా, ఏక జాతియే యుండినట్లు భృగు భరద్వాజుల సంవాదమునందు

నిరూపింపబడెను. తరువాత రెండు జాతులుగాను, మరి కొంతకాలము గడచిన తరువాత నాలుగు జాతులుగాను విభాగ మేర్పడెను. బహుకాలము జరిగిన తరువాత బ్రాహ్మణస్త్రీ యందు శూద్రునకు జన్మించినవాడు పంచముడని పంచమజాతి యేర్పడినట్లు శాస్త్రములలో విశదీకరింపబడినది. ఈయైదుజాతులలో గల స్త్రీ పురుషులకు పరస్పర సంబంధము గలిగి పుట్టినవారే అనేక జాతులవారైరి. మనుస్మృతి, సూత సంహితాది గ్రంథములలో ఎవరెవరి సంకరము వల్ల, యేయే జాతి యేర్పడినదో స్పష్టముగ వర్ణించబడినది. ఇది చాలవరకు యుక్తియుక్తముగా నుండునని తోచుచున్నది. కాని బ్రాహ్మణ స్త్రీ యందు శూద్రునకు జన్మించినవాడు పంచముడని చెప్పుటలో ఏలాటి సమన్వయార్థము లేదు. ఏలన, సంకరముచే పుట్టిన శిశువు ఒకవేళ తల్లి జాతిగాని తండ్రిజాతిగాని యుండును. బ్రాహ్మణ స్త్రీ యందు శూద్రునకు జన్మించిన వాడు పంచముడని చెప్పినచో ఇపుడుగూడ నావిధముగ ననేకులు జన్మించుచున్నారు. వారు పంచములలో చేరుటగాని, వారిని పంచములని పిలుచుటగాని లోకములో సంప్రదాయము లేదు. ఈ విషయమై భారతదేశ చరిత్రమే సరియగు మార్గమును జెప్పుచున్నది. ఆర్యులీదేశమునకు వచ్చుటకు ముందుగా, ఆదిమనివాసులై యుండువారే పంచములుగా ఏర్పడియుండవచ్చును.

ఆర్యులు శ్రేష్ఠులు, విజ్ఞానవంతులు, తేజోరూపులుగా నుండిరి. ఆర్యులు కాని వారిని అనార్యులుగాను ఆదిమాంధ్ర, ఆది ద్రావిడ ఇత్యాది దేశములకు సంబంధించిన పేర్లతో పిలువసాగిరి. ఇపుడుగూడ చాతుర్వర్ణ్యస్థుల ఆచార ఆహార వ్యవహారములకును, ఆదిమవాసుల ఆచార ఆహారవ్యవహారములకును ఎంతో మార్పు గనబడుచున్నది. ఆర్యులు ఆదిమవాసులను సంస్కరించి తమలో చేర్పకనే కడగా నుంచినందుచేతనే యింత వైషమ్యమేర్పడినది. అయితే ఈ విషయము చరిత్రకారులకు వదలి

వేయడమైనది. చరిత్రకారులు వ్రాసిన దానిలోను ఒకదానికి మరియొకటి సంబంధ పడకనేయున్నది. పాశ్చాత్యులు వ్రాసిన భారత దేశచరిత్రముకన్న భారతదేశములో జన్మించిన వారు వ్రాసిన చరిత్రమే చాలవరకు నిజమును తెలుపుచుండును. అయినను బ్రాహ్మణ, బ్రాహ్మణేతర పక్షపాతము గలవారు వ్రాసినచో నిదియును సత్యముగా నుండదు. అట్టి ద్వేషబుద్ధి లేనివారు వ్రాసియుండినచో బాగుండును. లేనిచో ''బ్రాహ్మణో౽స్యముఖమాసీత్'' అను శ్రుతివాక్యమునకు పరమేశ్వరుని ముఖ, బాహూరు, పాదములనుండి బ్రాహ్మణాది నాలుగు జాతులు జన్మించునట్లు పనికిమాలిన అర్థమునే చెప్పెదరు, ఇంతకంటె అన్యాయమైన, అనర్థకరమైన అర్థము మరియొకటి గలదా? దాని కేదైన యుక్తి గలదా! జీవులు ఈశ్వరాంశులనియు, ఈశ్వరునివలె అనాదులనియు లేక యీశ్వర స్వరూపులనియు చెప్పెడు శ్రుతివాక్యములకు, పైజెప్పిన యర్థమునకు నేమైన సంబంధముండునా? ఈ విషయమై ఇదివరలో శ్రుతికాండమున వివరించి యుండుటచే యిచట మరల జెప్ప తలంచలేదు.

భృగురువాచ:–

న విశేషో౽స్తి వర్ణానాం సర్వం బ్రహ్మమయం జగత్ ।
బ్రహ్మణా పూర్వసృష్టం హి కర్మభిర్వర్ణతాం గతమ్ ॥

సృష్ట్యారంభమున జాతి విభాగము గలిగి యుండలేదు. బ్రాహ్మణులు మాత్రమే యుండిరి! వారకే '' ఆర్యులను ''పేరు గలిగియుండెను. బ్రహ్మచే ఈలాగున ఆదిలో సృష్టి యేర్పడెను. తరువాత జనులయొక్క గుణముల ననుసరించి వర్ణవిభాగములు గలిగెను. ఇదియెంతో సమంజసముగా నున్నది. ఈ విషయమై శ్రీకృష్ణభగవానుడు చెప్పినపుడు పై జెప్పిన యేకవర్ణములో గుణముచే రెండువర్ణము లేర్పడి యుండెను.

**ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ అసుర ఏవ చ।**
**దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ ! మే శృణు॥ (గీత. అ.16)**

ఈ లోకమందు దేవతా సంబంధమయిన గుణములు గలవారనియు, అసుర సంబంధమయిన గుణములు గలవారనియు సృజింపబడిన మనుజాలు రెండు విధములుగా నున్నారు. దేవతా సంబంధ గుణముగలవారి సృష్టి యీ యధ్యాయమున మొదటి మూడు శ్లోకములలో గుణములతో వర్ణింపబడినది. అసుర సంబంధ గుణము గలవారి సృష్టి యిక వినుము. అనగా నీ యధ్యాయమున 4వ శ్లోకమునుండి అధ్యాయాంతము వరకు అసుర గుణము గలవారిని వర్ణించి యున్నాడు. ఈ యిరుతెగలు బహుకాలమునుండి యుండిన తరువాత, ''చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః''– అప్పటికి ఆర్యులలో జనసంఖ్య వృద్ధియై వచ్చునప్పటికి, గుణకర్మములుగూడ అనేకములయి యుండుటవల్లను, వ్యవహారములు జరుగవలసి వచ్చుట వలనను, నాలుగు జాతులుగా విభాగము చేయవలసి వచ్చెను. తరువాత సాంఖ్య, జైన, బౌద్ధ, శైవ, వైష్ణవాది యిప్పటివరకు గల జాతులన్నియు, మతములన్నియు నేర్పడెను. ఇంకను ఎన్నియో విభాగములు ఏర్పడునపుడు అవియు నొక్కొక్క జాతులుగా నేర్పడగలవు. దీనిని గురించియు ఇదివరలో జెప్పియుండుటచే విస్తరింపబూనలేదు. శ్రీకృష్ణభగవానుడు 'ద్వౌభూత సర్గౌ లోకేఽస్మిన్' అని చెప్పిన దానికి, ఉద్గీథ బ్రాహ్మణ శ్రుతియును ఆలాగుననే యుంటున్నది.

''ద్వయా హ ప్రాజాపత్యా దేవాశ్చాసురాశ్చ'' రెండువిధములగు ప్రజల సృష్టియే గలదు. అది అసుర స్వభావముగలదనియు, దేవతా స్వభావముగలదనియు గ్రహించదగినది. ఇక నారద భక్తిసూత్రమందు గల కొన్ని వాక్యములను తెలిపెద.

**సూ॥ తత్తు విషయాత్యాగా త్సంగత్యాగాచ్చ.**

ఆ భక్తి, విషయత్యాగము వలనను, సంగత్యాగము వలనను గలుగును. అనగా బంధవిముక్తియు, దైవప్రాప్తియు గలుగవలసియుండిన, ఎవరికైనను ఇట్టి స్థితిగలిగి యుండవలయును.

**తస్మింఀ స్తజ్జనే భేదాఽభావాత్.**

ఏలననగా భగవంతుడు తన భక్తులయం దెంత మాత్రమును భేదము లేనివాడై యున్నాడు.

**స తరతి స తరతి స లోకాంస్తారయతి.**

వాడే సంసారసాగరమును దాటును. వాడే యజ్ఞానమును దాటును. అట్టివాడు తాను దాటునదేగాక, లోకమునుగూడ దాటించును.

**సూ॥ నాస్తి తేషు జాతి, విద్యా, రూప, కుల, ధన క్రియాది భేదః**

భగవద్భక్తులకు జాతి, విద్య, రూపము, కులము, ధనము, కార్యములు మొదలగు భేదములు లేవు.

**సూ॥ అహింసా సత్య శౌచ దయాఽస్తిక్యతాది
చారిత్రాణి పరిపాలనీయాని.**

అహింస, సత్యము, శుచి, దయ, ఆస్తిక్యము మొదలగు, మంచి నడవడికలను రక్షింపవలయును. ఇక నాపస్తంభ మునీంద్రులు తన ధర్మశాస్త్ర మందు తెలిపినదానిని చూడుడు.

**వసూ॥ ధర్మచర్యయా జఘన్యో వర్ణః పూర్వం పూర్వం వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ.**

ధర్మానుష్ఠానముచే నిమ్నజాతియందుండువాడు పై జాతిలోనికి ప్రవేశించుచున్నాడు. జాతి, గుణాగుణములచే ఘటీయంత్రమువలె నూర్ధ్వాధోభాగములకు తిరుగుచుండును.

**మూ॥ అధర్మచర్యయా పూర్వో వర్ణో జఘన్యం జఘన్యం వర్ణ మాపద్యతే జాతిపరివృత్తౌ.**

అధర్మ ప్రవృత్తివల్ల ఉన్నత జాతియందుండువాడు నిమ్నవర్ణమును బొందుచున్నాడు. జాతియనునది చక్రము యొక్క ఆకులవలె, గుణాగుణముల ననుసరించి క్రిందికిని, పైకిని తిరుగుచుండును. అనగా సద్వృత్తివల్ల, తక్కువజాతియందుండు వాడెక్కువ జాతిలోనికిని, దుర్వృత్తివల్ల యెక్కువజాతి యందుండువాడు తక్కువజాతిలోనికి వెళ్ళుచుండును. కొందరు పుట్టిన కులాభిమానముగల పండితులు ఈమార్పు ఈ జన్మమున గలుగునది కాదనియు, జన్మాంతరములో గలుగుననియు శుష్కార్థమును జెప్పుదురు. అది సత్యమునకు దూరమైన వాక్యము. నహుషుడను రాజు, ధర్మగుణములచే ఆ జన్మములోనే దేవతల కధిపతి యయ్యెను. అచట స్వర్గలోకములో తన స్థానమును నిలుపుకొనజాలక దుర్వృత్తిగలవాడై ఋషుల శాపమువలన అజగరమై భూమిలో పడెను. ఈ చరిత్రము భారతమున సువిస్తరింపబడినది. ఈ మనుజుడొక జననములోనే దేవత్వమును బొందుటయు, మరల నాజన్మములోనే తిర్యగ్జన్మము గలిగిన వాడగుటయు ప్రత్యక్షమయ్యెను. దీనికన్న నిక సాక్ష్యమేమి కావలయును? కావున శ్రద్ధానుష్ఠానములు గలిగిన యెడల అంత్యజాతి యందుండు వాడుగూడ, అగ్రజాతిని ఈజన్మలోనే పొందగలుగును. ఆలాగున అగ్రజాతియందుండు వాడైనను దుష్టాచారము గలిగి వర్తించిన, యీ జన్మములోనే అంత్యజాతిలోనికి చేరగలుగును. ఇట్టి సంస్కరణము చేయువారు రాకపోవుటచేతనే యున్నతజాతి చెడుటకును, నిమ్నజాతి యున్నతస్థితికి

కాకపోవుటకును కారణమైనది. ఇదే సత్యమైన జాతియొక్క స్వరూపము.

**సంసారార్ణవ మగ్నానాం జంతూనా మవివేకినామ్ ।**
**అగతీనాం గతిస్సాక్షా దాద్జ్ఞానమేవ హి కారణమ్ ॥**

జననమరణ రూపమగు సంసార దుఃఖసాగరములో నిమగ్నులైన ప్రాణులకును, జ్ఞానములేనివారికి, ఏగతియు లేనివారికిని, సాక్షా దాత్మజ్ఞానమే గతి యగును. అనగా జ్ఞానమే సంసారసాగరమును తరించుటకు నావ యని భావము.

**జ్ఞానయజ్ఞోడుపేనైవ బ్రాహ్మణోఽప్యంత్యజోఽపి వా ।**
**సంసారసాగరం తీర్త్వా ముక్తిపారం హి గచ్ఛతి ॥**

జ్ఞానవమనెడు ఓడవలన, బ్రాహ్మణుడైనను, అంత్యజుడైనను దుఃఖరూపమగు సంసారసాగరమునుండి తరించి యిచ్చటనే మోక్షము చేరును.

**అస్తిచే ద్బ్రహ్మవిజ్ఞానం స్త్రియో వా పురుషస్య వా ।**
**వర్ణాశ్రమసమాచార స్తస్య నాస్త్యేవ సర్వదా ॥**

బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము స్త్రీకైనను, పురుషునికైనను గలిగినచో అట్టివారికి వర్ణాశ్రమ సమాచారమును గురించి యేమియు సంబంధము లేదు.

**తండులస్య యథాచర్మ యథా తామ్రస్య కాలిమా ।**
**నశ్యతి క్రియయా పుత్ర! పురుషస్య తథా మలః ॥**
**జీవస్య తండులస్యేవ మలం సహజమప్యలమ్ ।**
**నశ్యత్యేవ న సందేహ స్త స్మాదుద్యమవాన్భవ ॥**

యోగవాసిష్ఠమందు వసిష్ఠులు శ్రీరాముల కొరకు కిట్లుపదేశించిరి. జీవునకు కర్మ లేక అవిద్య లేక వాసన, ఒకవేళ స్వభావముగా నుండినను పురుష

ప్రయత్నమువలన దానిని నశింపజేయవచ్చును. బియ్యమునకు పుట్టుకలోనే యుముకయు, తౌడును, రాగికి నుత్పత్తిలోనే చిలుమును గలిగియుండినను, యేలాగున వడ్లను దంచుటచేతను, తామ్రమును స్ఫుట మొనర్చుటచేతను దోషములు లేని వగుచున్నవో, ఆలాగున పురుషప్రయత్నముచేత జీవునియొక్క మాయయు నశించును. ఈ విషయములో సంశయింపకుము. అందువలన ప్రయత్నవంతుడవు కమ్ము.

**బ్రాహ్మణ క్షత్రియ విశాం స్త్రీ శూద్రాణాం చ పావనమ్ ।**
**శాంతయే కర్మణా మన్న ద్యోగాన్నాస్తి విముక్తయే ॥**

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, స్త్రీ శూద్రాదులలో నెవరికైనను ఆత్మత్యాగ జ్ఞానయోగము తప్ప సమస్తకర్మలు నశించుటకును, జీవన్ముక్తి గలుగుటకును వేరు మార్గము లేదు. ఇందువల్ల సర్వజనులకును బ్రహ్మవిద్య కధికారము గలదనియు, జ్ఞానమందును, యోగమందును అర్హత గలదనియు, రూఢి యగుచున్నది.

**నైవ స్త్రీ న పుమానేష నై వచాయం నపుంసకః।**
**యద్య చ్ఛరీరమాదత్తే తేన తేన స యుజ్యతే॥**

ఈ యాత్మ పురుషుడును గాదు, నపుంసకుడును గాదు, స్త్రీయును గాదు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాది జాతులతో సంబంధించినదిగాదు, బ్రహ్మచర్య, గృహస్థ, వాన ప్రస్థ యత్యాశ్రమములతో గూడినదియును గాదు. ఏ యే శరీరమును గ్రహించినను దానికి విలక్షణమై, సాక్షియై, శివమై, అమృతమయముగా నుంటున్నది, ఈ సత్యమును గ్రహించినచో, ఆత్మ అన్నిటిలోను ఒకేవిధముగానే యుండునను సత్యము బోధపడగలదు. దీపమునకు ప్రకాశమే స్వభావమై యుండినను, ఏ యే రంగులతోగాని, ఆకృతులతోగాని, చేరినపుడా యావర్ణములును,

ఆకారములును గలిగి యున్నటుల ఏవిధముగ తోచునో, ఆత్మయొక్క యథార్థస్థితియు నా లాగుననే యుండును. ఇట్టి యాత్మను గురించి బోధించుటయే, జ్ఞానోదయమగును. అట్లు ఆత్మను గురించి తెలుపక దేహాదివర్ణాశ్రమముల గురించి చెప్పెడు వాక్యములు, అజ్ఞాన బోధకములే యగును. దీనివల్ల బాధ గలుగునే గాని బోధ గలుగదు. శ్రీ జగద్గురు శంకర భగవత్పాదులు జాతిని గురించి మనీషా పంచకమందు ఎట్లు చెప్పియున్నారో దానిని తెలిపెద.

**సత్యాచార్యస్య గమనే కదాచి న్ముక్తిదాయకమ్।**
**కాశీ క్షేత్రం ప్రతి సహ గౌర్యా మార్గేతు శంకరమ్ ।**
**అంత్యవేషధరం దృష్ట్వా గచ్ఛ గచ్ఛేతి చాబ్రవీత్।**
**శంకరః సోఽపి చండాల స్తం పునః ప్రాహ శంకరమ్ ॥**

ఒకానొకప్పుడు మోక్షము నిచ్చునట్టి, కాశీక్షేత్రమున శ్రీ శంకరాచార్యులు వెళ్ళుచుండగా, మార్గ మధ్యమున ముదుసలి వేషము ధరించిన పార్వతిని, చండాల వేషము ధరించి మహావృద్ధుడుగా గనిపించు నట్లుండు పరమశివుని చూచి శంకరాచార్యులు తొలగుము, తొలగుము అని చెప్పగా చండాలవేషధారియగు ఆ పరమశివుండు శంకరాచార్యులతో ఇట్లు వచించెను.

**అన్నమయాదన్న మయం హ్యథవా చై తన్యమేవ చైతన్యాత్ ।**
**ద్విజవర దూరీకర్తుం వాంఛసి కిం బ్రూహి గచ్ఛ గచ్ఛేతి ॥**

ఓ ద్విజశ్రేష్ఠుడా ! మీ శరీరము ఏలాగున అన్నమయమగు శుక్లశోణితములతో గూడినదో ఆలాగున, నా శరీరమున్ను పంచభూతాత్మక మగు అన్నమయమే. ఆలాగున చైతన్యాత్మ నీయందును, నాయందును ఒకటియే. కావున దేనిని తొలగు తొలగు అని చెప్పుచున్నావు. దీనిని నాకు చెప్పుము అని అంత్యజ వేషము ధరించిన సాక్షాత్ పరమశివుడు చెప్పిన

వాక్యములు విని, శ్రీశంకరాచార్యులు దివ్యదృష్టితో చూడగా ఆ వేషధారులు శ్రీ పార్వతీ పరమేశ్వరు లని యెరింగి యిట్లు బదులు చెప్పిరి.

**కిం గంగామ్బుని బింబితేఽమ్బరమణౌ చండాలవాటీపయః**
**పూరే చాన్తరమస్తి కాంచన ఘటీ మృత్కుమ్భయోర్వామ్బరే।**
**ప్రత్యగ్వస్తుని ని స్తరంగసహజానందావబోధామ్బుధౌ**
**విప్రోఽయం శ్వపచోఽయమిత్యపి మహాన్ కోఽయం విభేదభ్రమః ?॥**

సువర్ణపాత్రయందు గంగాతీర్థము నిండజేసినను దానిలో గల సూర్య ప్రతిబింబమునకును, మట్టిపాత్రయందు అంత్యజాతులు నివసించెడు స్థలములో గల జలముచే నింపిన దానియందు ప్రతిబింబించెడు సూర్యప్రతిబింబమునకును ఏలాగున కొంచెమైనను భేదము గలుగదో, ఆ జలముయొక్క శుద్ధాశుద్ధములు ఏలాగున సూర్యునకు గలుగవో, సూర్యబింబ మేలాగున స్వచ్ఛప్రకాశమైయుండునో లేక ఈ రెండు పాత్రలలో ఏకమై వ్యాపించియుండు నాకాశమునకు మంచి చెడు దోషములు అంటవో, ఆలాగున నిస్తరంగ సముద్రమువలె నాత్మసాక్షాత్కార జ్ఞాన సాగరముగా గల స్థితిలో వీడు బ్రాహ్మణుడు, వీడు అంత్యజుడు అను భేద మెక్కడిది? అట్టి భేదము మాయా భ్రమయే గాని మఱియొకటి గాదు.

**జాగ్రత్స్వప్న సుషుప్తిషు స్ఫుటతరా యాసంవిదుజ్జృమ్భతే**
**యా బ్రహ్మాది పిపీలికాన్త తనుషు ప్రోతా జగత్సాక్షిణీ।**
**సైవాహం న చ దృశ్యవ స్త్వితి దృఢప్రజ్ఞాపి యస్యాపి చే**
**చ్చండాలోఽస్తు స తు ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ॥**

జాగ్రత్స్వప్న సుషిప్తులనెడు అవస్థాత్రయములకు సాక్షియై, యే సంవిత్స్వరూపమగు నాత్మ వెలుగుచున్నదో, బ్రహ్మాది పిపీలికాంతము గల సకల ప్రాణికోట్ల చైతన్యము మణిలో సూత్రమువలె గ్రుచ్చబడుచున్నదో,

ఆ జగత్సాక్షి యగు నాత్మయే తాను కాని, యీ దృశ్యవస్తువేదియును గాదని యెవనికి అట్టి దృఢ ప్రజ్ఞగలిగి యుండునో అట్టి వాడు చండాలుడైనను, లేక ద్విజుడైనను వాడు నా యొక్క గురుడని నాయొక్క మనో నిశ్చయము. ఇచట కూడ గుణమును గురించి జాతి తెలుపడమైనది.

**బ్రహ్మైవాహమిదం జగచ్చ సకలం చిన్మాత్రవిస్తారితం**
**సర్వం చై త దవిద్యయా త్రిగుణయా శేషం మయా కల్పితమ్ ।**
**ఇత్థం యస్య దృఢా మతిః సుఖతరే నిత్యే పరే నిర్మలే**
**చండాలోఽస్తు స తు ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ ॥**

నేను చైతన్యాత్మయగు బ్రహ్మయేగాని, యీ పంచభూతాత్మకమగు దేహము గాదు. ఇవన్నియు అజ్ఞాన స్వరూపమగు బ్రహ్మముచే వ్యాప్తములైనవి. త్రిగుణాత్మకమైన మాయవల్ల నీజగత్తు కల్పితము, ఈలాగున నెవనియొక్క మతి దృఢనిశ్చయము గలిగియుండునో, పరమై, నిర్మలమై, నిత్యమై, ఆనందమైయుండు నాత్మయందు యెవనికి నిలుకడ కలిగియుండునో, వాడు చండాలుడై నను లేక బ్రాహ్మణుడైనను నాయొక్క గురుమూర్తియనియే నానిశ్చయము.

ఈవిధముగా శ్రీశంకర భగవత్పాదులు ఐదు శ్లోకములచే స్తుతించడమైనది. దీనికే మనీషాపంచకమని పేరు. శ్రీ శంకరాచార్యులు గూడ జాతి భేదము మొదట గలిగి యుండెననియు, అట్టి భేదము మాయాకల్పితమనియు, బ్రహ్మవేత్తలగు జ్ఞానుల కుండకూడదనియు, పరమకారుణికుడగు పరమేశ్వరుడు తలంచి శ్రీ శంకరాచార్యులకు అట్టి భేదమును పోగొట్టుటకు అంత్యజవేషము ధరించి యిట్లు యుపదేశించడమైనదని పెద్దలు వచింతురు. ఈ విషయమై శ్రీశంకరుల ముఖ్యశిష్యులలో నొకరగు హస్తామలకాచార్యులు జెప్పినది చూడుడు.

**నాహం మనుష్యో న చ దేవయక్షో**
**న బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రాః ।**
**న బ్రహ్మచారీ న గృహీ వనస్థో**
**భిక్షుర్న చాహం నిజబోధరూపః ॥**

శ్రీశంకరాచార్యులు ''కస్త్వం శిశో'' ఓచిన్నవాడా నీవెవడవు? అని యడిగిన ప్రశ్నకు ఈ పైశ్లోకము జెప్పడమైనది.

నేను మనుష్యుడను గాను, దేవుడను గాను, యక్షుడను గాను, బ్రాహ్మణుడను గాను, క్షత్రియుడను గాను, వైశ్యుడను గాను, శూద్రుడను గాను ఆలాగున బ్రహ్మచారియును, గృహస్థుడను, వానప్రస్థుడను, సన్యాసియును గాను. ఇవన్నియూ మాయాకల్పితములు. సత్యమైన బోధ రూపమగు జ్ఞానమేది గలదో, అయ్యదియే నేను. ఇట్టి బ్రహ్మబోధము గలవాడై సన్న్యాసియును ధర్మబోధకు డగును. అట్టి వారేర్పడునపుడే లోకము తరింపగలుగును.

**ఓమ్.**

ఓమ్

# లోకోద్ధారకము

## విస్మృతి కాండము



**సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్।**
**వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి॥**

టీ॥ సర్వేషు=సమస్తములైన, భూతేషు=ప్రాణులయందు, సమం= సమముగా, తిష్ఠన్తం=ఉండునట్టి, పరమేశ్వరం=పరమేశ్వరుని, (సర్వేషుభూతేషు=సమస్తప్రాణులు) వినశ్యత్సు (సత్సు)=నశించిన వగుచుండగా, అవినశ్యన్తం = నశింపని వానినిగా, యః=ఎవడు, పశ్యతి= చూచుచున్నాడో, సః=వాడు, పశ్యతి=చూచుచున్నాడు.

(ఓ అర్జునా!) ఎవ్వడు బ్రహ్మాది స్తంబపర్యంతములగు సకల ప్రాణులయందును, అనగా, నశ్వరములయిన సకల చేతనా చేతనములయందును సమముగా నుండునట్టియు, దేహేంద్రియ మనో బుద్ధ్యాదులకంటె నితరుడు నగు పరమేశ్వరుని సర్వము నశించినను, నశింపని వానినిగా నెఱుంగుచున్నాడో వాడే చూచువాడు. ఇతరుడు జూచువాడు గాడు. (గీత).

నేత్రము లున్నప్పటికి సర్వత్ర సమానముగానుండు, సర్వేశ్వరుని జూడనివాడు, నేత్రములు లేనివానితో సమానుడు. ఇట్టి జ్ఞానదృష్టి లేకపోవుట వలననే, సమానముగ సర్వులలో నుండు పరమేశ్వరుని జూడకపోవుటచేతనే, కల్పిత వర్ణములగు దేహములు మాత్రము జూచి, మాయామోహములో బడియుండుటకు కారణమగుచున్నది. అట్టి దివ్యదృష్టిని, దైవదృష్టిని

సమత్వదృష్టిని, కరుణ దృష్టిని సంపాదించుకొనవలయును. అంతవరకు అంధప్రాయులై జీవింపవలసి యుండును. దైవనిర్మితమగు చిత్రవిచిత్రమైయుండు జగన్మంగళమును అంధుడు జూచి యానందింపజాలనట్లును, మార్గము దెలియక దారితప్పి నడుచునట్లును, అట్టి సువిమల దృష్టి లేనివారు సర్వేశ్వర సుఖము ననుభవింపకపోవుటయేగాక, సత్యమార్గములో, ధర్మమార్గములో, ఆనందమార్గములో నడువజాలక పోవుదురు.

బ్రా:– వివేక జ్ఞాన సంపన్నుడవగు శివరామకృష్ణయ్యగారూ! ఈ భాగమునకు ఏల విస్మృతి కాండమని పేరిడితిరి?

అ:– విశుద్ధాంతః కరణము గల రామశర్మగారూ! ఇకమీదట లోకక్షేమము గోరు వారందఱును, ఇదివరలో బ్రాహ్మణులపై, బ్రాహ్మణేతరులు బ్రహ్మద్వేషము జేసి యుండినచో అదియు, బ్రాహ్మణేతరునిపై ఏదైన బ్రాహ్మణేతర ద్వేషము జరిపియుండినచో దానినిన్ని మరచిపోవలయును. కావుననే యీ భాగమునకు విస్మృతికాండమని పేరిడుటకు కారణమైనది. సత్యము దెలియువఱకే సందేహము గలుగుచుండును. అది విచారణచేత, నిదానముగానే గోచరము గాగలదు.

దాని కొక కథ జెప్పెద. ఒక కాలమున, శ్రీ కాశియందు గంగా పుష్కరము జరుగుచుండగా దూరదేశమునుండి ఒక బ్రాహ్మణ కుంటుంబమువారు భార్యా బిడ్డలతో స్నానమునకు వచ్చిరి. జనుల వత్తిడివలన స్నానసమయమున అయిదు సంవత్సరముల ప్రాయముగల బ్రాహ్మణబాలుడు కనుపించకపోయెను. వెదుక వలసినదంతయు వెదకియు, పుత్రుడు గానరాకుండుటచే ఎటుపోయెనో, గంగలోబడి మృతినొందెనో అని శోకము గలిగి మనోనిశ్చయము జేసికొని స్వగ్రామమునకు వెళ్ళిరి. ఆ బాలుడు జనులు క్రిక్కిరిసియుండు ప్రదేశమగుటచే, తల్లి దండ్రులు గనుపించనందున

యేడ్చుచుండగా, కరుణా స్వరూపుడగు నొక సాధు వాబిడ్డను దగ్గరకు జేర్చుకొని సాంత్వనవాక్యముల జెప్పుచు పండ్లు ఫలాహారముల బెట్టెను. పాప మాసాధుసత్తము డాబ్రాహ్మణబాలుని దీసికొని యనేక స్థలములలో వెదకినను, దైవవశముననో, మతేకారణముననో మాతాపితరులు కనుపించినవారు గారు. ఆ సాధువు తాను ఉండు ప్రదేశమున ఈ బాలుని గూడ నుంచి కొంత చదువును నేర్పి, మంచి యోగనిష్ఠగల తపస్విగా తయారుచేసెను. ఆ శిశువు క్రమముగా వృద్ధినొంది, జటామండితుడై, రుద్రాక్షభూషితుడై, కౌపీనధారియై, విభూతిని ధరించువాడై, యౌవన వయస్సు గలవాడై నపుడు, తన పూర్వవృత్తాంతము జ్ఞాపకమునకు వచ్చి, స్వగురువుని యనుజ్ఞ బడసి, స్వగ్రామమునకు వెళ్ళుసరికి యాతని మాతాపితరులు పరలోకము నలంకరించియుండిరి. నలుగురు సోదరులు, ఇద్దరు సోదరీమణులును స్వగృహమున నుండిరి. ఈ తపస్వి తన పూర్వ వృత్తాంతము నేమియు జెప్పకనే ఆయింటికి వెళ్ళెను. ఇంటివారు ఇతడెవరో బైరాగిగా నుండవచ్చునని తలచి బియ్యమును భిక్షము పెట్టుటకు వచ్చిరి. అతడు తనకు బియ్య మక్కరలేదనియు, భోజనము చాలుననియు జెప్పగా అరుగుపై కూర్చుండ బెట్టి విస్తరాకును ముట్టకయు, పాత్రను తాకకయు జలము నిచ్చి భోజనము బెట్టిరి. భోజనానంతరము సత్రమునకు వెళ్ళవలసినదిగా గృహమున నుండువారు జెప్పిరి. అపుడతడు తనయొక్క పూర్వ వృత్తాంతమును ఇంటివారికి జ్ఞాపకము జేయవలయునని తలంచి వారి మాతాపితరుల గురించి అడిగెను. వారిరువురును కొంతకాలము క్రిందట స్వర్గలోకము నలంకరించిరని వారు బదులు చెప్పిరి. అపుడు ఈ తపస్వి జన్మించుటకు ముందుగ ఇద్దరు మగపిల్లలును ఒక ఆడపిల్లయు గలిగియుండిరి. వారితో మీ తల్లి దండ్రులు మీ ముగ్గురు యెప్పుడైనా గంగాపుష్కర స్నానమునకు వెళ్ళిరా! అనియు, తన పూర్వపు పేరగు విశ్వనాథశర్మయను ఒక తమ్ముడు మీకుండెనా? ( అనగా యోగియొక్క బాల్యమున నామధేయము విశ్వనాథశర్మయని యుండెను)

అనియు అడిగెను. పైన జెప్పిన వాక్యముల వినినపుడే ఆ సోదర సోదరీమణులకు గంగాపుష్కర వృత్తాంతము జ్ఞప్తికి వచ్చి కొంత ప్రేమ గలిగి, యీ తపస్వియొక్క ముఖదేహాదుల జూచి తమ విశ్వనాథశర్మయై యుండవచ్చునా యని సందేహము గలిగెను. ఇట్లుండగా ఇరుగు పొరుగువారగు జనులందఱు అచ్చోటికి విచ్చేసిరి. అపుడు యోగి తనయొక్క వృత్తాంతమంతయు తెలిపి మహాత్ముడగు నొక గురువరుడు తనను సంరక్షించి, విద్యయు; యోగమును నేర్పి యిట్టి తాపస స్థితికి తెచ్చిరని జెప్పగా జ్యేష్ఠ సోదరులును, సోదరియును ఈ యోగిని కౌగలించుకొని సంతోషము బట్టజాలక, ''కరుణాసాగరా! మా తమ్ముడు ఎచటో గంగలో పడి మరణించెనని తలంచితిమి. మీ కృపవలన మఱల జూడదగిన భాగ్యము గలిగినందులకు మేమెంతో ధన్యులము'' అని చెప్పిరి.

వర్ణము యొక్క రహస్యమున్ను ఇట్టిదే. అందరిలోను వెలుగుచుండు సర్వేశ్వరుని మాయా మోహముతో జూడజాలక యీ భేదములు, ద్వేషములు గలుగుటకు కారణమైనది. యధారముగ అందఱును ఒక యీశ్వరుని సంతానములే యనియు, అందఱిలోను ఒక సర్వేశ్వరుడే వెలుగుచుండెనని జ్ఞానము గలుగునపుడు, విశ్వనాథశర్మ యొక్క నిజపరిస్థితి దెలిసినపుడు జ్యేష్ఠ సోదరీ సోదరులకు, ఎంతటి ప్రేమగలిగెనో తెలియుటకుముందుగానున్న తిరస్కారభావమును గూర్చి యెంత పశ్చాత్తాపపడిరో, ఆలాగున అందఱి ఆత్మలో సర్వేశుడొక్కడే గలడని జ్ఞానముగలిగినపుడు ఇంత ప్రేమయు పశ్చాత్తాపమున్ను గలుగును. కావున శ్రీ బుద్ధుడు, శ్రీ మహమ్మదు, శ్రీ యేసుక్రీస్తు మొదలగు ప్రవక్తలు మానవసోదరులను ఆలింగనము జేసికొని ప్రేమించుటకు కారణమైనది. కావున గతమును గుఱించి విచారించిన ప్రయోజనము లేదు. ఇకమీదట బ్రాహ్మణ బ్రాహ్మణేతరు లుభయులును పరస్పరవైషమ్యమును విస్మరించి యొకే సోదరభావముతో మెలగెడి శక్తి జ్ఞానము చాలకపోయినను, గుణము ననుసరించియైన అందఱిని ప్రేమించుటయు,

సమానముగ జూచుటయైనను జేసికొనవలయును, సాత్త్విక, రాజస, తామస జ్ఞానములగుఱించి శ్రీకృష్ణభగవాను లుపదేశించినది చూడుడు.

**సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే।**
**అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్॥**

వేఱువేఱుగానున్న, బ్రహ్మాదిస్తంబ పర్యంతములగు సకల భూతముల యందును, ఎడతెగక యుండునదియు, అద్వితీయ మైనదియును, పుట్టుక, చావు మొదలగు సకల వికారములు లేనిదియును, (నిత్యమైనదియును) అగు వస్తువును (పరబ్రహ్మమును) ఏ జ్ఞానముచేత జూచుచున్నాడో, ఆ జ్ఞానమును సాత్త్విక జ్ఞానముగా దెలిసికొనుము!

**పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావా న్పృథగ్విధాన్।**
**వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం విద్ధి రాజసమ్॥**

బిన్న భిన్న రూపములుగా నున్నట్టి సకలభూతములయందును, అనేక జీవులనం, వేఱు, వేఱు లక్షణవులు గలవారినిగా, ఏజ్ఞానవు తెలిసికొనుచున్నదో అట్టి జ్ఞానమును రాజసజ్ఞానముగా దెలిసికొనుము.

**యత్తుకృత్స్నవదే కస్మిన్కార్యే సక్తమహైతుకమ్।**
**అతత్త్వార్థ వ దల్పంచ తత్తామస ముదాహృతమ్॥**

ఒక కార్యమునందు (దేహమునందు లేక ప్రతిమ మొదలగు దానియందు) సమస్తము వలెనే (దేహమాత్మయనియును, విగ్రహములే యీశ్వరుడనియును తలంపుతో) కూడుకొనినదియును, యుక్తి (కారణము) లేనిదియును, తత్త్వార్థరహితమైనదియును, స్వల్ప విషయములు గలదియును, లేక స్వల్ప ఫలముగలదియు, నగు ఏజ్ఞానము గలదో, ఆ జ్ఞానము తామసజ్ఞానమని చెప్పబడినది ఈ త్రివిధజ్ఞానములలో, శ్రీభగవంతు

డుపదేశించిన యేజ్ఞానము గలదో, అట్టి జ్ఞానములలో మనకు గలిగియుండు జ్ఞానముత్తమమా! మధ్యమమా! అధమమా! అని యోచించిన సర్వ చరాచర ప్రాణికోట్లలో నంతర్యామియై యుండు, సర్వేశ్వరుని జూచునది సాత్త్విక జ్ఞానమనియు, అంతఃశుద్ధియు, విశాలత్వము లేనిదై జీవ కోట్లలోగల యీశ్వరత్వమును జూడశక్తి లేనిదై వారిలోగల శుద్ధాశుద్ధ గుణములను జూచి, ప్రేమించుటగాని, యుపేక్షించుటగాని జేయు జ్ఞానము రాజసమనియు, ఈశ్వరత్వమును జీవుల గుణములనుగూడ జూడజాలక, కేవలము దేహమును గుఱించి, అనగా పుట్టిన జాతినిగూర్చి మాత్రము జూచెడి జ్ఞానము తామస జ్ఞానమనియు వర్ణింపబడినది. ఉత్తమ మధ్యమ జ్ఞానములను బొందకపోయినను అధమజ్ఞానమును పొంది హీనస్థితిలో నుండుట తగునా?

బ్రా:– భగవన్ముఖమునుండి బ్రాహ్మణులును, బాహువులనుండి క్షత్రియులును, ఊరువులనుండి వైశ్యులును, పాదములనుండి శూద్రులును పుట్టినట్లు ''బ్రాహ్మణోఽస్యముఖమాసీత్'' అను శ్రుతి నాధారము జేసికొని, స్మృత్యాది శాస్త్రకర్తలగు ఋషులందఱున్ను అంగీకరించి, నేటివరకు దానినే యనుసరించిరి. అనగా ''బ్రాహ్మణోఽస్యముఖమాసీత్'' అను వేదవాక్యమునకు మీరు జెప్పులాగున విరాట్పురుషవర్ణనముగాక బ్రాహ్మణాది నాలుగు వర్ణములును, ముఖాది స్థానములనుండియే జన్మించినట్లు చెప్పుచుండగా, మీరేల విరాట్పురుషవర్ణన యని చెప్పెదరు? శాస్త్రములన్నిటి లోను, వేదమునకు వెనుక నేర్పడినది మానవశాస్త్రము అనగా మనుస్మృతి దానియందు గూడ, విరాట్పురుషముఖాదులనుండియే బ్రాహ్మణాదులు జన్మించినట్లును, అట్లేల యేర్పడవలయుననిన లోకక్షేమము కొఱకే అనియు జెప్పబడియున్నది.

**లోకానాం తు వివృద్ధ్యర్థం ముఖబాహూరుపాదతః।**
**బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రం చ నిరవర్తయత్॥**

ఇట్లు సృష్ట్యారంభమునుండి యేర్పడి వచ్చుచుండగా, ఏల సాహసించి విరాట్పురుషవర్ణన యని చెప్పవలయును!

అ:– ఓ దీర్ఘ దర్శివగు సోదరా! సృష్ట్యారంభమునుండి ఒకధర్మము ప్రారంభించి వచ్చి దానినే, అందఱును అంగీకరింపవలయునని జెప్పినచో, ప్రతి మతమున్ను న్యాయవిరుద్ధమగును. ఏలన! ఒక్కొక్క మతకర్త యవతరించి యొక్కొక్క మతమును స్థాపించెను. సాంఖ్య, మీమాంసా, బౌద్ధ, అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత, శైవ, వైష్ణవ, క్రైస్తవ, మహమ్మదీయ మతకర్తలు అందఱును, ధర్మమార్గము నుల్లంఘించిన వారలే యగుదురుగదా! అంతేగాక, అట్లు దానినే అంగీకరించుచు వచ్చిన మానవుల కేర్పడియుండు విజ్ఞానశక్తి యేముపయోగపడును? అట్లైన విజ్ఞానమెట్లు వృద్ధినొందును? సృష్టియొక్క ఆదిలో నుండిన పదార్థజ్ఞానము మాత్రము చాలునని అంగీకరించినచో నూతనములుగా ఏర్పడియుండు, విద్యుద్యంత్రములు, ఆవిరి యంత్రములు మొదలగు అనేక యంత్రసామగ్రుల నుపయోగ పఱచరాదుగదా! విరాట్పురుషుని వర్ణనయే ''బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్'' అను అర్థమునే శ్రీ దయానందసరస్వతి మున్నగువారు ప్రకటించిరి. తైత్తిరీయాద్యుపనిషత్తులో పశువధపరమగు అర్థములను వర్ణించియుండు వేదభాగములకు ఆత్మపరమగు యజ్ఞము ఏలాగున అంగీరింపబడియుండునో, ఇదియు నట్టిదే గాని, క్రొత్తగా కల్పింపబడినది గాదు. మఱియు ''గతానుగతికో లోకః'' అను వాక్యము ననుసరించి ప్రవర్తించుటగూడ గలదు. ఎట్లన! సృష్ట్యారంభమునుండి నేటివఱకు సూర్యుడే భూమిచుట్టు తిరుగుచున్నట్లు అనేకులు వ్రాసియున్నారు.

ప్రత్యక్షముగ దృష్టికిని ఆలాగుననే కనిపించుచున్నది. అయినను, నవీన శాస్త్రజ్ఞులు భూమియే సూర్యుని చుట్టును సంచరించుచున్నట్లు దెలుపుచున్నారు. దృష్టాంతరూపముగాను, యంత్రసహాయమునను ప్రత్యక్షముగ జూపుచున్నారు. మనలో నెవ్వరైనను ఇపుడు భూగోళమును చుట్టి

రావచ్చును. దీనికి మీరేమి తెలిపెదరు? '' ఈశ్వరదర్శనము '' అను గ్రంథమున, ఆర్యమతస్థులు వేదముల నాధారము జేసికొని, సూర్యునిచుట్టును భూమియే సంచరించునట్లు, నవీన శాస్త్రము ననుసరించి వేదార్థమును నిరూపించినారు. ఈలాటి స్వభావము లనేకములు గలవు. లోకములో ఏపక్షమునకును, ఇదివఱలోనుండు ఏ శాస్త్రమునకును వశుడు గాక స్వబుద్ధితో సత్యముపై ఆధారపడి, విచారముజేయు జీవులు చాలా అరుదుగనే యుందురు. మఱియు సర్వజనులకు, వేదముల జదివి అర్థమును గ్రహించుట కవకాశము లేకపోయినందుచేతను, ఒకేతెగవారు మాత్రము చదివి వచ్చినందుచేతను, వారి కనుకూలపడియుండు భావమునే అదివరలో వ్రాసియుండుటచేతను, దానినే బలపఱచి వచ్చుట కవకాశ మేర్పడినది. మన్వాదిధర్మశాస్త్రములన్నియు నీలాగుననే కనుపించుచున్నవి. ఒక్కొక్క కాలము ననుసరించి, దానికి పూర్వముండు స్మృతులలో గొన్నింటిని దీసివేసి, నవీనముగా మఱికొన్నింటిని జేర్చినట్లు స్పష్టముగా గోచరమగుచున్నది. మనువు వ్రాసిన ''స్మృతి'', కృతయుగమునకు మాత్రమే యుపయోగించునని తలంచి, త్రేతాయుగమున ఆకాలమునకు తగినట్లు గౌతమస్మృతి వ్రాయడమైనది. ద్వాపరయుగమునకు పైజెప్పిన రెండును తగవని నిశ్చయించి, శంఖలిఖిత స్మృతి యేర్పరచిరి. కలియుగమున ఆ మూడు స్మృతులును అర్థములు గావని పరాశరుడు స్వయముగా నొక స్మృతిని నిర్మించెను. చూడుడు.

**కృతే తు మానవా ధర్మాస్త్రేతాయాం గౌతమాః స్మృతాః।**
**ద్వాపరే శంఖలిఖితాః కలౌ పారాశరాః స్మృతాః॥**

దీనినిబట్టి ఆలోచించిన, ఈస్మృతులన్నియు ఒక్కొక్క ప్రభుత్వ మేర్పడునపు డాప్రభుత్వ సంరక్షణ కొఱకు ఏర్పరచెడు నియమముల వంటివని దెలియదగును. మఱియు ఎపుడెపుడు ప్రభుత్వ మభివృద్ధికి రావలయునని

తలంతురో, అపుడపు డేలాగున పాత ఆర్డినెన్సులను రద్దుపఱచి క్రొత్త ఆర్డినెన్సుల నేర్పరచుచున్నారో, స్మృతులున్న అటువంటియేయని నమ్మదగును. మీరు మనువు జెప్పిన శ్లోకముయొక్క ఆంతర్యమును లోకముయొక్క యభివృద్ధికొఱకే, పరమేశ్వరుడు నాలుగువర్ణముల నేర్పరచడమైనదని చెప్పుటచే యీ నాలుగు వర్ణములు లేనిచో ప్రపంచ వ్యవహారము జరుగదని తలంచుట సరిగాదు.

ఏలన! భూగోళశాస్త్రములో, ఇతరదేశము లన్నిటిలో కన్న భారతదేశము చాల తక్కువగ గనుపించుచున్నది. జాతిని గుఱించి విభాగము లేని గుణమును గుఱించి పాలనగల రాజ్యములో లోక వ్యవహారము జరుగుట లేదా! ఈ వాక్యములన్నియు అంధ విశ్వాసముతో గూడి ప్రపంచజ్ఞానము లేనివారితో జెప్పదగినవే గాని లోకజ్ఞానము·గలిగినవారితో జెప్పదగవు. అట్లు చెప్పువారి జ్ఞానము గూడ ప్రపంచజ్ఞానము లేనిదనియు, అంధ విశ్వాసముచే నిబిడమైనదనియు, విజ్ఞులు దలంతురు. పోనీ, కులము ననుసరించియే జాతి యేర్పడినదని నమ్మెదము. ఇపుడు భరతఖండములోనుండు జనులు, వారి వారి కులమునకు నియమించబడిన పనుల మాత్రమే జేయుచున్నారా? ప్రతిజాతివారును, వారి వారి గుణము ననుసరించిన విద్యాభ్యాస తపస్సులనుగాని, ప్రజాపాలనమునుగాని, వ్యాపారమునుగాని, నౌకరి (యుద్యోగము) అగు సేవకవృత్తినిగాని జేయుచున్నారుగదా! దీనికేమి సమాధానమిచ్చెదరు? అగ్రజాతులు, బ్రాహ్మణేతరులకు సేవకవృత్తియే ధర్మమని బోధించుచున్నారే గాని, బ్రాహ్మణ ధర్మము బ్రహ్మజ్ఞాన మగునని తలంచక పోవుట యేమి న్యాయమగును? మఱియు భారతదేశమునకు మాత్రమే సర్వేశ్వరుడు కరుణగలిగి చాతుర్వర్ణ్యమును ఏర్పఱచెను. అందువలననే యీదేశ మితర దేశములకన్న, ఉన్నతస్థితిలో నుండి, యితరదేశములకు ధర్మమును బోధించు శక్తిగలదైనదని జెప్పినచో, దయ, భక్తి, వైరాగ్యము కొంత యధికముగ నితర దేశీయులకన్న, భారతీయులలో

ఎక్కువ గలదని అంగీకరించినను, పరమతస్థుల పాలనలో నుండువఱకెట్లు పైజెప్పిన వర్ణాశ్రమములచే శ్రేష్ఠత్వ మీదేశమునకు గలిగినదని యంగీకరించుటకు సాధ్యమగును?

ఇపుడుగల ఇంగ్లీషు ప్రభుత్వ మేర్పడి, నూటరువదిసంవత్సరము లైనను దానికి ముందు మహమ్మదీయ పాలనము ఏడునూఱులు సంవత్సరములు గలిగియుండెను. ఆలోచించిన రమారమి వేయి సంవత్సరములనుండి యీ భారతీయులు పరాధీనులు గారా! కులము ననుసరించి వర్తించిన యీ దేశ మధోగతికి జారిపోవుటకు, గుణము ననుసరించి ప్రవర్తించెడు దేశ మున్నతస్థితిలోనికి వెళ్లుటకును కారణమగు చున్నది. అంతేగాదు. బ్రాహ్మణాది నాలుగువర్ణములు సత్యములయినచో ఆయా వర్ణములకు తగిన గుణములుగల వారే ఆయా జాతులలో పుట్టవలసి యుండును. ఇదివఱలో నిరూపించిన, పశు, పక్షి, వృక్షాదులే తార్కాణము. అట్లు జాతి ననుసరించిన గుణము గలవారే, ఆయా జాతులలో బుట్టు చుండిన, అది సత్యమని నమ్మవచ్చును. అట్లేజాతిలోనూ గనుపించుట లేదు.

సాత్త్వికి, రాజస, తామస, మిశ్రమగుణములు గలవారు నాలుగు జాతులలోను గనపడుచున్నారు. ఆలాగున తపోధ్యాన యోగాదులుగల వారున్ను, దేశ సంరక్షకులున్ను, వ్యాపార నిపుణులున్ను, సేవా పరులున్ను అన్ని జాతులలోను బుట్టుచున్నారు. ఇక దీనికన్న పరమ ప్రమాణమున్ను, సత్యమున్ను ఏమి గావలయును! నాయనా! ఇట్టిధర్మవివక్షత యెంతకాలము వఱకు, ఏదేశమందయినను గలగదో, ఆదేశ మాధ్యాత్మికోన్నతిలోనికిని, ప్రపంచోన్నతిలోనికిని రాజాలదు. ఇదే సత్యము. దీనియందు ఒకరిని స్తుతించుటగాని, మఱొకరిని నిందించుటగాని లేదు. వర్ణస్థితి యిట్లుండక పోవుటయెగాక, ఆశ్రమస్థితి మరింత హీనముగానున్నది. అనగా సన్న్యాసవేషముచేత మాత్రమే, అతడు సర్వ బంధవిముక్తుడై నట్లును, సర్వ

కర్మ రహితుడైనట్లును, సర్వజనులచే పూజింపదగిన వాడైనట్లును దలంచుచున్నారు. దీనిని గూడ పరిశోధన సలుపువారు లేకపోయిరి. ఈ ధర్మమున్ను ఒక మనుజునిచే చక్కబఱచ దగినదిగాదు. ప్రభుత్వ శాసన ముండవలయును. ప్రభుత్వమువారు ఇతరదేశస్థులున్ను, ఇతర మతస్థులు నయినవారగుటచే, ఈ విషయమై నేటివఱ కేలాటి జోక్యమును కలుగ జేసికొనకపోయిరి. నిజమయిన సన్న్యాసమే యే లోకమునకయిన కావలసియుండును. అట్టి నిష్ఠగల సన్న్యాసి, మానవలోకమునకు శిరస్సువంటివాడగును. సన్న్యాసియొక్క ధర్మము విద్యచేతను, తపస్సుచేతను, ఆత్మజ్ఞానము గలవాడై ప్రపంచమునకు ధర్మమును బోధించుటయే యగును. ఇది హిందూమతమొక్కదానికి మాత్రముగాదు, బౌద్ధ, క్రైస్తవ, మహమ్మదీయ మతము లన్నిటికిని ధర్మమైయున్నది. కనుకనే ఆయామతములు, సజీవములై యున్నవి. ఆమతము లన్నిటిలోను సన్న్యాసపద్ధతియు, సన్న్యాసులునుగలరు. సన్న్యాసము (త్యాగము) లేనిచో యెట్టివాడయినను, స్వతంత్రుడై ధర్మమును భోదింపజాలడు.

బ్రా:- పుణ్యమువలన ఉత్కృష్టజాతిలో జన్మించునని చెప్పెడి శాస్త్రము నందఱు నంగీకరించుచున్నారు. అట్లయిన పుణ్యము గలజీవులు బ్రాహ్మణకులములో ఏల బుట్టకూడదు? పాపమువలననే హీనజాతులలో జన్మింతురు. అందువల్లనే పుణ్యహీనులై నందుచేతనే శూద్రాదికులములలో బుట్టుచున్నారని యేలనమ్మకూడదు? దీనియందు మనుజుడు జేసిన భేదమేమైనగలదా! ఇందుచే శాస్త్రము సత్యమని యేల నమ్మకూడదు! ఈశ్వరునియందుగాని, శాస్త్రమునందుగాని, బ్రాహ్మణులయందుగాని ఏల ద్వేషమును వహింపవలయును? వారి వారి జన్మాంతరకర్మానుసారముగ ఆయాజాతులలో బుట్టుచుందురు. త్రికాలజ్ఞానియైన శ్రీపతంజలిమహర్షి యోగ దర్శనమందు జెప్పినది జూడుడు.

**సతి మూలే తద్విపాకో జాత్యాయు ర్భోగాః.**

అనాదికాల సంచిత కర్మపరిపాకము వలన, జాతి, ఆయువు, భోగము అనునవి యేర్పడుచున్నవి.

అ:– ఈ యోగసూత్రమందు బ్రాహ్మణజాతియని నిరూపించలేదు. శ్రేష్ఠ జాతియు, ఆరోగ్యము, ఇంద్రియ సౌఖ్యము గలుగుచున్నవనియే అర్థము. అలాగున పాపకర్మ పరిపాకముచే హీనజాతియు, రోగము, దారిద్ర్యము గలుగుననియే తాత్పర్యము. అందువల్ల పై మీరు చెప్పిన యుక్తి సరియైనది గాదు. ఈశ్వరసృష్టిలో గుణము ననుసరించియే జాతిగలుగుట చేతను, కులము ననుసరించి కానందుచేతను ఈదృష్టాంతము సరిగాదు. ఏలన, పుణ్యముయొక్క ఫలము, ఆరోగ్యము, సుఖము, జ్ఞానము, ధనముతో గూడియుండుట. అట్లయిన బ్రాహ్మణులలో నందఱును పైజెప్పిన నాలుగు గుణములు గలవారై యుండవలయును. బ్రాహ్మణేతరులలో ఆరోగ్యాది యీనాలుగు గుణములు లేనివారై యుండుట సంభవింపవలయును. అట్లు కనిపించుట లేదు. నాలుగుజాతులలోను శ్రీమంతులు, శోభాయమానులు, విజ్ఞానవంతులు, సత్త్వగుణము గలవారుంటున్నారు. కావున నీ దృష్టాంతము సరియైనది గాదు. దీనివలననే యీశ్వరదృష్టిలో నాలుగు జాతులని భేదము లేదని నిశ్చయించు కొనవలయును. దరిద్రులు, కురూపులు, విద్యావిహీనులు, ప్రజ్ఞాశూన్యులు, తమోగుణావిష్టులు సకలజాతులలోను గలరు. ఇందువలనను కులము ననుసరించుట సరికాదు.

ఒక వేళ భారతీయులపై కరుణగలిగి పరమేశ్వరుడు నాలుగు వర్ణములను సృష్టించెనని యనుకొందము. అట్లయిన విద్యలోను, సౌభాగ్యములోను, ఇతర దేశములకన్న ఈ దేశమాధిక్యము గలిగి యుండవలయును గదా! భూలోకములో గల అమెరికా, జపాను, ఇంగ్లాండు, రష్యా, జర్మనీ మొదలగు దేశములలో కుబేరులవంటి శ్రీమంతులు ఎందఱో

గలరు. వారి సౌభాగ్యమునకు సరిజూచిన ఏనదేశమెంత? మరియు, వివేకశౌర్యాదులు బ్రాహ్మణ క్షత్రియాదులకే యుండునని జెప్పునది నిజమైనచో, న్యాయాధిపతులు, హైకోర్టు జడ్జీలు, కలెక్టర్లు, యోధులు వీరల యందే యుండవలసి యుండును. ఆలాగున ఇంజనీర్లు, డాక్టర్లు వీరలలోనే జన్మింపవలసియుండును. ఆలాగున, వాణిజ్య, కృషి, గోరక్షాదులు వైశ్యులలో మాత్రమే యుండవలయును.

ఆలాగున ఉద్యోగాది సేవకవృత్తి శూద్రులలో బుట్టినవారికి మాత్రమే యుండవలయును. ఈ నాలుగు వృత్తులును, నాలుగు జాతులలో బుట్టినవారియందు సమానముగా గనుపించుటచే, జాతి యనునది యీశ్వరదృష్టిలో నొకటి లేదని నిశ్చయించుకొనవచ్చును, బీజములను భూమిలో పెట్టి పోషింపనిచో యెట్లు వృక్షములై, ఫలపుష్పాదుల నీయ జాలవో, ఆలాగున, బ్రాహ్మణేతరులకును, స్త్రీలకును, విద్యాధిక్యములో ప్రవేశమీయనందుచేతనే వారల వివేకము వికసించి, లోకక్షేమమునకును, ఆత్మోన్నతికిని నుపయోగ పడకపోయెను. అగ్నికుండమునుండి తీసిన కణములను దూది మొదలగువాటిలో బెట్టి ఊదుచు చిన్న చిన్న పుల్లలనువేసి రగిల్చి, తరువాత పెద్దపెద్ద కట్టెలను వేసిన, అది యెలాగున కారణరూపమగు మహాగ్ని కుండమువలె ప్రజ్వలించునో, ఆలాగున వేదవిద్య చేతను, తపస్సు చేతను, విజ్ఞానాభివృద్ధి జేయకపోవుటచేతనే, వారల జీవితము అడుగంటి పోవుటకు కారణమైనది, మొదటినుండియే బ్రాహ్మణేతరులకును, స్త్రీలకును ఇట్టి యవకాశమున్నచో, భారతదేశ మెంత యభివృద్ధికి రావలసియుండును? ఈజనులు, ఎంతో వీర్య, శౌర్యాదుల గలిగి ఓజస్సు గలవారై యుందురుగదా! ఇట్టి అభివృద్ధి కారకమగు కార్యము జేయనందు చేత, వీరు పశుప్రాయులై యుండిరిగదా! మహమ్మదీయులు,మొగలాయిలు, పోర్చు గీసులు, కట్టకడ కాంగ్లేయులు అనేకసార్లు భారతదేశముపై దండయాత్ర సలిపి సౌభాగ్యములన్నిటిని కొల్లగొట్టు కొనిపోవ కారణమైనది!

ఇప్పటికైనను ఈ సత్యము నందరెటింగి మేల్కొనినచో భారతదేశము బంధవిముకినొంది యున్నతస్థితికి రాగలదు.

కావున మిత్రమా! వాక్కుతో మాత్రము సోదరీసోదరులారా అని యుపన్యాస వేదికలపైనుండి సింహగర్జనముల జేసిన చాలదు. చెప్పినట్లు నడచుటయే యుత్తములయొక్క లక్షణమని మరువకుందురుగాక. ఇక మానుష్య, మానుష, మనుజ శబ్దాదుల యొక్క అర్థము శాస్త్రమందు జెప్పినది జూడదగును.

**మహర్షయస్సప్త పూర్వే చత్వారో మనవస్తథా।**
**మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥ ( గీత)**

లోకమునందు ఎవరికి బ్రాహ్మణాదులు సంతతి అయిరో, ఆ నాశక్తిగలవారును, సంకల్ప సంభవులును, అనగా అయోనిజులును అయిన యేడుగురు ( భృగువు మొదలుగాగల) మహర్షులును, వారికంటె పెద్దవారయిన నలుగురు సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాత మహర్షులును, అట్లే చతుర్దశ మనువులును పరమేశ్వరుడనగు నావలననే పుట్టిరి.

మనువునుండి పుట్టినందుచే మనుజులనియు, ఆలాగున మనువు యొక్క సంతతులగుటచే మానవులనియు, అదేరీతిగ మనువుయొక్క వంశీయులగుటచే మనుష్యులనియు పేర్లు వచ్చినవి. సిద్ధాన్తకౌముదియందు జెప్పిన ప్రకారము వ్యాకరణ సూత్రము ననుసరించి దీనిని వ్రాయడమైనది. ఈ సత్యము నాధారము జేసికొనిన మనుష్యులనియు, మానవులనియు, మనుజులనియు ఎవరెవరిని బిలుచుచున్నామో వారందఱు నొక మను వంశీయులనియే స్పష్టముగ దెలియవచ్చుచున్నది. బ్రాహ్మణులును మనుష్యులే. అబ్రాహ్మణులను మనుష్యులే, క్రైస్తవులును మనుష్యులే, బౌద్ధులును మనుష్యులే, మహమ్మదీయులును మనుష్యులే. ఈ వ్యాకరణశాస్త్రము

నాధారము జేసికొనియే శ్రీ దయానంద సరస్వతీస్వామివా రార్యసమాజమును స్థాపించిరి. ఒక వేళ ఉపనయనాది సంస్కారముచేతను, సత్త్వాదిగుణముల చేతను భేదము గలిగియుండునని చెప్పినచో, ఉపనయన వేదాధ్యయన సంస్కారములు మనుష్యకృతములగుటచే, అవి లేనివారిని మఱల సంస్కరించు కొని, యేల ఆర్యజాతులుగా జేయకూడదు? అయితే యీమనుష్యులచే, జేయబడిన సంస్కారముండిన చాలదు. జన్మాంతర సంస్కారములగు సత్య, శౌచ, దయాదిగుణము లుండవలయునని అడిగినచో, అట్టి సంస్కారములు గలవారిని ఎందులకు శ్రేష్ఠులనుగా గణింపగూడదు! ఈలాటి ప్రశ్నలన్నియు అర్థశూన్యములైనవి.

బ్రా:- చిరకాలమునుండి సంస్కారము లేక, భోజనశుద్ధి లేక యుండువారి కిపుడు సంస్కార మేలాగున లభించును?

ఆ:- అది సరియైన ప్రశ్నగాదు. సంస్కారశబ్దమెపుడు వచ్చెనో, అపుడు సంస్కార మదివఱలో లేనిదానికే సంస్కారపద మేర్పడినదని ఆ పదములోనే ఆ యర్థము నిగూఢమైయున్నది. వస్త్రము యొక్క నైజస్వభావము శుక్లవర్ణమై యుండినను, సంరక్షణ లేనందుచే మాలిన్యముగలదై యుండవచ్చును. దానిని మఱల శుభ్రముజేసెడు సంస్కారమువలన నెట్లు శుద్ధమగుచుండునో, అటులే సంస్కారము యొక్క యర్థము నగును. సుందరమగు స్వచ్ఛజలముచే శోభాయమానమగు నొకసరోవరము, సంరక్షణ లేనందుచే కొంతకాలమునకు కట్టలన్నియుతెగి, సోపానములన్నియు విరిగిపడి, జలము పంకిలమై పోయినచో మఱల యథాప్రకారము సంస్కరించి కట్టలను, సోపానములను గట్టిన నెట్లు నిర్మల జలపూర్ణమై జనుల స్నానపానాదుల కుపయోగపడునో, సంస్కారమున్ను ఇటువంటిదని దెలిసికొనినచో, ఈభేదవాదముల కవకాశము గలుగదు. కనుకనే ''సంస్కారాద్ద్విజ ఉచ్యతే'' సంస్కారము చేతనే ద్విజత్వము గలుగునని శాస్త్రము నిర్ణయించుటకు

కారణమైనది. అయితే బొట్టు, జుట్టు, కట్టుమాత్రమే సంస్కారమని తలచకూడదు. ఆలాగుననే నామమున్ను, రూపమున్ను సంస్కారము గాదు. అంతః కరణములోగల ఆత్మపవిత్రతయే నిజమైన సంస్కారమగును. ఈసత్యము దెలియక పోయినచో, పప్పు పులుసు జేసెడు పాత్రయొక్క బాహ్యప్రదేశమును శుభ్రముగా తోమియు లోపల కళాయి వేయకయు, తోమకయు దానిలో వండిన పులుసు వంటిదియే యని మరువగూడదు.

బ్రా:– సంస్కారహీనులై చాలకాలము నుండి, మత్స్య మాంసాదుల భుజించువారిని ఇపుడు సంస్కరింప దలచిన వీలగునా? ఇంగువయొక్క వాసన పోవుటకు నీటిలో లేక పాలలో ఎంత కడిగినను దాని వాసన నశించునా?

ఆ:– ఈ యుక్తి సరియైనది గాదు. ఇంగువకు వాసన నిజమైనది. వాసనను విడచి అది యుండదు. ఆలాగున మత్స్యమాంసాద్యాహారములచే గలుగు వాసన సరియైనది గాదు. ఎందుకనగా! ఆత్మయొక్క స్వభావము కేవలము ఈశ్వర స్వభావము. ఏలన! ఆత్మ యీశ్వరరూపమగుటచే. ఇంగువ వేసియుండు పాత్రలోగల యింగువ సంపర్కముచే గలిగిన వాసన యెట్టిదో, ఆహారముచే ఏర్పడెడు సంస్కారరూపవాసనయు అటువంటిదే. ఆ పాత్రను శుభ్రముగ కడుగుటచేతను, నిప్పులో కాల్చుటచేతను, ఇంగువవాసన పోవునట్లు, శుద్ధాహారముచేతను, దైవ ప్రార్థన చేతను, పాపసంస్కారములు పోయి పుణ్యసంస్కారము లేర్పడుచున్నవి. మత్స్య మాంసాదుల భుజించి రను నొక నెపముచే బ్రాహ్మణేతరులను దూరీకరింపరాదు.

ఏలన! క్షత్రియులలో గూడ చాలామంది మత్స్యమాంసాదులు భుజించువారు గలరు. వారిని ద్విజులలో పరిగణించిరే గాని, ద్విజేతరులనుగా జేసియుండలేదు. వారికి యజ్ఞోపవీత సంస్కారము, వేదాధ్యయనము, తపస్సు–శాస్త్రము విధించుచున్నది. కావున మత్స్యమాంసముల భుజించిరను కారణముచే నీచులనుగా పరిగణింపదగదు. వారికి సంస్కారార్హత లేదని

చెప్పుటకును అవకాశము లేదు. క్షత్రియులలో గూడ మత్స్యమాంసభక్షణము విధియని తలంపగూడదు. బ్రహ్మచర్యాశ్రమమందును, వానప్రస్థమందును, తురీయాశ్రమమందును, పర్వదినములలోను, వ్రతమునలుపు రోజులలోను వారుగూడ భుజింపగూడదనియే శాస్త్రనిర్ణయము. గృహస్థాశ్రమమందున్న అట్టి దుష్టాహారము గలిగియుండునని తలంచి, అట్టి దోషము నశింపక, బ్రహ్మజ్ఞానమున కర్హత గలగదని నిశ్చయించియే, వానప్రస్థము నందు ఫల పత్రాదుల భుజించి, సునిశ్చితమగు వ్రతముతో తపస్సు జేయులాగున శాస్త్రము విధించినది. ''తపసా కల్మషం హన్తి'' అగ్నిలో స్పుటము జేసిన ధాతువు లేలాగున దోషము నశించి శుద్ధములగుచున్నవో, ఆలాగున తపస్సువలన పూర్వ శారీర, మానసిక దోషములన్నియు క్షయించి శుద్ధములగుచుండును. మఱియు క్షత్రియులకు మాంసభక్షణము దోషము కాదని జెప్పి అందఱును భుజింపరాదు. యుద్ధము జేయువారికి మాత్రమే అయ్యది సంబంధించును. అట్టి యోధులు కానివారి కావాక్యము సంబంధింపదు. మఱియు మాంసభక్షణమునకు మాత్రమే అధికారము గలదని చెప్పరాదు. ''వార్ధకే మునివృత్తీనామ్'' అని మనువు విధించినదానిని గూడ మరువకూడదు. అనగా వార్ధక్యదశవచ్చునపుడు వనమున బ్రవేశించి తాపసవృత్తి నవలంబింపవలయును. కావుననే ''నివృత్తిస్తు మహాఫలా'' అని మనువు విధించుటకు కారణమైనది. అనగా మద్యమాంసముల వర్జించువారికి గొప్ప దైవలాభము గలుగునని చెప్పబడినది.

మఱియు హింస మహాపాపమని వేదము చెప్పుచున్నది. హింసలేక మాంసము దొరకనందుచే, హింసాపాపమునకు మాంసభక్షకుడు కారణు డగుచున్నాడు. అందువలన మాంసభక్షణము పాపహేతువగుచున్నది. దయార్ద్ర హృదయము గలుగనివానికి మలినజలములో సూర్య ప్రతిబింబము కనుపింపని చందమున దైవజ్ఞానము గలుగదు.

దయార్ద్ర హృదయము గలుగునపుడే ఆత్మశుద్ధి గలుగును. అపుడు సర్వజీవులును తన వలెనే తోచెడు అవస్థ సిద్ధించును! లేక సర్వజీవరాసులలోను అంతరాత్మయగు సర్వేశ్వరుండు వెలుగుచున్నటుల దర్శనము గలుగును. అత్తరి తన శరీరాంగమువలె సర్వజీవుల శరీరమని బోధగలుగును. అపుడొక ప్రాణికేని క్లేశము గలుగజేయు కార్యములో ప్రవర్తింపడు. ఆ తరుణమున నిర్మలజలము గల పాత్రలో సూర్యప్రతిబింబము స్పష్టముగ గనుపించునట్లు తన హృదయములో వెలుగుచుండు సర్వేశ్వరుని లేక పరమాత్మ స్వరూపమగు తన యాత్మను దర్శింపగలుగును. ఇక బ్రాహ్మణ క్షత్రియాది వర్ణములను గుఱించిన శబ్దములకు గలయర్థమును జూడుడు ''బ్రహ్మ'' అనగా వేదము. దీనిని అధ్యయనము జేయుటవలనను లేక బ్రహ్మమును దెలిసికొనుట వలనను బ్రాహ్మణు డగుచున్నాడు. క్షతములో (దుఃఖములో) నుండు వారికి త్రాణనము (రక్షణము) జేయుటవలన క్షత్రియు డగుచున్నాడు. వ్యాపారాదుల చేయుటచేతనే వైశ్యుడగుచున్నాడు. ఆలాగున శోకముతో అనగా నెల్లపుడు దుఃఖముతోగూడినవాడు శూద్రుడగుచున్నాడు. లేక శుచి, యాచారము లేనందుచేతను శూద్రుడగుచున్నాడు. ఈ ధాత్వర్థము పండితులకే యుపయోగపడును. సామాన్యులుగూడ దెలిసి కొనుట కిటుల వ్రాయబడినది. కావున ధాత్వర్థమును నిరూపింపలేదు. శబ్దస్తోమ మహానిధియను నిఘంటువులో ఈలాగు నిరూపించడమైనది. ఇచట గుణగ్రాహ్యము ముఖ్యమగుటచే పైజెప్పిన స్వభావము గలవారిని ఆయాజాతులని గ్రహింపదగును. మఱియు నిక శర్మ, వర్మ, గుప్త, దాసాది పదముల యర్థము దెలిపెద. శర్మ అనగా నెల్లపుడును సుఖముగలవాడు, వర్మ అన యుద్ధము మొదలగు సమయమున కవచమును ధరించువాడు. ఇచట వజ్రకవచమని గ్రహింపవలయును. దీనిని ధరించువారికి శత్రువులచే ప్రయోగింపబడిన బాణాదులు దేహమునకు తగలవు. గుప్తయనగా ధనమును సంరక్షించువాడు, దాసుడనగా సేవజేయుచు యజమానులచే నీయబడిన

దానిని భుజించువాడు. మఱియు ఆత్మజ్ఞానమును దెలిసినవాడని గూడదాస శబ్దమునకు యర్థము గలదు. శ్రీవైష్ణవులలో గల ''భగవద్దాస'' శబ్దమున కిదే యర్థమును భాగవతులు గ్రహించెదరు. ఇదియు గుణము ననుసరించియే మనము గ్రహింపవలసియుండును.

ఏలన! సర్వవర్ణములలోను, సమస్తదేశములలోను ఇట్టి స్వభావము గలవారు గలరు. ఈ యర్థమును 'శబ్దస్తోమ మహానిధి' యను నిఘంటువునందు నిరూపింప బడినది.

బ్రా:- ప్రియమిత్రుడా! శూద్రుడు బ్రహ్మజ్ఞాని యైనను, మరు జన్మములో వైశ్యుడు గాను, తరువాత జన్మములో క్షత్రియుడు గాను, పిమ్మట బ్రాహ్మణుడుగాను జన్మమెత్తి మోక్షము పొందవలసి యుండునని భారతమందు గలదు.

అ:- మిత్రమా! దీనికన్న శాస్త్ర విరుద్ధముగాను, మహాత్ముల యనుభవము నకు వ్యతిరేకముగ మరియొకటి గలదా! భారతమున బ్రహ్మజ్ఞానము గలిగిన లేక భగవద్భక్తి గలిగిన శూద్రుని గురించి చెప్పిన విషయము కాదు. స్వభావ పరిణామమును గురించి చెప్పినపుడు క్రమముగ నొక్కొక్క జాతియు క్రింది మెట్టునుండి పైమెట్టునకు వెళ్ళుచుండునని తెలపడమైనది. అదిన్నీ, శూద్రగుణము గలవాడు సత్కర్మచే వైశ్యగుణము లోనికని, వైశ్యగుణముగలవాడు క్షత్రియకులములోనికని, క్షత్రగుణము గలవాడు విప్రగుణములోనికని, సదాచారములచే మారవలసియుండునను తాత్పర్యమే అచట నిర్ణయించడమైనది. అదిన్నీ యిపుడు కనుపించెడు దేహమును గురించిన శూద్ర, వైశ్య, క్షత్రియ, బ్రాహ్మణుల గురించికాదు. శాస్త్రమందు బ్రాహ్మణాదు లెట్టి లక్షణము గలిగి యుండవలయునని తెలుపబడియున్నదో అట్టి స్వభావము గలుగవలయునని యర్థము. అది అందఱును అంగీకరించియేయున్నారు. మోక్షము గలుగవలసి యుండిన

బ్రాహ్మణలక్షణ మేలాగున భగవద్గీతలో చెప్పబడి యున్నదో, అట్టి లక్షణము గలుగ వలయునని గ్రహించదగినది. అదిన్ని అనుష్ఠాన సంస్కారాదులచే నొకే జన్మములోనే గలుగును. విద్యార్థియగువాడు ఒక సంవత్సరములో మొదటి తరగతి, మరు సంవత్సరములో రెండవ తరగతి, యీలాగున ప్రతిసంవత్సరము లోను పైపై తరగతులలోనికి వెళ్ళుచుండునటుల, అనుష్ఠాన బలముచే ఈ జన్మలో శూద్రావస్థలో నుండువాడు క్రమముగ వైశ్య, క్షత్రియ, బ్రాహ్మణ గుణములు గలిగి యీ జన్మలోనే ముక్తిని బొందును. వాల్మీక్యాది ఋషులే దీనికి దృష్టాంతము. దీని నిజార్థము చక్కగ గ్రహింపనందుచే ఇట్టి విపరీతార్థమును చెప్పుటకు కారణమగుచున్నది. అట్లు కానిచో మను, విశ్వామిత్ర, జనకాదులు మరల బ్రాహ్మణ కులములో జన్మించి మోక్షమునకు పోవలసియుందురుగదా. ఆలాగున తులాధారాది వైశ్యులు, క్షత్రియ, బ్రాహ్మణ జన్మము లెత్తవలసినవారుగదా? అదేరీతిగ ఉద్ధవ, సూత, విదురాదులు వైశ్య, క్షత్రియ, బ్రాహ్మణ జన్మము లెత్తిన తరువాత మోక్షము బొందవలసి యుందురు గదా. మను, విశ్వామిత్ర, జనకాదులు బ్రహ్మవేత్తలై యుండువారని శాస్త్ర ముద్ఘోషించుచున్నది. మీరు జెప్పినది యెంత అన్యాయమో యోచించుకొనుడు. బ్రాహ్మణేతరులకు శాస్త్రార్థమందు విచారింపశక్తి లేకపోవుటచే, న్యాయవిరుద్ధమైన యిట్టి వాక్యము లేర్పడినవి. ''బ్రహ్మవేదన మాత్రేణ బ్రహ్మైవ భవతి స్వయమ్''.

బ్రహ్మము నరంగన మాత్రముననే స్వయముగా బ్రహ్మమే యగుచు న్నాడనియు, ''బ్రహ్మవిద్బ్రహ్మ భవతి'' బ్రహ్మవిత్తు, బ్రహ్మమే యగుచున్నది. ఇదిన్ని వేదమునందున్నది. మఱియు గీతలోగల శ్రీమద్భగవద్వాక్యమును వినుడు.

**మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాంగతిమ్॥**

ఓ అర్జునా! పాపజన్మములు గల వారెవరు గలరో అట్టివారును, స్త్రీలు, వైశ్యులు, శూద్రులు మొదలగువారందరున్ను, నన్ను ఆశ్రయించి సర్వోత్తమమగు పరమగతిని (మోక్షమును) పొందుదురు. ఈలాటి, శ్రుతిస్మృతి ప్రమాణములు వేలకొలది గలవు. భక్తిగలవా డప్పుడే ముక్తుడు గాగలడని, శాస్త్రము సహస్రముఖములతో జెప్పుచుండగా, మరల నేల సంశయించవలయును. అంతేగాక యెంత మహాపాపియైనను, భగవద్భక్తివల్ల పరిశుద్ధాత్ము డగునని గీతాదిశాస్త్రములు చెప్పుట లేదా!

**అపి చే త్సుదురాచారో భజతేమామనన్యభాక్।**
**సాధు రేవ స మంతవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః॥**

మిక్కిలి నిందితములైన యాచారము గలవాడైనప్పటికిని, అనన్య భక్తిగలవాడై నన్ను (భగవంతుని) భజించినయెడల, అట్టివాడు చక్కని ఆత్మ విశ్వాసము గలవాడు గనుకనే, అట్టివాడు పరమశ్రేష్ఠుడేయని తలంచ దగినవాడు.

**క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి।**
**కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥**

అనన్యచింత గలిగి, విష్ణుస్వరూపుడనగు నన్ను భజించువాడు శీఘ్రముగ ధర్మాత్ముడగుచున్నాడు. సర్వకాలములయందును, పరమశాంతిని (ఉపరతిని) పొందుచున్నాడు. అర్జునా! నాయందు భక్తిగలవాడెవడైనను నశింపడని, అనగా పాపవిముక్తుడగునని కుతర్కవాదుల సభయందు భేరి వాయించి ప్రతిజ్ఞను చేయుము. లేక సూర్యుడు ప్రకాశించునపుడు, రాజవీథులలో గజముపై నగారా వాయించి చెప్పుము. స్పర్శవేది స్పర్శనముచే ఇనుము బంగారమగునట్లు, పరమాత్మాసక్తిగల జీవుడు జ్ఞానమయుడగునను తాత్పర్యమున సందేహము గలుగకూడదని స్థిరముగా తెలుపుట కొఱకే

''ప్రతిజానీహి'' ప్రతిజ్ఞచేసి చెప్పుము అని యుపదేశించెను.

**యథైధాంసి సమిద్ధోగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున।**
**జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా॥**

ఓ యర్జునా! లెస్సగా ప్రజ్వలింపజేయబడిన యగ్నిహోత్రుడు, కట్టెల నేవిధముగా భస్మమొనర్చుచున్నాడో, ఆ విధముగ, జ్ఞానమనెడు అగ్ని సర్వకర్మలను భస్మము చేయును. మఱియు యోగవాసిష్ఠమున చెప్పినది చూడుడు.

**యథైకం చ సువర్ణాది మిళితం రజతాదినా।**
**అల్పమూల్యం ప్రజాయేత తథా జీవోఽవ్యహంయుతః॥**
**యథైవహి సువర్ణాది క్షారాదే శ్శోధితం శుభమ్ ।**
**పూర్వవన్మూల్యతాం యాతి తథా జీవోఽపి సంస్కృతేః॥**

ఏలాగున సువర్ణము వెండి, రాగి, యిత్తడి మొదలగు లోహములతో కలసియుండిన స్వల్పవెలగలది యగుచున్నదో, ఆలాగున జీవుడు గూడ శుద్ధజ్ఞాన స్వరూపుడైనను, అహంకారాదులతో గూడిన యెడల నీచావస్థను పొందుచుండును. హీనలోహములతో గూడిన బంగారము, స్ఫుటము చేత దోషమునశించినదై ఎట్లు శుద్ధబంగారమగుచుండునో, అపు డేవిధముగ శ్రేష్ఠసువర్ణము యొక్క విలువ గలుగుచుండునో, ఆలాగున పాపజీవుడైనను పుణ్య సంస్కారములచే శుద్ధాత్ముడగును. ఈయొక్క దృష్టాంతమును గ్రహించిన మరల పాపవిమోచన విషయమై యేలాటి సందేహమును గలుగదు. ఎంత మురికి వస్త్రమైనను శ్రేష్ఠమైన చవుడు వేసి యుతికిన వర్తమానకాలములోనే ఎట్లు శుభ్రమగుచుండునో సంస్కారమువలన జీవుడును, ఈ జన్మలోనే శుద్ధుడగును. రోగియైనవాడు ఔషధసేవచే ఈజన్మలోనే యెట్లారోగ్యము బొందుచున్నాడో, ఆలాగున బ్రహ్మవిచారముచే, అవిద్యారోగమునశించి, ఈ

జన్మలోనే మోక్షము పొందుచున్నాడని ఆత్మబోధము తెలుపుచున్నది.

**ఏవం నిరంతరకృతా బ్రహ్మైవాఽస్మీతి వాసనా ।**
**హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్ ॥**

సర్వోత్తమమైన యౌషధమును సేవించుటవల్ల రోగములు నశించినట్లు, ఎల్లపుడును బ్రహ్మాత్మైక్యాను సంధానము వల్ల గలిగిన సంస్కారరూపమైన సద్వాసన ఆవరణవిక్షేప శక్త్యాత్మకమైన యవిద్యను బొత్తిగా పోగొట్టునని దృఢముగా నమ్మవలయుననుట. మఱియు భారతమున శివుడు పార్వతికి ఉపదేశించినది చూడుడు.

**శూద్రోప్యాగమ సంపన్నో ద్విజో భవతి సంస్కృతః।**
**బ్రాహ్మణో వా వ్యసద్వృత్తః సర్వసంకర భోజనః।**
**బ్రాహ్మణత్వం సముత్సృజ్య శూద్రో భవతి తాదృశః॥**

శూద్రజన్మమునందు జన్మించినవాడైనను, శాస్త్రసంపన్నుడై బ్రహ్మ విచారణముచేసెనేని ఆత్మసంస్కారమువల్ల బ్రాహ్మణు డగుచున్నాడు. బ్రాహ్మణ కులములో జన్మించినవాడైనను సద్వర్తన రహితుడై, సంకర భోజనుడయ్యెనేని బ్రాహ్మణత్వము లేనివాడై శూద్రుడగుచున్నాడు.

మఱియు మనువు చెప్పినది చూడుడు.

**శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్।**
**క్షత్రియా జ్జాతమేవం తు విద్యాద్వైశ్యాత్త థైవచ॥**

సంస్కారవముచే శూద్రుడు బ్రాహ్మణత్వము నొందును. బ్రాహ్మణుడు అసద్వృత్తుడైనచో, శూద్రత్వము నొందును. ఇట్లే క్షత్రియుడైనను, వైశ్యుడైనను బ్రహ్మధర్మము నవలంబించిన బ్రాహ్మణుడుగాను, శూద్రగుణము నవలంబించిన శూద్రుడుగాను మారుచుండును.

**వృషో హి భగవాన్ ధర్మ స్తస్య యః కురుతే హ్యలమ్ ।**
**వృషలం తం విదుర్దేవా స్తస్మా ద్ధర్మం న లోపయేత్॥**

పూజ్యమైన ధర్మము కోర్కెలనన్నిటిని వర్షించుచున్నది. కావున వృషమనబడును. అట్టి వృషము నెవడు నిషేధించునో వాడే వృషలుడు. (శూద్రుడు) అనబడును. కాని జాతిచే వృషలుడు వృషలుడు గాడు. శూద్రుడు శూద్రుడుగాడు. గనుక ధర్మమును మీరరాదు. అట్టి పవిత్రభావమును బోధించువారు లేకపోయినందుచే ఔషధము నిచ్చువారు లేని రోగుల స్థలమువలె భారతదేశము అజ్ఞాన రోగముచే పీడింపబడినది.

**అజ్ఞానకలుషం జీవం జ్ఞానాభ్యాసాద్వినిర్మలమ్।**
**కృత్వా జ్ఞానం స్వయం నశ్యేజ్జలం కతకరేణువత్॥**

అజ్ఞానమను కాలుష్యముతోగూడిన జీవుడు జ్ఞానాభ్యాసమువల్ల నిర్మలుడగుచున్నాడు. ఎట్లన? చిల్లగింజయొక్క గంధమువలన పంకిలమైన యుదకమెట్లు శుభ్రమగుచుండునో, యిదియును అటువంటిదే యని శ్రీ శంకర భగవత్పాదు లుపదేశించిరి. బురదనీరు చిల్లగింజ గంధముచే వర్తమానమున నిర్మలత్వము నొందనిచో, మలిన బంగారము స్పుటముచే వర్తమానకాలమున మంచి బంగారు కానిచో, చవుడువల్ల మలిన వస్త్రము యీ కాలములోనే శుభ్రత్వము నొందకపోయిన మాత్రమే, సంస్కారముచే జీవు డాజన్మములోనే శుద్ధుడు గాకపోవలసి యుండునని, పల్లెలలోను, పట్టణములలోను, వీథులలోను, సభలలోను, ఉత్సవములలోను, సంతలలోను, రైల్వే జంక్షనులలోను, రెండుచేతులను పైకెత్తి చెప్పేలాగున ధీరులగు పురుషులును, ధీశాలినులగు నారీమణు లేర్పడునపుడే భారతదేశ ముద్ధరింపబడును.

అంతమాత్రము చాలదు. విద్యాతపస్సులచే విజ్ఞానవంతులగు బ్రహ్మచారులును, బ్రహ్మచారిణులును, తన శరీరమున గల రక్తమును

జీవితాంతము వఱకు, ఈయజ్ఞాన కల్పిత మహాభూతమునకు ఆత్మజ్ఞాన బోధన మొనర్చెడు దృఢ సంకల్పము గలిగి, బలి ఇచ్చిన మాత్రమే యీ క్రూరమగు పిశాచమును భరత లోకమునుండి బారద్రోలి, పాతాళలోకములోనికిగాని, ఆకాశవీథిలోనికి గాని పంపగలవు. అట్లుచేయవలసినదే గాని ద్వీపాంతరములోనికిగాని, దేశాంతరములోనికి గాని ఈ క్రూరమగు బ్రహ్మరాక్షసిని యుచ్చాటన జేసి పంపరాదు. ఏలన యీపెనుభూత మెచ్చట ప్రవేశించునో ఆదేశమునకు, భారతదేశమునకు వలె బానిసతనము గలుగజేయును. మరల నచ్చటినుండియు, జాతి వర్ణమును అది నిర్మించుచుండును. ఇంతేగాక, మరికొన్ని వింత, వింత వాక్యములను పలుకువారలు గలరు. అదేమన స్త్రీ లెవ్వరైనను, మరల పురుష జన్మము నెత్తిన మాత్రమే మోక్షము గలుగునని వచింతురు. ఇదిన్నీ పైజెప్పినట్లు కపోల కల్పిత వాక్యములే. అట్లయినచో మైత్రేయి, గార్గి, చూడాల, మదాలస మొదలగు వారి గతి యేమి? చాందోగ్యాది ఉపనిషత్తులయందు వారు జీవన్ముక్తురాండ్రని చెప్పబడినది. కాబట్టి యివియన్నియు కల్పితగాథలు. ఈవిషయమై యిదివరలో పురుషులను గురించి యేదృష్టాంతము చెప్పబడెనో, ఆలాగున నిచ్చటగూడ గ్రహించదగినది.

బ్రా:– సంస్కారముండినగదా శూద్రు లున్నతస్థితిని పొందగలరు. వారికి సంస్కారాదులు బొత్తిగా లేవు! శాస్త్రము విధించలేదు. అప్పు డెట్లు పవిత్రు లగుదురు?

అ:– సంస్కారము లేని మతము ప్రపంచములో లేదు. సంస్కారము లేని మతము దుర్మతము. అంతేగాక అది దైవమతము కాదు. పైశాచిక మతము. అట్టి మతము ఆత్మద్రోహమును, దేశద్రోహమును గూడ నగును. ఇది రోగము గలహారికి ఔషధ మివ్వరాదు. ఏలన వారి వారి పాపకర్మలవల్లనే వ్యాధి గలిగెను. అందువలన నద్దానిని అనుభవించియే తీరవలయునని చెప్పెడు వారుండిన

అట్టివారికే చెల్లును. మఱియు బాల్యకాలమున ప్రాథమిక తరగతిలో చేరిన విద్యార్థి జీవితాంతము వఱకదే తరగతిలోనే చదువవలయును. శైశవావస్థలో పెట్టెడు ఆహారమే యౌవనకాలములోగూడ నుండవలయును. ప్రప్రథముననే చిన్నయుద్యోగములో ప్రవేశించునో వారి అంత్యకాలము వర కా పనియే యుండవలయునని యే పాపమతము బోధించునో అట్టి మతము యెంత యౌన్నత్యమునకు వచ్చునో, అట్టి మతము భూలోకములో నుండిన అట్టివారికే యిట్లుపదేశము చేయవలయును. ఇట్టి నియమము పశవులలోను, పక్షులలోను. వృక్షములలోను గూడలేదే! వృక్షములలో ఫలించెడు మామిడికాయలు లేత్రాయమున చేదు, వగరులుగాను మధ్యకాలమున పుల్లగాను, పండు కాలములో మధురముగాను, ఎట్లు ఒకే జన్మములోనే గలుగుచుండునో, ఆలాగున పాపజన్మము గలవారైనను, పుణ్యసంస్కారములచే నీ జన్మములోనే తమోగుణము నశించి రజోగుణములోకి ప్రవేశించి యచ్చటనుండి సత్త్వగుణములోనికి చేరగలుగుదురు. ఇదే సంస్కారములచే గలిగెడు మార్పని గ్రహించదగినది. ఇదివరలో చెప్పిన మలిన వస్త్రమును చాకలి వాడెట్లు చవిటిచే శుద్ధపరచునో, ప్రత్యక్షముగా సంస్కారము యొక్క ఫలమును చూడుడు. కావున ప్రతివారును బాల్యకాలమునుండి బ్రహ్మచర్యాది వ్రత సంస్కారములు గలిగియుండ వలయును. అపుడు మాత్రమే జీవుడు శుద్ధ సంస్కారము గలవాడగును. అపుడు స్ఫుటముచేసిన బంగారువలెను, సానబట్టిన రత్నమువలెను జీవుడు శుద్ధుడగును. అంతేగాక సానబట్టిన కత్తివలె, బుద్ధి సూక్ష్మ గ్రహణశక్తి గలదియై యజ్ఞాన లతాకుంజమును ఛేదింప శక్తిగలుగును. మఱియు అగ్నిసంస్కారమువలన విషము నశించిన ధాతువువలె నిర్విషయస్థితి గలుగును. ఇప్పుడు భూలోకములో ఏజాతి యున్నతస్థితిలోనికి రాజాలక యుంటున్నదో, అది వారిని సంస్కరించువారు లేని కారణముచేతనే అట్టి దీన దశలో నుండుటకు కారణమేకాని, వేరే యే దోషమునుకాదు, పాపమునుకాదు. బ్రాహ్మణజాతులును సంస్కారము లేనిచో ఇట్టి దీన స్థితిలోనికి రాగలుగును.

జాతి జన్మచేతనే గలుగునని చెప్పినచో ద్విజాలకును బ్రహ్మచర్యము, ఉపనయనము, అధ్యయనము తపస్సు లేకనే యున్నతస్థితి గలుగవలసి యుండును. అదే ప్రకారము ఇతరులను గూడ ఏల సంస్కరించగూడదు! అట్లు సంస్కారముగల బ్రాహ్మణేతరులు, స్త్రీలును, బ్రాహ్మణునివలె యోగ్యులు గాకపోయిరా? అనగా ఉన్నత విద్యలో నుత్తీర్ణులు గాలేరా? ఇది అన్నిటిలోను ఆలోచించుకొనిన చాలును? రోగశాంతికి దగిన ఔషధ పథ్యంబుల నివ్వక, వ్యాధి బాగుపడలేదని చెప్పెడు వాక్యమునందెంత గూఢార్థము ఇమిడియున్నదో, దీనియందుగూడ నంతేసారము గలదు. సర్వేశ్వరుండు సత్యస్వరూపు డగుటచేతనే, స్వాతంత్ర్యము సర్వజనులకు వారి వారి గుణములనుబట్టి యివ్వనందుచేతనే, యీలాగున పాలించిన హిందూరాజులును బాతాళమునకు త్రొక్కబడుటకు కారణమైనది. తన భూమియందు తానే విత్తనము పెట్టునో, అదే తనకు ఫలించునట్లు, ఎవరు ఇతర జనులు తమకు బానిసలుగా నుండవలయునని తలచిరో కట్టకడకు వారే బానిసలైరి. ధర్మముయొక్క సార మిట్టిదే. ఇతరుల కొరకు మీరేమి సంకల్పించెదరో అదే మీకు గల్గును. ఇది ఇపుడు భారతదేశ చరిత్రముచే స్పష్టమయినది గదా! ఏలన ''యద్భావం తద్భవతి'' ఒకరి క్రింద యొకరుండ వలయునని యెంతకాలము వర కతని హృదయములో సంకల్పము గలదో, అంతవరకతడు మరియొకని క్రింద నుండియే తీరవలయును. ఈ తత్త్వమును గ్రహించిన స్వరాజ్యమేల రాలేదను ప్రశ్నకు తనలో నుండియే జవాబు లభించును. ఆలాగుననే స్వారాజ్యమగు (ఆత్మ రాజ్యమగు) మోక్షముగూడ యేల గలగలేదని ముముక్షువులు పరితపించనక్కరలేదు. ఇతర ఆత్మలను, తన ఆత్మవలె చూడనందుచేతనే మోక్షము గలుగలేదని యంతరాత్మనుండి సమాధానము లభింపగలుగును.

**సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని।**
**సమం పశ్యన్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి॥**

అని యుపనిషత్తు బహుకాలము నుండి యుపదేశించుచున్నది.

సమస్త భూతములలో గల యాత్మను తన యాత్మగాను, సమస్త భూతంబుల ఆత్మవలెనె తన యాత్మయు గలదవెడి, జ్ఞానమెప్పుడు గలుగునో అట్టి ఆత్మయజ్ఞము చేయువాడు ఆత్మరాజ్యమును (మోక్షమును) పొందగలుగును. ఇట్టి యవస్థ గలుగువరకు మోక్షము లేదని శ్రుతియే యుపదేశించుచున్నది.

బ్రా:- చాతుర్వర్ణ్యమును సాక్షాద్భగవంతుడే యేర్పరచెనని గీతాది శాస్త్రములు నిర్వచించుచుండగా, గుణముచేతనే కులమని మీరెట్లు చెప్పగలరు? అట్టి వర్ణవిభాగము కూడ, యేదో భగవంతుని యిష్టప్రకారము చేయబడినదని చెప్పక సరియైన కారణమును చూపియే వచించియున్నారు. చూడండి.

**చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః।**
**తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్॥**

నాచేత బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులను వర్ణచతుష్టయము, సత్వాదిగుణముల యొక్కయు, తపశ్శమదమాది కర్మలయొక్కయు విభాగముల చేత సృజింపబడెను. ఆ సృష్టి కర్మమునకు కర్తనైనను, నన్ను కర్తను గానివానిని గాను, నాశనము లేనివానినిగాను తెలుసుకొనుము. ఈ గుణకర్మలు, జన్మాంతర ముల సంస్కారమును బట్టియే భగవంతుడు చేసెను గాని, బ్రాహ్మణులయందు రాగముచేత గాని, శూద్రులయందు ద్వేషముచేతగాని చేయలేదని తెలుపుట కొఱకే ''గుణకర్మ విభాగశః'' అని స్పష్టపరచుటకు కారణమైనది. కావుననే ''కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్'' అని విశదీకరించినాడు. అట్లు దీర్ఘాలోచన చేయక భగవంతుడు చెప్పినది కాదు. ఏలన భావికాలములో ప్రత్యక్ష ప్రమాణమును,

యుక్తివాదమును గలవా రుదయించెదరు. అప్పటికిని భగవంతుడు చెప్పిన వాక్యమున్ను, సనాతనముగా నుండవలయునని తలంచియే గుణకర్మల నిరూపించడమైనది. దీని కెవరేమి చేయగలరు?

అ:- ప్రశాంతమూర్తీ, ఏకార్యమైనను స్వశక్తి యందు అనగా స్వబుద్ధి యందు నిలచి, సత్యము నందాధారపడి యాలోచించిన మాత్రముననే నిజమేర్పడగలదు. అట్లు గాక, యిదివరలో ఎవ్వరైన వ్రాసియుండు అర్థముపై ఆధార పడియుండుటయు; నొక విధమగు పరాధీనతయే యగును! అయితే అట్లు చేయుట గూడ నొకవిధమగు భక్తియే యగును. కాని సత్యదృష్టిమాత్రము గాజాలదు! ఏలాగున, శ్రీ శంకరులు, శ్రీ రామానుజాలు, శ్రీమధ్వులు మొదలగువారు స్వబుద్ధితో నిలచి, బాగుగా నాలోచించినందుచేతనే, వేర్వేరు అభిప్రాయము లేర్పడుటకు కారణమైనదో, ఆలాగున శ్రీ ఏసుక్రీస్తు, శ్రీ మహమ్మదు, శ్రీ బుద్ధుడు మొదలగు ప్రవక్తలును నిర్మలమగు స్వబుద్ధితో నిలిచి యాలోచించినందుచేతనే, వారి యభిప్రాయములలో మార్పు గలుగుటకు కారణము. ఇట్టి స్వభావము వర్తమాన కాలములోనే కాదు, పూర్వయుగములలో గూడ శ్రీకపిలుడు, శ్రీవ్యాసులు, శ్రీజైమిని, శ్రీపతంజలి, శ్రీనారదుడు మొదలగువారు గూడ స్వమతములను ప్రతిపాదించిన వారలే. వారిలోను కొన్ని కొన్ని మార్పులు కనబడుచున్నవి. మఱియు శ్రీ శంకరులు మొదలగువా రాయా కాలానుగుణముగ ప్రవర్తించియుందురు. అట్లయిన మాత్రమే వారి మతము ప్రచారమునకు వచ్చును. అదియును గాక అప్పటి పరిస్థితి కది సరిగానే యుండును. సర్వేశ్వరుని సంకల్పముగూడ ఆలాగుననే యుండవచ్చును. ఒకడు రోగావస్థలో నుండునప్పుడు లేక బాల్యావస్థలో నుండిన, లేక ఆరోగ్యము గలిగిన తర్వాత లేక యౌవనకాల మువచ్చినప్పుడేలాగున ఆహార పానీయ స్నానాదులలో మార్పు గలుగుచుండును. ఇదిన్నీ యొక విధమగు రాజకీయ పాలనము ననుసరించియే జరుగుచుండును.

హిందూరాజులు రాజ్యమును పాలించునపుడుండు నియమములకు, మహమ్మదీయ పాలనములో గల నియమములకును, ఇంగ్లీషువారి పరిపాలనములో గల నియమములకును ఏలాగున మార్పులు కనబడుచున్నవో, ఆయా రాజులు పాలించునపుడాయా నియమములు ఎట్లు పాలించవలసి యుండునో, కాలముయొక్క స్థితి యీలాగున నుండును. అయితే వేదము సనాతనము గదా, దానికి మార్పు గలుగవచ్చునా యని సందేహింప నవసరము లేదు. వేదముయొక్క మూలతత్త్వమునకును, ముఖ్యానుష్ఠానమునకును మార్పు గలుగదు. కాని తక్కిన సామాన్య ఆచరణము లన్నియు దేశ కాలముల ననుసరించి మారుచుండును. ఈ సత్యమును గ్రహించిన సృష్టిలో గల మార్పులన్నింటిని సమన్వయము చేసుకొనవచ్చును. భారతీయమత గ్రంథములు, స్మృతులు, పురాణములు మొదలయిన వన్నియు హిందూరాజులు రాజ్యము నేలునపుడు వ్రాసినవే. ఆకాలము కులమును బట్టియే వర్ణాశ్రమములలోను బోధించుచువచ్చెను. అట్టి వర్ణాశ్రమములను పాలించుట రాజుల ధర్మమనిగూడ తెలుపుచుండెను. గ్రంథము వ్రాసిన వారిలోను, మతము బోధించువారిలోను బ్రాహ్మణులే యెక్కువమంది యుండిరి. కావున వారందరును జాతిని గురించి యేకాభిప్రాయము గలిగియుండిరి. బ్రాహ్మణేతరులలో శ్రుతి, స్మృతుల నిజార్థమును విచారించుటకు తగిన విద్యయు, తపస్సును లేకయుండెను. వెయ్యేల? శూద్రులు శ్రుతి స్మృతులను పఠింపరాదని శాసనముండెను.

అంతే గాదు. వేదమును వినినచో సీసమును, లక్కయును కరిగించి చెవిలో పోయవలయుననియు, వేదవాక్యము నుచ్చరించిన నాలుక కోయవలయుననియు, వేదార్థమును ధారణజేసిన హృదయమును చీల్చవలయుననియు శాసనముండెను. అక్కటా యెంత పాపము! సత్యదృష్టితో జూచిన అట్టి కాలములో ప్రపంచము స్వర్గసమానమనియు, కృతయుగమనియు ఎట్లు చెప్పగలిగిరి ? ఏలన, వర్తమానకాలములో

గుణకర్మల ననుసరించి, మనుజులకు స్వాతంత్ర్యము గలదు. గుణకర్మలకు స్వాతంత్ర్యము లేనిది సత్యదూరముగదా! సత్యదూరమగుటచే నది యసత్యమని యేల చెప్పకూడదు? అసత్యప్రవర్తనగల యుగమెట్లు సత్యయుగము (కృతయుగము) అని చెప్పగలిగిరో, దూరూహ్యముగా యున్నది. మీ రుదాహరించిన శ్లోకములోగల ''గుణకర్మ విభాగశః'' అను ప్రయోగము చాల యగాధమైనది. దానియొక్క అర్థము విశ్వతోముఖముగా వ్యాపకమైనది. దానియందు జన్మాంతర గుణకర్మల ననుసరించి ''చాతుర్వర్ణ్యం మయా సృష్టం'' అని యెచట గలదు? జీవుల యొక్క పుట్టుకలో గల గుణకర్మల ననుసరించి నాలుగు వర్ణములును విభజించబడెనని యేల చెప్పకూడదు? అట్లయినచో నది సుందరమైనది. ఎంత సత్యమైనది. ఎంత ఆనందమైనదిగా నుండును! అట్లయినచో, దానికి యే యుగమందును ప్రశ్న గలుగదుగదా! గుణకర్మల ననుసరించియే చాతుర్వర్ణ్యముల విభాగము గలిగె నని భారతమందుగల భృగు భరద్వాజుల ప్రశ్నోత్తరములలో తెలిపినదే నిజమైనది. శాస్త్రములలో గూడ గుణకర్మల ననుసరించియే జాతిగలదని తెలిపెడు వాక్యములు అనేకములు గలవు. అయితే దానిని బయటకు తీసి, జనులకు తెలిపెడివారు లేకపోయిరి. శాస్త్రములో ఈ పరమసత్యమును మూసిపెట్టి యుండినట్లు గ్రహించుటచేతనే శ్రీబుద్ధదేవుడు అసత్య ప్రవర్తనలో సౌఖ్యము ప్రస్తుతము గనుపించినను ఇది విషయుక్త క్షీరాన్నమువలె భావిజీవితమును నశింపజేయునని తలంచియే సత్యమును బోధించుట కొరకీ మతమును, ఈ బౌద్ధగ్రంథములను విరచించి బౌద్ధమతము నిర్వాణప్రాప్తికి సుఖకరమయినదని జనులకు బోధించుటకు కారణమైనది. అదే రీతిగ శ్రీదయానంద సరస్వతిస్వామియు, వర్తమాన హిందూమతములో గల సత్యమును జనులు గ్రహింపజాలకున్నారని తలంచి, బుద్ధదేవునివలె, వేదమును, దైవమును త్రోసివేయక వేదములపై, సర్వేశ్వరునిపై హిందూమత ప్రవర్తకులు కల్పించియుండు దోషములను మాత్రము తొలగించి, సత్యార్థమును

ప్రకాశింపజేసిరి. కావుననే " సత్యార్థప్రకాశిక" వ్రాయుటకు కారణమైనది. ఇదే ఆర్యమతము.--

జన్మాంతర గుణకర్మల ననుసరించియే చాతుర్వర్ణ్య విభాగమేర్పడినదని చెప్పినచో భగవద్వాక్యమే మిథ్యయగును. ఏలనన, సత్త్వగుణముచేతను, శమదమ తపస్సులనెడు కర్మలచేతను, బ్రాహ్మణులు సృష్టింపబడిరని చెప్పినచో, ఇప్పుడుండు బ్రాహ్మణులందరును సత్త్వగుణాధిక్యము శమదమాది గుణములు గలిగి యుండవలసియుండును. ఆలాగున సత్త్వగుణము కొంచెముగాను, రజోగుణమధికముగా గలిగి, శౌర్యాదిగుణవములు మెండుగాగలవారు క్షత్రియులని చెప్పినచో క్షత్రియులందరు నాలాగున యుండవలసియుండును. ఆలాగున సత్వరజస్తమో గుణములచేతను, కృష్యాదికర్మలచేతను వైశ్యులేర్పడిరని చెప్పినచో, వైశ్యులందరిలోను ఇట్టి గుణమే గలిగియుండవలయును. ఆలాగున రజోగుణ మల్పముగాను, తమోగుణమధికముగాను, పరులసేవక వృత్తిచే వారిచ్చెడు అన్నముచే జీవించెడు కర్మ గలవారు శూద్రులైనచో, ఇపుడుండెడు శూద్రులందరు నాలాగుననే యుండవలయును. దీనినెవరైన లోకములో నాలుగువర్ణములలో చూపగలరా? పైన చెప్పిన నాలుగువిధములగు కర్మలును, నాలుగు వర్ణస్థులలోను కనబడుచున్నవి గదా! దీని కేమి సమాధానము చెప్పగలరు? ఇది యింతటితో పోనిచ్చిన, అంత బాధాకరము గాదు గాని, క్రిందజాతిలో నుండువారు పైపై జాతిలోనికి వెళ్ళుటకు తగిన విద్యాజ్ఞాన, సంస్కారాదులకు గూడ అర్హతలేదని చెప్పుటకన్న, అకటా! మరియొక ఘోర పాపము గలదా? ఇది యెట్టి దూరాలోచన లేని కార్యమని చెప్పవచ్చును. అందువలన గదా భారతదేశము సహస్రసంవత్సరములనుండి బానిసతనము నొందవలసి వచ్చెను. సంస్కారాదులకుగూడ నర్హత యివ్వనిచో, జీవులెట్లభివృద్ధికి రాగలరను పరమతత్త్వమునుగూడ ఆలోచించుటకు తగిన మేధాశక్తి, భారతదేశ మతకర్తలకు లేకపోయెను గదాయని విచారణచేయగా,

ఎవరి మనసు కరుగకుండును? రోగగ్రస్తునకు ఔషధమే యివ్వగూడదని విధించిన మతము దుర్మతము కాదా! జన్మాంతర సత్త్వ, రజో, మిశ్ర, తమస్సులననుసరించియే, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను సృష్టించెనని చెప్పినచో, వారికి తరతరములవర కట్టి గుణములలో మార్పు గలుగకూడదు. ఏలననగా గుణములు నైజములైనచో ఎప్పటికిని మార్పు గలుగకూడదు.

సృష్ట్యాదినుండి వచ్చుచుండు గోవు, అశ్వము, గజము, వ్యాఘ్రము, వీటియొక్క స్వభావము నేటికిని ఆలాగుననే యుంటున్నది. సత్త్వగుణము గల గోవును, రజోగుణముగల వ్యాఘ్రమును, మిశ్రగుణముగల యశ్వమును, తమోగుణము గల సూకరమును సృష్ట్యారంభమునుండి నేటివరకు అట్టి స్వభావము గలిగియే యున్నవి. ఇంకను అలాగుననే యుండగలవు. ఇదివరలోను అలాగుననే యుండెను. భూత భవిష్యద్వర్తమాన కాలములలోగూడ వాటికి మార్పు గలుగదు. ఆవిధముగ సత్త్వగుణము గల హంసయు, రజోగుణముగల డేగయు, మిశ్రగుణముగల పావురమును, తమోగుణముగల రాబందు (బోరువయు) ను సృష్ట్యారంభమునుండి నేటివరకు స్వభావములో మార్పు నొందలేదు. అదేవిధముగ సత్త్వగుణమగు మాధుర్యముగల కదళీఫలమును, రజోగుణముగల చింతపండును, మిశ్రగుణముగల మామిడిపండును, తమోగుణముగల ముష్టిపండును సృష్ట్యారంభమునుండి నేటికరకు వాటి గుణములను విడువకనే వచ్చుచున్నవి.

ఇక కల్పాంతము వరకవి అటులనే యుండును. అదే రీతిగ పూర్వజన్మ గుణకర్మల ననుసరించి బ్రాహ్మణాది చతుర్వర్ణములు సృష్టింపబడినవని చెప్పిన, ఇదివరలో వచ్చిన ప్రశ్నలన్నియు వచ్చును. ఈ జన్మలోగల గుణకర్మల ననుసరించియే చాతుర్వర్ణ్య మేర్పడినదని చెప్పినచో, ఏకాలమందును దానికాక్షేపము గలుగదు. ఇంత సుగమ మార్గముండగా పూర్వజన్మ గుణకర్మలచే చాతుర్వర్ణ్య సృష్టి యేర్పడినదని కంటకావృత దుర్గమ

కల్పిత మార్గమునేల యనుసరించ వలయును? మఱియు, ''తస్య కర్తారమపి మాం'' అని భగవంతుడు చాల జాగ్రత్తతో యీ పదమును ప్రయోగించి యున్నాడు. తనపై నేలాటిభారము నుంచుకొనక యర్థమును చెప్పు వారిపై భారమునుంచిరి. ''విద్ధ్యకర్తార మవ్యయమ్'' తాను కర్త కాడనియు, తాను సనాతనమగు అవ్యయుడ ననియు పలికిరి.

దీనికి మరియొక అర్థము గూడ గలదు. జీవకోట్ల సత్త్వగుణ, తపోఽధ్యయన, కర్మ విభాగముచే చాతుర్వర్ణ్యము భగవంతునిచే సృష్టింపబడె ననియు, దానికే తాను కర్తయనియు, అట్లు గాక జన్మాంతర గుణకర్మల ననుసరించి చాతుర్వర్ణ్యమును సృష్టించెనని యెవ్వరైన చెప్పినచో తాను దానికి కర్త కాడనియు, ఏలన భగవంతు డవ్యయు డగుటచే సత్యరూపుడై నందువల్ల అట్లు చెప్పెననియు గలదు. కనుకనే ''విద్ధ్యకర్తార మవ్యయం'' అని నిరూపించుటకు కారణమైన దనియు విజ్ఞులలో కొందరు చెప్పుచున్నారు. పూర్వ జన్మ గుణకర్మల ననుసరించి, చాతుర్వర్ణ్యము భగవంతునిచే చేయుబడినదని చెప్పినచో, ఇప్పుడాలాగున చెప్పువారు వర్ణవిభాగ వైషమ్యదోషము తమపై లేకుండ భగవంతునిపై మోపెదరని–శ్రీ భగవానుడు ముందుగా నూహించియే తాను దానికి కర్త కాడని చెప్పుటకు కారణమైనది. అర్థము చెప్పెడివారు తాము నిర్దోషులుగా నుండదలంచి భగవంతుని కర్తగా చేసి, ఆ దోషమును పరమపావన మూర్తియగు భగవంతునిపై మోపదలంచినను, భగవంతుడు నిర్దోషి యనియు, అర్థము వ్రాసినవారియందే యీ దోషము గలదని యిప్పటికి స్పష్టమైనది.

శ్రీ కృష్ణభగవంతుడు త్రికాలజ్ఞాని యగుటచే, ఈ సత్యమును ముందుగానే తెలిసికొని, నేను కర్త గానని విస్పష్టముగా చెప్పుటకు కారణము. ఈ విషయమై పదునెనిమిదవ అధ్యాయములో చాతుర్వర్ణ్యము స్వభావముల జెప్పునపు డుపదేశించిన దానిని చూడుడు.

**బ్రాహ్మణ క్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప! ।**
**కర్మాణి ప్రవిభక్తాని, స్వభావప్రభవైర్గుణైః ॥**

ఓ ఫల్గునా ! బ్రాహ్మణులకును, క్షత్రియులకును, వైశ్యులకును, శూద్రులకును పూర్వజన్మ సంస్కారము కారణముగా గల సత్త్వ, రజో, మిశ్ర తమోగుణములచేత, కర్మలు బాగుగా వేరు చేయబడినవి. ఇచ్చటను "స్వభావ ప్రభవైర్గుణైః" అని యుండుటచే జన్మాంతర స్వభావముచే నుద్భవించిన గుణములవల్ల చాతుర్వర్ణ్యములు సృజింపబడినవని స్పష్టముగా చెప్పియున్నారు. ఇదివరలో చెప్పిన గోవు, హంసము, అరటి మొదలగు చరాచరముల స్వభావములు నిరూపించడమైనది. స్వభావము గుణమును విడిచియుండదు. ఇదే పరమార్థ సత్యము. స్వభావమును గురించి శ్రీ శంకరులాత్మబోధములో చెప్పిన దానిని చూడుడు.

**ప్రకాశోఽర్కస్య తోయస్య శైత్య మగ్నేర్యథోష్ణతా ।**
**స్వభావ స్సచ్చిదానంద నిత్యనిర్మలతాఽత్మనః ॥**

సూర్యునికి ప్రకాశమును, నీళ్ళకు చల్లదనమును, అగ్నికి ఉష్ణత్వమును స్వతస్సిద్ధమైన స్వభావమైన ట్లాత్మకును, సచ్చిదానంద నిత్యనిర్మలతాదులే స్వరూపమని (స్వభావమని) ముముక్షువు తెలుసుకొనవలయుననుట. ఇదే రీతిగ జన్మాంతర సత్త్వ శమదమాది స్వభావములచే, బ్రాహ్మణాది నాలుగు వర్ణములు ఏర్పడినవని చెప్పినచో, ఇపుడు భగవంతుడు క్రింద నిరూపించెడు స్వభావగుణములు గలిగి యుండవలసియుండును.

**శమో దమస్తపశ్శౌచం క్షాంతిరార్జవ మేవ చ ।**
**జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్ ॥**

అంతరింద్రియ నిగ్రహమగు శమమును, బాహ్యేంద్రియ నిగ్రహమగు దమము, కాయిక, వాచిక, మానసికములను మూడువిధములైన తపస్సును, బాహ్యాభ్యంతర శుద్ధియును, సహనమును, మనోవాక్కాయ కర్మల యేకత్వమనెడు ఋజుత్వమును, శాస్త్రీయ జ్ఞానమును, బ్రహ్మాత్మైక్యానుభవ విజ్ఞానమును, అస్తిక్యబుద్ధియును అను నీసముదాయము స్వభావసిద్ధమైన బ్రాహ్మణజాతియొక్క లక్షణము.

ఈ శ్లోకములోను ''బ్రాహ్మం కర్మ స్వభావజం'' అనుటచే స్వభావముగ జనించిన శమదమాది గుణముగలవారు బ్రాహ్మణులని తెలియదగినది. ఇట్టి గుణములు ఎవరియందు స్వభావముగ, నుంటున్నవో, అట్టివారిని స్వభావముగ బ్రాహ్మణులని గ్రహించదగినది. జన్మనా యిట్టి స్వభావములు గలవారు; జన్మాంతర పుణ్య సంస్కారముచే బ్రాహ్మణులుగా పుట్టినవారే. ఒకవేళ జన్మాంతర సంస్కారము సంపూర్ణముగ శుద్ధము గాక కొంచెము రజోగుణ, తమోగుణములు గలవారు ఈజన్మములో ధ్యాననిష్ఠాది సంస్కారములచే, రజస్తమోగుణంబుల నశింపజేసి, సత్వగుణము గలిగి, శమదమాదులు గలుగునపుడే బ్రాహ్మణత్వమున కర్హులగుదురు.

**శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం, యుద్ధేచాప్యపలాయనమ్।**
**దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్॥**

పరాక్రమమును, తేజస్సును, ధైర్యమును, (గొప్ప యాపదయందుగూడ దేహేంద్రియ సముదాయమునకు పిఱికితనము తోచకుండుట) కార్యనిర్వహణ సమర్ధతయు, యుద్ధమునందు శత్రువులచే భీతినొంది పారిపోకుండుటయును, దానమును, ఈశ్వరభావమును, (ప్రజలను పాలించుటలో శ్రద్ధయును కావున యీశ్వర భావమని ప్రయోగించడమైనది). ఈశ్వరు డేలాగున సకల ప్రాణికోట్లను సూర్యరశ్మి, వాయువు, వర్షములచే సమానముగ సంరక్షించుచుండునో ఆవిధముగ

సర్వజీవరాసులను, కన్నబిడ్డలవలె, సంరక్షించెడు స్వభావము క్షత్రియుల కర్మ. దీనియందు గూడ ''క్షాత్రం కర్మ స్వభావజం'' స్వభావముగ నిట్టిగుణములు గలవాడు క్షత్రియుడగును.

కృషిగోరక్షవాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥

భూమి దున్నుటయును, పశువుల గాచుటయును, క్రయ విక్రయ రూపకమగు వ్యాపారమును, స్వభావసిద్ధమైన వైశ్యజాతియొక్క కర్మము. ఇచ్చటను ''వైశ్యం కర్మ స్వభావజం'' అని చెప్పుటచే స్వభావముగ పై జెప్పిన గుణములుగల వానిని వైశ్యునిగా గ్రహించుకొనవలయును. మఱియును సేవకవృత్తి రూపమగు కర్మము శూద్రునకు స్వభావము. ఈ వాక్యమందును ''శూద్రస్యాపి స్వభావజం'' అని యుండుటబట్టి స్వభావముగ పరులసేవించి జీవించెడు స్వభావముగలవాడు శూద్రుడని గ్రహించుకొనవలయును. దీనియందు నాలుగు జాతులను గురించి చెప్పినపుడు నాల్గింటిలోన. ''స్వభావజం స్వభావజం'' అని వచించుటవల్ల, అట్టి గుణముగల వా రట్టి జాతులలో చేరిన వారని తెలియదగినది. స్వశక్తివల్ల పరాధీనము లేక స్వయముగ కార్యమును నిర్వహించెడు శక్తి లేనివారలై పరాధీనులై పరుల ప్రేరణ ననుసరించి పనిజేయుచు, దాని వలన జీవించు వారందరును శూద్రులని గ్రహించుకొనవలయును. ఈ స్వభావ గుణములనుబట్టి చూచిన ఇపుడు భరతఖండమున నెంతమంది బ్రాహ్మణులు, ఎంతమంది శూద్రులు గలరో తెలియగలరు. ఇదే భగవంతుడు వచించిన చాతుర్వర్ణ్య స్వరూపమని తెలియవలయును. ''స్వభావ'' అని ప్రయోగించుటచే విజ్ఞులు, పండితులు ఎట్లయినను అర్థమును చేసుకొనవచ్చును. అందువలననే శాస్త్రమందుగల యర్థమును తెలుసుకొనుటకు ప్రయాసమైనది.

బ్రా:– పుణ్యవిశేషముచే బ్రాహ్మణజన్మము గలుగునని చెప్పెడు వాక్యములో మీకు నమ్మకము లేదా?

అ:– సుకృత విశేషముచే మాత్రమే బ్రాహ్మణజన్మము గలుగునని చెప్పిన శాస్త్రమందు విశ్వాసము నాకు గలదు. అయితే వ్యవహారములో గల బ్రాహ్మణ జాతియని చెప్పెడు వాక్యమందు విశ్వాసము లేదు. బ్రహ్మజ్ఞానమే బ్రాహ్మణ చిహ్నమని చెప్పెడి వాక్యమందు మాత్రము దృఢవిశ్వాసము గలదు. ఏలన!

**పాపం వినా శరీరస్య దుఃఖం నాస్తి పదే పదే।**
**యత్కించి ద్దృశ్యతే దుఃఖం సర్వం పాపసముద్భవమ్॥**
**స్థూలం చై వాథసూక్ష్మంచ దుఃఖం పాపసముద్భవమ్।**
**అపాపం చ యదా స్యాద్వై శరీరం సుఖభాజనమ్॥**

పాపము లేనిచో శరీరమున కప్పుడప్పుడు దుఃఖము గలుగుట కవకాశము లేదు. కొంచెమైనను దుఃఖము గలిగిన, నది పాపముచే నేర్పడినది. అట్టి దుఃఖము స్థూలదేహసంబంధమైనను, సూక్ష్మదేహ సంబంధమైనను కొంచెమైనను, గొప్పదై నను అది పాపము వలననే యుద్భవించినది. ఎప్పుడు పాపము నశించునో అపుడు దుఃఖము గూడ నశించును. ఇదియే దానికి గురుతు. ధర్మశాస్త్ర ముపదేశించిన దానిని చూడుడు.

**జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః।**
**వేదపాఠాత్తు విప్రస్స్యాద్బ్రహ్మజ్ఞానాత్తు బ్రాహ్మణః॥**

ఇదే నిజమైన భావము. ఒక జన్మములోనే నాలుగవస్థలుగలవు. అట్టి అవస్థలను గురించియే నాలుగుజాతులుగా అనగా జీవితమును నాలుగు భాగములుగా చేయడమైనది. దీనిని బాల్య, కౌమార, యౌవన, వార్ధక్యము లనెడు నాలుగంతస్తులుగా శాస్త్రములో వర్ణించడమైనది. ప్రతివారును

బాల్యావస్థలో శూద్ర స్థితిలోనే యుందురు. శౌచాచారములు లేనివారిని శూద్రులుగా శాస్త్రములో వర్ణించిరి ఇది నిక్కము. చాతుర్వర్ణ్యస్థులలో నెవరికైనను బాల్యకాలమున శౌచాచారము లుండవు. అంతే కాదు, స్వశక్తిచే జీవింపజాలరు.

అందువలన మాతా పితరుల సంరక్షణలోనే అనగా పరాధీనముగానే యుందురు. బ్రాహ్మణకులమున జన్మించినను ఉపనయన సంస్కారములు లేని దశలో యే కర్మాధి కారమును లేదు. కనుక నిది శూద్రదశ యనబడును. బాల్యకాలము దాటి ఉపనయనాది సంస్కారములును, వేదాధ్యయనమును, గాయత్రీ ఉపాసనము ప్రారంభించునప్పుడు ద్విజత్వమును బొందుచున్నాడు. అపుడు వైశ్యుడు ధనార్జన కార్యములో ప్రవేశించునట్లు, గురుకులవాసముచేసి విద్యయను ధనము నార్జించుటకు శక్తి గలవాడగు చున్నాడు. అందువలన ఆదశను వైశ్యదశనుగా వర్ణించిరి. మరల యౌవనము గలిగి ధర్మవిరుద్ధములగు దుర్గుణముల నిగ్రహింప శక్తిగలిగి ధర్మానుగుణ విషయసుఖంబుల ననుభవించునపుడు క్షత్రియు డగుచున్నాడు. అట్టి యౌవనదశయందు మాత్రమే శూరత్వ ధీరత్వాది శక్తులు గలిగియుండును. వైశ్య, శూద్రదశలలో నాయపారశక్తి గలుగదు. అంతేగాదు, ఆర్తుల రక్షించుటకును, సత్పాత్రునకు దానముచేయుటకును, ప్రజలను పాలించుటకును గలశక్తి యౌవనమందే గలుగును. కాబట్టి అట్టి యవస్థను క్షత్రియ దశనుగా వర్ణించిరి.

యౌవనకాల మంత్యమగునపుడు వాన ప్రస్థములో ప్రవేశించి తపస్సు చేతను, తీవ్రవ్రతములచేతను, అవిద్యాసంబంధ దోషముల నశింపజేసి, బ్రహ్మజ్ఞానము సంపాదించుటకు తగిన ధ్యానయోగాదులను పరిశీలించుచూ బ్రహ్మానుసంధాన పరులై యుండుకాలము వార్ధక్యము. అపుడు బ్రహ్మత్వ ప్రాప్తికి తగిన కాలమగుటచే దానిని బ్రాహ్మణత్వమని శాస్త్రములో వర్ణించుడమైనది. పూర్వము బ్రాహ్మణులకు ప్రాపంచిక విషయవ్యవహారము లేమి యుండలేదు.

వేదాధ్యయన తపోజ్ఞానయోగాదులు గలిగియుండిరి. అంతేగాదు. వనములో నివసించుచుండిరి. వార్ధక్యదశలోను లోకవ్యవహార కార్యములను చేయుటకు శక్తిలేక భగవద్ధ్యాన కార్యములో ఇపుడుగూడ ఉండు వారాచరించుచుండుటచే అట్టిదశను బ్రాహ్మణత్వముగా శాస్త్రములో నిరూపించడమైనది. ఇదే చాతుర్వర్ణ్యముయొక్క నిజార్థము. దీని ననుసరించి మరియొక శ్లోకము గలదు.

**జన్మనా జాయతే జంతుః సంస్కారాద్ద్విజఉచ్యతే।**
**వేదపారాయణా ద్విప్రో బ్రహ్మజ్ఞానీ తు బ్రాహ్మణః॥**

దీనియందు మానవులందరును జన్మనా జంతువులవలె నుందురనియు, అనగా జన్మించినపుడు పశ్వాదిశిశువులు ఎట్లుండునో మనుష్య సంతానములో గూడ నాలాగుననేయుండును. మరల 5 గాని 8 గాని 11 గాని సంవత్సరముల వయస్సులో ఉపనయనాది సంస్కారములు చేయునపుడు ద్విజుడగును. ద్విజుడన రెండవ జన్మముగలవాడని భావము. ఇది సంస్కారము వలననే సిద్ధించును. ద్విజత్వమునకు మరియొక అర్థముగూడ గలదు. అదేమన మాతృగర్భమునుండి జన్మించినపుడు, మృగమువలె దేహభావము మాత్రమే గలిగియుండును. ఆత్మసంస్కారము వలన దేహమందుగల దేహిని దేహమునుండి వేరు పరుచువిధము తెలిసికొనెడి జ్ఞానము సిద్ధించును. అంతకుముందు అజ్ఞానముచే తాను దేహభావము గలిగియుండును. ఇపుడు దేహేంద్రియ మనోబుద్ధులకు సాక్షియై, స్వప్రకాశమై, జ్ఞానమయమైయుండు ఆత్మయే తానను జ్ఞానముగలుగుటచే రెండవ జన్మంబగు ద్విజత్వము గలుగును. ఇట్టి ద్విజత్వమగు జ్ఞానము గలవాడే ద్విజుడగును. అట్టిజ్ఞానము ఉపనయనాది సంస్కారములచే గలుగనిచో అతడు ద్విజుడు కాజాలడు. ఒకవేళ ఉపనయనాది సంస్కారము లేకపోయినను జన్మాంతర పుణ్యవిశేషముచే దేహేంద్రియములకు సాక్షియగు దైవజ్ఞానము గలిగినచో నతడును బ్రాహ్మణుడే యగును.

వేదాధ్యయనముచేతను, వేదార్థవిచారణచేతను విజ్ఞానము గలుగునపుడు విప్రుడను వాక్యమున కర్హుడగును. జ్ఞాన విజ్ఞానములచే బ్రహ్మసాక్షాత్కారము గలుగునపుడు బ్రాహ్మణుడగును. ఇదియే నిజమైన నాలుగు వర్ణములయొక్క యర్థమగును. ఈ విధముగచెప్పుటలో శాస్త్రమునకు గాని, జాతికి గాని యేలాటి ఆక్షేపమును గలుగదు. ప్రతివారును దీని నంగీకరించియే తీరవలయును. ఈ దేహము మాతాపితరులచే యేర్పడు చుండును. ఆత్మజ్ఞానము గురువులవల్లనే యేర్పడును. కనుకనే ఆత్మజ్ఞానోపదేష్ట యగు గురుని తండ్రిగాను, శిష్యులను గురుపుత్రులను గాను పిలుచుటకు కారణము. ఈవిషయమై మనుస్మృతిలో నుదాహరించినది చూడుడు.

**ఉత్పాదక బ్రహ్మ దాత్రోర్గరీయాన్ బ్రహ్మదః పితా।**
**బ్రహ్మజన్మ హి విప్రస్య ప్రేత్య చేహ చ శాశ్వతమ్॥**

విప్రునకు వేదగ్రహణార్థమై ఉపనయన రూపమైన రెండవ జన్మము నొసగు ఆచార్యుడు తండ్రికంటే శ్రేష్ఠుడు. బ్రహ్మ గ్రహణార్థమైన జన్మము బ్రహ్మప్రాప్తిఫలకమైయుండుటచే నిహపరములందు రెంటియందును నిత్యమైనది. తల్లిదండ్రులు కలుగజేసిన యీ దేహము, జడమై అజ్ఞానమయమగుటచే దుఃఖమునకు కారణమగును. గురువరుం డొసంగెడు ఆత్మసంస్కారరూపమగు జ్ఞానదేహము, సర్వదుఃఖములను రహితమొనర్చునది గాను, ఇహములో స్థూలదేహముతో గూడియున్నపుడు గూడ పరమశాంతిని, నిరతిశయ సుఖమును గలుగజేయునదిగాను, పరమందు శాశ్వతానందము నొసంగునది యగుటచే, నయ్యది శ్రేష్ఠమనియు, శాశ్వతమనియు చెప్పుటకు కారణమైనది. ఈస్థూలదేహము జడమైనది, నశించునది. ఆత్మజ్ఞాన దేహమే చైతన్యమైనది, సుఖమైనది, శాశ్వతమైనది. ఇందువలననే, మాతాపితరులకన్న గురు డధికుడని చెప్పుటకు కారణము. ఇదివరలో, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాదులకు జన్మలోనే రక్తములో శుద్ధాఽశుద్ధ భేదములు గలవని

అంధవిశ్వాస పరమగు నొకవాక్యమును మీరు తెలిపితిరి. ఆ విషయమై శాస్త్రమేమి చెప్పినదో చూడుడు.

**న చర్మణో న రక్తస్య మాంసస్య న న చాస్థినః।**
**న జాతి రాత్మనో జాతి వ్యవహారః ప్రకల్పితః॥**

జాతి చర్మమునకు గాని, రక్తమునకు గాని, మాంసమునకు గాని, ఆస్థికి గాని లేదు. మఱియు ఆత్మను పరిశోధించిన దానికిన్నీ లేదు. అనగా నందరి దేహములును పంచభూతాత్మకములే. అందులో నధివసించెడు ఆత్మయు నందరిలో నొకే జ్ఞానమయమైనదే. జాతి యనునది వ్యవహారములకు మాత్రమే అని తేజో బిందూపనిషత్తు. మఱియు మహాభారతమం దన్నిజాతులలో జన్మించినవారునూ, మోక్షమును బొందవచ్చునని తెలిపినది చూడుడు.

**జై గీషవ్యో యథా విప్రో యథా చై వాఽసితాదయః।**
**క్షత్రియా జనకాద్యాస్తు తూలాధారాదయో విశః।**
**ధర్మవ్యాధాదయ స్సప్త శూద్రాశ్చైలవకాదయః।**
**మైత్రేయీ సలభా శార్ఙ్గీ శాండలీ చ తపస్వినీ।**
**ఏ తే చాన్యేచ బహవో నీచయోనిగతా అపి।**
**జ్ఞాననిష్ఠాం పరాం ప్రాప్తా.................**

జై గీషవ్యుడగు విప్రుడును, ఆలాగున అసితాదులును, జనకాదులగు క్షత్రియులును, తులాధారాదులగు వైశ్యులును, చైలవకాదులగు శూద్రులును, ధర్మవ్యాధాదులగు కిరాతులును, శ్రేష్ఠమయిన జ్ఞాననిష్ఠను బొందినవారై మోక్షమును బడసిరి. ఆవిధముగనే స్త్రీలలో మైత్రేయి, సులభ, శార్ఙ్గ, గార్గి, శాండిల్య మొదలగు తపస్వినులును జ్ఞాననిష్ఠావలంబనలై మోక్షమును బొందిరి. ఇంతేగాక ఇంకను నీచయోని సంభవులగువారనేకులు బ్రహ్మజ్ఞానము గలవారై జీవన్ముక్తులైరి.

**న జాతిః కారణం తాత గుణాః కల్యాణకారణమ్।**
**వృత్తస్థ మపి చండాలం తం దేవా బ్రాహ్మణం విదుః॥**

ఓ ధర్మరాజా! జాతి కారణము కాదు. గుణమే మంగళమునకు కారణము. పవిత్ర వర్తనము గలవాడు చండాలుడైనను వానిని దేవతలు బ్రాహ్మణుడని తలంతురు.

**శ్వపచో౽పి మహీపాల! విష్ణుభక్తో ద్విజాధికః।**
**విష్ణుభక్తివిహీనస్తు యతిశ్చ శ్వపచాధమః॥**

ఓ రాజా! శ్వపచుడైనను భగవద్భక్తిగలవాడగుచో వాడు బ్రాహ్మణుని కంటె నధికుడు. దైవభక్తి లేనివాడు బ్రాహ్మణుడైనను, లేక సన్న్యాసియైనను వాడధమచండాలు డగును.

**న శూద్రా భగవద్భక్తా విప్రా భాగవతాస్స్మృతాః।**
**సర్వవర్ణేషు తే శూద్రా యేహ్యభక్తా జనార్దనే॥**

శూద్రయోనియందు జన్మించిన వారైనను భగవద్భక్తులు శూద్రులు కారు. మరి యెవరన, భాగవతోత్తములగు విప్రులనియే తలంచవలయును. దైవమందు భక్తిలేనివా రేజాతిలో జన్మించువారైనను వారే శూద్రులని వేదసమ్మతము.

**శూద్రో౽పి శీలసంపన్నో గుణవాన్బ్రాహ్మణో భవేత్।**
**బ్రాహ్మణో౽పి క్రియాహీనః శూద్రాత్ప్రత్యవరో భవేత్॥**

శూద్రుడై జన్మించినను, శమ దమాది సద్గుణ సంపన్నుడైనచో నతడు బ్రాహ్మణుడే. బ్రాహ్మణకులమందు పుట్టినను బ్రహ్మనిష్ఠానుష్ఠానములు లేనిచో అట్టివాడు శూద్రునికంటె తక్కువవాడని తెలియవలయును.

**జ్ఞానయజ్ఞోడుపేనైవ బ్రాహ్మణో వాంత్యజోఽపివా।**
**సంసారసాగరం తీర్త్వా ముక్తి పారం హి గచ్ఛతి॥**

చండాలుడుగాని, బ్రాహ్మణుడుగాని, జ్ఞానమను తెప్పచే జనన మరణదుఃఖ రూపమగు ఘోర సంసార సాగరమును దాటి ముక్తియనెడు పరమపదమును బొందును. ఇక నీవిషయమై యెక్కువ వ్రాసి గ్రంథమును విస్తరింపజేయ తలంచలేదు. ఇదివరలో నిరూపించిన శ్రుతిస్మృతి పురాణేతి హాసవములచే గ్రహించదగిన విషయువు లన్నిటిని సంగ్రహవుుగ నిరూపించడమైనది. ఇపుడు శ్రీ యోగవాసిష్ఠమందు శ్రీ వసిష్ఠమునీంద్రుడు సత్యదృష్టితో నుపదేశించిన వాక్యములజూడుడు:–

**యుక్తియు క్త ముపాదేయం వచనం బాలకాదపి।**
**అన్యత్తృణ మివ త్యాజ్య మప్యుక్తం పద్మజన్మనా ॥**

యుక్తి యుక్తమైయుండు వచనము బాలుడు చెప్పినను బ్రహ్మవచనము వలె గ్రహించదగినది. యుక్తియుక్తము గాని వాక్యము బ్రహ్మదేవుడు చెప్పినను తృణీకరించదగును. ఏలననగా మహాత్ములగు గొప్పవారు సత్యమునకు ధర్మమునకును భిన్నమైన దానిని జెప్పరు. అంతేగాదు. వారు చెప్పెడి వాక్యములు యుక్తి యుక్తములుగా నుండును. యుక్తి యుక్తములకు విరుద్ధముగా కల్పించెడు వచనములు దేవతల లేక మహర్షుల పేరుపెట్టి యెవరో వ్రాసి యుండవచ్చునని తలంచవలయును. అట్టి ధృఢవిశ్వాసవు గలిగినవూత్రవే లోక ముద్ధరింపబడును. అప్పుడే ప్రకాశములోను, ఆనందములోను జీవులు సుఖింపగలరు.

మరియు పుట్టినకులము ననుసరించియే బ్రాహ్మణాది జాతులు ఏర్పడినచో హీన కర్మలచే కులమునుండి యేల వెలివేయవలయును? కులోచిత కర్మల అతిక్రమించినందుచే గదా! కుల భ్రష్టత్వమొనర్చుచున్నారు. అట్టివారిని

మరల ప్రాయశ్చిత్తాది సంస్కారమొనర్చి తరువాత ఏలాగున కులములో కల్పుచున్నారు? ఈయొక్క దృష్టాంతముచే కులమునకు ప్రాధాన్యము లేదనియు, గుణమునకే ప్రధానత యనియు అర్థమగుచున్నది. కావున గుణకర్మములను బట్టియే చాతుర్వర్ణ్య మేర్పడినదని చెప్పుటలో నేలాటి దోషమున్ను లేదు. ఇదియే శ్రీకృష్ణభగవాను డుపదేశించిన దానికి తాత్పర్యము.

కులభ్రష్టత్వము కలిగినపుడున్ను అతడు బ్రాహ్మణుడే. సంస్కారముచే తిరిగి కులములో కలుపునప్పుడున్ను బ్రాహ్మణుడే. ఇచట కలిగిన భేదమేమన యే హీన కర్మలచే కులమునుండి పతితుడయినాడో అట్టి హీన కర్మలు మరల చేయనీయగూడదనియే దీనివల్ల నేర్పడిన సారము. అంతేగాని పంచగవ్య ప్రాశనము చేతగాని. పుణ్యతీర్థావగాహనముచేగాని, సమారాధనపరమగు పంక్తి భోజనముచేగాని పతితునకు, ఏమార్పున్ను గలుగలేదు. జనుల మనుస్సునకు గలిగిన నమ్మక మొక్కటియు, హీనకర్మ నివృత్తియు కారణముగా గనపడుచున్నది. మరల అట్టి అవినీతికర్మ చేయకయుండుటకున్ను అది కారణమగును.

కావున గుణమే శ్రేష్ఠత్వమునకు, నికృష్టత్వమునకును కారణముగాని కులము కాదు. అట్లు కానిచో, కులచ్యుతి గలిగినపుడున్ను, బ్రాహ్మణులందరున్ను మామూలు ప్రకారము అతనితో సర్వకార్యములలోను సంబంధము గలిగియుండవలసి యుండును. అట్లు లేనందుచే గుణమే ప్రధానమని స్పష్టమగుచున్నది. సత్యార్థ ప్రకాశమునందు శ్రీ దయానంద సరస్వతీ స్వాములవారు చెప్పిన కొన్నివాక్యములు ఇచట తెలిపెద. శ్రీ శంకర భగవత్పాదులకు తరువాత శాస్త్ర పరిశ్రమ చేసినవారు వీరికి సమానముగా మరియొకరు లేరనిచెప్పుట అతిశయోక్తి కానేరదు. శ్రీ శంకరాచార్యుల వలె, వీరును లోకములో బోధించుటకు చేసిన పరిశ్రమ అమోఘమైనది. వేదాది శాస్త్రములందంతట పరమేశ్వరునియొక్క ప్రధాన నిజనామము ( ఓమ్)

చెప్పబడి యున్నది. తక్కినవన్నియు గౌణనామములు '' ఓమిత్యేత దక్షరమిదం సర్వం తస్యోపవ్యాఖ్యానం'' మాండూక్యోపనిషత్, '' ఓమిత్యే త దక్షర ముద్గీథ ముపాసీత'', ఛాందోగ్యోప నిషత్. ఓమ్ ఎవనియొక్క నామమో, ఎవడు యెన్నటికిన్ని నశించడో, అతనిని యుపాసించుట యోగ్యము గాని అన్యోపాసన యోగ్యము కాదు.

**సర్వే వేదా య త్పద మామనన్తి**
**తపాంసి సర్వాణి చ య ద్వదన్తి।**
**యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరన్తి,**
**తత్తేపదం సంగ్రహేణ బ్రవీమ్యో మిత్యే తత్॥ కఠోపనిషత్**

అన్ని వేదములును, సమస్త ధర్మానుష్ఠానరూప తపశ్చరణయు. ఎవనిని జెప్పుచుా, గౌరవించుచున్నవో ఎవనిని బొందగోరి, బ్రహ్మచర్యాశ్రమమును జరిపించు చున్నారో, అతని నామము ఓమ్ అనగా ప్రణవము.

**ప్రశాసితారం సర్వేషామణీయాంస మణోరపి।**
**రుక్మాభం స్వప్నధీ గమ్యం విద్యాత్తం పురుషం పరమ్॥**

(ప్రశాసితారం) ఎవడు అందరికిని శిక్షకుడో (అందరినీ, అన్నిటినీ తత్తద్ధర్మములలో నడుపువాడో) ఎవడు సూక్ష్మమునకంటె సూక్ష్ముడో, ఎవడు స్వప్రకాశస్వరూపుడో, ఎవడు సమాధిస్థ బుద్ధిచేత దెలియుటకు యోగ్యుడో అతనినే పరమపురుషుడని తెలియవలయును.

**యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః॥**
**బ్రహ్మ రాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ స్వాయచారణాయ॥**

యజుర్వేదము, పరమేశ్వరుడు సెలవిచ్చుచున్నాడు. (యథా) ఎట్లు

నేను, (జనేభ్యః) మనుష్యులందఱి కొఱకు (ఇమాం) ఈ (కల్యాణీమ్) కల్యాణము అనగా సుఖమునిచ్చునట్టి (వాచం) ఋగ్వేదాది నాలుగువేదముల యొక్క వాణిని (అవధాని) యుపదేశించుచున్నానో, అట్లు మీరును జేయ వలయును. (బ్రహ్మరాజాన్యాభ్యాం) నేను బ్రాహ్మణ క్షత్రియ (ఆర్యాయ) వైశ్య (శూద్రాయ) శూద్రుల కొరకును, (స్వాయ) తమ భృత్యులు కున్ను, (స్త్రీలు) వీటికొఱకును, (అరణాయ) అతిశూద్రుల కొఱకును, వేదములను ప్రకాశపఱచినాను. ఇందువల్ల సర్వేశ్వరుడనుగ్రహించిన వేదమున, వేదార్థమున, వేదాంతజ్ఞానమందును సర్వజనుల కధికారము గలదని స్పష్టమగుచున్నది. ఇచట నెవరైన అడిగినచో, వారితో నీలాగున చెప్పవలయును. ''సర్వజ్ఞుడగు సర్వేశ్వరుని వాక్యము నమ్మవలయునా? లేక సామాన్య మానవుడగు మీ వాక్యము నమ్మవలయునా?'' అని అనిన చాలును.

ఇక నైష్కర్మ్య సిద్ధియందు ''సురేశ్వరాచార్యులు'' చెప్పిన కొన్ని వాక్యముల నిచట నిరూపించెద. వీరు పూర్వాశ్రమమున '' మండన మిశ్రుడ'' ని ప్రసిద్ధిగాంచిన పూర్వ మీమాంసా కర్మశాస్త్రమునకు ఆచార్యులైయుండిరి. వీరిచరిత్రము శ్రీ శంకర విజయమునందు కనందగును. వీరే శ్రీ శంకరభగవత్పాదుల ముఖ్యశిష్య చతుష్టయములో ప్రధానులై యుండిరి. వీరిని శ్రీ శంకరులే ''శృంగేరి మఠమున'' కధిపతులుగా ప్రప్రథమమున జేసిరి. వీరే యీ ''నైష్కర్మ్యసిద్ధి'' ని వ్రాసినవారు:-

**ఆ బ్రహ్మస్తంబపరంతైస్సర్వ ప్రాణిభిస్సర్వ ప్రకారస్యాపి దుఃఖస్య, స్వరసత ఏవ జిహాసి తత్వాన్ని వృత్యర్థా ప్రవృత్తిరస్తి స్వరసత ఏవా'' :-**

బ్రహ్మ మొదలు పిపీలికవఱకు గల జంతువులచే సర్వవిధములగు దుఃఖము స్వభావముగనే విడువవలసినదని కోరబడుచున్నందున, ఆదుఃఖము నివృత్తించుటకొరకు దగిన నడవడిక స్వభావముగనె గలిగియుండును. అనగా సర్వజంతువులును, నిరతిశయానందాత్మ స్వరూపులగుటచేతనే,

దుఃఖశాంతియు ఆనందప్రాప్తియు గలుగ వలయునని ప్రవర్తించుటకు కారణమగుచున్నది. ఆత్మశుద్ధియు ఆచార్యోపదేశమున్ను లేనందుచే సర్వశోకశాంతి పరమగు నిరతిశయానంద సుఖమును బొందజాలకున్నారు. ఇదియే వేదాంత తత్త్వముయొక్క పరమ రహస్యము.

**అజ్ఞాన నివృత్తేశ్చ సమ్యక్ జ్ఞాన స్వరూప**
**లాభ మాత్ర హేతుత్వాత్తదుపాదానమ్॥**

అజ్ఞానముయొక్క నివృత్తికి ఆత్మ యాథాత్మ్యజ్ఞానము యొక్క స్వరూపప్రాప్తి మాత్రమే కారణమై యున్నందుచే. నాసమ్యక్ జ్ఞానమును గ్రహించుటయే యావశ్యకము. ఇట్లు చెప్పుటచే, సర్వ స్త్రీ పురుషులకున్ను ఆత్మజ్ఞానము వేదాంత శాస్త్రవిచారణవల్ల మాత్రమే గలుగునని శ్రుతి యుపదేశించుచున్నది. అపుడు సర్వులకున్ను బ్రహ్మవిద్యయం దధికారము లేకయుండిన మోక్షమెట్లు గలుగును?

**అజ్ఞానహీనమాత్రత్వాత్, ముక్తేః కర్మ న సాధనమ్।**
**కర్మాపమార్ష్టి నాజ్ఞానం తమసే వోత్థితం తమః॥**

మోక్షము అజ్ఞానముయొక్క వినాశనము మాత్రమే గావున, దానికి కర్మ సాధనము గాదు. అంధకారములో బుట్టిన భ్రాంతిని, అంధకారము నివారింపలేనటుల, అజ్ఞానమును కర్మ నివారింపజాలదు. ఇట్లు చెప్పుటచే కర్మకాండులు చెప్పుచుండెడు వర్ణాశ్రమ పరములగు జాతులను గురించిన సిద్ధాన్తము మోక్షమును గలుగజేయదు. ప్రకాశమువల్లనే అంధకారము నశింపవలసి యుండుటచే, ఆత్మజ్ఞాననిష్ఠలో ముముక్షువు లందరున్ను తప్పక ప్రయత్నింపవలెనని స్పష్టమగుచున్నది.

**శయానాః ప్రాయశో లోకే, బోధ్యమానాః స్వనామభిః।**
**సహసైవ ప్రబుధ్యంతే యథైవం ప్రత్యగాత్మని॥**

లోకములో తరచుగా నిద్రించువారు తమ నామములచేత మేలుకొలుప బడుచున్నవారై త్వరగా నే ప్రకారము, ప్రబోధమును బొందుచున్నారో, ఆ ప్రకారముగనే ప్రత్యగాత్మయందు వాక్యము ప్రబోధమును గలుగజేయును. దీనివల్ల శాస్త్రజ్ఞానము తెలియనివారుగూడ, తత్త్వమస్యాది మహావాక్యముల శ్రవణము వల్లనే ఆత్మజ్ఞాన ప్రబోధము గలవా రగుదురని స్పష్టమగుచున్నది. శాస్త్రపఠనమువల్ల, శ్రవణమువల్లను, ప్రయోజనము లేదనియు అనుష్ఠానము మాత్రము గలిగియుండిన చాలుననియు చెప్పువారి వాక్యము గూడ వ్యర్థమని గోచరమగుచున్నది. నిద్రలో నుండువారు, ఆప్తునిచే పిలువబడి లేచునట్లు శాస్త్రము అజ్ఞానములో నుండు జనులను సుజ్ఞానులుగా జేయగలుగునని గ్రహించదగినది. మరియు అనుష్ఠానము యొక్క విధానమున్ను శాస్త్రమువల్లనే తెలిసికొనవలసి యుండుటచే అట్టి సచ్ఛాస్త్ర పఠనమును గూడ సాధ్యమైనంత వరకందరున్ను జేయవలయును.

**ఏవ మవగత పరమార్థ తత్త్వస్య న శేషశేషి**
**భావస్తత్కారణ స్యోత్సారితత్వాదిత్యాహ॥**

ఈ ప్రకారము తెలియబడిన పరమార్థ స్వరూపము గలవానికి, శేష, శేషిభావము లేదు. దానికి కారణమైన అజ్ఞానము నశించియున్నందున అని చెప్పుచున్నాడు. ఇచట జీవేశ్వరుల భేదమే ''శేష శేషి'' భావమని చెప్పబడును. అది యుపాధి గలిగియుండువరకు మాత్రమే యుండును. అట్టి యుపాధి, అజ్ఞానమువల ఏర్పడినదగుటచే, అట్టి అజ్ఞానము ఆత్మజ్ఞానమువల్ల నివృత్తమగుగునపుడు, సముద్రమునకున్ను, నదులకున్నుగల వేరుపాటునకు కట్ట యేలాగున కారణమగుచున్నదో, అట్టి కట్ట తీసివైచిన, ఏలాగున నదులున్ను సముద్రమున్ను యొకటియే యగుచుండునో అట్లే యుపాధి నిలయమందు జీవేశ్వరుల కేకత్వము గలుగుచుండును.

ఓమ్.

# లోకోద్ధారకము

ధర్మ కాండము



**యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి।**
**తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥**

టీ ॥ యః = ఎవ్వడు, సర్వత్ర = సర్వభూతములయందును, మాం= నన్ను, పశ్యతి = చూచుచున్నాడో, సర్వం చ = సకల భూతసముదాయమును, మయి = నాయందు, పశ్యతి = చూచుచున్నాడో, తస్య = అతనికి, అహం = నేను, న ప్రణశ్యామి = కనబడకపోను, స చ = వాడును, మే = నాకు, న ప్రణశ్యతి= కనబడకపోడు.

అ:– ధర్మ శబ్దమునకు దేనివలన ఈ జగత్తు ధరింపబడు చున్నదో, అదే నిజమైన ధర్మమని యర్థము. అది వర్ణాశ్రయమా! లేక గుణాశ్రయమా! అని ప్రశ్న గలిగినచో, వర్ణాశ్రయమని కొందఱును, గుణాశ్రయమే నిజమైనదని మఱికొందఱును వచించుచున్నారు. గుణాశ్రయమునే అందఱును అనుష్ఠించుచున్నారు. దీనినే యిదివరలో దెలుపుచు రావడమైనది. ఎట్లన! పోలీసు డిపార్టుమెంటులో గల సబ్ యిన్స్పెక్టర్లలో, బ్రాహ్మణులును, క్షత్రియులును, వైశ్యులును, శూద్రులును, ఇతర మతస్థులును గలరు. అలాగున సైన్యములోను, పైజెప్పిన నాలుగు వర్ణస్థులే గాక, యితర వర్ణస్థులుగూడ నుంటున్నారు. వారు వర్ణాశ్రమ ధర్మమని చెప్పుచు యుద్ధము వచ్చునపుడు క్షత్రియులు మాత్రము యుద్ధసన్నద్ధులై, బ్రాహ్మణులు జపతపముల నొనర్చుటయు, వైశ్యులు వ్యాపార నిమగ్నులై యుండుటయు, శూద్రులు సేవకవృత్తిలో నుండుటయు జరిగిన, రాజ్యము నేలాగున శత్రువుల

నుండి రక్షింపజాలరో, అందఱు నైకమత్యము గలిగి రణరంగములో ఆయుధపాణులై, శూరులై, ధీరులై దుమికిన మాత్ర మేలాగున, శత్రువులను నిశ్శేషమొనర్చి రాజ్య సంరక్షణమును జేయగలరో, అందువలన, పోలీసు డిపార్టుమెంటు వారును, సైన్యములో జేరువారును, వారి వారి కేర్పడిన ధర్మమెట్టిదో దాని నాచరించినట్లు ఎవరెవరు ఏ యే యనుష్ఠానమందుంటున్నారో దానికి తగిన ఆచరణ గలిగి యుండుటయే నిజమైన ధర్మమగును. వారు బ్రాహ్మణాది నాలుగు వర్ణములలో జేరినవారెవ్వరైనను, బ్రహ్మచర్యాది చతురాశ్రమములలో నుండువా రెవ్వరైనను సరే, వారివారి ధర్మముల నాశ్రయించి యుండుటయే ధర్మమగును.

ఇదే "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అని శ్రీ కృష్ణుడు గీతలో యుపదేశించిన దానికర్థము. అదేరీతిగ ఒక ఆస్పత్రిలో గల రోగులలో ఒక్కొక్క రోగము గలవారు చాతుర్వర్ణ్యస్థులలో నెవ్వరైనను, డాక్టరు ఆయావ్యాధిగల వారందఱికిని యొకే యౌషధమును, పథ్యమును ఎట్లు యేర్పాటుజేయునో, అలాగున జేసినచో రోగమెట్లు కుదురునో, అదేరీతిగ జేయక బ్రాహ్మణులకొక యౌషధము, అట్లే క్షత్రియులకును, శూద్రులకును వేఱువేఱు మందును, పథ్యమును ఏర్పఱచినచో రోగమెట్లు కుదరదో, భవరోగము యొక్క స్థితియు నిటువంటిదే. అలాగున నెవరెవరు ఏ యే గుణములు గలిగియుందురో వారి వారికి తగిన యనుష్ఠానముండిన మఱల నజ్ఞానమువలన నెవరును దుఃఖపడ నవసరము లేదు. అట్లుగాక వర్ణాశ్రమధర్మము, కులముననుసరించియే యుండవలయునని జెప్పినచో క్షయరోగము గల వానికి దానికి తగిన యౌషధమును పథ్యము నియక, కాసవ్యాధి గలవాని కేర్పడిన మందును, ఆహారమును ఇచ్చినచో రోగమేలాగున బాగుకాదో అలాగున, శ్లేష్మరోగికి దానికి తగిన యౌషధ పథ్యములను, అట్లే పైత్యవ్యాధి గలవానికి వాత వ్యాధి గలవానికిని తగిన యౌషధాహారములను ఏర్పఱచకుండిన యెట్లు అందఱును ఆరోగ్యవంతులై యుండరో, క్షయరోగికి

కాసరోగికిగల మందును భోజనమును, అట్లేశ్లేష్మ, పైత్య, వాతరోగులకు, దానికి తగిన యౌషధమును యాహారనియమమును ఏర్పరచనిచో రోగమేలాగున నశింపజాలదో, ఆరోగ్యము గలుగక సంకటపడవలసి యుండునో, ఆలాటి దుఃఖస్థితియే వర్ణాశ్రమధర్మము వారి వారి గుణముల జూడక కులముపై నాధారపడినందుచే నేర్పడినది. మఱియు ప్రవాహవేగము నకును వాయువునకును అనుకూలముగా నడిపెడు పడవ, యేలాగున నతి శీఘ్రముగ గమ్యస్థానమునకు జేరునో, అట్లు నడపని పడవ ఎట్లు చేరదో, సంస్కారమును జూడక కులము ననుసరించి ప్రవర్తించవలయునని జెప్పెడు విధియు నటువంటిదే. అనగా ప్రవాహమునకును గాలికిని వ్యతిరేకముగ నడపెడు పడవ చందమున నుండునని గ్రహించుకొనవలయును. మఱియు బ్రాహ్మణేతరులు మాత్రము వర్ణాశ్రమముల ననుసరించి నడువవలయునని చెప్పువారు తమ వర్ణమున కనుగుణముగా తాము నడచుచున్నామా! అని గూడ జ్ఞాపకము జేసికొనిన ఈ సంకటమేమియు గలుగదు.

అట్లు గానిచో, ఈ దీర్ఘ వ్యాధికి మరు మందే లేదు. ఒకవేళ శాస్త్రములలో అట్టి నియమముగలదని జెప్పినచో గుణమును గుఱించిన భాగమును మనము గ్రహించిన చాలును. అట్లుగాక కులము ననుసరించియే యుండవలయునని జెప్పినచో అలాటి కులగుణములు గలవారెవరు గలరు? ఎవరేని యొకానొకరుండినను యుండుగాక, వారిజాతిలోగల వారందఱిని ఆలాగున జేసిన తరువాత మాతో నాలాగున జెప్పిన చాలునని మంచిమాటలు జెప్పి పంపవలయును. బ్రాహ్మణులగు సోదరులారా! ఎవరో దేశ, కాల ప్రపంచ పరిస్థితిని పూర్తిగ దెలిసికొనక, మీకును మతవిషయకమై యుద్యోగము తగదని జెప్పినచో, మీరు మోసపోయి యుద్యోగమును మానవలదు. మానిన బ్రాహ్మణజాతి అడుగంటును. దేశ విషయమై యుద్యోగము మానవలసియుండిన అపుడు మానవచ్చును. దేశాభిమానము సర్వులకు నుండవలసిన పరమధర్మము. అయితే యుద్యోగాదుల జేయుచుండినను,

శక్తికొలది బ్రహ్మధర్మమును విడువరాదు. ఇది ఆత్మశుద్ధిని, అప్రాకృత జ్ఞానమును, దివ్యమగు తేజస్సును గలుగజేయును. అంతేగాదు, దుఃఖమును దరిజేరనీయక అది సంరక్షించుచుండును. జీవితము నతినిర్మలముగ నుండులాగున జేయును. అందువలననే బ్రాహ్మణులకు 'శర్మ' యని యుపాధినామము. శర్మ యనగా నెల్లప్పుడును సుఖముగా నుండువాడని అర్థము. ఈ విధి బ్రాహ్మణులకు మాత్రము గాదు. ఎవరు ఏవిత్తనమును బెట్టినను, వారికి దానికి తగిన ఫలము గలుగును. ఆలాగున బ్రాహ్మణేతరులున్ను, స్త్రీలు గూడ బ్రహ్మధర్మమగు అనుష్ఠానమును, సత్యము, కరుణ, విరక్తి గలిగియుండిన, వాటివలన సౌఖ్యమున్ను, మనశ్శాంతియు గలుగును. ధర్మవిషయమై మనువు జెప్పినది జూడుడు.

**ధర్మ ఏవ హతో హన్తి ధర్మో రక్షతి రక్షితః।**
**తస్మాద్ధర్మో న హన్తవ్యో మా నోధర్మో హతోఽవధీత్॥**

ధర్మము చెఱుపబడినదైనచో అది మనలను జెఱచును. ధర్మమును మనము గాపాడితిమేని మనల నది కాపాడును. కావున ధర్మమును నశింపజేయరాదు. ధర్మము నశింపజేయబడనిదై మనలను నశింపజేయకుండుగాక!

**ధృతిః క్షమా దమోఽస్తేయం శౌచ మింద్రియనిగ్రహః।**
**ధీ ర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణమ్॥**

ధైర్యము, ఓరిమి, దేహేంద్రియాదులను స్వాధీనమునందుంచుట, ఇతరుల సొమ్ము నపహరింపకుండుట, బాహ్యాభ్యంతరశుద్ధి, ఇంద్రియ నిగ్రహము, శాస్త్రార్థములను గ్రహించదగిన బుద్ధి, ఆధ్యాత్మవిద్య, సత్యవచనము, క్రోధరాహిత్యము నను నీ పదియును ధర్మమునకు గురుతులు.

**దశలక్షణకం ధర్మ మనుతిష్ఠ న్సమాహితః ।**
**వేదాన్తం విధివచ్ఛ్రుత్వా సన్న్యసేదనృణో ద్విజః ॥**

ద్విజుడు ఈ చెప్పబడిన పదిలక్షణములు గలధర్మముల నెఱిగి, జాగరూకుడై వీనిననుష్ఠింపుచు వేదాన్తమును, ఉపనిషదాదుల యర్థమును గురువుకడనుండి చక్కగా నేర్చుకొని ముత్తెఱగులగు ఋణముల దీర్చి సన్న్యాసమును స్వీకరింపవలయును.

**అనభ్యాసేన వేదానా మాచార్యస్య చ వర్జనాత్ ।**
**ఆలస్యా దన్నదోషా చ్చ మృత్యుర్విప్రాన్జిఘాంసతి ॥**

వేదాధ్యయనము చేయమిచేతను, ఆచార్యసేవనము లేకుండుటచేతను, ఆలస్యము చేతను, అనగా చేయవలసిన యనుష్ఠానములందు నిరుత్సాహము చేతను, ఆహారవస్తువులందలి దోషములచేతను మృత్యువు విప్రుల జంపుచున్నది.

**ఋషిభిర్బ్రాహ్మణైశ్చైవ గృహస్థైరేవ సేవితాః ।**
**విద్యాతపోవివృద్ధ్యర్థం శరీరస్య చ శుద్ధయే ॥**

ఋషులును, బ్రహ్మ నిష్ఠులును, గృహస్థులును తమకు బ్రహ్మజ్ఞాన ధర్మమభివృద్ధియగుటకై యుపనిషత్తులలోని వాక్యములను మననము చేసి అనుష్ఠించిరి.

**అధర్మ ప్రభవం చైవ దుఃఖయోగం శరీరిణామ్ ।**
**ధర్మార్థ ప్రభవం చైవ సుఖసంయోగ మక్షయమ్ ॥**

జీవాత్మల కధర్మము వలన జనించు దుఃఖసంబంధమును, ధర్మము వలన గలిగిన బ్రహ్మసాక్షాత్కారము వలన జనించిన మోక్ష రూపంబగు నక్షయ సుఖమునుగూర్చి యాలోచింపవలయును.

**దూషితోఽపి చరేద్ధర్మం యత్ర తత్రాఽశ్రమే రతః ।**
**సమస్సర్వేషు భూతేషు న లింగం ధర్మకారణమ్ ॥**

ఏ యాశ్రమమం దున్నను ఆయాశ్రమంబులకు విరుద్ధములగు నాచారములు లేకుండిన చాలును. ఆయాశ్రమపు గురుతులు ధరింపకున్నను సకల భూతంబులందు, బ్రహ్మత్వదృష్టిచే, సమదృష్టిగలవాడై ధర్మమునే యాచరింపవలయును. ఆశ్రమచిహ్నములు ధర్మాచరణమునకు గారణములు గావు. విహితకృత్యము నాచరించుటయే ధర్మమునకు కారణము.

**ఫలం కతకవృక్షస్య యద్యప్యంబుప్రసాదకమ్।**
**న నామగ్రహణాదేవ తస్య వారి ప్రసీదతి॥**

చిల్లగింజ నీటియందలి మురికిని బోగొట్టును, అయినను దాని పేరు చెప్పినంతమాత్రమున నీరు నిర్మలము గాదు. దానిని నీటియందు జాదిననే, యానీటియందలి మురికిబోవును. అట్లే యాశ్రమ చిహ్నములు గొప్పగొప్ప పేర్లు యేర్పఱచుట, ధరించుట, ధర్మాచరణ గాక విధివిహిత కృత్యము లొనర్చుటే ధర్మాచరణము.

**అహింసయేంద్రియాసంగై ర్వైదికై శ్చైవ కర్మభిః।**
**తపస శ్చరణైశ్చోగ్రై స్సాధయంతీహ తత్పదమ్॥**

హింస చేయకుండుటచేతను, ఇంద్రియములను విషయంబులందు చేర్పకుండుటచేతను, వేదోక్తములగు నిత్యకర్మల ననుష్ఠించుటచేతను, ఉగ్రతపస్సుల నాచరించుటచేతను, ఈలోకంబున బ్రహ్మప్రాప్తి యను పదవిని బొందుదురు.

**ప్రియేషు స్వేషు సుకృత మప్రియేషు చ దుష్కృతమ్।**
**విసృజ్య ధ్యానయోగేన బ్రహ్మాభ్యేతి సనాతనమ్॥**

బ్రహ్మవేత్తయగువాడు తన ప్రియులందు తన పుణ్యమును తన యప్రియులందు పాపమును వదలి, ధ్యాననిష్ఠ గలవాడై బ్రహ్మముతో నైక్యమొందు చున్నాడు. అనగా బ్రహ్మనిష్ఠునియందు గల పుణ్యము వారిని ప్రేమించువారికిని, దూషించువారికి పాపమును వెళ్ళుచుండును.

**ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేద్దివానిశమ్।**
**జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః॥**

రేయింబవళ్ళు ఇంద్రియముల నిగ్రహించుటకు ప్రయత్నము చేయువలయును. జితేంద్రియుడగు రాజే ప్రజలను తన వశమున నుంచుకోగలడు.

అనగా వ్యష్టికిని సమష్టికిని సంబంధము గలదు. వ్యష్టిరూపమగు దేహమందుగల తన యింద్రియములనెడు, ప్రజలనెవడు స్వాధీనము చేసుకొనుచున్నాడో, అట్టిరాజు (ప్రభువు) తన రాష్ట్రములో గల ప్రజలను తన స్వాధీనమునందుంచుకొనుటకు శక్తివంతుడగును. కావున భూపాలకులకు, ఇంద్రియముల నిగ్రహ మత్యవసరము. మఱియు తన యింద్రియము లనెడి జనులను, ఏ యాత్మవేత్త ధర్మమార్గములో నడుప శక్తిగలిగి యుండునో. అట్టి గురువు తన భక్తులను, (శిష్యులను) ధర్మమార్గములో నడుప శక్తిగలిగియుండును.

**వృషో హి భగవాన్ ధర్మస్తస్య యః కురుతే హ్యలమ్।**
**వృషలం తం విదుర్దేవా స్తస్మాద్ధర్మం న లోపయేత్॥**

పూజ్యమైన ధర్మము కోర్కెల నన్నింటిని వర్షించుచున్నది. కావున వృషమనబడును. అట్టి వృషము నెవడు నిషేధించునో వాడే వృషలుడు(శూద్రుడు) అనబడును. కాని జాతిచే వృషలుడని దేవతలు తలంచరు. కనుక ధర్మమును మీరరాదు.

**ఏక ఏవ సుహృద్ధర్మో నిధనేప్యనుయాతి యః।**
**శరీరేణ సమం నాశం సర్వమన్యద్ధి గచ్ఛతి।**

ధర్మమనునది యొక్కటియే ముఖ్యస్నేహితుడు. ఏలయన, మరణానంతరము సైతము, ధర్మమనెడు స్నేహితుడే మనలను వెంబడించును. మరియు తక్కినది యెల్లను మన శరీరముతోడనే నాశనము నొందుచున్నది గదా!

**ఇంద్రియాణాం ప్రసంగేన దోష మృచ్ఛత్యసంశయమ్।**
**సన్నియమ్య తు తాన్యేవ తత స్సిద్ధిం నియచ్ఛతి॥**

మనోధర్మమగు సంకల్పము వలననే తరచుగా నింద్రియములు ప్రవర్తించుచున్నవి. కావున ఏల యింద్రియ నిగ్రహము చేయవలయుననిన చెప్పబడుచున్నది. ఇంద్రియములు విషయములందు చేరుటవలన మానవుడు సందియము లేక యిహలోకమున. గష్టమును, పరలోకమున పాపము నొందును, కావున నట్టి యింద్రియములను బంధించిననే మోక్షసంసిద్ధి గలుగును. కావున నింద్రియములను నియమింపవలయును.

**వేదా స్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసి చ।**
**న విప్ర దుష్టభావస్య సిద్ధిం గచ్ఛంతి కర్హిచిత్॥**

వేదాధ్యయనము , దానము, యజ్ఞములు, నియమములు, తపస్సులు చెడుమనస్సు గలవాని కెప్పటికిన్ని సంసిద్ధిని ఎచ్చటను గలిగింపజాలవు.

**ఇంద్రియాణాం తు సర్వేషాం యద్యేకం క్షరతీంద్రియమ్।**
**తేనాఽస్య క్షరతి ప్రజ్ఞా దృతేః పాత్రాదివోదకమ్॥**

ఇంద్రియములన్నిటిలోపల, నొక యింద్రియము విషయాసక్తమైనను, అట్టివాని జ్ఞానము బెజ్జముబడిన తోలుతిత్తిలోని యుదకము కారిపోవునట్లు

నశించిపోవును.

**సేవేతేమాంస్తు నియమాన్ బ్రహ్మచారీ గురౌ వసన్।**
**సన్నియమ్యేంద్రియగ్రామం తపోవృద్ధ్యర్థమాత్మనః॥**

బ్రహ్మచారి గురుకులమున వసించుచు ఇంద్రియముల బంధించి యాముష్మికము నందలి తపోఽభివృద్ధికై నియమముల ననుసరింపవలయును.

**అహింసా సత్య మస్తేయం శౌచ మింద్రియ నిగ్రహః।**
**ఏతం సామాసికం ధర్మం చాతుర్వర్ణ్యేఽ బ్రవీన్మనుః॥**

అహింస, సత్యము, పరులసొమ్ము దొంగిలింపకుండుట, బాహ్యాభ్యంతరశుద్ధి గలిగియుండుట, ఇంద్రియనిగ్రహము అను నీ ఐదు గుణములు సర్వజనుల కుండవలసినవిగా మనువు వచించెను.

**ఇంద్రియాణాం ప్రసంగేన ధర్మస్యాసేవనేన చ।**
**పాపాన్సం యాంతి సంసార మవిద్వాంసో నరాధమాః॥**

ఇంద్రియములను విషయములందు ప్రవేశపెట్టుటవలనను, అకార్యములను చేయుటబట్టియు, ప్రాయశ్చిత్తాది ధర్మముల చేయకపోబట్టియు, మూఢమానవులు సంసారమందు నీచస్థితిని పొందుచున్నారు.

**ఇహ చాముత్ర వా కామ్యం ప్రవృత్తం కర్మ కీర్త్యతే।**
**నిష్కామం జ్ఞానపూర్వం తు నివృత్త ముపదిశ్యతే॥**

కామ్యముతో చేయుకర్మ ప్రవృత్త కర్మ యనంబడును. ఇహఫలము గాని, అముష్మిక ఫలముగాని లేక బ్రహ్మజ్ఞానము నలవరించుటవలన సంసార నివృత్తి హేతువగు నివృత్తికర్మ మనబడును. అనగా ప్రవృత్త కర్మముచే

సంసారమును, నివృత్తి కర్మముచే మోక్షము గలుగును.

**యథోక్తాన్యపి కర్మాణి పరిహాయ ద్విజోత్తమః।**
**ఆత్మజ్ఞానే శమే చ స్యా ద్వేదాభ్యా సే చ యత్నవాన్॥**

బ్రాహ్మణోత్తముడు శాస్త్రవిహితములగు అగ్నిహోత్రాది కర్మల బరిత్యజించియైనను పరమాత్మ చింతనము, ఇంద్రియజయము, ప్రణవజపము, ఉపనిషదాది వేదపఠనము వీని యందైనను ప్రయత్నపరుడై యుండవలయును. ఈ శ్లోకము ఈ శాస్త్రముయొక్క అంత్యమగు ద్వాదశాధ్యాయమున ఆఖరున చెప్పినదగుటచే, దీనిని బాగుగా ప్రతివారును జ్ఞాపక ముంచదగినది. శ్రీభగవద్గీత యందు గూడ అంత్యమున '' సర్వధర్మా న్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ'' అనగా ధర్మము లనేకములు గలవు. వాటిని ఆచరింపక పోయినను పరమాత్మ జ్ఞానమొకటి కలిగేలాగున చూడవలయునని చెప్పడమయినది. వృక్షము యొక్క మొదటిలో నీళ్ళు పోసిన మరల శాఖోపశాఖా పత్రపుష్ప ఫలాదులకు జలసేచన మెట్లవసరము లేదో, అలాగున సర్వకారణ కారణ స్వరూపుడగు పరమాత్మ ధ్యానము గలిగియుండిన, సమస్త సత్కర్మలు చేసినట్లే తలంచవలయును. మఱియు సర్వనదీనదములు సముద్రమున చేరునట్లు, సర్వధర్మములును పరమాత్మనే పొందుచున్నవి. అట్టి పరబ్రహ్మమును ధ్యానించువాడు సముద్రమువంటివాడనియు, తక్కిన కర్మ యెంత మహోన్నతమైనను లేక బ్రహ్మవిష్ణు శివాది మూర్తుల నారాధించునదైనను నదులవంటిదే యగును.

**ఏతద్ధి జన్మసాఫల్యం బ్రాహ్మణస్య విశేషతః ।**
**ప్రాప్యైతత్కృతకృత్యో హి ద్విజో భవతి నాన్యథా॥**

ఈ యాత్మజ్ఞానవేదాభ్యాసములే ముఖ్యముగా బ్రాహ్మణునకు జన్మసాఫల్య హేతువులు. ఏలయన ద్విజుడీ బ్రాహ్మజ్ఞాన వేదాదుల నభ్యసించి

జన్మసాఫల్యము నొందును. కాని ప్రకారాంతరమున కృతార్థుడు కానేరడు.

**ఏవం యస్సర్వభూతేషు పశ్యత్యాత్మాన మాత్మనా।**
**స సర్వసమతామేత్య బ్రహ్మాభ్యేతి పరం పదమ్ ॥॥**

ఎవడివ్విధంబున, సర్వభూతవములందున్న యాత్మను బ్రహ్మజ్ఞానముతో జూచునో, యాతడు బ్రహ్మసాక్షాత్కారము వలన నుత్తమ పదమగు బ్రహ్మమును బొందుచున్నాడు. ఈ చెప్పినదంతయు మనుస్మృతి శాస్త్రములో గలదియే. అంతేగాక యిచట నిరూపించినది ఆశాస్త్రముయొక్క అంత్య సందేశమగుటచే మరింత భక్తిశ్రద్ధలు గలిగి యనుష్ఠించదగినది.

ఇక పరాశరస్మృతియందుగల కొన్ని ధర్మముల నీ ఘట్టమున దెలిపెద.

బ్రాహ్మణ - **దుశ్శీలోఽపి ద్విజః పూజ్యో నతు శూద్రో జితేంద్రియః।**
**కః పరిత్యజ్య గాం దుష్టాం దుహే త్శీరవతీం ఖరీమ్ ॥**

బ్రాహ్మణుడు దుఃస్వభావుడైనను పూజింపదగినవాడు- కాని శూద్రుడు జితేంద్రియుడైనను పూజ్యుడు కాడు. లోకమునందెవ్వడైనను ఆవు చెడ్డదైనను దానిని వదలి, ఎక్కువ పాలిచ్చునట్టియు, సాధువైనట్టియు గాడిదపాలు పితుకడు గదా!

అబ్రాహ్మణ - మిత్రమా! మన ముభయులమును, రాగద్వేషములు ఈ సంభాషణలో గలుగకూడదని నిశ్చయించియుండినందుచే మీరు చెప్పిన యీవాక్యము సహించవలసి వచ్చినది. అట్లయినను నాహృదయమున దుఃఖాగ్ని ప్రజ్వలించుచున్నది. ఎటువంటి పాపవాక్యమును చెప్పితిరి. ప్రపంచములో నెట్టి పౌరుషహీనుడైన పురుషుడైనను, ఇట్టి వాక్యమును వినిన సహింపగలుగునా? భారతం, భాగవతం, భగవద్గీత, మనుస్మృతి మొదలగు గ్రంధము లనేకములుగా గుణము చేతనే బ్రాహ్మణుడనియు, గుణహీనుడు బ్రాహ్మణకులములో పుట్టినను శూద్రుడే యనియు విధించుచుండగా, మీరేల బ్రాహ్మణేతరజాతుల

కవమానకరమగు నీ వాక్యమును పలికితిరి. ఒకవేళ పరాశరస్మృతి యందుండినను ఉండుగాక! దేశకాల స్థితిగతుల ననుసరించి ప్రవర్తింపని వారపాయమునే పొందగలరని శాస్త్రమును పెద్దలును వక్కాణించియున్నారు. ఒకవేళ పరాశరుడు ఈస్మృతి వ్రాసిన కాలములో బ్రాహ్మణేతరులు సంస్కారహీనులై, దీనస్థితిలో నుండినను యుండవచ్చును. అదిన్నీ వారికి ఉన్నతస్థితిలోనికి వచ్చుట కవకాశము కలుగజేయునందుచేతనే యట్టి నిస్సహాయస్థితిలో నుండి యుండవచ్చును. ఇప్పుడు ఈ వింశతి శతాబ్దమున, ఆంగ్లేయపాలనమున, సంస్కారముచేతను, విద్యచేతను, శౌచముచేతను, కాంతిచేతను, ధనముచేతను, బలముచేతను బ్రాహ్మణేతరు లిట్టి యున్నతస్థితిలో నుండగా, మీరును ఆలోచింపక ఎట్లు విషప్రాయమగు వచనమును పలికితిరి? ఒక దృష్టాంతము, దార్ష్టాంతములోనికి తెచ్చునపుడు కొంతవరకైనను గుణసమన్వయము గలిగియుండవలయునుగదా! బ్రాహ్మణులను గోవులుగాను, బ్రాహ్మణేతరులను గాడిదలుగాను చెప్పుటకు మీకెట్లు నోరాడినది? గోవు ఏలాగు శుక్లరక్తాది వర్ణములచేతను, కాయసౌష్ఠవముచేతను, సుందరస్వరముచేతను, అమృతతుల్యమగు క్షీరముచేతను, శృంగములచేతను, పాదగిట్టలచేతను, గోమూత్ర గోమయాదులచే చేయబడు పంచగవ్యములచేతను, యజ్ఞార్హమగు ఘృతముచేతను, గోమయముచే ఎట్టి యపవిత్ర స్థలముగూడ శుద్ధము చేయబడుటచేతను, శోభాయమానమగు కామధేనువునకును, ఆగుణములన్నిటికిని భిన్నముగానుండు నీచజంతువైన ఖరముతో సమానముగా బ్రాహ్మణేతరుల నెట్లు వర్ణించిరి? బ్రాహ్మణులకును బ్రాహ్మణేతరులకును ప్రజ్ఞయందుగాని, శరీర వర్చస్సు నందుగాని, ఆయుః పరిమితి యందుగాని, జనన మరణమందుగాని, శరీరాకారమందుగాని, యేదైన నొక్క అణుమాత్రమునైన భేదమును మీరు చెప్పగలరా? ఇట్టి పాపవాక్యములనగదా పావనమగు భారతభూమి పతితమగుటకు

కారణమైనది. ఈ విషయమై యిక పైన చెప్పబోవు చుండెడు భారతాది గ్రంథములలో గుణముచేతనే బ్రాహ్మణత్వముగాని, శూద్రత్వముగాని గలుగుననెడి శాస్త్రమును మీరు చూడగలరు. పరాశర స్మృతియందు బ్రాహ్మణులను గురించి చెప్పినది చూడుడు.

**యశ్శూద్ర్యా పాచయే న్నిత్యం శూద్రా చ గృహమేధినీ।**
**వర్జితః పితృదేవేభ్యో రౌరవం యాతి స ద్విజః॥**

ఏ బ్రాహ్మణుడు శూద్రస్త్రీచేత అన్నమును వండించుకొని భుజించునో, యేబ్రాహ్మణునకు శూద్రాంగన భార్యగా నుండునో, అట్టి బ్రాహ్మణుడు పితరులకుగాని, దేవతలకుగాని హవ్యకవ్యముల నొసగుటకుగాని తగడు. రౌరవ నరకమును పొందును– అనఁగా శూద్రాన్నము భుజించెడు బ్రాహ్మణుడున్నూ, శూద్రస్త్రీతో సంబంధము గల విప్రుడును చేసెడు దేవతార్చన, శ్రాద్ధతర్పణము, హోమము దేవత లంగీకరించరు. ఇపుడు లోకమున నిట్టి స్వభావముగల బ్రాహ్మణులెందరు గలరో యోచించుకొనుడు.

**యథా షండోఽఫలః స్త్రీషు యథా గౌ రూషరాఽఫలా।**
**యథా చాజ్ఞేఽఫలం దానం తథా విప్రోఽనృతోఽఫలః॥**

స్త్రీలయందు నపుంసకు డెట్లు వ్యర్థుడగుచున్నాడో, చవిటి నేలయందు విత్తన మేవిధముగ నిష్ఫలమో, అజ్ఞుడగు వాని కొసంగిన దాన మెటుల వ్యర్థమో, అదేవిధముగా అసత్యపురుషుడైన బ్రాహ్మణుడు నిరర్థకుడు. మీరు చెప్పిన వాక్యమునకు ఇదే సమాధానము. ఇక సామాన్యముగ అందరు గ్రహించదగిన ధర్మముల నీ స్మృతిలో గల వానిని తెలిపెద.

**మృతే భర్తరి యా నారీ బ్రహ్మచర్యే వ్యవస్థితా।**
**సా మృతా లభతే స్వర్గం యథా తే బ్రహ్మచారిణః॥**

ఏ స్త్రీ భర్త మరణించిన పిదప బ్రహ్మచర్యమును పరిపాలించి దివ్యజ్ఞానము సంపాదించునో అట్టి స్త్రీ, మరణానంతరము పవిత్రులైన నైష్ఠిక బ్రహ్మచారులవలె స్వర్గమును పొందుచున్నది.

**కృతే త్వస్థిగతాః ప్రాణాః త్రేతాయాం మాంసమాశ్రితాః।**
**ద్వాపరే రుధిరం చైవ కలౌ త్వన్నాదిషు స్థితాః॥**

కృతయుగమున ప్రాణములు శల్యగతములై యుండును. త్రేతాయుగమున ప్రాణములు మాంసము నాశ్రయించి యుండును. ద్వాపరముగమునందు రక్తము నాశ్రయించి ప్రాణములు నిలిచియుండును. కలియుగమునం దన్నాదికము నాశ్రయించి ప్రాణములు దేహమందు నిలిచియుండును.

**తపః పరం కృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతే।**
**ద్వాపరే యజ్ఞమిత్యాహు ర్దానమేవ కలౌ యుగే॥**

కృతయుగంబున తపంబును, త్రేతా యుగంబున జ్ఞానంబును, ద్వాపరయుగంబున యజ్ఞంబును, కలియుగంబున దానంబును ముఖ్యములని చెప్పెదరు. ఇది యుగానుగుణ సామాన్య ధర్మమని గ్రహించదగినది. ముక్తికొరకు వేదాధ్యయన బ్రహ్మచర్య తపస్సులు కలిగియుండవలయును.

**అన్యే కృతయుగే ధర్మాస్త్రే తాయాం ద్వాపరే యుగే।**
**అన్యే కలౌ యుగే నృణాం యుగరూపానుసారతః॥**

కృతయుగ, త్రేతాయుగ, ద్వాపరయుగ, కలియుగముల ననుసరించి ధర్మములు భిన్న భిన్నములుగ నుండును. కలియుగమున కేర్పడిన స్మృతియగు పరాశర స్మృతియందే యీ సత్యమును దెలుపడమైనది. ఇదివరలో నుండెడు ధర్మశాస్త్రములు కలియుగమున కవసరము లేదనియు, ఈ యుగమునకు

ఎట్టి యాచరణ గలిగియుండవలయునో అదే యుండదగిన దనియు నిశ్చయించిరి. కావున పాలన ప్రభుత్వము ననుసరించియు, బ్రాహ్మణేతరుల యభివృద్ధి ననుసరించియు, సర్వజనులతో బ్రాహ్మణులెట్లు కలిసిమెలిసి యుండిన, వారును క్షేమమును పొందగలరో అదే యీ యుగధర్మమని పరాశర ప్రభృతులు తెలిపిరి. కావున బ్రాహ్మణులును, బ్రాహ్మణేతరులును, ప్రభుత్వమును, ప్రజలును యెట్లు క్షేమము నొందగలుగుదురో, అట్టి ధర్మమును ఇప్పుడు ధర్మము నెఱింగిన వారెట్లు నిరూపించెదరో అదియే ఆచరణయోగ్యమగు ధర్మమగును.

## తులాధారుడు జాజలికిం చెప్పిన బ్రహ్మగీతలు

(శ్రీ మహాభారతము, శాంతిపర్వము)

**అత్ర గాథా బ్రహ్మగీతాః కీర్తయంతి పురావిదః।**
**శుచే రశ్రద్దధానస్య శ్రద్దధానస్య వాఽశుచేః।**
**దేవా విత్తమమన్యంత సదృశం యజ్ఞకర్మణి॥**

ఈ శ్రద్ధావిషయమున పూర్వజ్ఞులు బ్రహ్మగీతముల కీర్తించిరి. శుచియై శ్రద్ధలేనివాడును, అశుచియై శ్రద్ధగలవాడును యాగమున సమాన సంపదగలవారని దేవతలెంచిరి.

**శ్రోత్రియస్య కదర్యస్య వదాన్యస్య చ వార్ధుషేః।**
**మీమాంసిత్వోభయం దేవాః సమమన్నమకల్పయన్ ॥**

వేదవిదుడైన పిసినిగొట్టు యొక్కయు, వడ్డికిచ్చునట్టి దానశీలుని యొక్కయు నన్నమును గూర్చి విచారించి దేవతలు తుదకు రెంటిని సమానములుగా జేసిరి.

ఓ దేవా! పూజ్యుడగు బ్రహ్మదేవునిచే పూర్వము బ్రాహ్మణాది చతుర్వర్ణములు సృజింపబడినవి. ఏ కర్మ విపరిణామముచే, వైశ్యుడు శూద్రత్వము నొందును? దేనిచే క్షత్రియుడు వైశ్యుడగును? ఎందువలన బ్రాహ్మణుడు క్షత్రియుడగును? ఈ ప్రతిలోమ ధర్మమెట్లు నివారించుటకు శక్యమైనది?

**కేన వా కర్మణా విప్రః శూద్రయోనౌ ప్రజాయతే।**
**క్షత్రియ శ్శూద్రతా మేతి కేన వా కర్మణా విభో॥**

ఓ ప్రభూ, ఏ కర్మచే బ్రాహ్మణుడు శూద్రుడగును? ఏ కర్మచే క్షత్రియుడు శూద్రత్వము నొందును?

**ఏతం మే సంశయం దేవ! వద భూతపతేఽనఘ।**
**త్రయో వర్ణాః ప్రకృత్యేహ కథం బ్రాహ్మణ్య మాప్నుయుః॥**

పుణ్యాత్ముడవగు జీవేశా! ఈలోకమున స్వభావమున నెట్లు క్షత్రియాది వర్ణత్రయము బ్రాహ్మణత్వమును బొందును? నా యీ సంశయమును దీర్చుము.

దేవ ఉవాచ :– ఈశ్వరుడు చెప్పెను.

**బ్రాహ్మణ్యం దేవి దుష్ప్రాప్యం నిసర్గా ద్బ్రాహ్మణశ్శుభే।**
**క్షత్రియో వైశ్య శూద్రౌ వా నిసర్గాదితి మే మతిః॥**

ఓ పార్వతీ, బ్రాహ్మణత్వము దుర్లభమైనది. స్వభావముచేతనే బ్రాహ్మణుడగును. స్వభావముచేతనే క్షత్రియుడగును, స్వభావముచేతనే వైశ్యుడగును. స్వభావముచేతనే శూద్రుడగును. నా యభిప్రాయ మిట్టిది.

**కర్మణా దుష్కృతేనేహ స్థానాద్భ్రశ్యతివై ద్విజః।**
**జ్యేష్ఠం వర్ణమనుప్రాప్య తస్మా ద్రక్షేత వైద్విజః॥**

బ్రాహ్మణు డీ లోకమున దుష్టముగా చేయబడిన కర్మచే స్వీయమగు బ్రాహ్మణ్యమునుండి జారిపోవుచున్నాడు. అనఁగా క్షత్రియాద్యపర వర్ణముల బొందుచున్నాడు. అట్టి బ్రాహ్మణుడు సుకర్మలచే నుత్తమ వర్ణముల బొంది, ఆదుష్కృత కర్మలనుండి తన బ్రాహ్మణత్వమును రక్షించుకొనవలయును.

**స్థితో బ్రాహ్మణ ధర్మేణ బ్రాహ్మణ్య ముపజీవతి।**
**క్షత్రియో వాఽథ వైశ్యో వా, బ్రహ్మభూయం స గచ్ఛతి॥**

బ్రాహ్మణ ధర్మముల నాచరించుచు క్షత్రియ, వైశ్య, శూద్రాదులు పునః తమ బ్రాహ్మణ్యము నుజ్జీవింప చేసుకొని బ్రహ్మత్వము నొందుదురు.

**యస్తు బ్రహ్మత్వముత్సృజ్య క్షాత్రం ధర్మం నిషేవతే।**
**బ్రాహ్మణ్యాత్స పరిభ్రష్టః క్షత్రయోనౌ ప్రజాయతే॥**

ఎవడు స్వీయమగు బ్రాహ్మణత్వమును విడిచి, క్షత్రియ ధర్మ నిరతుడగునో యట్టివాడు, తన బ్రాహ్మణ్యమునుండి భ్రష్టుడై క్షత్రియుడగును.

**వైశ్యకర్మ చ యో విప్రో లోభమోహ వ్యపాశ్రయః।**
**బ్రాహ్మణ్యం దుర్లభం ప్రాప్య కరోత్యల్పమతి స్సదా॥**
**స ద్విజో వైశ్యతా మేతి వైశ్యో వా శూద్రతామియాత్।**
**స్వధర్మాత్ప్రచ్యుతో విప్రస్తత శ్శూద్రత్వమాప్ను తే॥**

బ్రాహ్మణుడు దుర్లభమగు బ్రాహ్మణత్వమును బొందియు, బుద్ధి హీనుడును, లోభమోహాదులు గలవాడునునై సర్వదా వైశ్యకర్మ నాచరించునో అట్టి బ్రాహ్మణుడు వైశ్యత్వమును, అట్టివైశ్యుడు శూద్రత్వమును బొందును.

మఱియు స్వధర్మ భ్రష్టుడగు బ్రాహ్మణుడు శూద్రత్వమును బొందును.

**తత్రాసౌ నిరయం ప్రాప్తో వర్ణభ్రష్టో బహిష్కృతః।**
**బ్రహ్మలోకా త్పరిభ్రష్ట శ్శూద్రస్సముపజాయతే॥**

శూద్రత్వమునొందిన బ్రాహ్మణుడు దుర్గతిని బొంది, బ్రాహ్మణ వర్ణమునుండి భ్రష్టుడై వెలివేయబడి, బ్రహ్మలోకము ( బ్రాహ్మణ్యము) నుండి పరిచ్యుతుడై శూద్రుడగును.

**క్షత్రియో వా మహాభాగో వైశ్యో వా ధర్మచారిణి।**
**స్వాని కర్మాణ్యపాదాయ శూద్రకర్మ నిషేవతే॥**

మఱియు నట్లే స్వధర్మ భ్రష్టుడగు క్షత్రియుడుగాని, వైశ్యుడుగాని ధర్మబద్ధములగు స్వీయకర్మల వదలిపెట్టి శూద్రకర్మ నిరతుడగును.

**స్వస్థానాత్స పరిభ్రష్టో వర్ణసంకరతాం గతః ।**
**బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రత్వం యాతి తాదృశః ॥**

తన వర్ణమునుండి పరిచ్యుతుడై అనగా నుత్తమోత్తమ ధర్మముల వదలి యధమాధమ ధర్మముల నాశ్రయించినవాడై వర్ణసంకరతను బొందిన బ్రాహ్మణుడు గాని, క్షత్రియుడు గాని వైశ్యుడు గాని శూద్రత్వమును బొందును.

**యస్తు బుద్ధ స్స ధర్మేణ జ్ఞానవిజ్ఞానవా న్శుచిః ।**
**ధర్మజ్ఞో ధర్మనిరత స్స ధర్మఫల మశ్నుతే ॥**

ఎవడు స్వీయధర్మము నెరుగునో, వాడా ధర్మముచే జ్ఞాన విజ్ఞానవంతుడును, శుచియు, సకల ధర్మముల నెరిగినవాడును, ధర్మాచరణుడునై యాధర్మ ఫలమును ( ఉత్కృష్టస్థానమును) బొందును.

**ఇదం చైవాపరం దేవి బ్రహ్మణా సముదాహృతమ్।**
**అధ్యాత్మం నైష్ఠికం సద్భి ర్ధర్మకామై ర్నిషేవ్యతే ॥**

ఓపార్వతీ, బ్రహ్మదేవుడు మరియు నిట్లుచెప్పెను, వర్ణవివక్షతను వదలి ధర్మేచ్ఛ వలన సత్పురుషులు ఆత్మజ్ఞాన నిష్ఠగలవారగుదురు.

**ఉగ్రాన్నం గర్హితం దేవి గణాన్నం శ్రాద్ధసూతకమ్ ।**
**దుష్టాన్నం నైవ భో క్తవ్యం శూద్రాన్నం నైవ కర్హి చిత్ ॥**

ఓపార్వతీ, క్రూరులయన్నము, గణాన్నము, శ్రాద్ధసంబంధమగు నన్నము, సూతకముగలవారి యన్నము, దుష్టుల యన్నము, హీనుల యన్నము నింద్యమైనది. కనుక నది యొకానొకప్పుడును భుజింపదగనిది యగును.

**శూద్రాన్నం గర్హితం దేవి సదా ద్వైర్మహాత్మభిః ।**
**పితామహాముఖోత్సృష్టం ప్రమాణమితి మే మతిః ॥**

ఓ దేవి, దేవతలు, మహాత్ములును శుచ్యాచారము లేనివారి అన్నమును నిందించిరి. ఈ విషయమున బ్రహ్మదేవుని వచనము ప్రమాణమని నా యభిప్రాయము. శూద్రాన్నమనగా శూద్రగుణముగలవాని యన్నమని తెలియవలయును.

**బ్రాహ్మణత్వం శుభం ప్రాప్య దుర్లభం యోఽవమన్యతే ।**
**అభోజ్యాన్నాని వాశ్నాతి స ద్విజత్వాత్పతేత వై ॥**

ఎవడు మంగళకరమును, దుర్లభమును అగు బ్రాహ్మణత్వమును బొందియు, దానినాచరింపక విడిచిపెట్టునో లేక భుజించ నర్హములుగాని యన్నముల భుజించునో, వాడు బ్రాహ్మణత్వమునుండి పతితుడగును.

సురాపో బ్రహ్మహా శూద్ర శ్చౌరో భగ్నవ్రతో౽శుచిః।
స్వాధ్యాయ వర్జితః పాపో లుబ్ధో నై కృతిక శ్శఠః॥
అవ్రతీ వృషలీ భర్తా కుండాశీ సోమవిక్రయీ।
విహీనసేవీ విప్రో హి పతతే బ్రహ్మయోనితః॥

కల్లుత్రాగువాడును, బ్రాహ్మణహంతకుడును, శూద్రుడును, చోరుడును, వ్రతభంగముగలవాడును, శుచిలేనివాడును, వేదాధ్యయన మొనర్చనివాడును, పాపియు, పిసినిగొట్టును, కుత్సితుడును, వ్రతముల నాచరింపనివాడును, శూద్ర స్త్రీ భర్తయు, కుండునియన్నము తినువాడును, సోమరసమును విక్రయించువాడును, మిక్కిలి హీనులగు వారిని సేవించువాడును నగు బ్రాహ్మణుడు బ్రాహ్మణత్వమునుండి భ్రష్టుడగును.

గురుతల్పీ గురుద్వేషీ గురుకుత్సారతిశ్చ యః।
బ్రహ్మవిచ్చాపి పతతి బ్రాహ్మణో బ్రహ్మవిత్తమః॥

గురుభార్యాగమనము గలవాడును, గురువును ద్వేషించువాడును, గురునిందానురాగియగు బ్రాహ్మణుడు బ్రహ్మవేత్తయైనను, మఱియు బ్రహ్మవేత్తలందరిలోను మిగుల శ్రేష్ఠుడైనను బ్రాహ్మణత్వమునుండి పతితుడగును.

ఏభిస్తు కర్మభి ర్దేవి శుభైరాచరితై స్తథా।
శూద్రో బ్రాహ్మణతామేతి వైశ్యః క్షత్రియతాం వ్రజేత్॥

పూర్వోక్తములగు కర్మలను మంగళకరములను (నిర్దుష్టములను,) గా ఆచరించు శూద్రుడు బ్రాహ్మణత్వమును, వైశ్యుడు క్షత్రియత్వమును బొందును.

**దేవద్విజాతిసత్కర్తా సర్వాతిథ్యకృత వ్రతః।**
**ఋతుకాలాభిగామీ చ నియతో నియతాశనః॥**
**చోక్షశ్చోక్ష జనాన్వేషీ శేషాన్నకృతభోజనః।**
**వృథా మాంసం న భుంజీత శూద్రో వైశ్యత్వమృర్ఛతి।**

దేవతలను, బ్రాహ్మణులను పూజించుచు, త్రైవర్ణికుల కందరికీ నాతిథ్యము నొసంగుచు, ఋతుకాలమున భార్యాగామియై, నియమములు గలిగి, మితముగా భుజించుచు, చోక్షజనుల నన్వేషించుచు, దేవతాతిథి పూజానంతరమున భుజించుచు, శ్రాద్ధాదులయందువమాత్రము మాంసాహారియగు శూద్రుడు వైశ్యత్వము నొందును. పూర్వము శ్రాద్ధములలో మాంసముండెను. అది కలియుగమున కూడదని నిషేధించడమైనది. పరాశరస్మృతి చూడుడు.

**ఋతవాగనహం వాదీ నిర్ద్వంద్వ శ్శమకోవిదః।**
**యజతే చైవ యజ్ఞై శ్చ స్వాధ్యాయపరమ శ్శుచిః॥**
**దాంతో బ్రాహ్మణ సత్కర్తా సర్వవర్ణ బుభూషకః।**
**గృహస్థవ్రతమాతిష్ఠ న్ ద్వికాలకృత భోజనః॥**
**శేషాశీ నియతాహారో నిష్కామో నిరహంవదః।**
**అగ్ని హోత్ర ముపాసంశ్చ జుహ్వానోఽథ యథావిధి॥**
**సర్వాతిథ్య ముపాతిష్ఠన్ శేషాన్న కృతభోజనః।**
**త్రేతాగ్ని మంత్రవిహితో వైశ్యో భవతి వై ద్విజః॥**

సత్యవాక్కులు గలిగి, నిరహంకారియై, సుఖదుఃఖాది ద్వంద్వముల సహించి, శాంతుడై, వేదాధ్యయన మొనర్చి, యజ్ఞములచే దేవతల నారాధించి, పరిశుద్ధుడై యింద్రియ నిగ్రహముగలిగి, బ్రహ్మనిష్ఠుల సత్కరించుచు, సర్వవర్ణములు సౌఖ్యముగా నుండగోరుచు, గృహస్థధర్మముల నాచరించుచు, దినమునకు రెండువమారులు వమాత్రము గుడుచుచు, దేవతాతిథి

సత్కారానంతరము భుజించుచు, మితాహారము గలిగి, కామాహంకారముల వదలి, అగ్నిహోత్రము నుపాసించుచు, శాస్త్రోక్తముగా హోమము నాచరించుచు, అతిథి యభ్యాగతులకు సర్వవిధముల నాతిథ్య మొసంగుచు, ఆహవనీయాద్యగ్నిత్రయమును సమంత్రకముగా వ్రేల్చుచు నుండు వైశ్యుడు ద్విజత్వమున కర్హుడగును.

**స వైశ్యః క్షత్రియకులే శుచి ర్మహతి జాయతే।**

అట్టి వైశ్యుడు శుచియై గొప్ప క్షత్రియు డగును.

**స వైశ్యః క్షత్రియో జాతో జన్మ ప్రభృతి సత్కృతః।**
**ఉపనీతో వ్రతపరో ద్విజో భవతి సత్కృతః॥**

ఆ వైశ్యుడు క్షత్రియుడైనది మొదలు సంస్కరింపబడి యుపనీతుడై వ్రతాసక్తి గలిగి ద్విజత్వమున కర్హుడగును.

**దదాతి యజతే యజ్ఞై స్సమృద్ధైరాప్తదక్షిణైః।**
**అధీత్య స్వర్గ మన్విచ్ఛం స్త్రేతాగ్నిశరణస్సదా॥**

అతడర్హుల కుచితమగు దానముల నిచ్చును. మఱియు వేదాధ్యయన మొనర్చి స్వర్గాకాంక్షియై సమృద్ధిగా దక్షిణలు గల యజ్ఞములచే, దేవతల నారాధించుచు, ఆహవనీయాద్యగ్ని గృహములు గలిగి యుండును.

**ఆర్త హస్తప్రదో నిత్యం ప్రజా ధర్మేణ పాలయన్।**
**సత్య స్సత్యాని కురుతే నిత్యం యస్సుఖదర్శనః॥**

దుఃఖితులకు చేయూతనొసగుచు, సదా ధర్మబద్ధముగా ప్రజల బాలించుచు, సత్యమును బలుకుచు, దర్శనమాత్రమున సుఖమును గలిగించుచు సత్కర్మల నాచరించును.

**ధర్మదండేన నిర్దండో ధర్మకార్యాను శాసకః।**
**యంత్రితః కార్యకరణైః షడ్భాగ కృతలక్షణైః॥**

దోషము గలవారిని ధర్మబద్ధముగా దండించుటచే, దండనవలన గలుగు దోషము లేనివాడై, ధర్మకార్యముల నొనర్ప బ్రజల శాసించుచుండును. మఱియు షడ్భాగములచే చేయబడిన లక్షణములు గల మంత్రి మొదలగు వారిచే నియమింప బడుచుండును.

**గ్రామ్యధర్మాన్న సేవేత స్వచ్ఛందేనార్థకోవిదః।**
**ఋతుకాలే తు ధర్మాత్మా పత్నీముపశయేత్సదా॥**

న్యాయవేత్త యగునతడు సురతసేవన మొనర్పడు. ధర్మాత్ముడై ఋతుకాలమున మాత్రము భార్యాశయన మొనర్చును:

**సదోపవాసీ నియత స్స్వాధ్యాయ నిరతశ్శుచిః।**
**బర్హిష్కాంతరితే నిత్యం శయానో౽గ్నిగృహే సదా॥**

నియంత కాలమున భుజించును. నియమములు గలిగి వేదాధ్యయనమున మిక్కిలి యాసక్తిగలవాడై, శుచియై, నిరతము హోమ, ధూపములచే నావరించబడిన గృహమున శయనించును.

**సర్వాతిథ్యం త్రివర్గస్య కుర్వాణ స్సుమనా స్సదా।**
**శూద్రాణాం చాన్నకామానాం నిత్యసిద్ధమితి బ్రువన్ ॥**

సతతము మంచి మనస్సు గలవాడై, త్రైవర్ణికులకు అన్నివిధముల నాతిథ్య మొసంగుచు, నన్నమును గోరు శూద్రుల కన్నము వండబడియున్నదని మధుర మాటలు చెప్పుచూ శాంతపర్చవలెను.

పితృప్రదో౽తిథికృతే సాధనం కురుతే చ యః।
స్వవేశ్మని యథాన్యాయముపాస్తే భైక్షమేవచ ॥
త్రికాల మగ్నిహోత్రం చ జుహ్వానో వై యథావిధి।
గో బ్రాహ్మణ హితార్థాయ రణే చాభిముఖో హతః।
త్రేతాగ్ని మంత్రపూతం వా సమావిశ్య ద్విజో భవేత్ ॥

ఎవడు పితృదేవతలకు తిలోదకముల నిచ్చుచు, నతిథుల కాసనాదుల నొసంగుచు, స్వగృహమున న్యాయము నతిక్రమించక భిక్షనిచ్చుచు, కాలత్రయమున హోమములు శాస్త్రోక్తముగా నాచరించుచు నుండునో మఱియు గోవులయొక్కయు, బ్రాహ్మణులయొక్కయు హితము కొరకు యుద్ధము నొనర్చి హతుడయినను లేక మంత్రములచే బవిత్రమగు త్రేతాగ్నిని ప్రవేశించినను లేక పైధర్మములను సదా అనుష్ఠించుచుండినను అట్టివాడు బ్రాహ్మణుడగును.

జ్ఞాన విజ్ఞాన సంపన్న స్సంస్కృతో వేదపారగః ।
విప్రో భవతి ధర్మాత్మా క్షత్రియ స్స్వేన కర్మణా ॥

జ్ఞానవిజ్ఞానములు గలవాడును, సంస్కరింపబడినవాడును, వేదములు కడవర కభ్యసించినవాడును, ధార్మికుడునగు క్షత్రియుడు స్వీయకర్మచే బ్రాహ్మణు డగును.

ఏతైః కర్మఫలైర్దేవి న్యూనజాతి కులోద్భవః।
శూద్రోప్యాగమ సంపన్నో ద్విజో భవతి సంస్కృతః॥

ఓపార్వతీ! ఇట్టి యుత్కృష్ట కర్మఫలములచే సంస్కరించబడిన తక్కువవాడగు శూద్రుడు గూడ ఆగమసంపన్నుడగు బ్రాహ్మణుడగును.

బ్రాహ్మణో వాప్యసద్వృత్తః సర్వసంకరభోజనః।
బ్రాహ్మణ్యం సమనుత్సృజ్య శూద్రో భవతి తాదృశః॥

నీచమగు నడత గలిగి, సంకరు లయన్నమును భుజించువాడు బ్రాహ్మణుడైనను, తన బ్రాహ్మణత్వమును వదలుకొని శూద్రుడగును.

**కర్మభి శ్శుచిభిర్దేవి శుద్ధాత్మా విజితేంద్రియః।**
**శూద్రో౾పి ద్విజవ త్సేవ్య ఇతి బ్రహ్మాను శాసనమ్॥**

పరిశుద్ధకర్మలవలన పవిత్రాత్ముడును, ఇంద్రియముల జయించిన వాడును నగు శూద్రుడును బ్రాహ్మణునివలె సేవింపదగినవాడని బ్రహ్మదేవుని యాజ్ఞ.

**స్వభావం కర్మ చ శుభం యత్ర శూద్రేపి తిష్ఠతి ।**
**విశిష్టస్సద్విజాతేర్వై విజ్ఞేయ ఇతి మే మతిః ॥**

పవిత్రస్వభావమును, మంగళకరమగు కర్మలను గలవాడు శూద్రుడైనను అతడు బ్రాహ్మణుని కంటె మిక్కిలి శ్రేష్ఠుడుగా దెలియదగిన వాడని నాయభిప్రాయము.

**న యోని ర్నాపి సంస్కారో నశ్రుతం న చ సంతతిః।**
**కారణాని ద్విజత్వస్య వృత్త మేవ తు కారణమ్॥**

ఉత్తమకులమున బుట్టుటగాని, ఉపనయనాది సంస్కారములు గాని, శాస్త్రాధ్యయనముగాని, సంతానముగాని బ్రాహ్మణత్వము గలుగుటకు కారణములు గావు. మరేమన నిష్కళంకమగు ప్రవర్తనమే దానికి కారణమగును.

**సర్వోయం బ్రాహ్మణో వృత్తే లోకేన చ విధీయతే।**
**వృత్తే స్థితస్తు శూద్రో౾పి బ్రాహ్మణత్వం నియచ్ఛతి॥**

లోకము నిష్కళంకమగు ప్రవర్తనగలవారిని బ్రాహ్మణులని

విధించుచున్నది. అట్టి పవిత్రమగు నడతగలవాడు శూద్రుండైనను బ్రాహ్మణుడగును.

**బ్రహ్మస్వభావః కల్యాణి సమస్సర్వత్ర మే మతిః।**
**నిర్గుణం నిర్మలం బ్రహ్మ యత్ర తిష్ఠతి స ద్విజః॥**

ఓ కల్యాణీ! బ్రహస్వభావము సమస్త భూతములయందు సమానముగా నుండునది యని నా యభిప్రాయము. ఆ బ్రహ్మము సత్త్వాది గుణరహితమైనది. నిర్మలమైనదియు నగును. ఇట్టి స్థితి యెవనికి గలదో వాడే బ్రాహ్మణుడు.

**ఏతే యోనిఫలా దేవి స్థానభాగ నిదర్శకాః।**
**స్వయం చ వరదేనోక్తా బ్రహ్మణా సృజతా ప్రజాః॥**

ఓ పార్వతి, ఈ పూర్వోక్తములగు ధర్మములే బ్రాహ్మణాదులగుటకు ప్రయోజకములు, ఆ యా స్థాన విభాగమునకు నిదర్శకములును నగును. ప్రజాసృష్టికర్త యగు బ్రహ్మదేవుడు తానుగానే యీధర్మములు చెప్పెను.

**విఘసాశినా సదా భావ్యం సత్పథాలంబినా తథా।**
**బ్రాహ్మ్యం మార్గ మనుక్రమ్య వర్తితవ్యం బుభూషతా॥**
**సంహితాధ్యాయినా భావ్యం గృహే వై గృహమేధినా।**
**నిత్యం స్వాధ్యాయ యుక్తేన న చాధ్యయన జీవినా॥**

దేవాతిథుల పూజానంతరమున భుజించువాడును, సన్మార్గ ప్రవర్తకుడును, వేదమున మంత్రభాగము నధ్యయనము చేయువాడును, నిత్యము స్వశాఖీయ వేదాధ్యయన మొనర్చువాడును, గృహమున గృహస్థుడును బ్రహ్మదేవునిచే పై జెప్పబడిన మార్గము నవలంబించి వర్తించవలయును.

వేదాధ్యయన మొనర్చి దానిచే జీవించువాడు మాత్ర మీ మార్గమున వర్తింపజాలడు.

**ఏవం భూతో హి యోవిప్రః సతతం సత్పథే స్థితః।**
**ఆహితాగ్ని రధీయానో బ్రహ్మభూయాయ కల్పతే॥**

బ్రహ్మదేవుడు చెప్పినటుల ప్రవర్తించునట్టివాడును, సర్వదా సన్మార్గ వర్తియును, అహితాగ్నియును, వేదాధ్యయన మొనర్చువాడును నగు బ్రాహ్మణుడు బ్రహ్మత్వము నొంద సమర్థుడగును.

**ఏతత్తే గుహ్య మాఖ్యాతం, యథా శూద్రో భవే ద్ద్విజః।**
**బ్రాహ్మణో వా చ్యుతో ధర్మా ద్యథా శూద్రత్వశ్నుతే॥**

శూద్రుడెట్లు ధర్మముచే బ్రాహ్మణుడగునో, బ్రాహ్మణుడెట్లు ధర్మభ్రష్టుడై శూద్రుడగునో యీ రహస్యమును నీకు జెప్పితిని.

## శౌనకుండు ధర్మరాజునకు ధర్మంబుల జెప్పుట

( శ్రీ మహాభారతము, అరణ్యపర్వము )

వైశంపాయన ఉవాచ :– వైశంపాయనుడు చెప్పెను.

**ప్రభాతాయాం తు శర్వర్యాం తేషా మక్లిష్ట కర్మణామ్।**
**కాననం యియాసతాం విప్రా స్త ద్దుర్భిక్షాభుజోఽగ్రతః॥**

తెల్లవారగనే దుర్భిక్షాను భోక్తలగు బ్రాహ్మణులు, అరణ్యమున కేగబోవుచున్నట్టి క్లేశరహితకర్మలు గల యా పాండవుల యెదుటకు వచ్చిరి.

**తానువాచ తతో రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః।**
**వనం చ దోషబహుళం బహువ్యాళ సరీసృపమ్॥**

తరువాత, కుంతీ పుత్రుండగు ధర్మరాజు బ్రాహ్మణులగూర్చి యిటుల పలికెను. మేము రాజ్యమును, సంపదను, సర్వస్వమును బోగొట్టుకొన్నవారలమై ఫలమూలాద్యాహారము గల వారలమై, దుఃఖితులమై యరణ్యమునకు బోవుచున్నాము. అరణ్యము వ్యాఘ్రాద్యనేక క్రూర మృగములు గలది గనుక యనేకాపాయములకు హేతువగుచున్నది.

**పరిక్లేశశ్చ వో మన్యే ధ్రువం తత్ర భవిష్యతి।**
**కిం పునర్మామితో విప్రాః నివర్తధ్వం యథేష్టతః॥**

అరణ్యమునందు మీకు చాలా క్లేశములు గలుగునని తలంచుచున్నాను. బ్రాహ్మణులకు క్లేశము గలిగిన, అది దేవతలను గూడ నశింపచేయును. కాన నావెంట నేల వచ్చెదరు? యథేష్టముగా మరలుడు.

బ్రాహ్మణా ఊచుః – బ్రాహ్మణులు చెప్పిరి.

**అస్మత్పోషణజా చింతా మా భూత్తే హృది పార్థివ।**
**స్వయమాహృత్య చాన్నాని చోపయోక్ష్యామ హే వయమ్॥**

ఓ రాజా! మమ్ముల బోషించు విషయమై చింతింపకుము. మా భోజనాదుల మేమే సమకూర్చుకొనెదము.

**అనుధ్యానేన జప్యేన విధాస్యామశ్శివం తవ।**
**కథాభి శ్చాభిరమ్యాభి స్సహ రంస్యామహే వయమ్॥**

మరియు జపధ్యానములచే మీకు శుభమును చేకూర్చెదము. ఇకను మనోహరములగు కథలతో మేమానందించెదము.

యుధిష్ఠర ఉవాచ :– ధర్మరాజు వచించెను.

**ఏవమేత న్న సందేహో రమేఽహం సతతం ద్విజైః।**
**మానభావాత్తు పశ్యామి ప్రత్యాదేశమివాత్మనః॥**

ఇట్టయినచో నాకేలాంటి సందేహమును లేదు. నేనును బ్రాహ్మణులతో నెల్లప్పుడు నానందించెదను. కాని నా గౌరవభావమును బట్టి మిమ్ములను తిరస్కరించినట్లే.

**కథం ద్రక్ష్యామి వ స్సర్వాన్ స్వయ మాహృత్య భోజనమ్।**
**మద్భక్త్యా క్లి శ్యతోఽనర్హాన్ ధిక్పాపా న్ధృతరాష్ట్రజాన్॥**

స్వయముగా సంపాదించుకొని భుజించునట్టియు, నాయందలి భక్తిచే క్లేశము నొందుచున్న మిమ్ముల నెట్లు చూడగలను ? అనర్హులును, పాపులును నగు ధృతరాష్ట్ర తనయుల నిందయగు గాక!

వైశంపాయన ఉవాచ :– వైశంపాయనుడు బలికెను.

**ఇత్యుక్త్వా స నృపతి శ్శోచ న్నిషసాద మహీతలే।**
**తమధ్యాత్మరతో విద్వాన్ శౌనకో నామ వై ద్విజః।**
**యోగే సాంఖ్యే చ కుశలో రాజాన మిద మబ్రవీత్॥**

ఆ ధర్మరాజిటుల జెప్పి భూమియందు గూర్చొనెను. అంతట నాత్మజ్ఞానియు, బ్రహ్మవేత్తయు, యోగసాంఖ్యములయందు నిపుణుడునగు శౌనకుడు యుధిష్ఠరుని గూర్చి యిట్లనియె.

**శోకస్థాన సహస్రాణి భయ స్థానశతాని చ।**
**దివసే దివసే మూఢ మావిశంతి న పండితమ్॥**

వేలకొలది శోకహేతువులను, వందలకొలది భీతికారణములును ఎల్లపుడు మూఢుని ఆవేశించునేగాని ఆత్మనిష్ఠుడగు పండితుని జేరవు. అనగా శోకభీతులకు జ్ఞాని వశుడుకాడని భావము.

**న హి జ్ఞానవిరుద్ధేషు బహుదోషేషు కర్మను ।**
**శ్రేయోఘాతిషు సజ్జంతే బుద్ధిమంతో భవద్విధాః॥**

బుద్ధిమంతులగు మీ బోటివారు జ్ఞాన విరుద్ధములును, దోషబహుళము లును, శ్రేయోవిధ్వంసములునగు కర్మల యం దాసక్తులు గారు.

**అష్టాంగాం బుద్ధిమాహుర్యాం సర్వాశ్రేయోఽభిఘాతినీమ్ ।**
**శ్రుతి స్మృతి సమాయుక్తాం రాజన్ ! సా త్వయ్యవస్థితా॥**

ఓ రాజా, అష్టాంగయోగ సంయుతమైన యే బుద్ధిని, సర్వానర్థముల నశింపజేయు దానినిగాను, శ్రుతిస్మృతి ధర్మయుక్తమైన దానిని గాను జెప్పు చున్నారో అట్టి నీబుద్ధి స్థైర్యము లేనిదాయెను.

**అర్థకృచ్ఛేషు దుర్గేషు వ్యాపత్సు స్వజనస్య చ।**
**శారీర మానసై ర్దుఃఖై ర్న సీదంతి భవద్విధాః॥**

స్వజనమునకు ధనముచేనైన బాధలు గలిగినట్టి, ( దారిద్ర్య బాధగల) దుర్గమములైన యాపదలు గలిగినచో, నీబోటివారు శారీర మానసికదుఃఖములలో వ్యథ నొందరు.

**శ్రూయతాం చాభిధాస్యామి జనకేన యథా పురా।**
**ఆత్మవ్యవస్థానకరా గీతాః శ్లోకా మహాత్మనా॥**

పూర్వము మహాత్ముడగు జనకునిచే ఆత్మ స్థైర్యకరములగు కొన్ని శ్లోకములు జెప్పబడినవి. వాటిని జెప్పెద వినుము.

**మనోదేహసముత్థాభ్యాం దుఃఖాభ్యా మర్దితం జగత్।**
**తయోర్వ్యాస సమాసాభ్యాం శమోపాయమిమం శృణు॥**

మనోదేహ జనితములగు దుఃఖములచే జగత్తు హింసించబడినది. ఆ దుఃఖములయొక్క శమోపాయమును విభజించి సంక్షేపముగా జెప్పెద వినుము.

**వ్యాధే రనిష్ట సంస్పర్శా చ్ఛ్రమాదిష్ట వివర్జనాత్ ।**
**ఆధివ్యాధి ప్రశమనం క్రియాయోగ ద్వయేన చ ॥**

అప్పుడు శారీరక మానసిక దుఃఖములకు తగిన ప్రతీకారము వలనను, ఎల్లప్పుడు ఆత్మ విచారణచేతను, క్రియాయోగముచేతను, జ్ఞానయోగముచేతను శారీరక మానసిక దుఃఖము లుపశమించును.

**మతిమంతో హ్యతో వైద్యాః శమం ప్రాగేవ కుర్వతే।**
**మానసస్య ప్రియాఖ్యానై స్సభోగోపనయై ర్నృణామ్॥**

అందువలన బుద్ధిమంతులగు వైద్యులు ముందుగనే మనుష్యుల యొక్క మనస్సునకు ప్రియమును గూర్చి మాటలు చెప్పుటచే, మానసిక దుఃఖోపశమనమును, ఔషధ సుఖోపభోగాది ప్రతీకారములచే శారీరక దుఃఖశాంతిని గలుగజేయుచున్నారు.

**మానసేన హి దుఃఖేన శరీర ముపతప్యతే।**
**అయఃపిండేన త ప్తేన కుంభసంస్థ మివోదకమ్॥**

బాగుగా కాలిన ఆయఃపిండము (ఇనుపముద్ద) చేత, కుండయందలి నీరువలె మానసిక దుఃఖముచే శరీరము తపింపబడుచున్నది.

**మానసం శమయే త్తస్మాద్ జ్ఞానేనాగ్ని మివాంబునా।**
**ప్రశాంతే మానసే హ్యస్య శారీర ముపశామ్యతి॥**

నీటిచే అగ్నినివలె, జ్ఞానవముచే (ఆత్మవిచారణచే) మానసిక దుఃఖమును బోగొట్టవలయును. మానసిక దుఃఖ ముపశమించిన శారీరక

దుఃఖము ఉపశమించును.

మనసో దుఃఖమూలంతు స్నేహమిత్యుపలభ్యతే।
స్నేహాత్తు సజ్జతే జంతు ర్దుఃఖయోగ ముపైతి చ॥

మానసిక దుఃఖమునకు స్నేహము (ప్రేమ) కారణము. మనుజుడు ప్రేమవలననే యేదేని వస్తువునందు లేక వ్యక్తియందాస క్తుడగుచున్నాడు. అందుచే దుఃఖమును బొందుచున్నాడు.

స్నేహమూలాని దుఃఖాని స్నేహజాని భయాని చ।
శోకహర్షౌ తథాఽఽయాస స్సర్వేః స్నేహాత్ప్రవ ర్తతే॥

దుఃఖము, భయము వీటికి ప్రేమయే కారణము, శోకహర్షము లాయాసము- ఇవియన్నియు స్నేహము వలననే గలుగుచున్నవి.

స్నేహాద్భావోఽను రాగశ్చ ప్రజజ్ఞే విషయే తథా।
అశ్రేయస్కావు భావేతౌ పూర్వస్తత్ర గురుః స్మృతః॥

స్నేహమువలన విషయమునందు మనోవికారము, అనురాగము గలుగుచున్నవి. ఈ రెండును శ్రేయోదాయకములు గావు. అందు మొదటిది యగు మనోవికారము మిక్కిలి గొప్పది.

కోటరాగ్ని ర్యథాఽశేషం సమూలం పాదపం హరేత్।
ధర్మార్థౌ తు యథాఽల్పోపి రాగదోషో వినాశయేత్॥

ఎట్లు చెట్టు తొఱ్ఱయందున్న యగ్ని కొంచెమైనను వృక్షమును సమూలప ుగ నశింపజేయునో అట్లే స్వల్పమైనను అనురాగము ధర్మార్థముల నాశనమొందించును.

**విప్రయోగేన తు త్యాగీ దోషదర్శీ సమాగమే।**
**విరాగం భజతే జంతు ర్నిర్వైరో నిరవగ్రహః॥**

మనుజుడు వియోగమునందు త్యాగియు, సమాగమమున దోషదర్శియునై నచో సుఖదుఃఖరహితుడై వైరాగ్యమును బొందుచున్నాడు.

**తస్మా త్స్నేహం న లిప్సేత మిత్రేభ్యో ధనసంచయాత్।**
**స్వశరీర సముత్థం చ జ్ఞానేన వినివ ర్తయేత్॥**

కావున మిత్రులయందును, ధనసంచయమునందును, లిప్తుడుగా కూడదు. స్వశరీరజనితమగు స్నేహమును; జ్ఞానముచే నివర్తింపవలయును.

**జ్ఞానాన్వితేషు యుక్తేషు శాస్త్రజ్ఞేషు కృతాత్మను।**
**న తేషు నజ్జతే స్నేహః పద్మపత్రే ష్వివోదకమ్॥**

తామరాకులయందు నీరంట నటుల, జ్ఞానులయందును, యోగులయందును, శాస్త్రజ్ఞులయందును, తత్త్వవేత్తలయందును స్నేహమంటదు. అనగా వారు స్నేహబద్ధులు కారని భావము.

**రాగాభిభూతః పురుషః కామేన పరికృష్యతే।**
**ఇచ్ఛా సంజాయతే తస్య తత స్తృష్ణా వివర్ధతే॥**

అనురాగయుక్తుడగు పురుషుడు కామముచే నాకర్షింపబడును. తరువాత యిచ్ఛ యుదయించును. పిమ్మట నతనికి తృష్ణ వృద్ధినొందును.

**తృష్ణా హి సర్వపాపిష్ఠా నిత్యోద్వేగకరీ స్మృతా।**
**అధర్మబహులా చైవ ఘోరపాపానుబంధినీ॥**

ఆశ, సర్వపాప భూయిష్ఠమై నిత్యమును ఉద్రేకమును

గలుగజేయును. మఱియు నిది యధర్మ బహుళమైనదియు, ఘోరమైనదియు, పాపానుకారి యగు చున్నది.

**యా దు స్త్యజా దుర్మతిభి ర్యా న జీర్యతి జీర్యతః।**
**యోఽసౌ ప్రాణాతికో రోగస్తాం తృష్ణాం త్యజత స్సుఖమ్॥**

దుర్బుద్ధులచే ద్యజింప నలవిగాని యే తృష్ణ శరీరము నశించినను నశింపదో, అట్టిది ప్రాణాంతికమగు రోగమగును. ఆ తృష్ణను వీడినవానికి సుఖము గలుగును.

**అనాద్యంతా తు సా తృష్ణా అంతర్దేహగతా నృణామ్ ।**
**వినాశయతి భూతాని అయోనిజ ఇవానలః ॥**

ఆద్యంత రహితమగు ఈ తృష్ణ, మనుజాల దేహాంతర్గతమై, అయోనిజమగు నగ్నివలె, సర్వభూతముల నశింపజేయుచున్నది.

**యథైధః స్వసముత్థేన వహ్నినా నాశమృచ్ఛతి।**
**తథా కృతాత్మా లోభేన సహజేన వినశ్యతి॥**

కాష్ఠమెటుల తనయం దుద్భవించిన యగ్నిచే నశించునో, అట్లే జ్ఞాని తన యాత్మయందు జనించిన తృష్ణచే నాశము నొందుచున్నాడు.

**రాజత స్సలిలాదగ్నే శ్చోరతః స్వజనాదపి।**
**భయమర్థవతాం నిత్యం మృత్యోః ప్రాణభృతామివ॥**

ప్రాణధారులగు జీవులకు మృత్యువు వలన వలె, ధనముగలవారలకు ఎల్లప్పుడు రాజువలనను, జలమువలనను, చోరులవలనను, స్వజనమువలనను భయము గలుగును.

**యథా హ్యామిష మాకాశే పక్షిభి శ్శ్వాపదైర్భువి।**
**భక్ష్యతే సలిలే మత్స్యైస్తథా సర్వత్ర విత్తవాన్॥**

మాంస మెటుల యాకసమునందు పక్షులచేతను, భూమియందు వ్యాఘ్రాది జంతువులచేతను, నీటియందు మత్స్యములచేతను ఆకర్షింపబడి భక్షింపబడునో, అట్లే ధనవంతుడు సర్వత్ర సర్వవిధముల అందరిచేతను పీడింపబడును.

**అర్థ ఏవ హి కేషాం చి దనర్థం కురుతే నృణామ్ ।**
**అర్థశ్రేయపి చాసక్తో న శ్రేయో విందతే నరః ॥**

కొందరికి ధనమే యనర్థమును గలుగజేయును. గాన ధనాసక్తుడగు మనుజుడు శ్రేయస్సు నొందడు.

**తస్మా దర్థాగమాః సర్వే లోభమోహ వివర్ధనాః।**
**కార్పణ్యం దర్పమానౌ చ భయ ముద్వేగ ఏవచ॥**

కాబట్టి ధనమును నిమిత్తముగా చేసికొని గలిగిన కార్పణ్యము, గర్వాహంకారములు, భయోద్వేగములు- నివియన్నియు లోభ మోహముల నినుమడింపజేయును.

**అర్థజాని విదుః ప్రాజ్ఞా దుఃఖాన్యేతాని దేహినామ్।**
**అర్థస్యోత్పాదనే చైవ పాలనే చ తథా క్షయే॥**

ప్రాణులకు దుఃఖములన్నియు ధన సంపాదనమునందు, తద్రక్షణమునందు, తన్నాశమునందును గలుగుచున్నవని విజ్ఞానులు చెప్పుచున్నారు. కాన దుఃఖమునకు మూలకారణము ధనమే యగుచున్నది.

**సహంతి చ మహ ద్దుఃఖం ఘ్నంతి చైవార్థకారణాత్।**
**అర్థాద్దుఃఖం పరిత్యక్తుం పాలితాశ్శ్రైవ శత్రవః॥**

ధన కారణముననే గొప్ప దుఃఖమును సహించుచున్నారు. మఱియు దీనివలననే యనేకులను హింసించుచున్నారు. ధనమువలనన్నైన దుఃఖమును వీడుటకు ప్రజలు కూడ శత్రువు లగుచున్నారు.

**దుఃఖేన చాధిగమ్యంతే తస్మాన్నాశం న చింతయేత్।**
**అసంతోషపరామూఢా స్సంతోషం యాంతి పండితాః॥**

ధనము మిక్కిలి కష్టముచే పొందబడుచున్నది. మూఢులు తృప్తిరహితులై దొరికినదానితో సంతసింపరు. జ్ఞాన లట్లుగాక లభించినదానితో సంతోషించెదరు.

**అంతో నాస్తి పిపాసాయా స్సంతోషః పరమం సుఖమ్।**
**తస్మా త్సంతోషమేవేహ పరం పశ్యంతి పండితాః॥**

పిపాసకు ( ఆశకు ) అంతము లేదు. సంతోషమే పరమ సుఖము. కాన జ్ఞానులు సంతోషమునే శ్రేష్ఠమైనదానినిగా దలంతురు.

**అనిత్యం యౌవనం రూపం జీవితం రత్నసంచయః।**
**ఐశ్వర్యం ప్రియసంవాసో గృధ్యే త్తత్ర న పండితః॥**

యౌవనము, రూపము, జీవితము, రత్నసంచయము, ఐశ్వర్యము ప్రియులతోగూడి యుండుట - ఇవి యన్నియు నశ్వరములు జ్ఞానులవీటియం దాసక్తులు గారు.

**త్యజేత సంచయాంస్త స్మాత్తజ్జాన్ క్లేశా న్సహేత చ**
**న హి సంచయవాౝ కశ్చిద్దృశ్యతే నిరుపద్రవః।**
**అతశ్చ ధార్మికైః పుంభి రనీహార్థః ప్రశస్యతే॥**

కావున, ధనసంచయమును విడువవలయును. తదుత్పన్నములగు దుఃఖముల సహింపవలయును. ధన సంపాదన పరు డెవడును ఉపద్రవ రహితుడ గుట కానరాదు. కావున, ధార్మికులగు పురుషులు నిరాశను మిక్కిలి కొనియాడు దురు.

**ధర్మార్థం యస్య విత్తేహా వరం తస్య నిరీహతా।**
**ప్రక్షాళనాద్ధి పంకస్య శ్రేయో హ్యస్పర్శనం నృణామ్॥**

ధర్మకార్యముల జేయుటకై ధనమును సంపాదింపవలయునని యెవనికి కోరిక గలుగునో, అతని కాకోరిక గలుగకుండుటయే శ్రేష్ఠము. బురదలో కాలు బెట్టి కడుగు కొనుటకంటె కాలు బెట్టకుండుటయే మేలు.

**యుధిష్ఠిరైవం సర్వేషు న స్పృహాం కర్తు మర్హసి।**
**ధర్మేణ యది తే కార్యం విముక్తేచ్ఛో భవార్థతః॥**

ఓ ధర్మరాజా ! నీ కార్యము ధర్మబద్ధమైనను సర్వ పదార్థముల యందాస క్తుడవు గాదగవు. ధనము నుండి ఆశను వీడుము.

యుధిష్ఠిర ఉవాచ :– ధర్మరాజు పలికెను.

**నార్థోపభోగ లిప్సార్థ మియమర్థేప్సుతా మమ।**
**భరణార్థంతు విప్రాణాం బ్రహ్మౕ కాంక్షే న లోభతః॥**

ఓ బ్రహ్మనిష్ఠుడా ! నే నీ ధనమును గోరుట నా సుఖోప భోగము కొఱకు గాదు. వరేవున బ్రాహ్మణుల యొక్క రక్షణము కొఱకై

యర్థించుచున్నాను. కాని లోభమువలన కాదు.

**కథమస్మద్విధో బ్రహ్మన్ వర్తమానో గృహాశ్రమే।**
**భరణం పాలనం వాఽపి నకుర్యాదనుయాయినామ్॥**

ఓ బ్రాహ్మణా ! గృహస్థాశ్రమమునందున్న మాబోటివారు, అనుయాయుల యొక్క భరణము నెటుల జేయకుందురు?

**సంవిభాగో హి భూతానాం సర్వేషా మేవ దృశ్యతే।**
**తథైవా పచమానేభ్యః ప్రదేయం గృహమేధినా॥**

సర్వ ప్రాణులకును సంవిభాగము ( ధనసంచయము) ధర్మముగనే గనబడుచున్నది. అట్లే గృహస్థు డతిథి అభ్యాగతుల నాదరించవలయును.

**తృణాని భూమి రుదకం వాక్చతుర్థీశ సూనృతా।**
**సతా మేతాని గేహేషు నోచ్ఛిద్యంతే కదా చన॥**

తృణభూవ్యుదక ప్రియవచనములు ( అతిథి సత్కారము) గృహస్థులకు ముఖ్య ధర్మములు. సనాతనములగు నీ ధర్మము లెన్నడును నశించునవి గావు.

**దేయ మార్తస్య శయనం స్థిత శ్రాంతస్య చాసనమ్।**
**తృషితస్య చ పానీయం క్షుధితస్య చ భోజనమ్॥**

గృహస్థుడు ఆర్తునకు శయనమును, స్థిత శ్రాంతునకు ( శ్రమ నొందిన వానికి) ఆసనమును, దప్పికగొన్న వానికి జలమును, ఆకలిగొన్నవానికి అన్నము నీయవలయును.

**చక్షుర్దద్యాన్మనో దద్యా ద్వాచం దద్యా త్సుభాషితామ్।**
**ఉత్థాయ చాసనం దద్యాదేష ధర్మ స్సనాతనః॥**

గృహస్థుడు అతిథిని జూచి మంచి దృష్టి గలిగి, మంచి మనస్సు గలిగి, మంచి మాటలు చెప్పి లేచి ఆసనము నియ్యవలయును. ఇది గృహస్థులకు సనాతనమైన ధర్మము.

**ప్రత్యుత్థాయాభిగమనం కుర్యా న్న్యాయేన చార్థినామ్।**
**అగ్నిహోత్ర మనడ్వాంశ్చ జ్ఞాతయోఽతిథి బాంధవాః॥**
**పుత్రదారాశ్చ భృత్యాశ్చ నిర్దహేయురపూజితాః।**
**ఆత్మనే పాచయే న్నాన్నం న వృథా ఘాతయేత్పశూన్॥**

గృహస్థు డతిథిని జూచి లేచి యెదురుగా వెళ్ళి సత్కరించవలయును. అగ్నిహోత్రము, వృషభము, జ్ఞాతులు, అతిధులు, బంధువులు, భార్యాపుత్రులు, భృత్యులు వీరలను సత్కరించనిచో పాపము సంభవించును. కాన, వారల నాదరించవలయును. మఱియు గృహస్థుడు తన కొరకుగా నన్నమును వండుకొన కూడదు. అనగా నతిథి యభ్యాగతుల సత్కారము కొరకు వండవలయునని భావము. వ్యర్థముగా పశువులను వధించరాదు.

**విఘసాశీ భవేత్త స్మాన్నిత్యం చామృత భోజనః।**
**విఘసో భుక్త శేషంతు యజ్ఞ శేషం తథాఽమృతమ్॥**

కాన, నిత్యము విఘసమును భుజించువాడును, అమృతమును భుజించువాడును గావలయు. దేవతాతిథి భుక్తశేషము విఘసమనియు, యజ్ఞశేష మమృత మనియు చెప్పబడును.

**యో దద్యాదపరిక్లిష్టమన్న మధ్వ నివర్తతే।**
**శ్రాంతాయాదృష్ట పూర్వాయ తస్య పుణ్యఫలం భవేత్॥**

ఏగృహస్థుడు మార్గాయాసముచే శ్రాంతుడైనట్టియు, ఇదివరకెన్నడును జూడబడని యతిథికి క్లేసరహితమగు నన్నమును బెట్టునో, యట్టి గృహస్థునకు పుణ్యఫలము గలుగును.

**ఏవం యో వర్తతే వృత్తం వర్తమానో గృహాశ్రమే।**
**తస్య ధర్మం పరం ప్రాహుః కథం వా విప్ర మన్యసే॥**

ఓ బ్రాహ్మణా ! ఏ గృహస్థుడు పైజెప్పిన యాచరణ గలిగియున్నాడో అతనియొక్క ఆధర్మము లత్యుత్కృష్టములని పెద్దలు జెప్పుచున్నారు. నీయభిప్రాయమేమి ?

శౌనక ఉవాచ :– శౌనకుడు బలికెను.

**అహో బత మహత్కష్టం విపరీత మిదం జగత్।**
**యేనాపత్రపతే సాధు రసాధు స్తేన తుష్యతి॥**

ఆహా ! ఈ విషయమెంత యాశ్చర్యకరమైనది! ఎంత క్లిష్టమైనది! జగత్తంతయు విపరీత భావనగలది! ఏలన సజ్జనుడు దేనిచే సిగ్గునొందుచున్నాడో, దానిచేతనే దుష్టుడు సంతసించుచున్నాడు గదా!

**శిశ్నోదరకృతే ప్రాజ్ఞః కురుతే విఘసం బహు।**
**మోహరాగవశాక్రాంత ఇంద్రియార్థవశంవదః॥**

విజ్ఞుడు మోహరాగపరవశుడును, ఇంద్రియార్థములగు శబ్దస్పర్శాదులకు స్వాధీనుడునై శిశ్నోదరసంతృప్తి కొరకు విఘస భోజనాద్యనేక కర్మముల నొనర్చుచున్నాడు.

**హ్రియతే వధ్యమానోపి నరో హారిభి రింద్రియైః।**
**విమూఢసంజ్ఞో దుష్టాశ్వై రుద్భ్రాంతై రివ సారథిః॥**

దిగ్భ్రమ జెందిన దుష్టాశ్వములచేత సారథివలె మూఢుడగు పురుషుడు చంపబడుచున్న వాడైనను (మరణమాసన్నమైనను) మనుష్యుని స్వాధీనపరచుకొను స్వభావము గల యింద్రియములచే నాకర్షింపబడుచున్నాడు.

**షడింద్రియాణి విషయం సమాగచ్ఛంతి వై యదా।**
**తదా ప్రాదుర్భవత్యేషాం పూర్వసంకల్పజన్మనః॥**

ఎపుడు షడింద్రియములు వాటికి విషయభూతములగు పదార్థముల బొందునో, అపుడు సంకలాత్మకమగు మనస్సు జనించుచున్నది.

**మనో యస్యేం ద్రియస్యేహ విషయాయాతిసేవితుమ్।**
**తస్యాత్సుక్యం సంభవతి ప్రవృత్తి శ్చోపజాయతే॥**

మనస్సు ఏ యింద్రియవిషముల సేవింపదలచునో ఆ విషయము లందు ప్రథమమున ఔత్సుక్యము గలుగును. తదుపరి విషయప్రవృత్తియు గలుగును.

**తత స్సంకల్పబీజేన కామేన విషయేషుభిః।**
**విద్ధః పతతి లోభాగ్నౌ జ్యోతిర్లోభాత్పతంగవత్॥**

తరువాత సంకల్పబీజమైన కామముచే విషయరూపబాణములచే గొట్టబడిన పురుషుడు, అగ్నియందు ఫలభ్రాంతి జెందిన పతంగమువలె, లోభాగ్నియందు బడుచున్నాడు.

**తతో విహారై రాహారై ర్మోహితశ్చ యథేప్సయా।**
**మహామోహే సుఖే మగ్నో నాత్మాన మవబుధ్యతే॥**

తరువాత యథేచ్ఛముగా విహారాహారములచే మోహితుడై మహా మోహాత్మకమగు సుఖమునందు మగ్నుడై తన్ను తానెరుంగడు .

**ఏవం పతతి సంసారే తాసు తాస్విహ యోనిషు।**
**అవిద్యా కర్మ తృష్ణాభి ర్భ్రామ్యమాణోఽథ చక్రవత్॥**

పిమ్మట యీప్రకార మవిద్యాతృష్ణాదులచే భ్రాంతుడై చక్రమువలె జనన మరణరూప సంసారమున తిరుగుచున్నాడు.

**బ్రహ్మాదిషు నృణాం తేషు భూతేషు పరివర్తతే।**
**జలే భువి తథాకాశే జాయమానః పునఃపునః॥**

ఈప్రకారము జలమునందును, భూమియందును, ఆకాశము నందును మాటి మాటికి బుట్టుచున్నవాడై, పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సకల భూతములయందు పరిణామము నొందుచున్నాడు. అనగా పశుపక్ష్యాది జన్మల బొందునని భావము.

**అబుధానాం గతి స్త్వేషా బుధానామపి మే శృణు।**
**యే ధర్మే శ్రేయసి రతా విమోక్షరతయో జనాః॥**

అజ్ఞానుల యొక్క గతి యిట్టిది. ఇక ధర్మమునందును , శ్రేయస్సు నందును, మోక్షమునందు నాసక్తిగల జ్ఞానుల యొక్క పరిస్థితి జెప్పెదవినుము.

**తదిదం వేదవచనం కురు కర్మ త్యజేతి చ।**
**తస్మాద్ధర్మా నిమాన్ సర్వాన్నాభిమానా త్సమాచరేత్॥**

ఈ కర్మము చేయుము, దీనిని చేయకుము అనునది వేదవచనము గాన ఈ సమస్త ధర్మములను అభిమానముతో ( కర్తృత్వ బుద్ధితో) జేయరాదు.

**ఇజ్యాధ్యయనదానాని తపస్సత్యం క్షమాదయః।**
**అలోభ ఇతిమార్గోఽయం ధర్మస్యాష్టవిధ స్స్మృతః॥**

యజ్ఞము, అధ్యయనము, దానము, తపస్సు, సత్యము, క్షమ, ధనము, లోభము లేకుండుట అనునవి యెనిమిది విధములగు ధర్మము లనబడును.

అత్ర పూర్వ శ్చతుర్వర్గః పితృయాన పథే స్థితః।
కర్తవ్యమితి యత్కార్యం నాభిమానా త్సమాచరేత్॥

ఈ పైజెప్పిన ధర్మములలో పూర్వమున్న నాలుగు ధర్మములు పితృయాన మార్గమున కనుయుక్తములైనవి. ఇది నాకర్తవ్యమని యాచరింపవలయును. కాని కర్తృత్వ బుద్ధితో నాచరింపరాదు.

ఉత్తరో దేవయానస్తు సద్భిరాచరితస్సదా।
అష్టాంగే నైవ మార్గేణ విశుద్ధాత్మా సమాచరేత్॥
సమ్యక్సంకల్ప సంబంధాత్సమ్య క్చేంద్రియ నిగ్రహాత్।
సమ్య గ్వ్రతవిశేషాచ్చ సమ్యక్చ గురుసేవనాత్॥
సమ్యగాహారయోగాచ్చ సమ్యక్చాధ్యయనాగమాత్।
సమ్యక్కర్మోపసన్యాసా త్సమ్యక్చిత్తనిరోధనాత్॥

తరువాతనున్న నాలుగు ధర్మములును దేవయాన మార్గము లనబడును. పూర్వము సత్పురుషులు దీని నాచరించిరి. అష్టాంగయోగ మార్గముల చేతను, సంకల్పముల బాగుగా నరికట్టుటవలనను, ఇంద్రియ నిగ్రహము వలనను, సద్వ్రతానుష్ఠానమువలనను, బాగుగా గురుసేవ యొనర్చుటవలనను, మంచి యాహార నియమమువలనను, వేదాధ్యయనము వలనను, సర్వకామ్య కర్మ సన్యాసము వలనను, చిత్తనిరోధము వలనను, పరిశుద్ధాంతః కరణము గలవారై పైజెప్పిన ధర్మముల సదా ఆచరింపవలయును.

ఏవం కర్మాణి కుర్వంతి సంసార విజిగీషవః।
రాగద్వేష వినిర్ముక్తా ఐశ్వర్యం దేవతా గతాః॥

సంసారమును జయింపదలచువారు ఈకర్మల నాచరించుచున్నారు. పూర్వము దేవతలు రాగద్వేషరహితులై, యీకర్మల నాచరించి దేవత్వమును బొందిరి.

**రుద్రా స్సాధ్యా స్తథాదిత్యా వసవోఽథ తథాశ్వినౌ।**
**యోగైశ్వర్యేణ సంయుక్తా ధారయంతి ప్రజా ఇమాః॥**

ఏకాదశరుద్రులు, సాధ్యులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, అశ్వినీ దేవతలును యోగైశ్వర్య సంయుక్తులై యీప్రజలనెల్ల కాపాడుచున్నారు.

**తథా త్వమపి కౌంతేయ! శమమాస్థాయ పుష్కలమ్।**
**తపసా సిద్ధి మన్విచ్ఛ యోగసిద్ధిం చ భారత॥**

ఓ కుంతీపుత్రా! నీవును పుష్కలమగు శాంతి నవలంబించి తపస్సిద్ధిని, యోగసిద్ధిని బొందుము.

**పితృమాతృమయీ సిద్ధిః ప్రాప్తా కర్మమయీ చ తే।**
**తపసా సిద్ధి మన్విచ్ఛ ద్విజానాం చరణాయ వై॥**

నీకు పితృమాతృసంబంధమును, కర్మపరమును నగు సిద్ధిగలదు. (అనగా ప్రజలను బిడ్డలవలె కాపాడుట, కార్యదక్షత గలదని భావము) ఇక బ్రాహ్మణుల రక్షించుటకై తపస్సిద్ధిని సంపాదింపుము.

**సిద్ధా హి యద్యదిచ్ఛంతి కుర్వతే తదనుగ్రహాత్।**
**తస్మా త్తపస్సమాస్థాయ కురుష్వాత్మమనోరథమ్॥**

సిద్ధిని బొందినవా రేది దలంచెదరో, దానిని దైవానుగ్రహము వలన జేయగలరు. కావున నీవును తపస్సు నవలంబించి, నీమనోరథంబుల బూర్తి -నొనరించుకొనుము. ( ఇతి శ్రీ మహాభారతే ఆరణ్యపర్వాంతర్గతారణ్యక

పర్వణి, ద్వితీయోஉధ్యాయః. ఇది శ్రీమహాభారతమున, అరణ్య పర్వాంతర్గతమగు, అరణ్యకమునందు రెండవ అధ్యాయము)

## అ జ గ ర యు ధి ష్ఠి ర సం వా ద ము

సర్ప ఉవాచ :– అజగర మడిగెను.

**బ్రాహ్మణః కో భవే ద్రాజన్ వేద్యం కిం చ యుధిష్ఠిర।**
**బ్రవీమ్యతిమతిం త్వాం హి వాక్యైరనుమిమామహే॥**

అజగరమను సర్పము భీమసేనుని మ్రింగజొచ్చెను. అత్తరి ధర్మరాజు – నీవెవ్వడవు? ఇతడు నాతమ్ముడు విడిపింపుమని పలికెను. అజగరమునూ తనవృత్తాంతం బాయన కెరింగించి నే నడుగు ప్రశ్నలకు ప్రత్యుత్తరమిత్తువేని యట్లే నీ తమ్ముని విడిపింతునని వాక్రుచ్చెను. అప్పుడు ధర్మరాజు బ్రాహ్మణులచే తెలియదగిన దానిని తెలిసికొన్నవాడవు. అయినను నీప్రశ్నలకు ప్రత్యుత్తరమిచ్చి ప్రీతి గలిగింపగలవాడనగుచో నట్లే యొనర్తును, అనునిట్టి ధర్మరాజు వాక్యముల విని యజగర మిట్లనియె, ఓ ధర్మరాజా ! బ్రాహ్మణుడనగా నెవడు, వేద్యమగు వస్తువెద్ది. నీవాక్యములచే సందేహము జనించెను. కనుక మిగుల బుద్ధిమంతుడ వగు నిన్నడుగుచున్నాను.

యధిష్ఠిర ఉవాచ : ధర్మరాజు చెప్పెను.

**సత్యం దానం క్షమా శీల మానృశంస్యం తపో ఘృణా।**
**దృశ్యంతే యత్ర నాగేంద్ర స బ్రాహ్మణ ఇతి స్మృతః॥**

ఓ సర్పరాజా ! సత్యము, దానము, ఓర్పు, క్రౌర్యము లేమి, తపస్సు, కనికరము నెవనియందు గనుపించునో అట్టివాడు బ్రాహ్మణుడని తెలిసి కొనదగును.

**వేద్యం సర్ప పరం బ్రహ్మ నిర్దుఃఖ మసుఖం చ యత్।**
**యత్ర గత్వా న శోచంతి భవతః కిం వివక్షితమ్॥**

ఓ అజగరమా ! తెలియదగిన వస్తువు పరబ్రహ్మము అది సుఖ దుఃఖాతీతము. దానిని బొందినవారికి దుఃఖ ముండదు. ఈవిషయమున నీవేమి చెప్పదలచితివి ?

సర్ప ఉవాచ :– అజగరము పలికెను.

**చాతుర్వర్ణ్యం ప్రమాణం చ సత్యం చ బ్రహ్మ చై వహి।**
**శూద్రేష్వపి చ సత్యం చ దాన మక్రోధ ఏవ చ।**
**అనృశంస్య మహింసాచ ఘృణా చైవ యుధిష్ఠిర॥**

ఓ ధర్మరాజా ! వర్ణచతుష్టయము గలదు. పరబ్రహ్మమును సత్యమే, మరియు శూద్రులయందును, సత్యము, కోపములేమి, క్రౌర్యములేమి, అహింస, కనికరములు గలవు.

**వేద్యం యచ్చాత్ర నిర్దుఃఖ మసుఖంచ నరాధిప।**
**తాభ్యాం హీనం పదం చాన్యన్న తదస్తీతి లక్షయే॥**

ఓ మహారాజా, సుఖదుఃఖరహితమైన వేద్యమగు వస్తువెద్దియో యది గలదు. కాని తదితరమైన మరియొకటి సుఖ దుఃఖాతీతమైనది లేదు అనియు దెలిసి కొనుచున్నాను.

యుధిష్ఠిర ఉవాచ : – ధర్మరాజు చెప్పెను.

**శూద్రేచ యద్భవే లక్ష్మ ద్విజే తచ్చ వ విద్యతే।**
**న వై శూద్రో భవే చ్ఛూద్రో బ్రాహ్మణో న చ బ్రాహ్మణః ॥**
**యత్రైతల్లక్షతే సర్ప వృత్తం స బ్రాహ్మణః స్మృతః।**
**యత్రైతన్న భవేత్సర్ప స శూద్ర ఇతి నిర్దిశేత్ ॥**

ఓ అజగరమా! శూద్రు డెట్టి లక్షణము గలవాడో అట్టి లక్షణము గలవాడు బ్రాహ్మణుడు గాడు. శూద్రజాతియందు పుట్టినంత మాత్రమున వాడు శూద్రుడు గాడు. బ్రాహ్మణజాతియందు పుట్టినమాత్రాన నతడు బ్రాహ్మణుడును గాడు. మరే మన్న నెవనియందు పూర్వోక్తములగు సత్యాది ప్రవర్తనయుండునో, వాడు బ్రాహ్మణుడని తెలిసికొనబడును. ఎవని యందది లేదో వాడు శూద్రుడని నిర్దేశింపవలయును.

**యత్పునర్భవతా ప్రోక్తం న వేద్యం విద్యతీతి చ।**
**తాభ్యాం హీనమతోఽన్యత్ర పదం నా స్తీతి చేదపి।**
**ఏవ మేతన్మతం సర్ప తాభ్యాం హీనం న విద్యతే॥**

ఓ సర్పమా ! సుఖదుఃఖాతీతమగు వేద్యవస్తువు బ్రహ్మమనియు, దానికంటె నిరతమగు వస్తు వెద్దియు నట్టిది లేదనియు, నేది జెప్పితివో యది నాకును నిష్టమే యగును. నిజముగా సుఖదుఃఖరహితమగు ఆ సద్వస్తువు తప్ప మరెద్దియును లేదు.

**యథా శీతోష్ణయోర్మధ్యే భవేన్నోష్ణం న శీతతా।**
**ఏవం వై సుఖదుఃఖాభ్యాం హీనం నాస్తి పదం క్వచిత్।**
**ఏషా మమ మతి స్సర్ప ! యథా వా మన్యతే భవాన్॥**

శీతోష్ణములమధ్య నెట్లు, కేవల శీతముగాని, యట్లే యుష్ణముగాని నుండవో, శీతోష్ణములు రెండును మిశ్రములై యుండునో, అనగా నవిరెండును లేక శీతోష్ణములులేక యుండవో, అట్లే సుఖదుఃఖములచే విడువబడిన వస్తు వెచ్చట నుండదు. అనగా పరబ్రహ్మేతరమగు వస్తువు తప్పక సుఖదుఃఖములతో గూడియే యుండునని భావము. ఈవిషయమున నీవెట్లు తలచుచున్నావో నాయభిప్రాయమును నట్టిదియే.

సర్ప ఉవాచ :- అజగర మడిగెను.

**యది తే వృత్తతో రాజన్ బ్రాహ్మణః ప్రసమీక్షితః।**
**వృథా జాతి స్తథాఽఽయుష్మన్ కృతిర్యావన్న విద్యతే॥**

ఓ ధర్మరాజా ! ప్రవర్తనను బట్టియే బ్రాహ్మణుడు తెలిసికొనబడు చున్నట్లయిన నతడెంతవరకు క్రియావంతుడు గాడో యంతపర్యంతము జాతియే లేకపోవును గదా.

యుధిష్ఠిర ఉవాచ :– ధర్మరాజు చెప్పెను.

**జాతి రత్ర మహాసర్ప మనుష్యత్వే మహామతే।**
**సంకరా త్సర్వవర్ణానాం దుష్పరీక్ష్యేతి మే మతిః॥**

మహాబుద్ధిమంతుడవగు వో సర్పమా ! ఈ మనుష్యత్వమున సమస్త వర్ణములు సంకరము లగుటచే, జాతినిర్ణయ మొనర్చుట కష్టతరమని నా అభిప్రాయము.

**సర్వే సర్వాస్వపత్యాని జనయంతి సదా నరాః।**
**వాఙ్మైథున మథో జన్మ మరణం చ సమం నృణామ్॥**

సమస్తజనులును సర్వదా సర్వజాతులయందును బిడ్డల బుట్టించుచున్నారు. మఱియు మనుజు లందరకు వాక్కు, మిథునకర్మ, పుట్టుట, చచ్చుటయు సమానములు. కనుక పూర్వోక్తమగు జాతి నిశ్చయ లక్షణము నతిక్రమించి యొనర్ప శక్యముగాదని భావము.

**ఇదమార్షం ప్రమాణం చ యేయజామ హే ఇత్యపి।**
**తస్మాచ్ఛీలం ప్రధానేష్టం విదుర్యే త త్త్వదర్శినః॥**

ఈ విషయమున ''యేయజామహే'' అను నీ ఋషిసంబంధమగు ప్రమాణమును గలదు. గనుక యథార్థవేత్తలు, శీలము ముఖ్యముగా నిష్టమైనదని తెలిసికొనిరి.

ప్రాఙ్నాభివర్ధనా త్పుంసో జాతకర్మ విధీయతే।
తదాఽస్య మాతా సావిత్రీ పితాత్వాచార్య ఉచ్చ తే।
తావచ్ఛూద్ర సమో హ్యేష యావద్వేదే న జాయతే ॥

పురుషు డభివృద్ధి నొందకమునుపే (పుట్టినప్పుడే) జాతకర్మ విధించబడినది. పిదప నుపనయన కాలమున సావిత్రి తల్లియనియు, తదుపదేశకుడగు ఆచార్యుడు తండ్రియనియు చెప్పబడును. ఎంతవరకు వేదమున బ్రవేశములేదో అంతవరకు మనుజుడు శూద్ర సముడగును.

(తైత్తిరీయోపనిషత్)

ఋతంచ స్వాధ్యాయ ప్రవచనే చ
సత్యంచ స్వాధ్యాయ ప్రవచనే చ
తపశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ
దమశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ
శమశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ
అగ్నిశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ
అగ్నిహోత్రం చ స్వాధ్యాయ ప్రవచనే చ
అతిథయశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ
మానుషంచ స్వాధ్యాయ ప్రవచనే చ–
ప్రజాచ స్వాధ్యాయ ప్రవచనే చ
ప్రజనశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ
ప్రజాతిశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ.

శాస్త్రములయందు చెప్పబడిన శ్రౌతాదికర్మలు స్వాధ్యాయ ప్రవచనములు అనుష్ఠింప దగినవి. సత్య దమాదులు స్వాధ్యాయ ప్రవచనములు అనుష్ఠించదగినవి. తపస్సు స్వాధ్యాయ ప్రవచనములు అనుష్ఠించదగినవి. బహిరింద్రియ నిగ్రహము, స్వాధ్యాయ ప్రవచనము లనుష్ఠింపదగినవి.

శాస్త్రౌగ్నులుంచుటయు, స్వాధ్యాయ ప్రవచనము అనుష్ఠించ దగినవి. అగ్ని హోత్రాదరణము స్వాధ్యాయ ప్రవచనము లనుష్ఠింప దగినవి. అతిథి పూజయు స్వాధ్యాయ ప్రవచనము లను ష్ఠించదగినవి. బంధుమిత్రసత్కారము, పుత్రులు గలగుటకొరకు చేయు యజ్ఞాదికములు, ఋతుకాలమందగ్నిసాక్షిగ వివాహమాడిన భార్యతో సంసారముచేయుట, పుత్రులకు వివాహముచేయుట స్వాధ్యాయ ప్రవచనము లనుష్ఠింపదగినవి. (తైత్తిరీయోపనిషత్తు)

**ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా**
**లోకే ధర్మిష్ఠం ప్రజా ఉపసర్పంతి- ధర్మేణ పాప మపనుదతి**
**ధర్మే సర్వం ప్రతిష్ఠితం తస్మాద్ధర్మం పరమం వదంతి.**

ధర్మమనగా సత్యమగు ఆచరణము అనగా నంతరాత్మకు యేది చేయదగిన సత్కార్యమని తోచునో అదిచేయుట. అదియే విశ్వమునకును, జగత్తునకును ఆశ్రయమైనది.

లోకమునందు ధర్మమాచరించు వాని చుట్టును జనులు మూగుకొందురు. ధర్మమాచరించుటచే పాపము పోవుచున్నది. ధర్మమునందు సర్వమును ఇమిడి యున్నది. అందుచే ధర్మమును ఉత్తమమగు మోక్షసాధన మని ధర్మిష్ఠులు చెప్పుచున్నారు. ధర్మమాచరించు వానిని ధర్మదేవత తన నీడవలె తోడై సదా సంరక్షించుచుండును. ధర్మముయొక్క నిర్వచన మేమన, ఇతరులు తనకు ఏది చేసిన సుఖముగా నుండునో, అది యితరులకు చేయుటయే యగును. ఇతరులు తనకు నేదిచేసిన క్లేశము గలగునో అట్టిది ఇతరులకు తాను చేయకుండుటయే ధర్మము యొక్క రహస్యమగును. ఇదే ధర్మము యొక్క పర్యవసాన నిశ్చయము.

శ్రీ శంకర భగవత్పాదాచార్యులు జీవేశ్వరుల యేకత్వమును గురించి అపరోక్షానుభూతిలో తెలిపిన భాగము ఈ క్రింద వ్రాయబడుచున్నది. అట్టి

సద్విమల దృష్టితో చూచిన ఆత్మయొక్క యేకత్వము అందరికిని స్పష్టముగా గలుగును. అపుడు అజ్ఞానముచే కల్పింపబడిన భేదము ఎంత పాపకర్మమో స్పష్టముగా జనులకు తెలియగలదు, అట్టి ఆత్మతత్త్వమును బోధించెడివారు లేకపోవుటచేతనే, కల్పితములగు అనేక భేదములు గలిగి సోదరభావమును భిన్న మొనర్చి, జాతియొక్క దుర్బలత్వమునకును, దేశముయొక్క క్షీణ దశకును కారణమైనది.

**సువర్ణా జ్జాయమానస్య సుకర్ణత్వంచ శాశ్వతమ్।**
**బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వంచ తథా భవేత్॥**

సువర్ణమునుండి భిన్న భిన్నములుగా యేర్పడిన కటకకంకణ కుండలాద్యాభరణములు బహువిధములుగా నుండినను ఏలాగున అవి యన్నియు నొకే సువర్ణమయమగునో లేక బంగారుచే చేయబడిన విగ్రహములు అనేక రకములుగా నుండినను నామరూపములతో బహు తెఱగులుగా నుండినను, దీర్ఘముగా నాలోచించగా నొకే బంగారమే యని తోచునో, ఆలాగున బ్రహ్మమునుండి యేర్పడిన జీవులు గూడ నామరూపములతో వేరు వేరు విధములుగా కనుపించిన ఆత్మలో విచారణ చేసినచో నొకే బ్రహ్మమయముగానే గోచరించును.

**యథా తరంగకల్లో లై ర్జలమేవ స్ఫురత్యలమ్।**
**పాత్రరూపేణ తామ్రం హి బ్రహ్మండౌఘై స్తథాత్మతా॥**

ఫేనములు, అలలు, జలబిందువులు, నదులు ఇవన్నియు వేరువేరుగా కనుపించినను, వీటికి ఆధారములగు సముద్రజల మొకటియేగాని భిన్నము ఎటుల కాదో, అలాగున తామ్రమొకటైనను పాత్రలు అనేక రకములతో అనే కాకారములతో ననేక పేర్లలో కనబడినను, సత్యబుద్ధితో ఆలోచించినచో ఒకే తామ్రముగా యెట్లు తెలియునో, అలాగున మాయచే కల్పితములగు నీ భేదము

లన్నియు మిథ్యయని గ్రహించుకొనదగును.

**సర్పత్వేన యథా రజ్జూ రజతత్వేన శుక్తికా।**
**వినిర్ణీ తా విమూఢేన దేహత్వేన తథాత్మతా॥**

ఏలాగున రజ్జువునందు సర్పాధ్యాసము, శుక్తియందు రజతాధ్యాసము భ్రాంతివల్ల జనులకు గలుగుచుండునో ఆలాగున ఆత్మయం దనాత్మభావము గూడ విచారణ లేనందుచే మూఢులకు గలుగుచుండును.

**పురుషత్వేన వై స్థాణు ర్జలత్వేన మరీచికా।**
**వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా॥**

రాత్రిలో స్థాణువునందు చోరుడా? లేక భూతమా అనియు, ఆలాగున ఎండమావులయందు జలమున్నట్లును ఏ విధముగా భ్రాంతిమూలముగ తోచుచుండునో, ఆలాగున మూఢాత్ములు ఆత్మయందు దేహాధ్యాస భ్రాంతిగలిగియున్నారు.

**గృహత్వేనైవ కాష్ఠాని ఖడ్గత్వేనైవ లోహతా।**
**వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా॥**

ఏలాగున నొక దారువునుండి అనేకములగు పెట్టెలు, కుర్చీలు మొదలగునవి యేర్పడుచుండునో, ఆలాగున ఒకే యినుముచే ననేకములగు మిషన్లు, కత్తి, తుపాకులు మొదలగునవి యేర్పడుచుండునో, సూక్ష్మ బుద్ధితో పరిశీలించిన నా గృహోపకరణమగు కొయ్య సామానులన్నియు నొకే మ్రానునుండి యేర్పడినట్లును, ఇంజనులు, తుపాకులు మొదలగునవి యన్నియు నొకే లోహమువలన యుత్పత్తియైనట్లును తెలుసుకొనగలరో, అట్లే యేకత్వమును చూడజాలక మూఢులు భిన్నభిన్నములుగా చూచుచు, యేకాత్మత లేనివారై అనే కాత్మ భావముగలవారై యున్నారు.

**పోతేన గచ్ఛతః పుంస స్సర్వం భాతి విచంచలమ్।**
**తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః॥**

నదులలో పడవయందు ప్రయాణము చేయువారికి పడవ అతివేగముగా పోవుచుండిన తీరములో సుస్థిరములై యుండు వృక్షాదులన్నియు వెనుకకు నడుగిడునటుల యేలాగున గోచరించునో, ఇది యెంత భ్రాంతిమూలమో అలాగున అవివేకులు సత్యము నెఱుగజాలక, ఆత్మయం దనాత్మభావమును గలుగ జేసికొనుచున్నారు.

**పీతత్వం హి యథా శుభ్రే దోషా ద్భవతి కస్యచిత్।**
**తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః॥**

నేత్రవ్యాధిగలవానికి శుభ్రములగు వస్తువులు కూడా ఏలాగున పచ్చవర్ణములుగ తోచుచుండునో, లేక పసుపు, ఎఱుపు, నలుపు గల సులోచనముల ద్వారా చూచువానికి జగత్తంతయు నాయద్దపు రంగువలె కనుపించునో, అలాగున అజ్ఞానమువల్ల ఆత్మయందు గూడ అనేకత్వమును కల్పించుకొనుచున్నారు.

**యథా శశీ జలే భాతి చంచలత్వేన కస్యచిత్।**
**తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః॥**

ఏలాగున రాత్రికాలములో ఆకాశమండలమునందు చలింపక యుండు చంద్రుడు, చలనము గల నీటిలో ప్రతిబింబించినపుడు చంద్రుడే చలించుచున్నట్లు భ్రాంతివల్ల గలుగుచున్నదో, ఆలాగున కూటస్థుడై సాక్షిమాత్రుడై యుండు ఆత్మయందుగూడ అంతఃకరణ ధర్మములు కల్పితములై యుంటున్నవి.

**ఏవమాత్మన్యవిద్యాతో దేహాధ్యాసోఽపి జాయతే।**
**స ఏవాత్మపరిజ్ఞానా ల్లీయతే చ పరాత్మని॥**

ఈ పైన జెప్పినవన్నియు, ఏలాగున విచారణ చేయని కారణముచే, ఆత్మయం దధ్యాసితములైయున్నవో, ఆలాగున శుద్ధజ్ఞానమయమగు పరమాత్మయందు మాయవల్ల ననేకభేదములు కనబడుచుండును. నిజముగా విచారణ చేసిన పై జెప్పినవన్నియు, నసత్యములుగ నెట్లు తోచునో, ఆలాగున ఆత్మయందు చక్కగా విచారణ జేసిన నివి యన్నియు లీనమైపోవును. అనగా కల్పితములని భావము.

**స్వల్పమప్యంతరం కృత్వా జీవాత్మ పరమాత్మనోః।**
**యస్సంతిష్ఠతి మూఢాత్మా భయం తస్యాపి భాషితమ్॥**

ఏమూఢుడు, జీవాత్మపరమాత్మలకు భేదము కొంచెమైనను కల్పించునో అతనికి మాయయను భయము ఎల్లప్పుడును ఎచ్చటనైనను గలుగుచునే యుండును. ఈధర్మవాక్యముల నన్నింటిని సావధాన బుద్ధితో నాలోచించుకొనిన, గుణముచేత జాతియో లేక కులముచేత జాతియో అను తత్త్వ మేర్పడగలదు. ఈలాగున సహస్రముఖములుగా ధర్మశాస్త్ర ముద్ఘోషించుచున్నను, జనులకు దీనిని బోధించుచు వారి యజ్ఞానమును బారద్రోలువారు లేనందుచేతనే, భేదభావములచే జీవులలో ప్రతివారును బాధలను బొందుచున్నారు. ఇక శ్రీశంకరులు ఆత్మబోధములో నుపదేశించిన దానినిగూడ నిరూపించెద.

**అవిరోధితయా కర్మ నావిద్యాం వినివర్తయేత్।**
**విద్యాఽవిద్యాం నిహంత్యేవ తేజస్తిమిరసంఘవత్॥**

ప్రపంచమున అవిద్య, అనగా నజ్ఞానము మూలప్రకృతి. ప్రపంచమెట్లు అజ్ఞానజన్యమో (అనగా ప్రకృతి జన్యమో) అలాగే ప్రపంచాంతర్భూతములైన

కర్మలును ప్రకృతి జన్యములే యగుటచేత, జన్యజనకములైన కర్మాజ్ఞానములకు పరస్పర విరోధము లేదు గావున కర్మ అజ్ఞానమును నశింపజేయజాలదు. జ్ఞానము ప్రకృతి జన్యము గాదు. స్వయంప్రకాశరూపము, కావున తేజఃపుంజము తిమిరసంఘమును హరించినట్లవిద్యను తప్పక హరించును. ఇందువలన కర్మకాండ బుద్ధితో ఎంతకాలముండినను అ విద్య నశించదు. భ్రాంతి తొలగదు. ఆత్మజ్ఞానమగు విచారణచే గలిగిన ప్రకాశమువల్లనే యట్టి యజ్ఞానము తొలగును.

**నానోపాధివశాదేవ జాతినామాశ్రమాదయః।**
**ఆత్మన్యారోపితాస్తోయే రసవర్ణాదిభేదవత్॥**

స్వభావముచేతనే స్వచ్ఛమైన జలమునందు చేదు, పుల్లన, తియ్యన, యెరుపు, పచ్చదనము మొదలైన గుణములు గల పదార్థములయొక్క సంబంధములచేత నాయా పదార్థములయొక్క రుచియును, రూపమును ఏలాగు ఆరోపింప బడుచున్నదో, ఆలాగే ముందుచెప్పబడిన నానా విధములైన శరీరములవలన పరిశుద్ధమైన ఆత్మయందు బ్రాహ్మణత్వాది జాతులును దేవదత్త, యజ్ఞదత్తాది పేర్లును, బ్రహ్మచర్యాద్యాశ్రమములును, మఱియు విలోమాది జాతులును – ఇవి యన్నియు నవివేకముచే కల్పింపబడినవి గాని వాస్తవములు కావు.

**జీవన్ముక్తిస్తు తద్విద్యా త్పూర్వోపాధిగుణాం స్త్యజేత్।**
**స సచ్చిదాదిధర్మత్వా ద్భజే భ్రమరకీటవత్॥**

లోకమందు పురుగును తుమ్మెద తీసుకొని వచ్చి చేయవలసిన ప్రకారముగా చేసినమాత్రము చేతనే యీపురుగు తన్ను చంపుచున్నదను భయము గలదై తన తలంపును చలించకుండ దానియందుంచిన మాత్రముచేత అది తనయందు పూర్వమున్న పురుగుధర్మమును వదలి భ్రమర స్వరూపమును

బొందినట్లు, మీద జెప్పిన శ్రవణాదులచేతను ఆత్మను విచారించగా జీవధర్మమును వదలి సచ్చిదానందరూపమై బ్రహ్మస్వరూపమును బొంది వృత్తిరహితుడై యుండుటయే జీవన్ముక్తి యనియు ముముక్షువు తెలిసికోవలయు ననుట.

**యద్భాసా భాస్యతేఽర్కాది భాస్యైర్యత్తు న భాస్యతే।**
**యేన సర్వమిదం భాతి తద్బ్రహ్మే త్యవధారయేత్॥**

ఏ ప్రకాశముచేత, సూర్యుడు మొదలగు వస్తువులు ప్రకాశించునో, తనచే వెలిగింపదగిన సూర్యాది ప్రకాశవస్తువులచేత నెద్ది ప్రకాశింపజేయబడదో, ఏయాత్మ ప్రకాశముచేత నీ సర్వ ప్రపంచము వెలుగునో అట్టిది ఆత్మ యని తెలియవలెను.

**సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షు ర్నిరీక్షతే।**
**అజ్ఞాన చక్షుర్నేక్షేత భాస్వంతం భానుమంధవత్॥**

లోకమందు సర్వత్ర ప్రకాశించుచుండు సూర్యుని గ్రుడ్డివాడు తప్ప అందరును చూచినప్పటికిని వాడు ఆ సూర్యుని చూడలేనట్లు, సచ్చిదానందాత్మ సర్వత్ర వ్యాపించి యున్నప్పటికిని శ్రవణాదులవల్ల విచారించి తెలుసుకొన్న ఆత్మజ్ఞానియే ఆయాత్మను తన్నుగా జూచుచున్నాడు గాని దేహేంద్రియాదులను ఆత్మగా భ్రమించిన అజ్ఞాని చూడలేనందున అందరికినీ ఆ యాత్మ అగపడదు.

**శ్రవణాదిభి రుద్దీప్త జ్ఞానాగ్ని పరితాపితః।**
**జీవస్సర్వమలా న్ముక్త స్స్వర్ణవద్ద్యోతతే స్వయమ్॥**

లోకమందు బంగారు సమస్తలోహములయందును, వాటి మాలిన్యము చేత కప్పబడి తెలియకయున్నప్పటికిని, వాటికి చేయువలసిన పుటాది

సంస్కారములచేత వాటి యందుండు మాలిన్యము నివర్తింపబడి, బంగారు తనకు తానే ప్రకాశించుచున్నట్లు, జీవుడును శ్రవణాద్యభ్యాసమువల్ల వాడుకపడి సంసారహేతుభూతమైన మూలాజ్ఞానమువల్ల నివర్తింపబడినవాడై తనకు తానే ప్రకాశించుచున్నాడనుట–

**భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా।**
**పుమాంస్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్॥**

ముముక్షువగువా డేవస్తువును తీవ్రముగా భావించుచుండునో భావనావేగవిశేషముచే నెమ్మదిగగాని, శీఘ్రముగగాని అట్టి వస్తువే యగుచుండును. – ఎట్లన, భ్రమరమును భావించిన కీటకము భ్రమరమగు చున్నట్లుండును. కావున బ్రహ్మమును ధ్యానించువారు బ్రహ్మముగాను, సచ్చిదానందమగు ఆత్మను భావించువారు సచ్చిన్మయ ఆత్మగాను, శివ, రామ, కృష్ణ, నారాయణాది మూర్తులను ధ్యానించువారు తత్తన్మయులుగా నగుచుందురు. కావున ఈ జగత్తంతయు భావము ననుసరించియుండును.

**అనేనైవ ప్రకారేణ వృత్తి ర్బ్రహ్మాత్మికా భవేత్।**
**ఉదేతి శుద్ధచిత్తానాం వృత్తిజ్ఞానం తతః పరమ్॥**

పైన జెప్పిన ప్రకారము ఆత్మను నిరతిశయ సుఖమగు బ్రహ్మముగా భావించువారికి అట్టి బ్రహ్మాత్మజ్ఞానము గలుగును. అయితే శుద్ధమైన చిత్తముగల వారికి అట్టి శుద్ధ బ్రహ్మజ్ఞానము గలుగును.

**యేషాం వృత్తి స్సమా వృద్ధా పరిపక్వా చ సా పున।**
**తే వై సద్బ్రహ్మతాం ప్రాప్తా నేతరే బ్రహ్మవాదినః॥**

ఎవరికి బ్రహ్మచింతనచే బ్రహ్మభావము వృద్ధినొంది పరిపక్వమైన మనస్సు గలుగునో, అట్టివారికి మాత్రమే బ్రహ్మ ప్రాప్తి గులుగును. కాని

వాచా వేదాంతము చెప్పుచు కాలము గడుపువారికి కలుగదు.

**యే హి వృత్తిం విజానంతి జ్ఞాత్వాఽపి వర్ధయంతి యే।**
**తే వై సత్పురుషా ధన్యా వంద్యాస్తే భువనత్రయే॥**

ఎవరట్టి పరమపావనమగు బ్రహ్మవృత్తిని తెలుసుకొని వృద్ధి నొందించుచుందురో వారే సత్పురుషులు. వారి జన్మమే ధన్యము. వారు మూడు లోకములలోను పూజ్యులు.

**భావవృత్త్యా హి భావత్వం శూన్యవృత్త్యా హి శూన్యతా।**
**బ్రాహ్మవృత్త్యా హి పూర్ణ త్వం తథా పూర్ణత్వ మభ్యసేత్॥**

ఎవడు దేని నేభావముతో భావించునో, అట్టి భావమును పొందగలుగును. శూన్యముగా భావించువానికి శూన్యత్వమును, జీవులను ఈశ్వరాంశీయులుగా భావించువారికి ఈశ్వరమయముగాను, ఆలాగున జీవులనుగాని తన ఆత్మనుగాని హీనముగా భావించువారికి నీచత్వముగాను కనుపించును. కావున భావముయొక్క వృత్తి యీలాగున యుండునని తలంచి జీవులు బ్రహ్మాంశీయులని గ్రహించి పరిపూర్ణమగు బ్రహ్మముగానే తన యాత్మను ఇతర ఆత్మలను గూడ భావన చేయవలయును. ఒకడొక నిలువు టద్దముకడ నిలిచిన తన రూపము కురూపమనిగాని, సురూపమనిగాని యెట్లు తెలియగలుగునో, భావనయొక్క స్థితి గూడ ఆలాగుననే యుండునని తలంచి ముముక్షువు లెల్లప్పుడును పవిత్రహృదయము గలిగి తన ఆత్మయందు దైవభావమునే చేయవలయును. ఈ ధర్మకాండము యొక్క సారమేమన పర ప్రాణులకు మేలు నొనర్చుటయే సామాన్య మనుజుని ధర్మమగును. జనన మరణముల నొందని బ్రహ్మత్వము నొంది జీవన్ముక్తి నొందుటయే విశేష మానవుని ధర్మమగును.

**ఓమ్.**

ఓమ్

# లో కో ద్ధా ర క ము

పు రా ణ కాం డ ము



**సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని।**
**ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥**

టీ. సర్వత్ర = సకలభూతములయందును, సమదర్శనః = బ్రహ్మమును చూచుచున్నవాడు, యోగయుక్తాత్మా = యోగముతో గూడిన యంతఃకరణము గలవాడగుచు, ఆత్మానం = తనను, సర్వభూతస్థం = సకలభూతములయందును ఉన్నవానినిగాను, సర్వభూతాని చ = సకలభూతములను, ఆత్మని = తనయందును, ఈక్షతే = చూచుచున్నాడు.

బ్రాహ్మణ :- వంశానుక్రమమగు అనగా మాతాపితరు లనుష్ఠించుచు వచ్చిన, తల్లిదండ్రులయంశము వలన ఏర్పడిన సంస్కారమును బిడ్డలు గలిగియుండుటచే, ఆయాకర్మలలో వారికి నిపుణత యెక్కువగ నుండునని చెప్పుటలో ఏమి దోషము? అనగా - వర్ణానుగుణముగా వర్తించుట మంచిది గదా!

అబ్రాహ్మణ :- ఇపుడు మీరు జెప్పిన దానిని బట్టి యోచించిన ప్రస్తుతము మాతాపితరులు ఏయే పనుల జేయుచున్నారో, ఆయాపనుల బిడ్డలు గూడ జేయవలయునని యర్థమైనచో, ఇప్పుడన్ని జాతులలోను కొందఱు విద్యా ధ్యాన తపస్సుల నొనర్చువారును, ఉద్యోగము జేయువారును, వ్యాపార కృష్యాదుల నొనర్చువారును, సేవకాది పనులుజేయువారును గలరు. వారి సంతతి యెల్లపుడు నదే రీతిగ నుండవలయునని తాత్పర్యమైనచో అదెట్లు సాధ్యమగును? అట్లుగాక

కులము ననుసరించియే వృత్తుల నేర్పరచవలసియుండిన నది వర్తమానకాలములో ఎవరు జేయగలరు? ఎవరికి సాధ్యమగును? అది సాధ్యమైన పని గాదు. మఱియు తల్లి దండ్రుల దేహమువలన పుట్టినది బిడ్డల శరీరమేగాని ఆత్మ గాదు. ఆ యాత్మ అనేక సంస్కారములతో గూడి వచ్చుచున్నదగుటచే మాతాపితరుల గుణముల గలిగి యుండుటకు వీలు లేదు. సన్మార్గులగు తల్లి దండ్రులకు దుర్మార్గులగు పుత్ర పుత్రికలు గలుగుటకును, దుష్టులగు జననీ జనకులకు, శిష్టులగు సంతతు లేర్పడుటకును, పండితులగు మాతాపితరులకు విద్యావిహీనులగు పిల్లలు జన్మించుటకును, జ్ఞానవంతులగు తల్లి దండ్రులకు జ్ఞానవిహీనులగు సంతానములు గలుగుటకును కారణమేమి? పూర్వమునుండియు కులము ననుసరించి వృత్తి యేర్పడియుండలేదు. ద్రోణ, అశ్వత్థామ, పరశురామ, కృపాచార్యాదులు బ్రాహ్మణులయ్యు క్షత్రియ ధర్మమగు యుద్ధమునే చేసిరి.

మను, విశ్వామిత్రాదులు క్షత్రియులైనను బ్రాహ్మణ ధర్మము ననుష్ఠించి తాపసోత్తములైరి. ఆలాగున తులాధారాదులు వైశ్యులైనను పరమతపస్వులుగా నేర్పడిరి. అట్లే సూతోద్ధవాదులు శూద్రకులముకు సంబంధించిన వారైనను వేద వేదాంత పారంగతులై బ్రహ్మజ్ఞాన సంపన్నులై యుండిరి. దినికన్న పరమ ప్రమాణ మింకేది గలదు? పూర్వకాలమున గూడ గుణము ననుసరించి వర్తించుట ధర్మశాస్త్ర విరుద్ధము గాదు. పై జెప్పిన ప్రకారము వాల్మీకి, కన్నప్పనాయన మొదలగువారు కిరాత వంశము నందుండిన వారైనను తాపసోత్తములైరి. కలియుగమున తిరుప్పాణి యాళ్వార్లు శ్రీరంగనాథ క్షేత్రమున పరమభక్తులుగాను, నందనారు మొదలగువారు శివ చిదంబర క్షేత్రమందు భక్తాగ్రేసరులుగాను అయిరి. వారంత్య జాతిలో జన్మించినవారలు గదా! వీరి వృత్తి యేది? దీనిని యోచించుకొనవలయును. ఆలాగున రాక్షసులలో బుట్టిన విభీషణుడును, అసురులలో బుట్టిన ప్రహ్లాదుడును ఎట్టి గుణములు గలిగియుండిరి? అదేరీతిగ, గార్గి, సులభ, శబరి మొదలగు నారీమణులను గూర్చి గూడ విచారించుకొన

పలయును. వీరికి దైవకృప గలుగలేదా? మోక్షము సిద్ధింపలేదా! వీటి నన్నిటిని పరిశీలించిన అనాదినుండి గుణములను బట్టియే జరుగుచున్నది గాని, కులమునుబట్టి జరుగుటలేదని చెప్పబనిలేదు. ఈశ్వర దృష్టియు నీలాగుననే యుంటున్నది. వర్తమాన కాలములో బ్రాహ్మణులు కూడ ఉద్యోగ ధర్మములో బ్రవేశింపక బోయినచో వారి గతి యిపు డేమైయుండును? ఉద్యోగములో బ్రాహ్మణు లుండుటచేతనే ఆజాతి యింత యున్నతికి రాగలిగినది. లేనిచో ప్రస్తుత స్థితి ననుసరించి, బ్రాహ్మణేతరులు వారిని అధో లోకమునకు బంపియుందురు. అయితే బ్రాహ్మణులలో నెందఱో యుద్యోగము జెయుచుండినను సాధ్యమైనంతవఱకు బ్రాహ్మణ ధర్మము నాచరించువారు లేకపోలేదు. అట్టి బ్రహ్మధర్మమును బ్రాహ్మణేతరులు గూడ నేల యనుష్ఠింపగూడదు? ఎవరు కూడదనిరి? ఒకవేళ కూడ దనినను చేయనీయక అడ్డుపడు వారెవరుగలరు?

అట్లుగాక, కులము ననుసరించి వర్తమానకాలమున ఎవరు దేశమును నడుపగలరు? కావున నెవ్వరైనను ఉన్నత స్థితిని పొందుటకు యత్నింపవచ్చును.

బ్రా :- దూరదృష్టిగల మిత్రమా, దీనికి మీరేమి చెప్పగలరు? అదేమన! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో రక్తములోనే సృష్ట్యాదినుండి భేదము గలదని కొందఱు చెప్పుచున్నారు. కావున జాతి సృష్ట్యారంభమునుండియే యేర్పడినది గాని మధ్యకాలమున నెవరును నిర్మించినది కాదు.

అ :- సూక్ష్మదృష్టిగల ఓ స్నేహితుడా! ఇట్టి భేదముండిన అది నమ్మదగినదే. దీని నట్టివారైనను అంగీకరింపవలసియుండును. ఈలాగున ప్రత్యక్షముగ జూపునపుడే జాతిభేదము లేదని తర్కము జేయువారికి జ్ఞాన మేర్పడగలదు. అపుడే వారు నోరు మూసికొనెదరు. అయితే వట్టిమాటల వలన దానిని ఈకాలమున నెవరును నమ్మజాలరు. ఈ వాక్యములో చాల జాగ్రత్త

గలిగి చెప్ప వలసి యుండును. లేనిచో చెప్పువారి వాక్యము వారినే బాధించును. దీనిని స్థాపింపబూనుటకు ముందుగా, శరీరములో ముఖ బాహూరు పాదములలో గల రక్తమునకు భేదము గలదని రూఢిపరుపవలయును. ఏలన? విరాట్పురుషుని, ముఖ, బాహు, ఊరు, పాదముల నుండియే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు పుట్టిరనిగదా యిదివఱలో జెప్పియున్నారు! కావున అట్టి మొదటి మాటలకు హాని గలుగకూడదు. ఈలాగున సృష్టిలో మానవులకు, రక్తములో ముఖ పాదాదులలో మార్పు గలదాయని మొదట డాక్టరుల నడిగి కనుగొనవలసియుండును. అట్లయిన ముందు నిరూపించియుండు ముండక శ్రుతియందును, తైత్తిరీయ శ్రుతియందును, అగ్నిగుండము నుండి మిణుగురులు లేచినట్లు జీవులు బుట్టుచున్నారనియు, ఆనందమే బ్రహ్మమనియు, అట్టి యానంద బ్రహ్మమునుండియే జీవులుద్భవించుచున్నారనియు చెప్పబడినది. ఆ రెండు శ్రుతులకును విరోధము వచ్చును. బంగారమునుండి కలిగెడు రేణువులు ఎట్లు సువర్ణ మయములో, ఆలాగున పరమేశ్వరునినుండి యుద్భవించిన జీవులన్నియు పరమేశ్వర మయములని చెప్పెడు ధ్యానబిందూపనిషత్తునకు హాని వాటిల్లును. ఇదియు యోచించుకొనవలసి యుండును. ఈలాటి దృష్టాంతముల దెలిపెడు శ్రుతులనేకములు గలవు. వాటిని సమన్వయ పఱచుకొనవలసియుండును. ఇంతటితో తృప్తి బొందగూడదు. ఒక గురుకులమున జదువుచుండు సమాన వయస్సును, ఆకృతియు, ఆరోగ్యమును, ఆహారమును గల చాతుర్వర్ణ్యస్థులగు నలుగురు విద్యార్థుల రక్తమును దీసి పరీక్షార్థముగ యోగ్యుడగు డాక్టరు వద్దకు బంపవలయును. రక్తమును దీసికొనిన సీసాలపై బ్రాహ్మణాది చతుర్వర్ణస్థుల పేర్లను వ్రాయగూడదు. మనకు మాత్రము జ్ఞాపకార్థముగ నొకగుర్తును వేయవలయును. అపుడు భేదము కనుపించిన యీవాదము నిలువగలదు. లేనిచో దీనికన్న మోసకృత్యము మఱియొకటి గలదా యని లోకము జెప్పనారంభించును. ఆలాగున ఒక యాశ్రమములో గల ఒకే ప్రాయమును, భోజనమును, ఆరోగ్యమును గల సాధక పురుషులగు నలుగురు సన్న్యాసుల రక్తమును గూడ పరీక్షింపవలసి యుండును. అదియు పై జెప్పిన రీతిగానే తెలియుటకు గుర్తుమాత్రమే

యుంచవలసియుండును. కాని ఆహారభేదములు గలవారియొక్కయు, దేహపరిశ్రమాది మార్పుగలవారి యొక్కయు, రోగమును, వయస్సు మార్పుగలవారి యొక్కయు రక్తమును పరీక్షింపరాదు. ఇట్టిస్థితిగలవారి రక్తములో మార్పు ఉండినచో ఈ యుపదేశములన్నియు వాస్తవములే యగును. ఇట్టి యుపన్యాసముల జెప్పునపు డీకాలమున రక్తమును బరీక్షించుడు అని సాహసించి పలికెడు యువకులు లేరని దలంపవలదు. అట్లు గాకపోయిన ఈ యుపదేశము దివాంధములకే తగును. దివాంధములనగా గుడ్లగూబలు. వీటికి సూర్యుడు ప్రకాశించునపుడు చీకటిగానుండును. ఆలాగున పట్టపగలును రాత్రిగా జేయు సమర్థత గలవారే యిట్టిపరమ రహస్యమును బోధించవలసియుండును. మఱియు రక్తములో గల యీపరమసూక్ష్మమును శాస్త్రకర్తలుగూడ నిదివరలో కనిపెట్టినట్లు ఎచ్చోటను జూచి యుండలేదు. అట్టి శాస్త్రముండినట్లును గానరాదు. దీని నిరూపణము జేయవలయును. అట్లు కానిచో ఋషులకన్నను, సిద్ధపురుషుల కన్నను, కడకు వేదకర్తకన్నను అతీతమగు ఈ పరమ రహస్యమును కనుగొనినట్లు తాను దెలుపవలసియుండును. లేనిచో చాల ప్రమాదము గలుగును.

**న చర్మణో న రక్తస్య మాంసస్య చ న చాస్థినః।**
**న జాతి రాత్మనో జాతివ్యవహారః ప్రకల్పితః॥**

అని శ్రుతి వాక్యము గలదు.

ఏలన! జాతినిగుఱించి అంత ఉద్రేకమును జనులు గలిగియున్నారు. శ్రీ మద్భాగవతమున కర్మానుష్ఠానముచే క్షత్రియులు బ్రాహ్మణులైన చరిత్రము చూడుడు. ఇందువలన బ్రహ్మగుణము గలవారు ఎవరైనను బ్రాహ్మణులు కాగలరను తత్త్వము బోధ పడగలదు. కావున కులము ప్రధానము కాదనియు, గుణమే ప్రధానమనియు తెలియుట కొరకీ చరిత్ర మిచట నిరూపించడమైనది.

వసు దేవునకు నారదుండు పురాతనంబగు విదేహార్షభ సంవాదంబు దెలుపుట
శ్రీ మద్భాగవతము, ఏకాదశ స్కంధము.

వసు దేవః–

**భగవన్ భవతో యాత్రా స్వస్తయే సర్వదేహినామ్।**
**కృపణానాం యథా పిత్రోరుత్తమశ్లోక వర్త్మనామ్॥**

ఓ పూజ్యుడా! తండ్రిరాకడ పుత్రులకును, మహాపురుష మార్గానుసారులగు పుణ్యాత్ముల యాగమనము దీనులకును, ఎట్లు మంగళము కొఱకగునో యట్లే తవు యాత్ర సమస్తప్రాణుల శుభముకొరకగును– వసుదేవుడు నారదమహర్షితో చెప్పుచున్నాడు.

**భూతానాం దేవచరితం దుఃఖాయ చ సుఖాయ చ।**
**సుఖాయైవ హి సాధూనాం త్వాదృశామచ్యుతాత్మనామ్॥**

దేవతల నడవడి ప్రాణుల సుఖములకును దుఃఖములకును హేతువగును. అనగా నతివృష్టియనావృష్ట్యాదులచే దుఃఖమును, సమవృష్ట్యాదులచే సుఖమును గలిగించునని భావవు. శ్రీమన్నారాయణమూర్తిని సదా మనంబున ధ్యానించుచుండు తమబోటి సాధుపుంగవుల చరితము మాత్రము సర్వదా సుఖ కారణమే యగును.

**భజంతి యే యథా దేవాన్ దేవా అపి తథైవ తాన్।**
**ఛాయేవ కర్మ సచివా స్సాధవో దీనవత్సలాః॥**

ఎవరు దేవతల నెట్లు గొలుతురో, తదను గుణముగానే దేవతలు వారికి ఫలము లొసంగుదురు. మఱియు పురుషుని ఛాయవలె కర్మసహాయులును, ప్రాణుల కర్మానుగుణమగు ప్రవృత్తి గలిగి యుందురు. సాధువులుమాత్ర మాగొప్ప కొంచెముల నెంచక దీనుల యందును మిక్కిలి వాత్సల్యము గలిగి యుందురు.

**బ్రహ్మం స్తథాపి పృచ్ఛామో ధర్మాన్భాగవతాం స్తవ ।**
**యాన్ శ్రుత్వా శ్రద్ధయా మర్త్యో ముచ్యతే సర్వతో భయాత్ ॥**

ఓ బ్రాహ్మణశ్రేష్ఠా : సాధువు లట్టివారైనను, ఏ ధర్మముల శ్రద్ధతో విని మనుజాడు సమస్తభయముల బాయునో, అట్టి భగవత్సంబంధములగు ధర్మముల నడుగుచున్నాము చెప్పుడు.

**అహం కిల పురానంతం ప్రజార్థం భువి ముక్తిదమ్।**
**అపూజయం న మోక్షాయ మోహితో దేవమాయయా॥**

పూర్వము నేను దేవమాయా విమోహితుడనై యీలోకమున ముక్తినిచ్చు నట్టి శ్రీమన్నారాయణుని సంతానము కొఱకు పూజించితిని. మోక్షము కొఱ కట్లొనర్పనైతిని.

**యథా విచిత్రవ్యసనా ద్భవద్భి ర్విశ్వతోభయాత్।**
**ముచ్యేమహ్యంజసైవాద్ధా తథా నశ్శాధి సువ్రత॥**

ఓ మంచివ్రతములు గలవాడా! ఈ ప్రాపంచికములగు చిత్రవిచిత్ర ములైన దుఃఖములనుండియు, భయములనుండియు నెట్లు విడివడుదుమో అట్లు శీఘ్రముగాను, స త్యముగాను మమ్ము నడుపుడు.

శ్రీశుకః-

**రాజన్నేవం కృతప్రశ్నో వసుదేవేన ధీమతా।**
**ప్రీత స్తమాహ దేవర్షి ర్హరే స్సంస్మారితో గుణైః॥**

ఓ పరీక్షిన్నరేంద్రా! బుద్ధిమంతుడగు వసుదేవునిచే నిట్లు ప్రశ్నింపబడి, భగవద్గుణంబులచే భగవంతుని స్మరింపజేయబడిన దేవర్షి యగు నారదమహాముని ప్రీతి గలవాడై యిట్లు పలికెను అని శ్రీశుకమహర్షి వచించెను.

నారదః-

**సమ్యగేవం వ్యవసితం భవతా సాత్వతర్షభ।**
**యత్పృచ్ఛసే భాగవతాన్ ధర్మాంస్త్వం విశ్వపావనాన్॥**

ఓ వసుదేవా! లోకపావనములును, భగవత్సంబంధములును నగు ధర్మంబుల నీ వడుగుచున్నావు. కనుక బాగుగా నిశ్చయించిన వాడవైతివని నారదమహర్షి చెప్పుచున్నాడు.

**శ్రుతోను పఠితో ధ్యాత ఆదృతో వాఽనుమోదితః।**
**సద్యః పునాతి సద్ధర్మో దేవవిశ్వద్రుహో పి హి॥**

శ్రేష్ఠమగు ధర్మమును వినినను, చదివినను, ధ్యానించినను, ఆదరించినను, ఆమోదించినను అది దేవతలకు, ప్రపంచమునకును ద్రోహము చేసిన వారినైనను తత్క్షణమే పవిత్రుల జేయుచున్నది.

**త్వయా పరమకల్యాణః పుణ్యశ్రవణకీర్తనః।**
**స్మారితో భగవానద్య దేవో నారాయణో మమ॥**

పరమ మంగళుడును, పవిత్రమైన శ్రవణము, కీర్తనమును గలవాడును, దేవుడును, భగవంతుడును నగు నారాయణు డిప్పుడు నీచే స్మరింప చేయబడెను. కనుక మనమును పవిత్రులమే యని భావము.

**అత్ర్యాప్యుదాహరంతీమమితిహాసం పురాతనమ్।**
**ఆర్షభానాం చ సంవాదం విదేహస్య మహాత్మనః॥**

ఈ విషయమున ఋషభుని పుత్రులగు కవ్యాదులకును, నిమి జనకుడగు విదేహునకు జరిగిన సంవాద రూపమగు నొక పురాతనమగు నితిహాసమును పెద్దలు ఉదాహరింతురు.

**ప్రియవ్రతో నామ సుతో మనో స్స్వాయంభువస్య యః।**
**తస్యాగ్నీధ్ర స్తతో నాభీ ఋషభస్తత్సుత స్స్మృతః॥**

స్వాయంభువుడను మనువునకు ప్రియవ్రతుడను ప్రసిద్ధిచెందిన పుత్రుడుండెను. అతని కాగ్నీధ్రుడు గలిగెను. అతనికి నాభి యుదయించెను. ఆయిన పుత్రుడు ఋషభు డనబరగెను.

**తమాహు ర్వాసుదేవాంశం మోక్షధర్మవివక్షయా।**
**అవతీర్ణం సుతశతం తస్యాసీద్బ్రహ్మ సాగరమ్॥**

ఆ ఋషభుని మోక్షధర్మముల బ్రవర్తింపజేయు నిచ్చచే నవతరించిన, నారాయణాంశ సంభూతునిగా జెప్పుదురు. ఆయనకు నూరుగురు పుత్రు లుదయించిరి. వారు వేదములు కడవరకు జదివినవారలు.

**తేషాం వై భరతో జ్యేష్ఠో నారాయణపరాయణః।**
**విఖ్యాతం వర్షమేతద్యన్నామ్నా భారత మద్భుతమ్॥**

ఆ నూర్వురిలో జ్యేష్ఠుడు భరతుడు. ఆయన శ్రీమన్నారాయణ ధ్యానాసక్తచిత్తుడు. పూర్వమజనాభమను పేరుగల ఈవర్షమిపుడు భారతవర్షమని యాయనపేర యాశ్చర్యకరమగు ప్రసిద్ధిని జెందెను.

**స భుక్తభోగాం త్యక్త్వేమాం నిర్గతస్తపసా హరిమ్।**
**ఉపాసీన స్తత్పదవీం లేభే వై జన్మభి స్త్రిభిః॥**

ఆ భరతుడు సమస్త భోగముల ననుభవించి, పిదప నీ భూమిని పరిత్యజించి, బహిర్గతుడై తపస్సుచే శ్రీమన్నారాయణు నుపాసించి, మూడు జన్మలచే పరబ్రహ్మ సాయుజ్యమును పొందెను.

**తేషాం నవనవద్వీపపతయో౽స్య సమన్తతః।**
**కర్మతంత్రప్రణేతార ఏకాశీతి ర్ద్విజాతయః॥**

వారిలో తొమ్మండుగురు బ్రహ్మావర్తాది నవ ఖండములకు నీ భారతవర్షమునకును ప్రభువులైరి. తక్కిన ఎనుబది యొక్కండ్రు కుమారులు కర్మమార్గ ప్రవర్తకులై బ్రాహ్మణులైరి.

**నవాభవన్మహాభాగ మునయో హ్యర్థశంసినః।**
**శ్రమణా వాతరశనా ఆత్మవిద్యావిశారదాః॥**

పరమ పవిత్రులగు మిగిలిన తొమ్మండుగురు మునులును పర తత్వార్థ నిరూపకులును, దిగంబరులును, ఆత్మవిద్యయందు నిష్ణాతులును నైరి.

**కవిర్హరిరంతరిక్షః ప్రబుద్ధః పిప్పలాయనః।**
**అవిర్హోత్రో ద్రమీళశ్చ చమసః కరభాజనః॥**

కవి, హరి, అంతరిక్షుడు, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు, అ విర్హోత్రుడు, ద్రమీళుడు, చమనుడు, కరభాజనుడు అను నివి యాతొమ్మండుగురికి నామములగును. ఇందు ప్రస్తుతమగు కర్మమార్గ ప్రవర్తకులగు వర్ణాంతరులు బ్రాహ్మణులగుదురు అనుట నిరూపింపబడినది. తక్కిన కథ భాగవతమున నేకాదశస్కంధమున గనదగును.

ఇదివరలో చెప్పిన భాగవత కథచే కర్మానుష్ఠానమువల్లనే బ్రాహ్మణత్వము గలుగునని నిరూపించడమైనది. చాతుర్వర్ణ్యమెట్లేర్పడినదో ఆ విషయమై భారతములో శాంతి పర్వమున భృగు, భరద్వాజ సంవాదమును చూడుడు-

భృగుమహర్షి భరద్వాజునకు వర్ణాశ్రమముల క్రమముల చెప్పుట.
(శ్రీమహాభారతము, శాంతిపర్వము)

భృగురువాచ :- భృగుమహర్షి పలికెను.

**అసృజద్బ్రాహ్మణా నేవం పూర్వం బ్రహ్మ ప్రజాపతీన్।**
**ఆత్మతేజోభినిర్వృత్తాన్ భాస్కరాగ్ని సమప్రభాన్॥**

బ్రహ్మదేవుడు ఆత్మతేజస్సు నుండి బయలు వెడలినట్టియు, సూర్యాగ్నులతో సమానకాంతి గలిగినట్టియు ప్రజాపతులైన బ్రాహ్మణుల మొదట సృష్టించెను.

**తత స్సత్యం చ ధర్మం చ తపో బ్రహ్మ చ శాశ్వతమ్।**
**ఆచారం చైవ శౌచం చ స్వర్గాయ విదధే ప్రభుః॥**

పిమ్మట సత్యము, ధర్మము, ఉపనిషత్తులు, ఆచారము, శౌచము స్వర్గము కొరకు సృజింపబడెను. అనగా నివి గలవారు స్వర్గీయులని భావము.

**దేవదానవగంధర్వా దైత్యాసుర మహోరగాః।**
**యక్షరాక్షసనాగాశ్చ పిశాచా మనుజా స్తథా॥**
**బ్రాహ్మణాః క్షత్రియాః వైశ్యాః శూద్రాశ్చ ద్విజసత్తమ।**
**యే చాన్యే భూతసంఘానాం వర్ణాంస్తాంశ్చాపి నిర్మమే॥**

తరువాత దేవతలు, దానవులు, గంధర్వులు, మహోరగులు, దైత్యులు, అసురులు, యక్షులు, నాగులు, పిశాచములు, మనుజులు సృష్టింపబడిరి. మఱియు నే యే భూతసమూహము లున్నవో, వానియొక్క వర్ణములును నిర్మింపబడెను.

**బ్రాహ్మణానాం సితో వర్ణః క్షత్రియాణాం చ లోహితః।**
**వైశ్యానాం పీతకో వర్ణః శూద్రాణా మసితస్తథా॥**

తెలుపురంగులు గలవారు బ్రాహ్మణులు, ఎరుపురంగు గలవారు క్షత్రియులు, పచ్చరంగు గలవారు వైశ్యులు, నలుపురంగు గలవారు శూద్రులు నగుదురు.

భరద్వాజ ఉవాచ :– భరద్వాజమహర్షి పలికెను.

**చాతుర్వర్ణ్యస్య వర్ణేన యది వర్ణో విభిద్యతే।**
**సర్వేషాం ఖలు వర్ణానాం దృశ్యతే వర్ణసంకరః॥**

నాలుగు వర్ణములయందు రంగులచే వర్ణభేదమేర్పడుటచే అన్ని వర్ణములయందు నన్నిరంగులు గలవారున్నారు. కనుక వర్ణసంకరమేర్పడును గదా.

**కామః క్రోధో భయం లోభః శోకశ్చింతా క్షుధా శ్రమః।**
**సర్వేషాం చ ప్రభవతి కస్మాద్వర్ణో విభజ్యతే ॥**

కామము, క్రోధము, భయము, లోభము, శోకము, చింత, ఆకలిచేనైన శ్రమయు నందరికి సమానముగా గలగుచున్నవి. కనుక దేనిచే వర్ణవిభాగము చేయబడును?

**స్వేదమూత్ర పురీషాణి శ్లేష్మా పిత్తంచ శోణితమ్।**
**తనుః క్షరతి సర్వేషాం కస్మా ద్వర్ణో విభజ్యతే॥**

చెమట, మలమూత్రములు, శ్లేష్మము, రక్తయుక్తమగు పిత్తము అను వీనిని అందరియొక్క శరీరములు స్రవించుచుండుటచే దేనిచే వర్ణవిభాగ మేర్పడును?

**జంగమానా మసంఖ్యేయాః స్థావరాణాం చ జాతయః।**
**తేషాం వివిధవర్ణానాం కుతో వర్ణవినిశ్చయః॥**

జంగమ స్థావరముల జాతులు లెక్కకు మిక్కుటముగా నున్నవి. వాని యొక్క వర్ణ నిశ్చయము దేనిచే జేయబడును.

భృగురువాచ :– భృగుమహర్షి పలికెను.

**న విశేషోఽస్తి వర్ణానాం సర్వం బ్రాహ్మమిదం జగత్।**
**బ్రహ్మణా పూర్వసృష్టం హి కర్మభిర్వర్ణతాం గతమ్॥**

వర్ణములలో విశేషము లేదు. మొదట బ్రహ్మదేవు డీ సకల జనులను బ్రాహ్మణులను (ఆర్యులను) గా సృజించెను. పిదప కర్మలబట్టి వర్ణము లేర్పడినవి.

**ప్రవర్తయతి తత్కర్మ పరిపాకక్రమం విదన్।**
**ఋజవ శ్శుద్ధవర్ణాభాః క్షమావంతో దయాళవః।**
**స్వధర్మనిరతా యే స్యుః తే ద్విజేషు ద్విజాతయః॥**

వారి వారి కర్మ పరిపాకము ననుసరించి ఒక్కొక్కరు ప్రవర్తించెదరు. మనోవాక్కాయములచే నేకరీతిగ ప్రవర్తించువారును, సాత్త్వికగుణము గలవారును, క్షమావంతులును, దయాళుత్వము గలవారును, బ్రాహ్మణ ధర్మమగు వేదాధ్యయన తపోధ్యానాది బ్రహ్మవిద్యయందు ప్రవర్తించువారెవరో, వారు బ్రాహ్మణులలో బ్రాహ్మణులు.

**కామభోగప్రియా స్తీక్ష్ణాః క్రోధనాః ప్రియసాహసాః।**
**త్యక్తస్వధర్మా రక్తాంగా స్తే ద్విజాః క్షత్రతాం గతాః॥**

కామోపభోగములయందు ప్రీతి, తీక్ష్ణ కోపము గలిగి సాహస ప్రియులై స్వీయ బ్రాహ్మణ ధర్మముల విడిచి, యెఱ్ఱని శరీరములు గల బ్రాహ్మణులు క్షత్రియత్వమును బొందిరి.

**గోభ్యో వృత్తిం సమాస్థాయ పీతాః కృష్యుపజీవినః।**
**స్వధర్మాన్ నానుతిష్ఠంతి తే ద్విజాః వైశ్యతాం గతాః॥**

గోవుల గాపాడుచు కృషిచే జీవనము జేయుచు, స్వబ్రాహ్మణ ధర్మముల నాచరింపక, పచ్చని శరీరములు ధరించిన బ్రాహ్మణులు వైశ్యత్వమును బొందిరి.

**హింసానృతప్రియా లుబ్ధా సర్వకర్మోపజీవినః।**
**కృష్ణాః శౌచపరిభ్రష్టా స్తే ద్విజాశ్శూద్రతాం గతాః॥**

జీవహింస, అబద్ధము, లోభము గలిగి నీచకర్మల గూడ నాచరించి జీవించుచు, శౌచాచారములు బొత్తిగా లేనివారై, నల్లని దేహము గల బ్రాహ్మణులు శూద్రత్వమును బొందిరి.

**ఇత్యేతైః కర్మభి ర్వ్యస్తాః ద్విజా వర్ణాంతరం గతాః।**
**ధర్మో యజ్ఞక్రియా తేషాం నిత్యం న ప్రతిషిద్ధ్యతే॥**

ఈప్రకారముగా పై జెప్పబడిన కర్మలచే వేరువేరుగా చేయబడిన ద్విజాలు బ్రాహ్మణాది వర్ణాంతరముల బొందిరి. వారి కెప్పుడును యాగము ధర్మయుక్తమైనది. నిషేధము లేదు.

**ఇత్యేతే చతురో వర్ణా యేషాం బ్రాహ్మీ సరస్వతీ।**
**విహితా బ్రహ్మణా పూర్వం లోభా త్త్వజ్ఞానతాం గతాః॥**

బ్రాహ్మణాది చతుర్వర్ణము లట్టివి. వీనికి పూర్వము బ్రహ్మదేవుడు వేదమును విధించెను. లోభముచే నజ్ఞానమును బొందినవి.

భరద్వాజ ఉవాచ :- భరద్వాజమహర్షి పలికెను.

**పూర్వమేవ భగవతా బ్రహ్మణా, లోకహిత మనుతిష్ఠతా**
**ధర్మ సంరక్షణార్థ మాశ్రమాశ్చత్వారోఽభినిర్దిష్టాః॥**

లోకమునకు హితము నొనరించునట్టి భగవంతుడైన బ్రహ్మదేవుడు పూర్వమే ధర్మసంరక్షణము కొఱకు నాలుగాశ్రమముల నిర్మించెను.

**ప్రథమ మాశ్రమ ముదా హరంతి**
**తత్ర గురుకులవాసమేవ॥**

ఆ నాల్గింటియందు గురుకులవాసమే (బ్రహ్మచర్యాశ్రమమే) మొదటిది యని వచింతురు.

**సమ్య గత్ర శౌచ సంస్కార నియమ వ్రత వినియతాత్మా ఉభే సంధ్యే భాస్కరాగ్నిదైవతాన్యుపస్థాయ విహాయ తంద్రాలస్యే గురోరభివాదన వేదాభ్యాస శ్రవణ పవిత్రీకృతాంతరాత్మా త్రిసవన ముపస్పృశ్య బ్రహ్మచర్యాగ్ని పరిచరణ గురుశూశ్రూషా నిత్యభిక్షాభైక్షాది సర్వనివేదితాంతరాత్మా గురువచన నిర్దేశానుష్ఠానాప్రతికూలో, గురుప్రసాద లబ్ధ స్వాధ్యాయ తత్పరః స్యాత్.**

ఈ గురుకులవాసమున శుచి, ఉపనయనాది సంస్కారము, నియమము, వ్రతము వీటిచే నియమింపబడి, ప్రాతస్సాయం సంధ్యల యందు సూర్యాగ్ని దేవతల నర్ఘ్యాదికముచే సేవించుచు, కునికిపాటును ఆలస్యమును విడిచి గురు నమస్కారము, వేదాభ్యాసము, వేదాంత శ్రవణము వీనిచే పవిత్రమైన యంతఃకరణము గలవాడై, మూడు వేళల స్నానమొనర్చుచు, బ్రహ్మచర్యము, అగ్నికార్యము, గురు శుశ్రూష, నిత్యభిక్ష మొదలగువాని నెఱింగి గురునాజ్ఞ పరిపాలించుచు ఆచార్యానుగ్రహముచే లబ్ధమైన, వేదాధ్యయనము నందాసక్తుడై యుండవలయును–

**గార్హస్థ్యం ఖలు ద్వితీయ మాశ్రమం వదంతి–**

గృహస్థాశ్రమము రెండవదని చెప్పెదరు–

**తస్య సముదాచారలక్షణం సర్వమనువ్యాఖ్యాస్యామః.**

ఆ గృహస్థాశ్రమముయొక్క ఆచార లక్షణమంతయును వివరింతుము.

**సమావృత్తానాం, సదాచారాణాం సహధర్మచర్యా ఫలార్థినాం గృహాశ్రమో విధీయతే.**

గురుకులమున విద్య పూర్తిజేసి మరలి వచ్చి మంచి యాచారము గలిగి భార్యతోగూడ ధర్మముల నాచరింపదలంచినవారికి గృహస్థాశ్రమము విధింపబడినది.

**ధర్మార్థకామావా ప్తిర్యత్ర త్రివర్గసాధన మపేక్షాఽ గ్వర్హి తేన కర్మణా ధనాన్యాదాయ.**

ఈ గృహస్థాశ్రమమున దోషరహితమైన కర్మచే ధనాదికము నార్జించి త్రివర్గసాధన రూపమైన ధర్మార్థకామముల ప్రాప్తి యిష్టమైనది.

**స్వాధ్యాయోపలబ్ధ ప్రకర్షేణ వా బ్రహ్మర్షి నిర్మితే న వా, హవ్య కవ్య నియమాభ్యాస దైవత ప్రసాదోపలబ్ధేన వా, ధనేన గృహస్థో గార్హస్థ్యం వర్తయేత్.**

వేదాధ్యయనముచే పొందబడిన యుత్కర్షవలనగాని, బ్రహ్మర్షి నిర్మితమైనట్టిగాని, పితృదేవతలకు దేవతలకు, నన్న మిడుట మొదలగు నియమముల నభ్యసించుటవల్లనైన దైవానుగ్రహము వలనగాని ప్రాప్తమైన ధనముచే, గృహస్థుడు తన ధర్మమును నెరవేర్ప వలయును–

**తద్ధి సర్వాశ్రమాణాం మూల ముదాహరంతి.**

ఆ గృహస్థాశ్రమము తక్కిన యాశ్రమముల కన్నిటికిని కారణమని పలుకుదురు. అనగా మిగిలిన మూడా శ్రమములవారిని అన్నదానము మొదలగు వానిచే సంరక్షించునది యని భావము.

**గురుకుల నివాసినః పరివ్రాజకా యే చాన్యే సంకల్పితవ్రత నియమ ధర్మానుష్ఠాయినస్తేషా మప్యత ఏవ భిక్షాబలి సంవిభాగాః ప్రవర్తంతే.**

బ్రహ్మచారులకు, సన్న్యాసులకు మఱియు వ్రతముల నియమముల నాచరింప సంకల్పించి యనుష్ఠించు వాన ప్రస్థులకున్నూ ఈ గృహస్థాశ్రమము వలననే భిక్షయు, జంతువులకు ఆహారమును (భూతబలియును) జరుగుచున్నవి.

**వానప్రస్థానాంచ ద్రవ్యోపస్కారః ఇతి ప్రాయశః ఖల్వేతే సాధవః, సాధు పథ్యోదనాః, స్వాధ్యాయ ప్రసంగినః, తీర్థాభిగమన దేశదర్శనార్థం పృథివీం పర్యటంతి! తేషాం ప్రత్యుత్థా నాభిగమన మనసూయా వాక్ప్రదా న, సుఖ శక్త్యాసన సుఖశయ నాభ్యవహార సత్క్రియా చేతి.**

వానప్రస్థులకును ద్రవ్యము నొసగవలయును. తరచుగా నీసాధువులును పథ్యాహారము, వేదాధ్యయనము గలిగి తీర్థయాత్రలకొరకు, దేశముల జూచుట కొఱకు దిరుగుచుందురు. అట్టివారిని చూచి యెదురుగా వెళ్ళుట, అసూయలేక ప్రియసత్యములతో మాట్లాడుట, సుఖాసనము, మంచి పడకనిచ్చుట, భోజనము పెట్టుట యను సపర్య చేయవలయును.

**అపి చాత్ర యజ్ఞక్రియాభిర్దేవతాః ప్రీయన్తే నివాపేన పితరః విద్యాభ్యాస శ్రవణధారణేన ఋషయః అపత్యోత్పాదనేన ప్రజాపతిరితి.**

ఈ గృహస్థాశ్రమమున యజ్ఞములచే దేవతలు, తిలోదకములచే పితృదేవతలు, వేదాధ్యయనము, వేదాంతశ్రవణము, ధారణము వీటిచే ఋషులు, సంతానముచే ప్రజాపతియు సంతోషపెట్టబడుదురు.

**అపి చాత్ర మాల్యాభరణ వస్త్రాభ్యంగ నిత్యోపభోగ నృత్తగీత వాదిత్ర శ్రుతిసుఖనయనాభిరామ దర్శనానాం ప్రాప్తిః, భక్ష్య, భోజ్య, లేహ్య, పేయ, చోష్యాణా మభ్యవహార్యాణాం వివిధానా ముపభోగః, స్వవిహార సంతోషః కామసుఖావా ప్తిరితి.**

మఱియు నీ యాశ్రమమున పుష్పమాలలు, భూషణములు, మంచివస్త్రములు, సువాసనా ద్రవ్య పూర్వకమగు శిరఃస్నానములు, నర్తనము, చెవుల కింపగు సంగీతము, వాద్యములు, కనులకు మనోహరములగు దర్శనములు గలిగి యుండవచ్చును. భక్ష్యభోజ్య పాన పేయ చోష్యాది వివిధాహారముల భుజించ వచ్చును. ఉద్యానవనాదులయందు స్వేచ్ఛగా విహరింపవచ్చును. విషయసుఖముల ననుభవింపవచ్చును.

**త్రివర్గగుణనిర్వృత్తిః యస్య నిత్యం గృహాశ్రమే।**
**స సుఖాన్యనుభూయేహ శిష్టానాం గతి మాప్నుయాత్॥**

ఎవడు గృహస్థాశ్రమమున ఎల్లప్పుడు ధర్మార్థకామముల చక్కగా నాచరించుచుండునో, యట్టివాడీలోకమున సుఖముల ననుభవించి పరమున శ్రేష్ఠగతిని బొందును.

**ఉంఛవృత్తిర్గృహస్థో యః స్వధర్మ చరణే రతః।**
**త్యక్త కామసుఖారంభః స్వర్గ స్తస్య న దుర్లభః॥**

ధాన్యము నేరుకొని బ్రతుకుచు, స్వధర్మముల నాచరించుచు, విషయ సుఖోద్రేకమును విసర్జించిన గృహస్థుడు స్వర్గమును బొందును.

భృగు రువాచ :– భృగుమహర్షి పలికెను.

**వానప్రస్థాః ఖల్వపి, ధర్మమనుసరంతః, పుణ్యాని తీర్థాని నదీప్రస్రవణాని సువివి క్తేష్వరణ్యేషు, మృగ మహిష వరాహ శార్దూల వన గజాకీర్ణేషు తపస్యంతోఽనుసంచరంతి.**

వానప్రస్థులు స్వధర్మములగు తపశ్చర్యల నాచరించుచు, నిర్జన ప్రదేశములు గలిగి, జింకలు, అడవి దున్నపోతులు, పందులు, పులులు, ఏనుగులు వీనిచే వ్యాప్తమైన అరణ్యమున నిష్ఠలు చేయుచు పుణ్యతీర్థములను, నదులను, సెలయేళ్ళను దిరుగుచుందురు.

**త్యక్త గ్రామ్య వస్త్రాభ్యవహారోపభోగాః వన్యౌషధి ఫలమూల పర్ణపరిమిత విచిత్రనియతాహారాః, స్థానాసనినో భూమి పాషాణ సికతా శర్కరావాలుకా భస్మ శాయినః, కాశ కుశచర్మవల్కల సంభృతాంగాః, కేశగశ్మశ్రు నఖ లోమధారిణో నియత కాలోపస్పర్శనాః, అస్కందిత కాల బలిహోమాను ష్ఠాయినః సమిత్కుశ కుసుమోపహార సమ్మార్జన లబ్ధవిశ్రామాః. శీతోష్ణ వర్షపవన విష్టంభ విభిన్న సర్వత్వచో, వివిధ నియమోపభోగ చర్యానుష్ఠాన, విహిత పరిశుష్కమాంస, శోణితత్వ గస్థిభూతా ధృతిపరాః సత్వయోగాచ్ఛరీరాణ్యుద్వహంతే ॥**

గ్రామసంబంధమైన వస్త్రములను, ఆహారములను, ఉపభోగములను విసర్జించి వనసంబంధమైన ఓషధులు, ఫలములు, మూలములు, ఆకులు వీనిచే పరిమితమై, విచిత్రమైన నియతాహారము గలిగి భూమి, బండ, యిసుకతిన్నె, భస్మము వీనియందు శయనించుచు, రెల్లు, దర్భ, చర్మము, నారచీరలు, వెంట్రుకలు, మీసములు, గోళ్ళు–వీనిని ధరించుచు, నియత సమయముల స్నానమొనర్చుచు, విడువక భూతబలి హోమముల ననుష్ఠించుచు, సమిధలు, దర్భలు వీని సంపాదించుట, ఆశ్రమముల శుభ్రముగా నూడ్చుట, వీనియందు విశ్రాంతిని పొందుచు, చలి, వేడి, వాన, గాలి, వీనియాధిక్యముచే సహించెడు చర్మముగలిగి, నానావిధ నియమములచేతను, యోగానుష్ఠానముచేతను, శుష్కించిన మాంసము, రక్తము, చర్మము, యెముకలు గలవారై, ధైర్యముతోను, ప్రాణసంబంధముచేతను శరీరముల ధరించియుందురు.

**యస్త్వేతాం నియతశ్చర్యాం బ్రహ్మర్షివిహితాం చరేత్।**
**స దహేదగ్నివద్దోషాన్ జయేల్లోకాంశ్చ దుర్జయాన్॥**

బ్రహ్మర్షులచే విధింపబడిన యీచర్యల నెవడు నియమముతో నాచరించునో, యతడగ్నివలె దోషముల దహించును. అజేయములగు లోకముల జయించును.

బ్రహ్మచర్య వ్రతనిష్ఠ గలిగి, తపస్సునందు ప్రీతిగలిగి ప్రపంచవ్యవహారము స్మరింపని భార్యయుండిన, ఆమెనుగూడ తపోభూమి లోనికి తీసుకుని పోవచ్చును. అట్లు కాని వారిని గృహములో విడిచి వెళ్ళుటలో దోషము లేదు.

**పరివ్రాజకానాం పునరాచారః తద్యథా విముచ్యాగ్ని, ధనకళత్ర, పరిబర్హణ సంగేష్వాత్మానం స్నేహపాశా నవధూయ పరివ్రజంతి.**

సన్యాసుల యాచారము చెప్పబడుచున్నది. వా రగ్ని కార్యములను, భార్యను, పరివారమును విడిచి స్నేహపాశముల గోసివేసి స్సన్న్యసింతురు.

**సమలోష్టాశ్మ కాంచనా స్త్రీ వర్గ ప్రవృత్తేష్వసక్త బుద్ధయః అరిమిత్రో దాసీనానాం తుల్యదర్శనాః, స్థావర జరాయు జాండజ సంస్వేద జోద్భిజ్జానాం భూతానాం వాఙ్మనః కర్మభి రనభిద్రోహిణః, అనికేతాః, పర్వత పులిన వృక్షమూల దేవతాయత నాన్యనుసరంతః, వాసార్థ ముపేయు ర్నగరం, గ్రామం వా, నగరే పంచరాత్రికాః గ్రామే చైకరాత్రికాః ప్రవిశ్య చ ప్రాణధారణార్థం, ద్విజాతీనాం భవనా న్యసంకీర్ణ కర్మణా ముపతిష్ఠేయుః పాత్రపతితాయాచిత భై క్ష్యాః కామక్రోధ దర్పలోభ మోహ కార్పణ్య దంభ పరివాదాభిమాన హింసానివృత్తా ఇతి.**

మట్టి, రాయి, బంగారు వీనియందు సమానభావము గలిగి ధర్మార్థ కామములయం దాసక్తిలేనివారలై, శత్రుమిత్రో దాసీనులయందు సమాన దృష్టి గలిగి, పర్వతాదులకును, పశ్వాదులకును, పక్ష్యాదులకును, పేలు మొదలగు వానికిని, వృక్షాదులకును, త్రికరణశుద్ధిగా ద్రోహము చేయక, నిశ్చిత స్థానము లేక, పర్వతములయందు, ఇసుక తిన్నెలయందు, వృక్షమూలముల యందు, దేవాలయములయందును, సంచరించుచు పట్టణమున నైదురాత్రులుగాని, గ్రామమున నొక రాత్రిగాని నివసించవచ్చును.

పరిశుద్ధకర్మగల బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుల గృహములను, ప్రాణరక్షణము కొఱకు ప్రవేశించవచ్చును. ఆయాచితులై భిక్షను గ్రహించుచు భిక్షాపాత్రమున బడిన దానితో తృప్తినొందవలయును. కామము, క్రోధము, గర్వము, లోభము, మోహము, కృపణత్వము, దంభము, దూషణము, అభిమానము, హింస వీనిని వదలవలయును.

ధర్మబోధనార్థము సంచరించెడు యతి వర్తన మిచట నిరూపించడమైనది. వేదాంత శ్రవణము, ధ్యాననిష్ఠ, శాస్త్రబోధన చేయువారిని గురించినది కాదు. కావుననే విద్వత్సన్యాస మనియు, వివిషాన్యాస మనియు నిరుతెగలు ఏర్పడుటకు కారణము. మరియు కుటీచక, బహూదక, హంస, పరమహంసాది భేదములు సన్యాసములో గలవు. పరమహంసోప నిషత్తు, నారద పరివ్రాజకోప నిషదాదులలో నీ ధర్మము గనందగును.

*విశ్వామిత్రునకు బ్రాహ్మణత్వము గలిగిన ప్రకారము*

(శ్రీ మహాభారతము, అనుశాసిసనిక పర్వము)

శ్రీ మద్భాగవతమున ఋషభ పుత్రులు, కర్మానుష్ఠానముచే విప్రులైన విషయము వ్రాయడమైనది. ఇపుడు తపస్సువలన విశ్వామిత్రుడు బ్రాహ్మణుడైన చరిత్రము తెలుపబడుచున్నది.

**బ్రాహ్మణ్యం యది దుష్ప్రాప్యం త్రిభిర్వర్ణై ర్నరాధిప।**
**కథం ప్రాప్తం మహారాజ క్షత్రియేణ మహాత్మనా॥**
**విశ్వామిత్రేణ ధర్మాత్మన్ బ్రాహ్మణత్వం నరర్షభ।**
**శ్రోతుమిచ్ఛామి తత్త్వేన తన్మే బ్రూహి పితామహ॥**

ఓ ధర్మాత్మా ! బ్రాహ్మణత్వము క్షత్రియాది వర్ణత్రయముచే బొంద

శక్యము గానిచో, మహాత్ముడును, క్షత్రియుడును నగు విశ్వామిత్రునిచే నెట్లు బొందబడెనో యథార్థముగా వినగోరుచున్నాను చెప్పుము.

భీష్మ ఉవాచ: భీష్ముడు పలికెను.

**శ్రూయతాం పార్థ! తత్త్వేన విశ్వామిత్రో యథా పురా।**
**బ్రాహ్మణత్వం గతస్తాత బ్రహ్మర్షిత్వం తథైవ చ॥**

ఓ ధర్మరాజా! విశ్వామిత్రుడు పూర్వమెట్లు బ్రాహ్మణత్వమును, బ్రహ్మర్షిత్వమును బొందెనో యథార్థముగా వినుము.

**భరతస్యాన్వయే చై వాజమీఢో నామ పార్థివః।**
**బభూవ భరతశ్రేష్ఠ యజ్వా ధర్మభృతాం వరః॥**

ఓ భరతశ్రేష్ఠా! భరతవంశమున అజమీఢుడని ప్రసిద్ధి జెందిన రాజు గలడు. అతడు విధ్యుక్తముగా యజ్ఞముల నాచరించినవాడు, ధార్మిక శ్రేష్ఠుడును నగును.

**తస్య పుత్రో మహానాసీ జ్జహ్ను ర్నామ నరేశ్వరః।**
**దుహితృత్వ మనుప్రాప్తా గంగా యస్య మహాత్మనః॥**

జహ్నువని ప్రసిద్ధి జెందిన మహారాజా అజామీఢుని పుత్రుడు, గంగాదేవి యామహాత్మునికి పుత్రిక యగును.

**తస్యాఽఽత్మజస్తుల్యగుణః సింధుద్వీపో మహాశయాః।**
**సింధు ద్వీపాచ్చ రాజర్షి ర్బలాకాశ్వో మహాబలః.....॥**

మిక్కిలి యశస్వియు, సమానగుణుడును నగు సింధుద్వీపుడు ఆ జహ్ను మహారాజుయొక్క తనయుడు. అతనికి మిగుల బలవంతుడు, రాజర్షియు నగు బలాకాశ్వ డుదయించెను.

**వల్లభ స్తస్య తనయ స్స్వాషా ద్ధర్మ ఇవాఽపరః।**
**కుశిక స్తస్య తనయః సహస్రాక్ష సమద్యుతిః॥**

మూర్తీభవించిన ధర్మమో యన వల్లభు డాబలాకాశ్వుని కుమారు డయ్యెను. ఇంద్రసముడగు కుశికు డాతని కొమరుం డయ్యెను.

**కుశికస్యాఽఽత్మజ శ్శ్రీమాన్గాధిర్నామ జనేశ్వరః।**
**అపుత్రః ప్రసవేనార్థీ వనవాసముదావసత్॥**

లక్ష్మీ సంపన్నుడగు గాధియను మహారాజు కుశుకుని యాత్మజుడు. అత డపుత్రుడై పుత్రార్థ మరణ్యమున నివసించెను.

**కన్యా జజ్ఞే సుతా తస్య వనే నివసతస్సతః।**
**నామ్నా సత్యవతీ నామ రూపేణాఽప్రతిమా భువి॥**

కానన నివాసియగు నా గాధిరాజున కొక కూతు రుదయించెను. పేరు సత్యవతి. లోకాతిశయ సౌందర్యవతి.

**తాం వవ్రే భార్గవః శ్రీమాం శ్చ్యవనస్యాత్మసంభవః।**
**ఋచీక ఇతి విఖ్యాతో విపులే తపసి స్థితః॥**

ఋచీకుడని ప్రసిద్ధిజెందిన భృగువంశీయుడు , గొప్ప తపస్వియును నగు చ్యవనుని పుత్రు డా సత్యవతిని వరించెను.

**స తాం న ప్రదదౌ తస్మై ఋచీకాయ మహాత్మనే।**
**దరిద్ర ఇతి మత్వా వై గాధి శ్శత్రునిబర్హణః॥**

శత్రుహంతకుడగు నాగాధిరాజు, మహాత్ముడగు ఋచీకుడు దరిద్రుడ ని యెంచి యతని కామె నివ్వడాయెను.

**ప్రత్యాఖ్యాయ పునర్యాంత మబ్రవీ ద్రాజసత్తమః।**
**శుల్కం ప్రదీయతాం మహ్యం తతో వేత్స్యసి మే సుతామ్॥**

తిరస్కరించగా వెళ్ళుచున్న ఋచీకుని గూర్చి యారాజు శుల్కము నిమ్ము. పిదప నా కూతురును బొందగలవని పలికెను. గాధిరాజు తపస్వియగు ఋచీకునకు తన పుత్రికను ఇచ్చుట కిష్టము లేనప్పటికిన్ని శాప భయముచే ఎవరికిన్ని సాధ్యముగాని యాశుల్కము కోరడమైనది. ఇవ్వనిచో అతడే వెళ్ళిపోవును.

ఋచీక ఉవాచ:– ఋచీకుడు పలికెను.

**కిం ప్రయచ్ఛామి రాజేంద్ర తుభ్యం శుల్కమహం నృప।**
**దుహితు ర్బ్రహ్మ సంసక్తో మా భూత్తవ విచారణా॥**

ఓ రాజశ్రేష్ఠ! నీకు దేనిని కట్నము నిత్తును? నేను బ్రహ్మధ్యాన పరుడను గనుక నీకు నీ కూతురునకు విచారము వలదు.

గాధి రువాచ:– గాధిరాజు పలికెను.

**చంద్రరశ్మి ప్రకాశానాం హయానాం వాతరంహసామ్।**
**ఏకతశ్శ్యామకర్ణానాం సహస్రం దేహి భార్గవ॥**

ఓ భృగుకులవరేణ్యా! చంద్రకాంతివంటికాంతియు, వాయు వేగమును, ఒకవైపున నల్లని చెవులును గల వేయి గుఱ్ఱముల నిమ్ము.

భీష్మ ఉవాచ:– భీష్ముడు పలికెను.

**తత స్స భృగుశార్దూల శ్చ్యవనస్యాత్మజ ప్రభుః।**
**అబ్రవీ ద్వరుణం దేవ మాదిత్యం పతిమంభసామ్॥**

పిదప భృగువంశ శ్రేష్ఠుడును, సమర్థుడును నగు ఋచీకుడు జలాధి దేవత యగు వరుణదేవుని గూర్చి పలికెను.

ఏకత శ్శ్యామకర్ణానాం హయానాం చంద్రవర్చసామ్।
సహస్రం వాతవేగానాం భిక్షే త్వాం దేవసత్తమ॥

ఓ దేవతా శ్రేష్ఠా ! అశ్వముల యాచించుచున్నాను. అవి యొకవైపున నల్లని చెవులును, చంద్రకాంతివంటి కాంతిని, వాయువేగమును గలిగి యుండవలయును.

తథేతి వరుణో దేవ ఆదిత్యో భృగుసత్తమమ్।
ఉవాచ యత్ర తే ఛంద స్తత్రోత్థాస్యంతి వాజినః॥

వరుణదేవుడు అట్లే యగుగాక యనియు, ఆ గుఱ్ఱములు నీ కిష్టమగు చోటునుండి లేచి రాగల వనియును నా ఋచీకుని గూర్చి పలికెను.

ధ్యాతమాత్రే ఋచీకేన హయానాం చంద్రవర్చసామ్।
గంగాజలాత్సము త్తస్థౌ సహస్రం విపులౌజసామ్॥

ఋచీకుడు ధ్యానించినంతమాత్రాన చంద్రతేజస్సుగల వేయి గుఱ్ఱములు గంగా జలమునుండి లేచి వచ్చెను.

అదూరే కాన్యకుబ్జస్య గంగాయా స్తీర ముత్తమమ్।
అశ్వతీర్థం తదద్యాపి మానవాః పరిచక్షతే॥

కన్యాకుబ్జమునకు సమీపమున, నా గంగాతీరమున శ్రేష్ఠమగు నశ్వతీర్థము గలదు. దాని నిప్పుడును జనులు కీర్తించుచుందురు.

తతో వై గాధయే తాత సహస్రం వాజినాం శుభమ్।
ఋచీకః ప్రదదౌ ప్రీతశ్శుల్కార్థం తపసాం వరః॥

ఓ నాయనా ! పిదప మునిశ్రేష్ఠుడగు నా ఋచీకుడు సంతుష్టాంత రంగుడై గాధిరాజునకు మంగళకరమగు నాయశ్వసహస్రమును శుల్కముగా నిచ్చెను.

జగ్రాహ విధివత్పాణిం తస్యా బ్రహ్మర్షి సత్తమః।
సా చ తం పతిమాసాద్య పరం హర్షమవాప హ॥

బ్రహ్మర్షి శ్రేష్ఠుడగు నా ఋచీకుడు యథావిధిగా నా స్త్రీని పాణిగ్రహణ మొనర్చెను. ఆమెయు నాపతిని బొంది మిక్కిలి సంతసించెను.

సంతుతోష చ బ్రహ్మర్షిస్తస్యా వృత్తేన భారత।
ఛందయామాస చైవైనాం వరేణ వరవర్ణినీమ్॥

ఓ ధర్మరాజా! బ్రహ్మర్షి యాసత్యవతి యొక్క నడవడికకు సంతసించెను. వరవర్ణిని యగు నామెను వరము కోరుకొమ్మనెను.

మాత్రే తత్సర్వమాచఖ్యౌ సా కన్యా రాజసత్తమ ।
అథ తామబ్రవీన్మాతా సుతాం కించి దవాఙ్ముఖీమ్ ॥

ఓ రాజశ్రేష్ఠా! ఆకన్యక యావిషయ మంతయు తల్లికి జెప్పెను. పిదప తల్లి యవాఙ్ముఖి యగు కూతురిని గూర్చి పలికెను.

మమాఽపి పుత్రి భర్తా తే ప్రసాదం కర్తు మర్హతి।
అపత్యస్య ప్రదానేన సమర్థశ్చ మహాతపాః॥

గొప్ప తపస్సంపన్నుడును, సమర్థుడును నగు నీభర్త సంతతి దానముచే నన్నును అనుగ్రహింప నర్హుడు.

తతస్సా త్వరితం గత్వా తత్సర్వం ప్రత్యవేదయత్।
మాతు శ్చికీర్షితం రాజన్ ఋచీకస్తామథాబ్రవీత్॥

తరువాత నాకన్యక త్వరగా వెళ్ళి, తల్లి యభిప్రాయమునంతయు ఋచీకునకు దెలియజేసెను. అతడును నామెతో నిట్లు నుడివెను.

గుణవంతమపత్యం సా అచిరాజ్జనయిష్యతి।
మమ ప్రసాదాత్కల్యాణి మా భూత్తే ప్రణయోఽన్యథా॥

ఓ మంగళవతీ! నాయనుగ్రహముచే నామె శీఘ్రముగా గుణవంతు డగు బిడ్డను కనగలదు. నీస్నేహము వ్యర్థము గాదు.

తవ చైవ గుణశ్లాఘీ పుత్ర ఉత్పత్స్యతే మహాన్ ।
అస్మద్వంశకర శ్శ్రీమాన్ సత్యమేతద్బ్రవీమి తే ॥

నీకును, శ్లాఘ్యగుణుడును, మనయొక్క వంశవర్ధనుడును నగు పుత్రుడు బుట్టగలడు. నీకు సత్యముగా చెప్పుచున్నాను.

ఋతుస్నాతా చ సాఽశ్వత్థం త్వం చ వృక్షముదుంబరమ్।
పరిష్వజేథాః కల్యాణి తత ఏవ మవాప్స్యథః॥

ఓ కల్యాణీ, ఋతుస్నానమొనర్చి, నీతల్లి రావిచెట్టును, నీవు అత్తిచెట్టును ఆలింగనము చేసికొనుడు. పిదప నీవిధముగా పొందగలరు.

చరుద్వయమిదం చైవ మంత్రపూతం శుచిస్మితే।
త్వం చ సా చోపభుంజీతం తతః పుత్రావవాప్స్యథః॥

పరిశుద్ధమగు చిరునగవు గలదానా! మంత్రములచే బవిత్రమైన నీ చరుద్వయము ( యజ్ఞార్థము వండినయన్నము) ను నీవు, మీ తల్లియు భుజించుడు. తదనంతరము పుత్రుల బొందగలరు.

తతస్సత్యవతీ హృష్టా మాతరం ప్రత్యభాషత।
యదృచీకేన కథితం తచ్చాచఖ్యౌ చరుద్వయమ్॥

తదుపరి సత్యవతి సంతసించి తల్లికి ఋచీకుడు జెప్పినదానిని చెప్పెను.

చరుద్వయమును గూర్చియు పలికెను.

తాముువాచ తతో మాతా సుతాం సత్యవతీం తదా।
పుత్రి పూర్వోపపన్నాయాః కురుష్వ వచనం మమ॥

అపుడు తల్లి పుత్రికయగు సత్యవతితో నిట్లు లనియెను. కుమారీ! పెద్ద దాననగు నేను చెప్పినట్లు చేయుము.

భర్త్రా య ఏష దత్త స్తే చరుర్మంత్ర పురస్కృతః।
ఏనం మహ్యం ప్రయచ్ఛ త్వం మదీయం త్వం గృహాణ చ॥

నీ భర్త మంత్రపూర్వకముగా ఏ చరువును నీ కిచ్చెనో, దానిని నాకిమ్ము, నాకొసంగిన దానిని నీవు గైకొనుము.

వ్యత్యాసం వృక్షయోశ్చైవ కరవావ శుచిస్మితే।
యది ప్రమాణం వచనం మమ మాతు రనిందితే॥

ఓ పరిశుద్ధాత్మురాలా ! తల్లినగు నాయొక్క వచనమున బ్రమాణము గలదేని, వృక్షములయందు గూడ మార్పు చేసుకొందము.

స్వమపత్యం విశిష్టం హి సర్వ ఇచ్ఛత్యనావిలమ్।
వ్యక్తం భగవతా చాత్ర కృతమేవం భవిష్యతి॥

అందరు తమ సంతానమును సదాచార సంపన్నముగాను, నిర్మలము గాను ఉండునటుల వాంఛింతురు. ఈ పూజ్యుడును నిశ్చయముగా నీ విధముగా చేసి యుండగలడు.

తతో మే త్వచ్చరౌ భావః పాదపే చ సుమధ్యమే।
కథం విశిష్టో భ్రాతా మే భవేదిత్యేవ చింతయ॥

అందుచే నీ చరువునందును, వృక్షమునందును నాకభిప్రాయము గలదు. సదాచార సంపన్నుడు నాకు సోదరుడెట్లగును? ఇట్లనియే చింతింపుము.

**తథా చ కృతవత్యౌ తే మాతా సత్యవతీ చ సా।**
**అథ గర్భావనుప్రాప్తే ఉభే తే వై యుధిష్ఠిర॥**

ఓ ధర్మరాజా! అట్లొనర్చిన ఆతల్లి బిడ్డ లిద్దరు గర్భవతులైరి.

**దృష్ట్వా గర్భమనుప్రాప్తాం భార్యాం స చ మహాన్ ఋషిః।**
**ఉవాచ తాం సత్యవతీం దుర్మనా భృగుసత్తమః॥**

భృగు కులవరేణ్యుడగు నా ఋషిపుంగవుడు భార్యయు, గర్భవతియును నగు నా సత్యవతిని జూచి కోపనుడై బలికెను.

**వ్యత్యాసేనోపయుక్త స్తే చరుర్వ్యక్తం భవిష్యతి।**
**వ్యత్యాసః పాదపే చాపి సువ్యక్తం తే కృత శ్శుభే॥**

నీ చరువు మార్చి యుపయోగింపబడినదని స్పష్టము గాగలదు. వృక్షమునందును నిశ్చయముగా మార్పొనర్చబడినది.

**మయాऽపి విశ్వం యద్బ్రహ్మ త్వచ్చరౌ సన్నివేశితమ్।**
**క్షత్రవీర్యం చ సకలం చరౌ తస్యా నివేశితమ్॥**

నీ చరువునందు ప్రపంచాత్మకమగు బ్రహ్మతేజస్సును, నీతల్లి చరువునందు సంపూర్ణమగు క్షత్రియ పరాక్రమము నుంచితిని.

**త్రైలోక్యవిఖ్యాతగుణం త్వం విప్రం జనయిష్యసి।**
**సా చ క్షత్రం విశిష్టం వై తత ఏతత్కృతం మయా॥**

ముల్లోకముల బ్రసిద్ధికెక్కిన గుణములు గల బ్రాహ్మణుడు నీకును,

అనన్యసాధారణుడగు క్షత్రియు డామెకు గలుగగలడు! అందుచేనే నిట్లొనర్చితిని.

**వ్యత్యాసస్తు కృతో యస్మాత్త్వయా మాత్రా చ తే శుభే।**
**తస్మాత్సా బ్రాహ్మణం శ్రేష్ఠం మాతా తే జనయిష్యతి॥**

నీవు, నీ తల్లియు చరుతరువులయెడ మార్పొనర్చితిరి. అందుచే నామెకు బ్రాహ్మణశ్రేష్ఠుడు పుట్టగలడు.

**క్షత్రియం తూగ్రకర్మాణం త్వం భద్రే జనయిష్యసి।**
**న హి తే తత్కృతం సాధు మాతృస్నేహేన భామిని॥**

ఓ శుభకరీ! ఘోరకృత్యములు గల క్షత్రియుని నీవు కనగలవు. తల్లి ప్రేమచే నాపుత్రకృతమగు మంచి నీకేమియు గలుగబోదు.

**సా శ్రుత్వా శోకసంతప్తా పపాత వరవర్ణినీ।**
**భూమౌ సత్యవతీ రాజంశ్ఛిన్నేవ రుచిరా లతా॥**

సత్యవతి యా వచనమును విని, దుఃఖముచే తపించినదై భేదింపబడిన మనోహరమగు తీగవలె భూమిపై బడెను.

**ప్రతిలభ్య చ సా సంజ్ఞాం శిరసా ప్రణిపత్య చ।**
**ఉవాచ భార్యా భర్తారం గాధేయీ భార్గవర్షభమ్॥**

ఆమె తెలివినొంది, శిరః ప్రణామం బొనర్చి భృగువంశశ్రేష్ఠుడును, ప్రాణనాథుడును నగు ఋచీకునితో బలికెను.

**ప్రసాదయంత్యాం భార్యాయాం మయి బ్రహ్మవిదాం వర।**
**ప్రసాదం కురు విప్రర్షే! న మే స్యాత్ క్షత్రియస్సుతః॥**

ఓ బ్రహ్మ విద్వరా! దుఃఖమును తొలగద్రోసికొన్న భార్యనగు నన్నను

గ్రహింపుము. క్షత్రియు డగు బిడ్డ నాకు వలదు.

**కామం మమోగ్రకర్మా వై పౌత్రో భవితు మ్మర్హతి।**
**న తు మే స్యాత్సుతో బ్రహ్మన్నేష మే దీయతాం వరః॥**

ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! ఘోరకృత్యములు గల మనుమడు గలుగు గాక! అట్టి పుత్రుడు మాత్రము నాకు వలదు. ఈ వరమును దయచేయుడు.

**ఏవ మస్త్వితి హూవాచ స్వాం భార్యాం సుమహాతపాః।**
**తత స్సా జనయామాస జమదగ్నిం సుతం శుభమ్॥**

ఆమహాతపస్వి అట్లేయగుగాక యని తన భార్యతో బలికెను. పిదప నామె మంగళకరుడగు జమదగ్ని యను బిడ్డను గనెను.

**విశ్వామిత్రం చాజనయద్గాధిభార్యా యశస్వినీ।**
**ఋషేః ప్రసాదాద్రాజేంద్ర బ్రహ్మర్షిం బ్రహ్మవాదినమ్॥**

ఓ రాజశ్రేష్ఠా! కీర్తిమంతురాలగు గాధిభార్య ఋచీకమహర్షి యను గ్రహమువలన బ్రహ్మర్షి యగు విశ్వామిత్రుని గనెను.

**తతో బ్రాహ్మణతాం యాతో విశ్వామిత్రో మహాతపాః।**
**క్షత్రియ స్సోఽప్యథ తథా బ్రహ్మవంశస్య కారకః॥**

తదుపరి విశ్వామిత్రుడు క్షత్రియుడయ్యును తపస్సంపన్నుడై బ్రాహ్మణత్వమును బొందెను. మఱియు నతడు బ్రాహ్మణ వంశమునకు కారకుడునయ్యెను – సత్యవతి తల్లి మనమున నిట్లాలోచించెను. ఋచీకమునికి తన భార్యయగు సత్యవతియందు ప్రీతి యెక్కువ యుండవచ్చును. అందువల్ల శ్రేష్ఠమంత్ర జపమొనర్చి ఆమెకు ప్రసాదమివ్వవచ్చును. అత్తయగు నాయందు భార్యయందు గల ప్రీతి యుండదని తలంచి తనకు మంచిపుత్రుడు

గలుగవలయుననెడి యభిలాషతో సత్యవతి ప్రసాదము తానున్నూ, తనప్రసాదము కుమార్తెయగు సత్యవతికిన్ని మార్చుకొనుటకు కారణమైనది. దీనివల్ల స్త్రీలయొక్క స్వభావము వ్యక్తమగుచున్నది. ఆమె తన స్వసుఖమునే చూచెను గాని కుమార్తెయొక్క క్షేమమైనా ఆలోచింపకపోయెను.

ఇక భృగుమహర్షి అనుగ్రహమువలన వీతహవ్యుడను రాజు బ్రాహ్మణత్వము బొందిన చరిత్రము వినుడు. ఆర్షభులు కర్మపరత్వముచేతను, విశ్వామిత్రుడు తపస్సుచేతను, వీతహవ్యుడు ఋభుమహర్షి యాశీర్వాదము వలనను బ్రాహ్మణత్వము నొందిరి. ఇందువల్ల బ్రాహ్మణత్వమునొందుటకు తపస్సైనను, కర్మానుష్ఠానపరత్వమైనను, మహాత్ముల యనుగ్రహమైనను చాలునని బోధపడుచున్నది.

*భారతము – ఆనుశాసనికపర్వము –*

వీతహవ్యుని చరిత్ర మిచట సంక్షిప్తముగా వ్రాయబడును. విస్తారముగా చూడదలంచిన వారు భారతమున కనదగును.

*యుధిష్ఠిర ఉవాచ: – ధర్మరాజు పలికెను*

**శ్రుతం తే మహదాఖ్యానమేతత్కురుకులోద్భవ ।**
**సుదుష్ప్రాపం యద్బ్రవీషి బ్రాహ్మణ్యం వదతాం వర ॥**

ఓకురుకు లోద్భవ! బ్రాహ్మణత్వము మిక్కిలి దుర్లభమైనది యను నీగంభీరోపన్యాసమును వింటిని.

**విశ్వామిత్రేణ చ పురా బ్రాహ్మణ్యం ప్రాప్త మిత్యుత।**
**శ్రూయతే వదసే తచ్చ దుష్ప్రాపమితి సత్తమ॥**

సత్పురుష శ్రేష్ఠా! పూర్వము విశ్వామిత్రుడు బ్రాహ్మణత్వము పొందెనని వినుచున్నాను. మఱియు నది దుర్లభమని సందేహించుచున్నావు.

**వీతహవ్యశ్చ నృపతిః శ్రుతో మే విప్రతాం గతః।**
**తదేవ తావద్గాంగేయ శ్రోతుమిచ్ఛామ్యహం విభో॥**

ఓ గంగాపుత్రా! వీతహవ్యుడను రాజు బ్రాహ్మణత్వము నొందెనని యాకర్ణించితిని. దానినే వినగోరుచున్నాను.

**స కేన కర్మణా ప్రాప్తో బ్రాహ్మణ్యం రాజసత్తమః।**
**వరేణ తపసా వాఽపి తన్మే వ్యాఖ్యాతు మర్హసి॥**

ఆ రాజశ్రేష్ఠు డేకర్మచే బ్రాహ్మణుడాయెను? వరముచేతనా? లేక తపస్సుచేతనా? దాని నుపన్యసింపుడు.

భీష్మ ఉవాచ :– భీష్ముడు పలికెను.

**శృణు రాజన్యథా రాజా వీతహవ్యో మహాయశాః।**
**రాజర్షిర్దుర్లభం ప్రాప్తో బ్రాహ్మణ్యం లోకసత్కృతమ్॥**

ఓ ధర్మరాజా! గొప్పకీర్తిమంతుడగు వీతహవ్యుడను రాజర్షి దుర్లభము, లోకపూజ్యమును నగు బ్రాహ్మణత్వము నెట్లు బొందెనో యాకర్ణింపుము.

**మనోర్మహాత్మన స్తాత! ప్రజా ధర్మేణ శాసతః।**
**బభూవ పుత్రో ధర్మాత్మా శర్యాతి రితి విశ్రుతః॥**

ఓ నాయనా! ధర్మబద్ధముగా ప్రజల బరిపాలించు మహాత్ముడైన మనువునకు ధర్మాత్ముడును, లోక ప్రసిద్ధుడునునగు శర్యాతియను పుత్రుడుండెను.

**తస్యాన్వవాయే ద్వౌ రాజన్ రాజానౌ సంబభూవతుః।**
**హైహయ స్తాలజంఘశ్చ వత్సస్య జయతాం వర॥**

ఓ ధర్మరాజా! ఆ శర్యాతి వంశమున, హైహయుడు, తాలజంఘుడు అను నిద్దరు రాజులు గలిగిరి.

హైహయస్య తు రాజేంద్ర దశసు స్త్రీషు భారత।
శతం బభూవ పుత్రాణాం శూరాణా మనివర్తినామ్॥
తుల్యరూప ప్రభావానాం బలినాం యుద్ధశాలినామ్।
ధనుర్వేదే చ వేదే చ సర్వత్రైవ కృతశ్రమాః॥

ఓ భరతవంశోద్భవా! హైహయునకు పదుగురు భార్యలయందు నూర్గురు కొమరులు జనియించిరి. వారు శూరులు, సమానమగు రూపము ప్రభావమును గలవారు, బలవంతులు, సంగ్రామ నిపుణులు, ధనుర్వేదమునందు, వేదమునందు, మఱియు నన్నిటియందు పరిశ్రమము సలిపినవారలు.

కాశిష్వపి నృపో రాజన్ దివోదాసపితామహః।
హర్యశ్వ ఇతి విఖ్యాతో బభూవ జయతాం వరః॥

ఓ ధర్మరాజా! కాశీదేశములయందు, వీరశ్రేష్ఠుడై హర్యశ్వుడు అని మిక్కిలి ప్రసిద్ధిజెందిన దివోదాసుని పితామహుడగు రాజుండెను.

ఈ కథాసారమేమనగా, వీతహవ్యుని కొమరులు హర్యశ్వుని యుద్ధములో వధించిరి. హర్యశ్వుని పుత్రుడగు సుదేవుడు రాజ్యమునకు వచ్చెను. అపుడు వీతహవ్యుని పుత్రులు సుదేవుని యుద్ధములో వధించి సైన్యముల నన్నింటిని నశింపజేసిరి. అనంతరము సుదేవుని పుత్రుడగు దివోదాసుడు రాజ్యము నేలుచుండెను. అప్పుడు కూడ పైన జెప్పినవారేతించి, యుద్ధములో దివోదాసుని తప్ప మిగిలినవారి నందరిని నశింపజేసిరి. దివోదాసు డొంటరియై యేమియు తోచక శ్రీభరద్వాజ మునిని శరణు బొందెను. పరమకారుణికుడగు నమ్మునివరుండు దివోదాసున కభయమిచ్చి, యజ్ఞము నొకదానిని ఒనర్చి అందు ప్రతర్దనుడను మహాశూరుని గనెను. ఆ ప్రతర్దనుడు దైవానుగ్రహమును, ఋషి

ఆశీర్వాదము గలవాడగుటచే, దివ్యశక్తులన్నియు గలుగుట వలన వీతహవ్యుని రాజ్యమునకు వెళ్ళి యతని కుమారుల నందరిని యుద్ధములో విలయము నొందించుటచే, వీతహవ్యుడు భృగుమహర్షి కడకేగి యమ్మునిశ్రేష్ఠుని శరణు బొందెను.

**యయౌ భృగుం చ శరణం వీతహవ్యో నరాధిపః।**
**అభయం చ దదౌ తస్మై రాజ్ఞే రాజన్ భృగు స్తదా॥**

ఓ ధర్మరాజా! పుత్రులందరు మరణింపగా వీతహవ్యుడు నగరమును విడిచి భృగుమహర్షి యాశ్రమమునకు వెళ్ళెను. మఱియు నతడు భృగుమహర్షిని శరణు బొందెను. అప్పుడు భృగుమహర్షి యా రాజునకు నభయ మొసగెను.

**అథానుపదమేవాశు తత్రాగచ్ఛ త్ప్రతర్దనః।**
**స ప్రాప్య చాశ్రమపదం దివోదాసాత్మజో౽బ్రవీత్॥**
**భో భో కే౽త్రాశ్రమే సంత భృగో శ్శిష్యా మహాత్మనః।**
**ద్రష్టు మిచ్ఛే మునిమహం తస్యాచక్షత మామితి॥**

పిదప ప్రతర్దనుడు శీఘ్రముగా నతని వెంబడించి యచటికి వెళ్ళెను. అతడాయాశ్రమ ప్రాంత ప్రదేశమును బొంది మహాత్ముడగు ఓ! భృగుమహర్షి శిష్యులారా! ఈ యాశ్రమమున నెవరున్నారు. భృగుమహర్షిని చూడదలంచుచున్నాను. ఆయనకు నన్నెరింగింపుడు అని పలికెను.

**స తం విదిత్వా తు భృగు ర్నిశ్చక్రామాశ్రమాత్తదా।**
**పూజయామాస చ తతో విధినా నృపసత్తమమ్॥**

ఆ భృగుమహర్షి యా ప్రతర్దను నెఱిగి యాశ్రమమునుండి రాజు కడకు బయలు వెడలెను. పిదప శాస్త్రోక్తముగా నారాజ శ్రేష్ఠుని గౌరవించెను.

ఉవాచ చైవం రాజేంద్ర కిం కార్యం బ్రూహి పార్థివ!।
స చోవాచ నృప స్తస్మై తదాగమన కారణమ్॥

ఓ రాజోత్తమా! ఆగమన కార్యమేమిటి? తెలుపుము-అని పలికెను. ఆ రాజు తన రాకడకు కారణమును ఆయనకెఱింగించెను.

రాజోవాచ :- రాజు పలికెను.

అయం బ్రహ్మ న్నితో రాజా వీతహవ్యో విసర్జ్యతామ్।
తస్య పుత్రైర్హి మే కృత్స్నబ్రహ్మన్వంశః ప్రణాశితః॥
ఉత్సాదితశ్చ విషయః కాశీనాం రత్నసంచయః।
ఏతస్య వీర్యదృప్తస్య హతం పుత్రశతం మయా॥

ఓ బ్రాహ్మణవర్యా! వీతహవ్యుడను రాజిటనుండి విడిచి పెట్టబడుగాక! అతని పుత్రులచే నా వంశమంతయు నశింపజేయబడినది. కాశీదేశపు రత్న సమూహములు హరింపబడినవి. ఇట్టి యితనియొక్క నూరుగురు కొమరులు నాచే మారణమొనర్పబడిరి.

అస్యేదానీం వధాదద్య భవిష్యామ్యనృణః పితుః।
తమువాచ కృపావిష్టో భృగు ర్ధర్మభృతాం వరః।
నేహాస్తి క్షత్రియః కశ్చి త్సర్వే హి మే ద్విజాతయః॥

ఇతనిని జంపి పితృఋణ విమోచన మొనర్తును అని యా ప్రతర్దనుడు పలికెను. అతనితో ధార్మికశ్రేష్ఠుడగు భృగుమహర్షి కరుణాపూరిత హృదయుడై యిచట క్షత్రియు డొకడును లేడు. వీరందఱు బ్రాహ్మణులే యని పలికెను.

ఏతత్తు వచనం శ్రుత్వా భృగో స్తథ్యం ప్రతర్దనః।
పాదా వుపస్పృశ్య శనైః ప్రహృష్టో వాక్యమబ్రవీత్॥

ఏవ మప్యస్మి భగవన్ కృతకృత్యో న సంశయః।
య ఏష రాజా వీర్యేణ స్వజాతిం త్యాజితో మయా॥
అనుజానీహి మాం బ్రహ్మన్ ధ్యాయస్వ చ శివేన మామ్।
త్యాజితో హి మయా జాతి మేష రాజా భృగూద్వహ॥

ప్రతర్దనుడు భృగుమహర్షి యొక్క సత్యవచనమును విని మెల్లగా నతని యడుగులకెరగి, సంతోషావిష్ట హృదయుడై, యో పూజ్యుడా! నా పరాక్రమముచే నీరాజును స్వీయమగు క్షత్రియ జాతిని విడిచిన వానినిగా జేసితిని. ఈ విధముగను కృతకృత్యుడ నే నైతిని. సందేహము లేదు. నాకనుజ్ఞ నిమ్ము. శుభము ననుగ్రహింపుము. ఈ రాజు నాచే స్వీయజాతిని విడిచి పెట్టింపబడెగదా యని పలికెను. అనగా కరుణార్ద్రహృదయుడగు భృగుమహర్షి వీతహవ్యుని బ్రాహ్మణునిగా జేసెను.

తత స్తేనాభ్యనుజ్ఞాతో యయౌ రాజా ప్రతర్దనః।
యథాగతం మహారాజం ముక్త్వా విష మివోరగః॥

పిదవ ప్రతర్దనుడు భృగుమహర్షిచే ననుజ్ఞాతుడై సర్పము విషమును వలె నా రాజును విడిచి వచ్చిన మార్గమున బోయెను.

భృగో ర్వచనమాత్రేణ స చ బ్రహ్మర్షితాం గతః।
వీతహవ్యో మహారాజో బ్రహ్మవాదిత్వమేవ చ॥

ఓ ధర్మరాజా! భృగుమహర్షి యొక్క వాక్యమాత్రముచే, వీతహవ్య మహారాజు బ్రహ్మర్షిత్వము, బ్రహ్మవాదిత్వమును బొందెను.

బ్రా:– జీవదయాపరా! మీరు జెప్పినవన్నియు యుక్తియుక్తముగాను, శాస్త్ర సమ్మతముగాను ఉంటున్నవి. శాస్త్రవిరుద్ధమైన ఒక్క వాక్యమునై నను చెప్పియుండలేదు. అయితే, యీ వచనము లన్నియు కలియుగ మహిమ యనియే

నాతో నా మిత్రు లనేకులు తెలిపిరి. లేనిచో అనాదినుండి వచ్చుచుండు బ్రాహ్మణాది నాలుగు జాతులున్ను, నేటివరకు కులము ననుసరించి వచ్చుచుండగా, ఇపుడు సనాతనమగు కులమునకు ఆధిక్యము లేదనియు, గుణమునకే యాధిక్య మనియు చెప్పెడు కాలము వచ్చినది. ఇదంతయు కాలమహిమ యని తలంచి సజ్జను లందరు ఊరక యుండవలసి వచ్చినది.

ఆ:– ఆత్మమిత్రమా! సత్యాసత్యములను విమర్శించి, గ్రహించశక్తిగల మీరే, యీలాగునచెప్పిన ఇక శాస్త్రజ్ఞానమున్ను, లోకజ్ఞానమున్ను తెలియనివారిని గురించి యేమి చెప్పవలయును? నేను ఇదివరలో చెప్పినదానిలో శాస్త్రమునకున్ను, యుక్తికిన్ని, అనుభవమునకున్నూ విరుద్ధముగా నొక్క వాక్యము నైనా చెప్పియుంటినా! మహాజనసముదాయములో కొద్దిమంది మాత్రముగానుండు సంఘముయొక్క అనుకూలమును జూచి, తక్కిన మహాజన సముదాయమును పాడుచేయుట తగునా? అంతేగాక, ఒకవేళ నది సత్యముతో గూడినదైనచో కొంతవరకైనా అనుకరింపవచ్చును. సత్యదూరమై, అసత్యభూయిష్ఠమై, ధర్మవిరుద్ధమై, సచ్ఛాస్త్ర నిందితమై, దైవాజ్ఞకు విరుద్ధమై లోకక్షయకరమైయుండు దానిని ఏలాగున సత్యాన్వేషకులు అనుకరింపగలరు? మరియు లోకక్షయము గలిగిన ప్రస్తుతము అనుకూల మేర్పడిన జాతి గూడ నశింపవలసియుండును. గోడపడిపోయిన ఆ గోడలో చిత్రించిన చిత్ర మెట్లు శిథిలముగాక పోవును? ఆలాగున రాజ్యము లేనిచో జాతి యెట్లు నిలువగలుగును? మరియు సత్యముకాని స్థాపితములన్నీ మొదట అనుకూలముగా నుండునట్లు తోచినను, వెనుకటికది విషము గలిసిన క్షీరాన్నమును భుజించినట్లుండును. మరియు గుణము ననుసరించి సర్వజనులకున్ను అధికారము జేయుడమైనదికదా! అట్లు గుణముగలిగి యుండువారందరికిన్ని సమాన సత్యములేనిచో మాత్రమే పక్షపాతదోషము గలుగును. గుణమునకాధిక్యము నివ్వకపోయిన, కులమునకాధిక్యత యిచ్చిన, కులమునకు తగిన యోగ్యత సంపాదింపకపోవుటచే మరల సంకటమున

కవకాశము గలుగును. ఒకని తండ్రి నున్నతోద్యోగము గలిగియుండిన పుత్రుడు గూడ యున్నతవిద్య నభ్యసించి యుండిన, తండ్రి యనంతరము ఆ యుద్యోగమున కర్హుడగును. అట్లు కానిచో తండ్రి యనంతరము కుటుంబముక్లేశము నొందవలసి యుండును గదా! మరియు కులమున కాధిక్యము నిచ్చి, గుణమున నుండవలసియుండు యాధిక్యమును కప్పుపుచ్చిన, లోపల వ్రణము గలిగియున్నను, పైన మాత్రము వ్రణ మారుటకు మందు పూసినట్లుండును. అది మరియొక ప్రక్క వ్రణమును తప్పక కలిగించునట్లుండును. మరియు కోర్టులో హాజరు కావలసినదానికి సమను వచ్చినచో ఆ సమను తెచ్చిన జవానున కేదో యిచ్చి కర్త యగు మనుజుడు లేడని, వ్రాసికొని పోయినను కొద్దిరోజుల కాసమను మరియొక విధముగా తప్పక వచ్చును జాతియొక్క సత్యమున్ను ఆలాగున నుంటున్నది. జాతిని గురించి యిదివరలో అనేక బుద్ధిమంతులు వాద ప్రతివాదములు జరుపుచునే వచ్చిరి. ఇందువల్లనే అనేక మతము లేర్పడుటకు కారణము. దీనివల్ల హిందూమతముయొక్క బలము చాల వఱకు తగ్గిపోయినది. మహా విస్తీర్ణమై మంచి పత్రపల్లవములచే నీడ గలిగి, ఫల, పుష్పములచే, శోభాయమానమైయుండు వృక్షము యొక్క అనేక శాఖలను నఱికివేసిన ఆ వ్రాను ఏలాగున దుర్బలమై, జనసముదాయమునకు సంరక్షణ జేయశక్తి లేనిదగుచున్నదో, భారత జాతియొక్క స్థితియు నాలాగుననే సంభవించినది. ప్రతి సంవత్సరములోను వేలకొలది హిందువులు మత స్వాతంత్ర్యము లేనందుచే క్రైస్తవ, మహమ్మదీయ మతములలో జేరుచున్నారు. ఇందువల్లనే ఆ జాతులు వృద్ధియై, హిందువుల నరికట్ట సమర్థము లగుచున్నవి. ముస్లిములీగున్ను, క్రైస్తవ మిషన్లున్ను దీనికి తార్కాణము. ఈ సంగతి యెఱింగియే సనాతనమగు భారతీయ మతము నశింపగూడదని తలంచి ఆర్యసమాజమున్ను, బ్రహ్మసమాజమున్ను ఏర్పడుటకు కారణమైనది. ఈ ద్విమతములలో నార్యమతము మరింత పరిశ్రమ జేసినందుచే, ఇంతమాత్రమైనను సనాతన ఋషుల పుణ్యమతమగు హిందూమతము నశింపక సజీవత్వము గలిగియుండుటకు కారణమైనది. తమ మతమును సంరంక్షించుటలో

సనాతులమని చెప్పువారు ఏదైన ప్రయత్నమును చేయుచున్నారా? ఉపన్యాస వేదికలపై నుండి గంభీరముగా నుద్ఘోషించినను పత్రికలలో, విపులముగా వ్రాసినను, గ్రంథములను విస్తారముగా వ్రాసినను ఏమి ప్రయోజనము? ఆచరణలేని వాక్యములన్నియు లోభాగమున విత్తనము లేని వట్టిపొట్టువంటివిగదా! మంచిమంచి భోజనముల పేర్లు జెప్పిన ఆకలి శమియించునా? ఔషధ మాహాత్మ్యమును గురించి స్తుతించిన వ్యాధి శాంతించునా? కార్యరంగములో త్యాగమొనర్చి పనిచేసిన మాత్రముగదా ప్రయోజనము గలుగును. ఈ విషయమై సనాతనులమని చెప్పువారు నడిపెడు ఒక్క సంస్థయైనా గలదా? అపరిష్కృతులగు జాతులను, నిమ్నస్థితిలో నుండుజనులను నుద్ధరించుటకు ఒక్క స్థాపనయైనా నేటివరకేర్పరచిరా యేమి? భారతీయ సంస్థానములలో ధనము లేదా! భారతీయులలో తగిన పండితులు లేరా! భారతజనావళిలో ధనము లేదా! అన్నియు సమృద్ధి గలిగి యుంటున్నవి. ప్రవర్తించువారు మాత్రము లేరు. దానికి జాతియే గొప్ప ఆటంకము. ఈలాగున నుండినచో కొంతకాలమునకు వీరే తెలిసికొనెడు కాల మాసన్న మగును. ఇపుడే దానియొక్క రుచి కొంచెము కొంచెముగా తెలిసికొనుచున్నారు. స్వరాజ్య విషయమై పాశ్చాత్యామాత్య ప్రభృతులు, రాజప్రతినిధులు ఏమి చెప్పుచున్నారో, దానిని కొంత జాగ్రత్తతో పరిశీలించిన గొప్ప మేధాశక్తి లేనివారికి గూడ అర్థమగును. పశ్చిమదేశ మంత్రి ప్రముఖులు చెప్పెడు మహావాక్య మేమన, భారతీయులగు మీకు ఐక్యమత్యము లేదు. మీ దేశములో కలగూరగంపలవలె అనేకజాతు లేర్పడి ఒక్కొక్కరికిన్ని సంబంధము లేక మేమే గొప్పకులము గలవారము, మాకే యాధిక్య ముండవలయును గాని యితరుల కర్హతలేదు అని వాదించుటయే, స్వాతంత్ర్యరాహిత్యమునకు కారణమని చెప్పుట లేదా? మరియు ఒక్కొక్క జాతియు వారివారి సౌఖ్యము చూచుకొన్నారేగాని దుశముయొక్కయు, సర్వజనులయొక్కయు సౌభాగ్యమును యిచ్ఛయించుట లేదు. అందువల్ల మీరు స్వరాజ్యమున కర్హులు గారని చెప్పుచున్నారు. మిత్రమా! యథార్థముగా విచారించిన దీనికన్న మించిన వేదవాక్యమేమిగలదు? దైవకృపవల్ల, మహర్షుల

యనుగ్రహమువల్ల ఈ సత్యమును వర్తమానకాల మేధాసంపత్తి గలవారు ఎరింగియే, సర్వజన సమత్వము గుణము ననుసరించి యుండవలయునని చెప్పుటకు కారణము. ఇది సత్యమగుటచే త్వరలోనే అట్టికాలమును జూడగలము. ఇదివరలో గుణమును గురించియే నాలుగు వర్ణము లేర్పడినవని తెలిపినట్లు, సత్యాదిగుణముల బట్టియే నాలుగు యుగములు గూడ ఏర్పడినవని శాస్త్రములో నిగూఢమైయుండు రహస్యమును చూడుడు. మన్వాది పురాతన శాస్త్రములలో నాలుగు యుగములు, కాలమును గురించి గలుగుచున్నవని చెప్పక, జీవుల గుణముల ననుసరించి యేర్పడినవని తెలుపడమైనది.

కలిః ప్రసుప్తో భవతి స జాగ్రద్ద్వాపరం యుగమ్।
కర్మస్వభ్యుద్యతస్త్రేతా విచరంస్తు కృతం యుగమ్॥

ఎవనియొక్క ఆత్మ సుషుప్తిని పొందియుండునో, అతని కది కలియుగమై యుండును. లేక అజ్ఞానము, ఆలస్యము మొదలగు తమోగుణములచే ఎవడు ప్రయత్నహీనుడైయుండునో అపుడతనికది కలియుగము. ఎపుడు కొంచెము కొంచెముగ ఆత్మ జాగ్రదవస్థకు వచ్చునో అపుడతనికది ద్వాపరయుగ మగును. లేక సోమరితనము నణచి యెపుడు సత్ప్రవర్తనోద్యముడగునో అదిన్ని ద్వాపరయుగము యొక్క గురుతుగానుండును. ఎపుడు ఆత్మయొక్క పరోక్ష జ్ఞానము గలుగునో అపుడది అతనికి త్రేతాయుగమగును; లేక యెపుడు తాను చేయవలసిన కృత్యములన్నిటిని కొంచెమైనను విడువక చేయవలయునని ధృఢ సంకల్పము గలిగి ప్రవర్తించునో అతనికదిన్ని త్రేతాయుగమనబడును. ఎపుడు కృతకృత్యము గలిగి కృతార్థుడై దైవజ్ఞాన మపరోక్షముగాగల్గునో అపుడతనికది కృతయుగ మనబడును. లేక చేయవలసిన కార్యములన్నియు కొంచెమైనను విడిచిపెట్టక బహు జాగరూకతతో చేయుచూ దానియొక్క ఫలముపొంది యానందించుచుండునో అపు డతనికది కృతయుగ మనబడును.

**కృతం త్రేతాయుగం చైవ ద్వాపరం కలి రేవ చ।**
**రాజ్ఞో వృత్తాని సర్వాణి రాజా హి యుగముచ్యతే॥**

కృతయుగమనియు, త్రేతాయుగమనియు, ద్వాపరయుగమనియు కలియుగమనియు చెప్పినవన్నియు పైజెప్పిన మనుషునియొక్క ప్రవర్తన ననుసరించి యుండును. రాజుయొక్క ప్రవర్తన ననుసరించియే యుగమేర్పడును. కావున నాలుగు యుగములకున్ను రాజే కారణముగాని మరియొకటి గాదు. అనగా పై శ్లోకమున చెప్పినట్లు ప్రభువు ప్రవర్తించి ప్రజలచేత ప్రవర్తింప చేయవలయునని యర్థము. ఓహో! ఎంత సుందరమైన యర్థము. దీని నాలోచింపక పురుషప్రయత్న హీనులై, జడప్రాయులై కేవలము కాలమునకు మాత్రము అధీనులై కాలాను గుణముగ కర్మల చేయక కలియుగము కలియుగమని చెప్పుచుండిన, ఏమి ప్రయోజనము? ఇది యుగమును గురించి ఒక్క విధముగా దెలుపడమైనది. మరియొక విధముగా మాఘపురాణమునందు చెప్పినది చూడుడు.

**పురా కృతయుగే రామ బ్రాహ్మణా వై తపస్వినః।**
**అబ్రాహ్మణస్తతో రాజన్న తపస్వీ కథంచన॥**
**త్రేతాయుగే వ్యవర్తంత బ్రాహ్మణాః క్షత్రియాశ్చ యే।**
**తపోఽ తప్యంత తే సర్వే శుశ్రూషామపరే జనాః॥**
**తతోద్వాపర సంజ్ఞాతే, తపో వైశ్యాణ సమావిశేత్।**
**యుగేషు త్రిషు రాజేంద్ర! ధర్మం చక్రుర్ద్విజాతయః।**
**భవితా శూద్ర యోన్యాం హి తపశ్చర్యా కలౌ యుగే॥**

ఓ రామచంద్రా! పూర్వము కృతయుగమునందు బ్రాహ్మణులు మాత్రము తపస్సు చేయుచుండిరి. ఓరాజా! బ్రాహ్మణులు కాని వారలు కృతయుగమునందు ఒకానొకపుడు గూడ తపస్సు చేయునది లేదు. త్రేతాయుగమునందు బ్రాహ్మణులు క్షత్రియులుగూడ తపస్సుచేయుచుండిరి. మిగిలినవారందరున్ను ఆ తపము చేయువారికి శుశ్రూష చేయుచుండిరి. తరువాత ద్వాపర యుగమునందు

వైశ్యులుగూడ తపము చేయుచూవచ్చిరి. అనగా బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులుగూడ తపము జేయుచుండిరి. ఓ రాజశ్రేష్ఠుడా! ఈవిధముగా మూడు యుగములయందును ద్విజులగు బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులు ధర్మము జరుపుచుండిరి. కలియుగమునందు శూద్ర యోనులయందు పుట్టినవారుగూడ తపము చేయుదురు. ఈ ఋషుల వాక్యములపై నాధారపడి చూచినను కలియుగమున శూద్రులుగూడ తప స్స్వాధ్యాయాది బ్రహ్మధర్మములు గలిగియుందురని స్పష్టమగుట లేదా! ఇకయేల ప్రవృత్తిరహితులై కేవలము ప్రకృతికిలోనై, పురుషప్రయత్నహీనులై, యుగము యుగమని చెప్పుచూ ఎందులకు కాలము వ్యర్థపరచవలయును? కేవలము ఇట్టి చైతన్య రహితములగు వాక్యములకు లోబడి ధర్మానుష్ఠానము చేయుటకు సంకల్పమైన గలుగని జడావస్థలోనికి భారతీయులు వచ్చిచేరిరి. ఈ దేశములో మాత్రమే యిట్టి యుగముల వ్యవహారము గలదుగాని యితర విదేశాది దేశములలో ఈవ్యవహారము లేదు. కావుననే వారు ప్రయత్నపరులై యున్నతస్థితికి రాగల్గిరి.

ఇక శ్రీమద్భాగవతమున యుగమును గురించి చెప్పినది చూడుడు.

ద్వాపరాంతమున కలి ప్రవేశించెను. పరీక్షిన్మహారాజుతో తనకు స్థలము ఇవ్వవలయునని అడిగినపుడు నాలుగు స్థానములు మాత్రమే కలి మహారాజు ప్రభుత్వము చేయుటకు పరీక్షిన్మహారాజుచే నొసంగబడినవి. ఆ స్థానము లెవ్వియో చూడుడు.

**అభ్యర్థితస్తదా తస్మై స్థానాని కలయే దదౌ।**
**ద్యూతం పానం స్త్రియ స్సూనా యత్రాధర్మశ్చతుర్విధః॥**

అర్థింపబడిన, అతని కొఱకు నాలుగు స్థానములు పరీక్షిన్మహారాజుచే నివ్వబడెను.

1. జూదమాడే స్థలములో నీ ప్రభుత్వమును స్థాపించి జూదరులు

మొదలగువారికి ప్రభువుగా నుండుము.

2. మద్యపానము చేయువారి ప్రాంతమున నీ సంస్థానము నెలకొల్పి అట్టి మత్తువస్తువుల సేవింపువారిపై మహారాజుగారైయుండి పాలించుము.
3. దుర్వృత్తిగల స్త్రీలు నివసించు ప్రదేశమున నీరాజ్యము స్థిరపరచి అట్టి దుష్టస్త్రీలకు ప్రభువైయుండి పాలనము జేయుము.
4. ప్రాణిహింసకులు నివసించు దేశములో రాజ్యము స్థాపించి వారిని పాలించుచుండుము.

జనులారా! కలిమహారాజు పాలనస్థానములను విన్నారా? కావున ఓజనులారా! మీలో ఎవరైనా జూదరులున్నారా? మద్యపానీయులున్నారా? మహర్షిసంతతిలో జన్మించిన పుణ్యాత్ము రాండ్రగు సోదరీమణులారా! మీలో ఎవరైనా దుష్టవర్తన గలిగియున్నారా! మనుజులారా! మీలో ఎవరైనా ప్రాణిహింస జేసెడి క్రూరులైయున్నారా! అట్లయినమాత్రమే మిమ్ములను కలి బాధించును. కలియొక్క ప్రభుత్వము నడిపెడు పాపముగూడ మీదగ్గర చేరును. అట్లుగాక ఎచట పతివ్రత గుణములుగల స్త్రీలుందురో! ఎచ్చోట ఏకపత్నీవ్రతుడగు పురుషు డుండునో, ఎచ్చట ధర్మానుష్ఠానముగల మనుజుడుండునో, ఎచ్చట భగవద్భక్తు డుండునో, ఎచ్చట దయార్ద్ర హృదయు లుందురో, అచ్చటికి కలిగాని, అతని యొక్క యుద్యోగులగు పాపములుగాని దగ్గరనైనా చేరగూడదనెడి శాసనముపైన కలికి పరీక్షిన్మహారాజు రాజ్యము నప్పగించియున్నారు. ఈ సత్యమును తెలిసికొనమియే సత్ప్రవర్తనకైన జనులు ప్రవేశింపకుండుటకు కారణమైనది. ఈలాటి ధర్మములను ప్రపంచములో బోధించెడు త్యాగశీలురగు బుద్ధిమంతులు, సంయములగు యతులు లేకపోయినందుచేతనే యీజనమింత అంధకారమున బంధింపబడెను.

ఎవనియొక్క మనస్సు కల్మషమై యుండునో అత డన్ని యుగములలోను, కలియుగమునందుండువాడే. ఎవనియొక్క మనస్సు నిర్మలమైయుండునో అత

డన్ని యుగములలోను కృతయుగమునందుండువాడు.

4. ఇకను వినుడు. శాస్త్రసారము తెలిసికొనుడు.

ప్రభూతంచ యదా సత్త్వం మనోబుద్ధీన్ద్రియాణి చ।
తదా కృతయుగం విద్యాత్ దానే తపసి యద్రతిః॥
యదా కర్మసు కార్యేషు శక్తిర్యశసి దేహినామ్।
తదా త్రేతా రజోవృత్తి రితి జానీహి శౌనక॥
యదా లోభస్త్వసన్తోషో మానో దమ్భోఽథ మత్సరః।
కర్మణాం చాపి కామ్యానాం ద్వాపర స్తద్రజస్తమః॥

ఎపుడు సత్త్వగుణము గలిగియుండి, మనస్సు, బుద్ధి మొదలుగా గల అన్తరిన్ద్రియములును, బాహ్యేన్ద్రియములును పరిశుద్ధములగునో, అపుడు అతనిని కృతయుగమునందున్న వానినిగా దెలియవలయును. అట్టి పురుషుడు కృతయుగమువాడగును. వానికి కృతయుగ ధర్మములగు సత్యము, దానము, తపస్సు స్వభావములై యుండును. ఓ శౌనకుడా! ఏ పురుషులు సత్కర్మలాచరించుటలోను, స్థిరమగు యశస్సును బడయుటలోను ధృఢప్రయత్నము గలవారగుదురో అట్టివారిని త్రేతాయుగ ధర్మమగు రజోగుణము గలవారినిగా దెలిసికొనవలయును. దీని భావమేమన? రజోగుణము త్రేతాయుగ ధర్మమనియు, పై జెప్పిన గుణములు రాజసులకు స్వభావములనియు దెలియవలయును. ఇక రజస్తమోగుణముల సాంకర్యము జెప్పబడుచున్నది. రజస్తమస్సుల సమ్మేళనమే ద్వాపరయుగమని తెలియదగినది. ఎపుడు లోభము, అసంతుష్టి, అభిమానము, దంభము ( ఆత్మస్తుతి) మాత్సర్యము, కామ్యకర్మల జేయుటలో ప్రీతియు, ఇతర రజస్తమోగుణములవలన గలుగునో, అపుడు ద్వాపర యుగమని తెలియవలయును. ఇట్టివారు రాజస, తామస గుణముల గలిగి ద్వాపరయుగమున నుండువారని తెలియదగినది.

**యదా సదాఽనృతం తంద్రా నిద్రా హింసాది సాధనమ్।**
**శోకమోహభయం దైన్యం స కలిస్తు తదా స్మృతః॥**

అసత్యము, అలసట (సోమరితనము) అతినిద్ర, పరుల హింసించుటాదిగాగల దుష్కర్మముల జేయుట, అందులకై యుపాయముల వెదకుట, శోకము, మోహము, భయము, దీన స్వభావము – ఎపుడు ఇవన్నియు సర్వదా స్వభావములై యుండునో అదియే కలియుగమనియు, అట్టివారు కలియుగములోనివారనియు తెలియదగును.

**సత్త్వం కృతం రజస్త్రేతా ద్వాపరం చ రజస్తమః।**
**కలిం తమస్తు విజ్ఞేయం యుగవృత్తం యుగేషు చ॥**

నాలుగు యుగములలోను నాలుగు యుగములు గలవు. ఈక్రింద కనబఱచిన గుణముల గ్రహించిన ఆయా యుగములలోగల మనుజాని కనిపెట్టవచ్చును. ఇదే యుగముల యొక్క రహస్యము. సత్వగుణముగలవాడు కృతయుగ మందుండువాడనియు, రజోగుణముగలవాడు త్రేతాయుగమునం దుండువాడనియు, రాజస, తామస గుణము గలవాడు ద్వాపరయుగమం దుండువాడనియు తెలయదగినది. కేవలము తమోగుణముగలవాడు కలియుగ మునందుండువాడనియు నెరుంగవలయును. ఈ గుణముల ననుసరించియే యుగముల యొక్క భేదగతులన్నిటిని జనులకు చక్కగ బోధించు వారుండినచో లోకమెంత బాగుపడగలదు! సత్యము నెందరో గ్రహింపగలరు.

5. ఇక భారతమున యుధిష్ఠిరుడు భీష్ముని యుగవిషయమై అడిగినదిన్ని, దాని సమాధానమున్ను గ్రహించుకొనుడు.

**కాలో వా కారణం రాజ్ఞో రాజా వా కాలకారణమ్।**
**ఇతి తే సంశయో మాభూత్ రాజా కాలస్య కారణమ్॥**

యుధిష్ఠిరు డడిగెను.

ఓ పితామహా! కాలముచే రాజ్యమునకున్ను, రాజునకున్నూ, ప్రజలకున్ను మార్పుగలుగుచున్నదా? లేక రాజుచేతను, రాజ్యముచేతను, ప్రజలచేతను, కాలము మార్పు నొందుచున్నదా? దీనికి భీష్ముడు చెప్పినది చూడుడు. ఓ ధర్మరాజా! ఈ విషయమై మీకు సందేహము వద్దు. రాజ్యముచేతను, రాజుచేతను, కాలమునకే మార్పు గలుగుచున్నది. ఈ ప్రశ్న చాలా గొప్పది. కృత, త్రేతా, ద్వాపర, కలియుగముల మహిమచే జనుల మనస్సునకు యుగ మార్పు గలుగుచున్నదా? లేక సత్త్వ రజస్తమో గుణములచే, జనులకు నాలుగు యుగముల మార్పు గలుగుచున్నదా? అనగా సత్త్వాది గుణములచేత నాలుగు యుగము లేర్పడుచున్నవే గాని కృతాది యుగములచే మనుజుల మనస్సున మార్పు గలుగుట లేదు. జనులారా! సత్యమును జూచితిరా! కృతయుగమున హిరణ్య కశిపు, హిరణ్యాక్ష, ప్రహ్లాదులుండిరి. త్రేతాయుగమున రావణ, కుంభకర్ణ, విభీషణాదులుండిరి. ద్వాపరముగమున ధర్మరాజవిదురాదులున్ను, దుర్యోధనాదులున్ను ఉండిరి. ఆలాగున కలియుగమున ఔరంగజేబు, గురునానక్, క్రీస్తు, మహమ్మదు, బుద్ధ, శంకర, రామానుజ, మధ్వాచార్య, రామకృష్ణ పరమహంసాదు లుండిరి. దీనిని పరిశోధించిన, అన్ని యుగములలోను అన్ని గుణములు గలవారు ఉంటున్నారనియు, కావున మనస్సు ననుసరించియే యుగమని మను, భీష్మాదులు జెప్పిన దెంత సత్యమో! లేనిచో కృతయుగమున నుండిన వారందరున్ను పుణ్యాత్ములుగాను, కలియుగమున నుండువారు పాపాత్ములుగాను అంగీకరింపవలసి యుండును. ఈ సత్యముపై నాధారపడియే మన్వాదులు గుణము ననుసరించియే యుగము ప్రవర్తించుచున్నదని జెప్పుటకు కారణమైనది.

కలౌ కృతయుగం తస్య కలి స్తస్య కృతే యుగే ।
యస్య చేతసి గోవిన్దో హృదయే యస్య నాచ్యుతః ॥

ఎవని హృదయమందు నారాయణ స్మరణ గలిగియుండునో వానికది కలియుగమైనను కృతయుగమే యగును. ఎవనియొక్క హృదయమున భగవద్ధ్యానము లేదో వానికి అది కృతయుగమైనను కలియుగమే యగును. దీనికన్న పరమార్థ సత్యము ఇక యేమి కావలయును? ఇపుడు యుగభేదముల గురించి ఆరు ప్రకారములుగా దెలుపడమైనది. ఈ సత్యము నెరింగి జనులు ప్రవర్తించిరేని సదా సత్ప్రవర్తన గలవారై కృతయుగములోనే యుండువారగుదురు. ఇపుడు ధర్మమునకు కృతయుగమున నాలుగు పాదములనియు, త్రేతాయుగమున మూడుపాదములనియు, ద్వాపరమున రెండు పాదములనియు, కలియుగమున ఒకే పాదముతో కూడి యుంటున్నదనియు వచింతురు. అయితే ఆ పాదము లెవ్వియో, తెలిసినవా రరుదగుటచే దానియొక్క ప్రమాణ శ్లోక మిచట నిరూపించెద.

కృతే ప్రవర్తతే ధర్మం చతుష్పాత్తజ్జనైర్ధృతః।
సత్యం దయా తపో దాన మితి పాదా విభో! నృప॥

(1) సత్యము, (2) దయ, (3) తపస్సు, (4) దానము ఈ నాలుగున్ను గలవాడు కృతయుగ ధర్మము గలిగినవాడగును. మరల సత్యము క్షీణించి (1) దయా, (2) తపస్సు, (3) దానము గలవాడు త్రేతాయుగ మందున్నవాడగును. మరల సత్యమును దయయున్ను క్షీణించి (1) తపస్సును (2) దానమున్ను గలవాడు ద్వాపరయుగమందుండువాడగును. తరువాత సత్యము, దయ, తపస్సు లోపించి, (1) దానము మాత్రము గలవాడు కలియుగములో నుత్తమ మనుష్యుడని చెప్పబడును. ఇదే ధర్మముయొక్క నాలుగు పాదములు.

బ్రా:– శ్రీ భగవద్గీతయందు ''కులధర్మాస్సనాతనాః'' ''కులధర్మాశ్చ శాశ్వతాః'' అని విధించి యుండగా, మీరేల కులధర్మము శాశ్వతము గాదనియు, గుణధర్మమే సనాతనమనియు శ్రీ భగవద్గీతకు విరుద్ధముగా జెప్పుచున్నారు.

అ:- దయాకరుడవగు మిత్రమా! ఈ రెండు వాక్యములు ప్రథమాధ్యాయమున గలవు. అది సత్యము. ఈ వాక్యములను ఆధారము చేసికొని కొందరు వర్ణాశ్రమముల స్థాపించుట కొఱకు ఉపన్యాసములలోను, వార్తా పత్రికలలోను, గ్రంథములలోను చెప్పుటయు వ్రాయుటయు గూడ గలదు. ఇది భగవదాజ్ఞ యనియు, గీతాశాస్త్రము యొక్క సిద్ధాన్తమనియు చెప్పుచూ జనుల మోసపుచ్చుచున్నారు. స్వబుద్ధిచేత సత్యనిర్ణయము చేయ శక్తిలేనివారు ఈ వాక్యములను విని భగవదాజ్ఞనుల్లంఘించినవార మగుదుమేమో యని భయపడి భగవద్భక్తి గలిగి, కులమునకే లోబడిపోవుచున్నారు. ఇది యెంత నమ్మకద్రోహమో, ఆత్మవంచనమో, ఈశ్వరాజ్ఞకు విరుద్ధమో యీ క్రింద చెప్పబోవుచుండు సత్యవాక్యములచే మీరు తెలిసికొనగలరు. ఈ రెండు వాక్యములున్ను గీత ప్రథమాధ్యాయమున 40, 43 శ్లోకములలో గలవు. ఇది గీత ప్రథమాధ్యాయమున 26వ శ్లోకమునుండి, అర్జునుడు చెప్పిన ప్రశ్నలో గలవు. ఇది పూర్వపక్షమేగాని సిద్ధాన్తము గాదు. ఇది భగవద్వాక్యము గాదు. భగవద్వాక్యమే సిద్ధాన్తమగును. శ్లో॥ 26.

**దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్।**
**సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి।**
**వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే॥**

ఓ కృష్ణా! యుద్ధమును జేయదలంచి యున్న బంధుజనమును జూచి నాయొక్క అవయవములు శిథిలము లగుచున్నవి. నాయొక్క నోరున్ను ఎండుచున్నది. దేహమందు వణుకు బుట్టుచున్నది. గగుర్పాటున్ను గలుగుచున్నది అని అర్జునుడు భయపడి తపనము గలవాడై యుద్ధమును మానుటకొఱకు నిశ్చయించి, శ్రీకృష్ణభగవానునితో పైజెప్పిన ''కులధర్మాస్సనాతనాః'' ''కులధర్మాశ్చ శాశ్వతాః'' యను మాటలు తనయొక్క అభావవైరాగ్యమున జెప్పినవే గాని మరియొకటి గాదు. కావుననే అర్జునుని యొక్క ధర్మవిముఖతయు,

దీనభావమునుజూచి రెండవ అధ్యాయమున శ్రీకృష్ణభగవాను లుపదేశించినది చూడుడు.

శ్రీభగవానువాచ: –

కుతస్త్వాకశ్మల మిదం విషమే సముపస్థితమ్।
అనార్య జుష్టమస్వర్గ్యమకీర్తికర మర్జున॥

ఓయర్జునా! ఏ హేతువువలన ఈవిషమస్థితియందు పామరులచేత పొందబడినదియును, స్వర్గలోకమును గలుగజేయనిదియున్ను, అపకీర్తిని గలుగ జేయునదియును నగు ఈ కల్మషము నిన్ను బొందినది.

క్లైబ్యం మాస్మ గమః పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥

ఓయర్జునా! క్లైబ్యమును పొందకుము. క్లీబత్వమనగా స్త్రీలింగమున్ను పులింగమున్ను కానిదియగు నపుంసకత్వమని యర్థము. అనగా ఆడదిన్ని మగవాడున్ను కానివాడవని భగవంతుడు పరిహాసరూపముగా అర్జునునిగురించి పలుకడమైనది. నీకు ఈ భయమును పొందుట తగదు. నీచమైన మనస్సునందలి పిఱికితనమును విడచి లెమ్ము. ఈలాగున అర్జునునికి ప్రబోధముజేసి ''సనాతన'' శబ్దముయొక్క యర్థమును క్రింది విధముగ ఈరెండవ అధ్యాయమున వివరించెను.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః।
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః॥

ఈ యాత్మను ఆయుధములు చేధింపవు. ఈఆత్మను అగ్నిహోత్రుడు కాల్పడు. ఉదకములు ఈ యాత్మను తడుపవు. వాయువు ఈ యాత్మను కృశింపజేయడు.

**అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ।**
**నిత్యస్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః॥**

ఈయాత్మ శస్త్రములచే ఛేధింపతగినదిగాదు. ఈయాత్మ యగ్నిచే దహింపదగినది గాదు, జలముచే తడుపతగినదిగాదు. వాయువుచే ఈ యాత్మ ఎండింప జేయదగినది గాదు. త్రికాలములయందుండు వాడు, సర్వవ్యాపకుడు, నిశ్చల స్వభావము గలవాడు, సనాతనుడు.

జనులారా! జూచితరా! ''సనాతన'' శబ్దముయొక్క అర్థమును రెండు శ్లోకములలో ఒకే విషయమును గురించియే మరల మరల జెప్పడమైనది. అట్లు చెప్పుటకు కారణమేమన అగ్రాహ్యవిషయమును ఆశ్చర్యవిషయమును చెప్పునపుడు ''ద్విరుక్తిని'' ప్రయోగించెదరు. ఇపుడు సనాతన శబ్దముయొక్క నిజార్థము తెలిసికొన్నారు గదా! సామాన్యముగా సత్యదృష్టి లేనివారందరును, విపరీతార్థమును చెప్పుట గలదు. అందువల్లనే ఈ భారతదేశము ఇంత దీనస్థితికి రావడమునకు కారణమైనది. ఇపుడు మరియు ''సనాతన ధర్మము'' యొక్క స్వరూపమును దెలిపెద.

**అద్రోహశ్చాప్యలోభశ్చ దమో భూత దయా తపః।**
**బ్రహ్మచర్యం తథాసత్య మదంభశ్చ క్షమా ధృతిః॥**
**సనాతనస్య ధర్మస్య రూపమేత దుదీరితమ్।**
**తదతిక్రమ్య యో వర్తే ద్ధర్మఘ్నః స పతత్యధః॥**

1. ఒక ప్రాణికైనను ద్రోహము చేయకుండుట. 2. లోభము లేకుండుట. 3. దేహేంద్రియములను స్వాధీనపరచియుండుట. 4. భూతదయ గలిగియుండుట. 5. తపమొనర్చుట. 6. బ్రహ్మచర్య వ్రతనిష్ఠ గలిగియుండుట. 7. సత్యము పలుకుట. 8. డాంబికత్వము లేక యుండుట. 9. ద్వంద్వముల

సహించుట. 10. ధర్మకార్యములలో ధైర్యము గలిగి యుండుట– ఈ పది ధర్మములే " సనాతన ధర్మము " యొక్క స్వరూపమగును. ఈ పదింటిని అతిక్రమించి యెవడు వర్తించునో వాడు ధర్మఘ్ను డనబడును. వాడు అధః పతితు డగును.

మరియు యోగవాసిష్ఠమున ఈ ప్రపంచమంతయు మనస్సంకల్ప ప్రభావమని తెలుపడమైనది.

**కృశో౽తిదుఃఖీ బద్ధో౽హం హస్తపాదాది మానహమ్।**
**ఇతి భావన రూపేణ వ్యవహారేణ బధ్యతే॥**

నేను మిక్కిలి కృశుడను, అనేక దుఃఖములతో గూడినవాడను , కరచరణములతోటి సంయుక్తుడనై యేమియు చేయుటకు సాధ్యముగానివాడను, నేను శూద్రుడును, వైశ్యుడను, క్షత్రియుడను, బ్రాహ్మణుడను, స్త్రీని అను విధమున అనాత్మయగు దేహమందాత్మ బుద్ధితోగూడి మృగప్రాయులై, తనయొక్క నిజస్వరూపమైన ఆత్మను మఱచి బద్ధులగుచున్నారు.

**నాహం దుఃఖీ న మే దేహో బంధః కస్యా త్మనః స్థితః।**
**ఇతి భావనరూపేణ వ్యవహారేణ ముచ్యతే॥**

నేను దుఃఖిని గాను, నాకు దేహము లేదు, నిత్యశుద్ధ స్వప్రకాశకు డను, జనన మరణములు లేనివాడను, నేనాత్మస్వరూపుడను. అట్టి నాకు దేహమెట్లు గలుగును? నిత్యముక్తుడ నగు నాకు బంధ మెక్కడిది? ఈలాటి విచారణ రూపమగు వ్యవహారముచే ముక్తు డగుచున్నాడు.

**సంకల్ప వాసనాజాలైః స్వైరేవాయాతి బంధనమ్।**
**మనోలాలామయైర్బంధైః కోశకారక్రిమి ర్యథా॥**

మనుజులు, తమ మనోవాసనా సంకల్పదారములచే తమకు తామే, సంసారబంధనమును గల్పించుకొని దానియందు పట్టుబడి జనన మరణ దుఃఖములకు పాత్రులగుచున్నారు. ఎట్లన, పట్టుపురుగు తనయం దుత్పత్తి యగు నూలుచే గూడుకట్టి బంధమొంది అందులోనే మరణించుచున్నది.

**దేహోఽహం మానపాశేన దృఢం బద్ధోసి సర్వతః।**
**బోధోఽహం జ్ఞాన ఖడ్గేన తన్నికృత్య సుఖీభవ॥**

జీవులు దేహమే తామనెడు భావనారూపమగు బంధనమును పొందుచుందురు. ప్రజ్ఞానాత్మయే తామనెడు బోధయనెడు ఖడ్గముచేత అట్టి దేహమే తాననెడు పాశమును ఛేదించి సుఖస్వరూపుడవు కమ్ము.

ఇందువల్ల అనాత్మ స్వరూపమగు దేహమునకు, జాతిని కల్పించినందుచే జీవులు సంసారపాశములో జిక్కుకొని బద్ధులగుచున్నారనియు, దేహము తాను గాదనియు, తాను నిత్యశుద్ధ స్వప్రకాశ జ్ఞానమయుడగు నాత్మయనియు దెలిసికొనిన ముక్తి గలుగుననియు దీనియొక్క సారము.

– ఓమ్ –

ఓమ్

# లోకోద్ధారకము

ప్రణవకాండము



ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్।
యః ప్రయాతిత్యజన్దేహం స యాతి పరమాం గతిమ్॥ ( గీత )

టీ:- బ్రహ్మ = బహ్మవాచకమై, ఓమ్ ఇతి = ఓమ్ అనునట్టి, ఏకాక్షరం= ప్రణవమును, వ్యాహరన్ = ఉచ్చరించుచున్నవాడై, మాం = ( ఆ యోంకారవాచ్యుడనైన ) భగవంతుడనగు నన్ను, అనుస్మరన్ = చింతించుచున్నవాడై, దేహం = శరీరమును, త్యజన్ =విడచుచున్నవాడై, యః = ఎవ్వడు, ప్రయాతి = పోవుచున్నాడో, సః = వాడు, పరమాం = సర్వోత్తమమైన, గతిం = గతిని (మోక్షమును) యాతి = పొందుచున్నాడు.

బ్రాః - విశాలాత్మా! ప్రణవమును అందఱును జపము చేయరా దనియు, అది వేదము యొక్క మూలమనియు, మిక్కిలి పవిత్రమైన దనియు, ధ్యానించువారి సర్వదోషములను బోగొట్టి, పవిత్రుల నొనర్చునదనియు అట్లయినను, బ్రాహ్మణులలో పరమహంస సన్న్యాసులు మాత్రమే జపమొనర్పదగినదనియు జెప్పుచుండగా మీరేల అందఱితోను ప్రణవమును జపించవలయునని బోధించుచున్నారు.

అః- ప్రసన్నాత్మా! ఈ యోంకారధ్యాన విషయమై '' ప్రణవోపాసన'' యను నొక గ్రంథము వ్రాయబడియున్నది. అయినను, ఆ విషయమిచట సంక్షిప్త ముగా దెలిపెద. కొందఱు ద్విజులలోగల సన్న్యాసులు మాత్రమే ప్రణవమును

జపింపదగిన వారనియు, మఱి కొందఱు ద్విజులలో బ్రహ్మవిచారము జేయు పురుషులు మాత్రము జపింపవచ్చుననియు, ఇంకకొందఱు అనుష్ఠానముగల విప్రులు జపించిన విరోధము లేదనియు, కాని స్త్రీ, శూద్రులు చేయకూడదనియు వచింతురు. ఇదంతయు ఎట్లయినను పోనిండు. మనకు శ్రీ భగవద్గీత గదా ముఖ్యప్రామాణ్య గ్రంథము! దానియందు అష్టమాధ్యాయమున, అంత్యకాలములో ఎట్టి ధ్యానమువలన జీవులు పరమాత్మను బొందగలరని అర్జునుని ప్రశ్న యొకటి గలదు. దానికి సమాధానముగా శ్రీకృష్ణభగవానుడు ఎవరైననుసరే అంత్యకాలమున ప్రణవమును ధ్యానించి పరమాత్మ భావములో నిలచి ప్రాణమును విడచుచున్నారో, వారు పునరావృత్తిలేని బ్రహ్మమును బొందుచున్నారని యుపదేశించెను.

అచట వీరు, వారు జేయవచ్చునని దెలిపియుండలేదు. అయితే ధ్యానము చేయువారి లక్షణమును మాత్రము నిరూపింపబడియున్నది. స్త్రీ పురుషాధి భేదమేదైనా యుండినచో ఆ విషయము నచటనే శ్రీ భగవంతుడు నిరూపించి యుండును. మఱియు అర్జునుడు క్షత్రియుడు. అంతేగాక గృహస్థాశ్రమమున నుండినవాడు. అదియునుగాక రణభూమిలో నుండినవాడు. ఏకాంతమున గాని, వానప్రస్థాశ్రమమున గాని, తాపసియైయుండు నపుడు గాని యుపదేశించి యుండినచో మీరు జెప్పిన విషయము యోచించవలసియుండును. ఇట్టి విశాల భావము గీత కుండినందుచే గదా, శ్రీ భగవద్గీతకు ఇంత విఖ్యాతియు వ్యాపకతయు గలిగినది. ఇతరములైన వెన్నియో గీతలు గలవు. వాటి పేర్లనైన వినినవారు చాలా యరుదుగనున్నారు. అవి యన్నియు సంకుచిత భావముతో గూడి వారి వారి యింటి పెరట్లలో గల నూతులవంటివి. వాటికి గంగా, యమునా, గోదావరులవలె విశాలమైయుండు పుణ్యనదుల మాహాత్మ్య మేదేని గలదా! ఇది స్మృతి కావున సామాన్య మనుష్యుడగు మీవాక్య మంగీకరించ వలసినదా, లేక సర్వజ్ఞుడగు సర్వేశ్వరుని వాక్యమును గుఱించి జెప్పిన విషయము నమ్మవలయునా!

ఇక శ్రుతిని గుఱించి విచారింతము, కఠవల్లి శ్రుతియందు యమధర్మ నచికేతుల సంభాషణ మొకటి గలదు. నచికేతుడు బ్రహ్మచారి. ఆత్మోపదేశమును గుఱించి యమధర్మరాజు నడుగగా యముడు ఈ ప్రణవమునే యుపదేశించెను. అచ్చోటగూడ, స్త్రీ పురుషాది భేదముగాని, బ్రాహ్మణా బ్రాహ్మణ భేదముగాని యేమియు దెలుపక ఇంద్రియ నిగ్రహాది గుణముల గూర్చి మాత్రమే జెప్పియుండెను. ఇట్టి శ్రుతిస్మృతులను నిర్లక్ష్యమొనర్చి మీకధికారము లేదు, మీకు హక్కులేదు అని యిత్యాది కల్పిత వాక్యముల జెప్పి లోకమునేల పాడుజేయవలయును! అంతేగాక, కోట్లకొలది బ్రాహ్మణేతరులను స్త్రీలందఱిని నిషేధించి విరోధమున కేల గురి కావలయును? మరియు ఏల యీ మహాపాపమునకు ఒడిగట్టవలయును? ఏల యిన్నికోట్ల జనుల అభివృద్ధి నరికట్టవలయును, మఱియు మీరు జెప్పినదానిలోనే ప్రణవము అతిపావనమైన దనియు, సర్వపాపములు బోగొట్టి శుభమును గలుగు జేయునదియు అని కలదు. అందువల్లనే అట్టి వేదమూలమగు ప్రణవమును సదాచారముతో గూడి బ్రహ్మవిచారము జేయువారందఱును ధ్యానము జేయవచ్చునని జెప్పుటకు కారణము. రోగులైనవారికి శ్రేష్ఠమైన యౌషధమునిచ్చి రోగశాంతి గలుగ జేయుటగదా శ్రేష్ఠుడైన వైద్యుని ధర్మము! అట్లుగాక సరియైనమందు నీయక, రోగియొక్క బాధను బోగొట్టని వైద్యు డెట్టివాడగును? మీరే యోచించుకొనుడు. అయితే మందు మాత్రము మంచిదైనను దానికి తగిన పథ్యము కూడ నుండవలయును. పథ్యమును మాత్రము దెలిసికొనిన చాలదు: ఆ పథ్యమును కూడ నెఱింగియుండనిచో పథ్యము జెడిపోవునేమో! కావున యౌషధము నిచ్చునపుడే వైద్యుడా పథ్యమును కూడ జెప్పవలయును. ఒకవేళ వైద్యుడు జెప్పకపోయిన రోగియైనను అడిగి తెలిసికొనవలయును. అలాగున గురువులు జ్ఞానము నుపదేశించునపు డాచరణములను గూడ దెలుపవలయును. ఏదో కారణాంతరములచే, ఆచార్యులు నియమమును బోధింపక బోయినను, ముముక్షువులు మాత్రము అడిగి గ్రహించుకొనవలసి యుండును. మఱియు

గీతనుగూడ అందఱును పఠనము జేయరాదని జెప్పెడు పాపకాల మొకటి యుండియుండెను. అయ్యది కాలగర్భమున లీనమైనందుచే ప్రస్తుతము దానితోడ బనిలేదు. పుణ్యవిశేషముచే నిపుడందఱును గీతాపారాయణను జేయవచ్చునని జెప్పెడు పుణ్యకాల మావిర్భవించినది. అయితే ప్రణవమును మాత్రము అందఱును ధ్యానము జేయరాదని యెవరో యెచ్చటనో మరుగున జెప్పుచున్నారు. అదియు చాలావరకు ఇపుడు తగ్గిపోయినది. అట్లు జెప్పువారి నొక ప్రశ్నడగవలయును. అదేమన! ''గీతాపారాయణ జేయువారు దానియందు జెప్పిన యనుష్ఠానము గూడ జేయవలయునా లేక పారాయణమాత్రము చాలునా! అట్లయిన అంత్యకాలమున దేనిని ధ్యానించిన మోక్షము గలుగునని భగవంతు డుపదేశించెనో, దానిని యనుష్ఠింపనిచో ముక్తి యెట్లు గలుగునని'' యడిగిన చాలును. అనుష్ఠాన మక్కరలేదు, పఠనముమాత్రము చాలునని జెప్పినచో, వైద్యశాస్త్రపఠనము వలననే రోగశాన్తి కావలసియుండునుగదా అని చెప్పవలయును. అట్లుగాక మనకు వాదమెందులకని దలంచిన యూరకుండుటయే మేలు. ఏలన! అనుష్ఠానము గూడ దని జెప్పువారు అనుష్ఠానము యొక్క నిలుపుదలను వర్తమాన యుగమున జేయజాలరు. ''మౌనేన కలహో నాస్తి'' అని చెప్పెడు శాంతి పాఠము మంచిది. ఇక ప్రణవశబ్దమును గుఱించియు, ఓంకార శబ్దార్థమును గురించియు అథర్వశిఖోపనిషత్తునందు జెప్పినది జూడుడు.

ప్రాణాౙ సర్వాన్ పరమాత్మని ప్రణామయతీతి ప్రణవః
చతుర్ధావస్థిత ఇతి సర్వదేవ వేదయోనిః సర్వవాచ్య
వస్తు ప్రణవాత్మకమ్॥

సకల ప్రాణములను (ప్రపంచమంతయును) పరమాత్మయందు జేర్పించుట బట్టి ప్రణవమనబడును. నాలుగుపాదములతో గూడియుండుట వలన, బ్రహ్మ, విష్ణు, రుద్రాది సకల దేవతలకును, సకల వేదములకును కారణస్థానమై (యోనియై) యున్నది. సకలవాచ్యవస్తువులును (సకల దేవతల నామములును)

ప్రణవాత్మకమగును. ప్రకృతియను వలలో అధోముఖములై చిక్కుకొనియుండు ప్రాణికోట్లు, ప్రణవోచ్చారణచే ఊర్ధ్వముఖులై, ప్రకృతినుండి విముక్తులై పరమాత్మను పొందగలరు.

సకృదుచ్చరిత మాత్రేణ ఊర్ధ్వమున్నామయతీత్యోఙ్కారః.

ఒక్కమాఱు ప్రణవము నుచ్చరించిన, శ్రేష్ఠగతిని (పరమపదమును) జేర్పించుట బట్టి ఓంకారమనబడును. ఓంకారధ్యాన మొక్కదానికి మాత్రమే ప్రాణమూర్ధ్వముగా వెళ్ళెడు స్వభావముండును. తక్కిన యేమంత్రమునకును, జపకాలములో ప్రాణమూర్ధ్వముగా వెళ్ళి అధో ముఖముగా దిరుగుచుండును. అందువలన పునరావృత్తిగలుగుటకు కారణము కావచ్చును. మఱియు ఈ విషయమై మానవులందరికిని మూలపురుషుడగు మనువు జెప్పినది జూడుడు.

ఆద్యం యత్ర్యక్షరం బ్రహ్మ త్రయీ యస్మిన్ ప్రతిష్ఠితా।
న గుహ్యోఽన్యస్త్రివృద్వేదో యస్తం వేద స వేదవిత్॥

సర్వవేదములలో మొదటిదియై అకారోకార మకార స్వరూపమైనందున, త్ర్యక్షర స్వరూపమైన యేవేదసారము గలదో, ఏ మూడక్షర ముల యందే మూడు వేదములున్నవో, అది మఱియొక త్రివృద్వేదము, అయ్యది ప్రణవమనునది. వేదమంత్రములలో శ్రేష్ఠమైనది గనుకను, పరమార్థస్వరూపమగు బ్రహ్మను వివరించునది గనుకను పరమార్థకమైనందున, జపతపంబులు జేయువారికి మోక్ష ప్రదమైనందునను, మిక్కిలి రహస్యమును గోప్యమునైనది. ఎవ డీ ప్రణవమును స్వరూపముతోను అర్థముతోను నెఱుగునో వాఢు వేదవేత్త యగును.

బ్రహ్మణః ప్రణవం కుర్యాదాదా వంతే చ సర్వదా ।
స్రవత్యనోంకృతం పూర్వం పరస్తాచ్చ విశీర్యతే ॥

వేదాధ్యయనము ప్రారంభించునపుడు మొదటను, చివరను, ఎల్లప్పుడును ఓంకారము నుచ్చరింపవలయును. వేదమును ప్రారంభించునపుడు ఓంకారమును ధ్యానించనియెడల, చదివినదెల్ల గొంచెము గొంచెముగా మరచిపోవును. ముగించునపుడు ఓంకారమును జపించని యెడల చదివినది మనస్సున నిలువజాలదు. ఈవిధి ధ్యానమందును, పారాయణయందును ఉత్కృష్ట గ్రంథపఠనమందును, గ్రంథ రచనయందును గలిగియుండవలయును.

సహస్ర కృత్వ స్త్వభ్యస్య బహిరే తత్త్రికం ద్విజః।
మహతోప్యేనసో మాసాత్త్వచేవా హిర్విముచ్యతే॥

ద్విజుడు సంధ్యాకాలమునందును, తక్కినసమయములందును, గ్రామమునకు వెలపట పవిత్రమగు పుణ్యప్రదేశమున వ్యాహృతిత్రయముతో గూడిన యీ యోంకారమును వేయిపర్యాయములు ప్రతిదినము జపించిన యెడల, ప్రణవపూర్వకముగ మూడు వ్యాహృతులతో గూడిన గాయత్రినైనను జపించిన యెడల నొక్క మాసమునకు సర్పము కుబుసమునుండి విడివడునట్లుగా మహాపాపములనుండి విడుదల నొందును.

యోఽధీతేఽహన్యహన్యేతాం త్రీణి వర్షాణ్యతంద్రితః।
స బ్రహ్మపద మభ్యేతి వాయుభూతః ఖమూర్తిమాన్॥

ఎవడు ప్రతిదినము సోమరి గాక మహావ్యాహృతులతో గూడిన ఓంకారమును మూడు సంవత్సరముల కాలము నియమముతో జపించునో, వాడు పరబ్రహ్మమును పొందుచున్నాడు. అతడు వాయువువలె సంకల్ప శరీరము గలవాడై, బ్రహ్మ స్వరూపుడగుచున్నాడు. వాయువువలె పరిశుద్ధుడగుచున్నాడు.

ఏకాక్షరం పరం బ్రహ్మ ప్రాణాయామాః పరం తపః।
సావిత్ర్యాస్తు పరం నా స్తి మౌనా త్సత్యం విశిష్యతే॥

ఓం అనునొక యక్షరమే బ్రహ్మము, ప్రాణాయామములే గొప్పతపస్సు. గాయత్రి కంటె మించిన మంత్రము లేదు. మౌనముకంటె సత్యము చెప్పుట మేలు.

**క్షరంతి సర్వా వైదిక్యో జుహోతి యజతిక్రియాః।**
**అక్షరం దుష్కరం జ్ఞేయం బ్రహ్మ చైవ ప్రజాపతిః॥**

వేదవిహితములైన హోమయాగ క్రియలన్నియు నశించుచున్నవి. ఓం అను అక్షరము బ్రహ్మప్రాప్తి హేతుభూతమగుటవలన నశింపదు. ఏలయన, ప్రజల కధిపతియు నీ బ్రహ్మమేగాన నా బ్రహ్మస్వరూపమే. ఈ యోంకారము బ్రహ్మస్వరూపముగను, బ్రహ్మ ప్రతిపాదకముగను నుండుటచేత, ఓంకారమే బ్రహ్మము, రెండు తెఱగులను (బ్రహ్మత్వముచేతను, బ్రహ్మత్వ ప్రతిపాదకత్వముచేతను) ఓంకారమును జపించుట మోక్షప్రదమని భావము.

**జప్యే నైవతు సంసిద్ధ్యే ద్బ్రాహ్మణో నాత్ర సంశయః।**
**కుర్యా దన్య న్నవా కుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే॥**

బ్రహ్మనిష్ఠుడు ఈ ప్రణవ జపము చేతనే నిస్సంశయముగా మోక్షసిద్ధిని బొందును, తక్కిన యాగాది వైదిక కార్యములను జేసినను, చేయక వదలినను వదలనీ, బ్రాహ్మణుడు సర్వప్రాణిమైత్రుడు. యాగాదులయందు బ్రాణి హింస చేయక తప్పదు. కాన కొన్ని జంతువులకు విరోధి కావలసివచ్చును. కనుక జపకర్మచే నెవ్వరికిని విరోధి కాక, సర్వప్రాణులకు మిత్రుడైయే యుండును. ఇందువలన, హింసాపరమగు కర్మయజ్ఞమును విడిచి ఆత్మయజ్ఞ పరమగు నీజ్ఞానయజ్ఞమునే పుణ్యాత్ములు చేయవలయునని యేర్పడుచున్నది.

**విధియజ్ఞా జ్జపయజ్ఞో విశిష్టో దశభి ర్గుణైః।**
**ఉపాంశుః స్యాచ్ఛతగుణః సాహస్రో మానస స్స్మృతః ॥**

జ్యోతిష్టోమాదియాగముల నొనర్చుటకంటె, ఓంకార మహావ్యాహృత్యాదుల వాచక జపము పదింతలు మేలు. ఆ జపమే ఉపాంశువైనచో నూరింతలు హెచ్చు. మానసికమైనచో వేయింతలు హెచ్చు.

సమ్యగ్దర్శన సంపన్నః కర్మభిర్న నిబధ్యతే ।
దర్శనేన విహీనస్తు సంసారం ప్రతిపద్యతే ॥

ఆత్మజ్ఞానముతో కూడినవాడు పుణ్యపాపములచే కట్టుబడడు. అట్టి జ్ఞానములేనివాడు జనన మరణ రూపమగు సంసారమును బొందును.

ఋషయస్సంయతాత్మానః ఫలమూలానిలాశనాః ।
తపసైవ ప్రపశ్యంతి త్రైలోక్యం సచరాచరమ్ ॥

ఋషులు వాఙ్మనఃకాయ నియమములు గలవారై, ఫలమూలములను భుజించువారై, గాలిని బీల్చువారలగుచూ తపం బొనర్చియే తమ జ్ఞానదృష్టిచే, జంగమస్థావరాత్మకమైన స్వర్గమర్త్యపాతాళలోకముల నొక ప్రదేశమునుండియే చూడగలిగియున్నారు.

ఔషధాన్యగదో విద్యా దైవీ చ వివిధా స్థితిః।
తపసైవ ప్రసిధ్ద్యంతి తప స్తేషాం హి సాధనమ్ ॥

ఔషధములును, ఆరోగ్యము, బ్రహ్మజ్ఞానము, ధర్మశాస్త్రము వీని నెరుగగల జ్ఞానము, వేదములకు సంబంధించిన స్వర్గాదులగు అన్ని లోకంబులను నివి యెల్లను తపస్సువల్లనే గలుగుచున్నవి. ఏ కారణము వలన నివి యెల్లతపంబున గలుగుచున్నవో, అందువలన తపస్సే అన్నిటిని పొందుటకు గారణమై యున్నది.

ఋషయో దీర్ఘ సంధ్యత్వా ద్దీర్ఘమాయ రవాప్నుయుః।
ప్రజ్ఞాం యశశ్చ కీర్తించ బ్రహ్మవర్చస మేవ చ॥

ఋషులు దీర్ఘ కాలము, సంధ్యావందనాధ్యయనాద్యనుష్ఠానము చేయుటచే దీర్ఘాయుస్సు నొంది చిరకాలము జీవించి మానుష ప్రజ్ఞను, జీవిత దశలో యశస్సును, మృతులై కీర్తిని నొందిరి. కావున ఆయుస్సు కోరువాడు ఎక్కువ సమయము సంధ్యోపాసన చేయవలయును.

**ఉత్పాదక బ్రహ్మదా త్రోర్గరీయాꣳ బ్రహ్మదః పితా ।**
**బ్రహ్మజన్మ హి విప్రస్య ప్రేత్య చే హచ శాశ్వతమ్ ॥**

విప్రునకు ఆత్మజ్ఞాన గ్రహణమైన రెండవ జన్మ మొసంగెడు ఆచార్యుడు తండ్రికన్న శ్రేష్ఠుడు. బ్రహ్మగ్రహణార్థమైన జన్మము, బ్రహ్మప్రాప్తి ఫలకమైనందున ఇహపరములయందు రెండింటియందును ముఖ్యమైనది. ద్విజుడనగా రెండవసారి జన్మించినవాడని యర్థము. తండ్రివల్ల యేర్పడినది యీ జన్మము. ఇది నశించునది. ఈ దేహమున కధిపతియగు నాత్మజ్ఞానమును గలుగజేసినవా డాచార్యుడు. ఆ యాత్మ ఇహపరములలో చెడనిది. అంతేగాక బ్రహ్మసాక్షాత్కారమగు శాశ్వతమగు జ్ఞానమును దానివలననే గలుగును. కాబట్టి తండ్రికన్న గురుడధికుడు. కావుననే ''జన్మనా జాయతే జంతుః, సంస్కారాద్ద్విజ ఉచ్యతే'' జన్మించినపుడు మానవుడు గూడ జంతువులతో సమానుడు. ఆత్మజ్ఞానోపదేశమువల్ల దేహమునకు భిన్నుడగు దేహియే తాననెడు జ్ఞానము గలుగుటయే రెండవ జన్మమనబడును. ఇది గురువు వలననే గలుగును. ఇట్టి రెండవ జన్మమగు జ్ఞానము గలిగినవారు, ద్విజేతరులలో పుట్టినను ద్విజులగుదురు. అట్టి యాత్మజ్ఞానము గలుగనివారు ద్విజులలో పుట్టినను ద్విజేతరులే యగుదురు. ఇపుడు ప్రణవధ్యానమును గురించి వ్రాసిన యీ యమోఘ ధర్మములు గూడ మనుమహర్షి చెప్పినవే. ఇపుడు నారద పరివ్రాజకోపనిషత్తునందుగల ప్రణవమును గురించిన భాగము తెలిపెద.

**అథ హైనం భగవంతం పరమేష్ఠినం నారదః ప్రపచ్ఛ సంసార తారకం ప్రసన్నో బ్రూహీతి, తథేతి పరమేష్ఠీ వక్తు ముపచక్రమే. ఓమితి**

**బ్రహ్మేతివ్యష్టి సమష్టి ప్రకారేణ కా వ్యష్టిః కా సమష్టిః సంహార ప్రణవః, సృష్టి ప్రణవశ్చ.**

తరువాత నారదుడు భగవంతుడగు ఈ బ్రహ్మదేవుని సంసార మును తరించు ఉపాయమును ప్రసన్నుడవై చెప్పుమని అడుగగా, బ్రహ్మదేవుడు అట్లేఅని, ఓం అనునది బ్రహ్మమనియు, వ్యష్టి సమష్టి ప్రకారముగ సృష్టి యననేదియో, సమష్టియన నేదియో సంహార ప్రణవము సృష్టి ప్రణవము అన నేవియో ఈ విషయముల జెప్ప నారంభించెను.

**అంతర్బహిశ్చోభయాత్మకత్వా త్త్రివిధో బ్రహ్మప్రణవః, అంతః ప్రణవో వ్యావహారిక ప్రణవః బాహ్యప్రణవః ఆర్షప్రణవః, ఉభయాత్మకో విరాట్ప్రణవః, సంహార ప్రణవో బ్రహ్మప్రణవః, అర్ధమాత్రాప్రణవః, ఓమితి బ్రహ్మ ఓమిత్యేకాక్షర మంతః ప్రణవం విద్ధి.**

బ్రహ్మ ప్రణవము, అతః ప్రణవమనియు, బహిః ప్రణవమనియు ఉభయాత్మక (అంతర్బహి) ప్రణవమనియు మూడు విధములు. అందు ప్రణవమనగా వ్యావహారిక ప్రణవము, బాహ్యప్రణవము, ఆర్షప్రణవమగును. (ఋషిసంబంధమైనది) విరాట్ప్రణవము ఉభయాత్మకమైనది. అర్ధమాత్రారూపమగు బ్రహ్మప్రణవము సంహార ప్రణవమగును. (ప్రపంచోప శమనమగు ప్రణవమగును) అనగా బ్రహ్మము. ఓం అను ఈ యేకాక్షరమును అంతఃప్రణవముగా తెలియుము.

**సచాష్టధా భిద్యతే అకారోకార మకారార్ధ మాత్రా నాద–బిందు కళాశక్తిశ్చేతి.**

ఆ ప్రణవము అకారము, ఉకారము, మకారము, అర్ధమాత్ర, నాదము, బిందువు, కళ, శక్తి యను నెనిమిది విధములగు భేదములు గలదగు చున్నది.

**తత్ర చత్వారః అకారశ్చాయుతా వయవాన్విత ఉకారః, సహస్రావ యవాన్వితో మకారః, శతావయవో పేతోఽర్ధమాత్రా ప్రణవోఽనంతా వయవాకారః.**

అందు అకారము, ఆయుతావయవములతో గూడినది, (పదివేలు) ఉకారము సహస్రావయములు గలది (వెయ్యిగలది) మకారము శతావయవము లతో (నూరు) కూడినది. అర్ధమాత్రా ప్రణవము అనంతావయవ ములు గలది.

**సగుణో విరాట్ప్రణవః, సంహారో నిర్గుణ ప్రణవః, ఉభయాత్మకోత్పత్తి ప్రణవః, యథాప్లుతో విరాట్ప్లుతః, ప్లుత సంహారో, విరాట్ప్రణవః, షోడ శమాత్రాత్మకః, షట్త్రింశత్త త్త్వాతీతః.**

విరాట్ప్రణవము సగుణము, సంహార ప్రణవము (ప్రకృతి రహిత ప్రణవము) నిర్గుణము, ఉత్పత్తి, (సృష్టి) ప్రణవము, ఉభయాత్మకము (సగుణ నిర్గుణ స్వరూపము) విరాట్ప్రణవము షోడశమాత్రా స్వరూపము. షట్త్రింశత్త త్త్వముల కతీతమునై యున్నది. షట్త్రింశ త్తత్త్వము సాంఖ్యయోగమున కనందగును.

**షోడశమాత్రాత్మకత్వం కథమిత్యుచ్యతే. అకారః ప్రథమో కారో ద్వితీయా మకార స్తృతీయార్ధ మాత్రా చతుర్థీనాదః పంచమీబిందుః షష్ఠీ కళా సప్తమీ కళాతీతాష్టమీ శాంతి ర్నవమీ శాంత్యతీతా దశమీ ఉన్మన్యేకాదశీ మనోన్మనీ ద్వాదశీ పురీ త్రయోదశీ మధ్యమా చతుర్దశీ పశ్యంతీ పంచదశీ పరా షోడశీ.**

షోడశమాత్రా స్వరూ మెట్లనిన జెప్పబడుచున్నది. అకారము మొదటిమాత్ర (అన్నిటికిని మాత్రాశబ్దము కలిపి చదువవలయును). ఉకారము రెండవది, మకారము మూడవది. అర్ధమాత్ర నాలుగవది. నాదము ఐదవది. బిందువు ఆరవది. కళ ఏడవది. కళాతీతము ఎనిమిదవది. శాంతి తొమ్మిదవది.

శాంత్యతీతము పదియవది. ఉన్మని పదునొకండవది, మనోన్మని పండ్రెండవది. పురి పదమూడవది. మధ్యమ పదునాలుగవది. పశ్యంతి పదునైదవది. పరా పదునారవ మాత్ర యనబడును.

**పునశ్చతుష్షష్టిమాత్రా ప్రకృతి, పురుషద్వైవిధ్యమాసాద్య అష్టావింశత్యుత్తర భేదమాత్రాస్వరూపమాసాద్య, సగుణనిర్గుణత్వ ముపేత్యైకోఽపి బ్రహ్మప్రణవః, సర్వాధారః పరంజ్యోతిరేషసర్వేశ్వరో విభుః, సర్వదేవమయః, సర్వప్రపంచాధార గర్భితః.**

షోడశమాత్ర, మరల ప్రకృతి – పురుషుడు అను నీ ద్వైవిధ్యమును బొంది, అరువదినాలుగు మాత్రలు గలదగుచున్నది. మఱియు బ్రహ్మప్రణవము ఒకటయ్యు, యిరువది యెనిమిది భేదములు గల మాత్రా స్వరూపమును బొంది, సర్వాధారమును, సగుణనిర్గుణత్వమునున్ను బొంది సర్వాధారమును, పరంజ్యోతియు, వ్యాపకమును నగు సర్వేశ్వర రూపమగుచున్నది. ఇంకను సమస్త దేవతా స్వరూపమును, సర్వ ప్రపంచాధారమును నగుచున్నది.

**సర్వాక్షరమయః కాలః సర్వాగమమయశ్శివః।**
**సర్వశ్రుత్యుత్తమో మృగ్యః సకలోపనిషన్మయః॥**

మఱియు బ్రహ్మప్రణవము, అక్షర స్వరూపమును, కాలస్వరూపమును మంగళకరమునుసమస్త ఆగమ (శాస్త్ర) స్వరూపమును, మంగళకరమును, వేదములన్నిటికంటె యుత్తమమైనదియు, మృగ్యమును (మిక్కిలి ప్రయాసపడియైనను అన్వేషింపదగినది) సమస్త ఉపనిషత్స్వరూపమును అగుచున్నది.

**భూతం భవ్యం భవిష్యద్యత్త్రికాలోదితమవ్యయమ్।**
**తదప్యోంకారమేవాయం విద్ధి మోక్షప్రదాయకమ్॥**

ఓ పూజ్యుడా! భూతభవిష్యద్వర్తమాన రూపములగు త్రికాలముల యందున్నట్టియు, నాశరహితమైనట్టిది నగు, ఆ యోంకారమునే మోక్షము నిచ్చుదానినిగా తెలుసుకొనుము.

**తమేవాత్మాన మిత్యేత ద్బ్రహ్మశబ్దేన వర్ణితః ।**
**తదేక మమృత మజర మనుభూయ తథోమితి ॥**

ఆ ప్రణవమునే, ఆత్మస్వరూపముగ తెలిసికొనుము. ఇదియే బ్రహ్మశబ్దముచే వర్ణింపబడినది. ఆ యాత్మ యేకమును, అమృతమును, (మరణ రహితము) అజరమును, (ముసలితనము లేనిది) అగుచున్నది.

**స శరీరం సమారోప్య తన్మయత్వం తథోమితి।**
**త్రిశరీరం తమాత్మానం పరం బ్రహ్మవినిశ్చిను॥**

ఆయాత్మ శరీరము నధిష్ఠించి తన్మయత్వము. (శరీర రూపమును) పొందుచున్నది. అట్లే యోంకారమును ( ఆత్మమయము ) అగుచున్నది. స్థూల సూక్ష్మకారణ శరీరత్రయ విశిష్టమగు ఆత్మను బ్రహ్మనుగా నిశ్చయించుకొనుము.

ఇపుడు గార్గ్యాయనముని ప్రణవమును గురించి ఉపదేశించిన భాగము వ్రాయబడుచున్నది. ప్రణవము యొక్క మహిమ తగ్గిపోయినందుచే, బ్రహ్మజ్ఞానమును, బ్రహ్మజ్ఞాన మహిమను లోకులు తెలిసికొనలేకపోవుచున్నారని తలంచి దీనిని వ్రాయడమైనది. మఱియు స్త్రీలకును, బ్రాహ్మణేతరులకును ఇట్టి బ్రహ్మసాక్షాత్కారమునకు కారణమగు నీ ప్రణవోపాసనయందర్హత లేదని పలువురు కలకాలమునుంచి చెప్పుచూ వచ్చుచుండుట వలనను, దీనియందు ప్రవృత్తి లేక ప్రపంచములో చైతన్యము క్షీణించి పోవుటచేతను, ఈశ్వర స్వరూపులగు జీవులు తమ ఆత్మస్వరూపమును మరచి దీనులగుటచేతను, ఈ దివ్యమంత్రమును మరల ఉద్ధరించు కొనిన మాత్రమే జీవులు మరల

చైతన్యముగలవారై తేజోమయులై మహర్షుల సంతతివారమనుజ్ఞానము ధృఢముగ గలుగుటకును, శమదమాది గుణములు గల మనుష్యమాత్రులందరికిని ఈ బ్రహ్మనిష్ఠయందు సుదృఢభావము గలుగుటకును ఇది ప్రారంభించడమైనది. ప్రకాశమేలాగున తమస్సును లయమొందించునో, అమృత మేలాగున విషమును రహితమొనర్చునో ఆలాగున బ్రహ్మోపాసనపరమగు నీ ప్రణవోపాసనయు నజ్ఞానము నంతమొందించును. సుజ్ఞానవంతునిగా జేయును.

**ఓం మహర్షేః పదాంభోజం ధ్యాత్వా గార్గ్యాయణస్య చ।**
**తచ్ఛాస్త్రార్థం పరిజ్ఞాయ యథామతిబలం బుధాః॥**

పండితులారా! ఓంకార పూర్వకముగ గార్గ్యాయణ మహర్షియొక్క పాదపద్మములను ధ్యానించి అతడు చేసిన శాస్త్రార్థమును తెలిసికొని నాబుద్ధి బలము ననుసరించి ఓంకారము యొక్క సంగతిని వివరించెదను.

**పఠంతు పండితా స్సంతః స్థితప్రజ్ఞా హితైషిణః।**
**వర్ధతాం బ్రహ్మవిద్యా చ లోకేభ్య స్సుఖమేధతామ్।**

పండితులును, సత్పురుషులును, స్థిత ప్రజ్ఞులును, ఆత్మహితమును గోరువారును దీనిని పఠింతురు గాక! బ్రహ్మవిద్య లోకమునందు వృద్ధినొందుగాక, లోకులకు శుభము వృద్ధినొందును గాక!

**మాంగళ్యం పావనం ధర్మ్యం సర్వకామ ప్రసాదనమ్ ।**
**ఓంకారః పరమం బ్రహ్మ సర్వమంత్రేషు నాయకః ॥**

ఓంకారము మంగళప్రదము, పవిత్రముచేయునది. ధర్మమును గలిగించునది. అన్ని కోరికలను సాధించి యిచ్చునది. పరబ్రహ్మము. అన్ని మంత్రములలోను శ్రేష్ఠమైనది.

**ఓమిత్యేకాక్షరాత్సత్యా త్పరస్మాద్బ్రహ్మ తత్పరమ్ ।**
**అనంతమవ్యయం విద్ధి సర్వశాస్త్ర మిదం మతమ్॥**

సత్యస్వరూపము, పరస్వరూపమునైన ఓం అనెడి యేకాక్షరము వలననే అన్నింటి కంటెనూ పరమైన బ్రహ్మను తెలిసికొనవలయును. ఈ యోంకారమనంతము, అవ్యయమనియు ఇదియే సర్వశాస్త్రసారమనియు తెలిసికొనవలయును.

**స్మరణాత్కీర్తనా ద్వాపి శ్రవణా చ్చ జపాదపి ।**
**బ్రహ్మ తత్ప్రాప్యతే నిత్యమోమిత్యేతత్పరాయణమ్॥**

ఓంకారమును స్మరించుచుండుట వలనను, కీర్తించుచుండుట వలనను, వినుచుండుట వలనను, జపముచేయుచుండుట వలనను ఓంకారమే గొప్ప స్థానముగా గల యా పరబ్రహ్మము లభించుచున్నది.

**ఓంకారా జ్జాయతే విశ్వ మోంకారేణైవ వర్తతే।**
**ఓంకారే లయమాప్నోతీ త్యోంకారో బ్రహ్మసంజ్ఞకః॥**

ఈ ప్రపంచమంతయు ఓంకారము వలన బుట్టుచున్నది. ఓంకారము చేతనే వృద్ధిని బొందుచున్నది. ఓంకారమునందే లయించుచున్నది. కావున ఓంకారమే బ్రహ్మమను పేరు గలది.

**యుంజీత ప్రణవే చేతః ప్రణవో బ్రహ్మ నిర్భయమ్ ।**
**ప్రణవే నిత్యయు క్తస్య న భయం విద్యతే క్వచిత్॥**

ప్రణవమునందు చిత్తమును లగ్నము చేయువలయును. ప్రణవమే నిర్భయమైన బ్రహ్మము. ప్రణవమునందు నిత్యమును లగ్నమైన చిత్తముగలవానికి భయము దేనివలనను ఉండదు.

ఋగ్వేదో గార్హపత్యం చ పృథివీ బ్రహ్మ ఏవ చ ।
అకార స్సశరీరంతు వ్యాఖ్యాతం బ్రహ్మవాదిభిః ॥

అందు ముఖ్యులగు ముగ్గురు దేవతలును, మూడు లోకములును, మూడగ్నులును, మూడు మాత్రలు నర్ధమాత్రయును చెప్పబడినవి. మూడక్షరములు గలదియు, శివస్వరూపమునగు ఓంకారము తాలూకు ఆకారము యొక్క శరీరము ఋగ్వేదము, గార్హ్యపత్యాగ్ని, పృథివి, బ్రహ్మయు అని బ్రహ్మ నెఱిగి చెప్పువారిచేతను విస్తరించి చెప్పబడెను.

సామవేద స్తథా ద్యౌ శ్చాహవనీయ స్తథైవ చ ।
ఈశ్వరః పరమో దేవో మకారః పరికీర్తితః॥

సామవేదము, అట్లే దివియు, ఆహవనీయాగ్నియు, పరుడును, స్వయంప్రకాశమానుడును నగు నీశ్వరుడును మకారముగా చెప్పబడెను.

సాయం సంధ్యా మకారస్థా ప్రళయాంతప్రవాచికా ।
ఓమిత్యంతర్గతా సంధ్యా త్రివిధా పర్యుపాసితా ॥

ప్రళయాంతమునకు వాచకమగు సాయంసంధ్య మకారమునందున్నది. ఓం అనుదాని లోపలనున్న యీ మూడు విధముల సంధ్యయు ఉపాసింపబడినదై భోగ మోక్షముల నిచ్చును.

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ లక్షణం సర్వభావగమ్।
మహావాక్యేన గాయత్ర్యా యుక్తం శుద్ధా హ్యుపాసతే॥

బ్రహ్మమునకు గుర్తయినదియు, సర్వపదార్థములను బొందియున్నదియు, మహావాక్యములతోను, గాయత్రితోను గూడియున్నదియు నగు ఓంకారమును శుద్ధమైన యంతఃకరణముగలవా రుపాసింతురు.

**అధ్యేయ స్సాంగవేదశ్చ గాయత్రీమంత్ర ముద్ధృతమ్ ।**
**ఓమిత్యేతత్సమభ్యాసో జపతా పరమం పదమ్ ।**
**గృహ్యతాం పరమం జ్ఞానం పునర్ముక్తో భవిష్యతి ॥**

షడంగములతో గూడిన వేదమంతయు నధ్యయనము చేయదగినది. గాయత్రీ మంత్ర ముద్ధరింపబడినది. ఓం అనుదాని యభ్యాసము ( అవృత్తి) జపము చేయువారికి పరమపదమును గలిగించును. ఉత్తమమైన యీ జ్ఞానమును గ్రహించినచో ముక్తుడగును.

**స్వతస్సిద్ధమిదం సర్వం స్వయం ప్రోక్తం స్వయంభువా।**
**ఓమిత్యేత త్స్వరూపాంతం సాధ్యతామేవ సర్వదా॥**

ఇదియంతయు తనంతట నదియే సిద్ధమైయున్నది అని బ్రహ్మదేవుడు స్వయముగా చెప్పియున్నాడు. గనుక జీవుడు స్వస్వరూపమును బొందువరకును సర్వ ప్రకారములచేతను ఈ యోంకారము సాధన చేయు గాక!

**గాయత్రీ వేదమాతా స్యా న్మహావాక్యం పితా భవేత్।**
**ఓంకార స్సర్వమూలం స్యా త్సఏవహి పితామహః॥**

గాయత్రి వేదములకు తల్లి, మహావాక్యము తండ్రి. ఓంకార మన్నిటికిని మూలము. అదియే పితామహుడు.

**ఓ మిత్యేతత్స్వయం జ్ఞాత్వా గాయత్రీం వేదమాతరమ్।**
**మహావాక్యం చ విజ్ఞాయ వేదాభ్యాసఫలం లభేత్॥**

ఓంకారమును, వేదమాతను, గాయత్రిని వేదమునందు జెప్పబడిన మహావాక్యమును తెలిసికొన్నవాడు వేదముల నభ్యసించినవాని ఫలమును బొందును. ఈ ప్రణవమును గురించిన విషయము లింకను అనేక ఉపనిషత్తులందును జెప్పబడినవి. వాటిని కొన్నింటి నిట నుదాహరించెదను.

ఓమితి స్మరణేనైవ బ్రహ్మజ్ఞానం వరావరమ్ ।
తదేవ మోక్షసిద్ధిం చ తదేవామృత మశ్నుతే ॥

అఖండ ఉదాసీన శుద్ధ, బుద్ధ, ముక్త, స్వభావ సచ్చిదానంద స్వరూపముగ నుండు బ్రహ్మము, అనంతకోటి నామరూపములతోను, కోటి సూర్య ప్రకాశముతోను, సమస్తమైన చరాచర ప్రాణికోట్ల హృదయాంతరాళము నందును, బాహ్యమందును, దేదీప్యమానమై వెలుగుచుండు నా బ్రహ్మ మును ఎవరెవరు తమ తమ మతానుసారముగా తమ కిష్టమైన, యేవిధ నామరూపములతో భజించినను వారికి ఆ విధమైన నామరూపములతో నా భగవంతుడు ఫలం బొసంగి అనుగ్రహించుచున్నాడు.

ఓంకార వాచ్యమాత్మానం సచ్చిదానంద లక్షణమ్ ।
సమస్తమంగళోపేతం జగత్ప్రభు ముపాస్మహే ॥

ఓంకారముచేత చెప్పదగినవాడును, సత్తు, చిత్తు, ఆనందము అను నవియే స్వరూపముగా గలవాడును, సమస్తమైన మంగళములతో గూడినవాడును, లోకములకు ప్రభువునగు పరమాత్మను నుపాసించెదము.

ఓంకారః వరమం బ్రహ్మ సర్వమంత్రేషు నాయకః ।
ప్రజాపతే ర్ముఖోత్పన్న స్తపస్సిద్ధస్య వై పురా॥

ఓంకారము పరబ్రహ్మము, మంత్రములన్నిటిలోను నాయకమణివలె ముఖ్యమైనది. ఆ యోంకారము పూర్వము తపస్సిద్ధుడైన బ్రహ్మదేవుని ముఖము నుండి బయలు వెడలినది.

ఓమి త్యుచ్చారణేనై వ వాచ్యమానీయతే వరమ్ ।
ఓమిత్యానీయ తద్బ్రహ్మ నమస్కారపదేన తు॥

ఓం అని యుచ్చరించుట చేతనే వాచ్యమంతయు పరమపదమును బొందింపబడుచున్నది. నమస్కార పదముచేతను ఓం అని యా బ్రహ్మమును బొందింపబడవలయును.

**అవాచ్యం ప్రణవస్యార్థం యస్తం వేద స వేదవిత్ ।**
**ఓంకార ప్రభవో విష్ణు స్త్రినేత్రో వచసాం పతిః॥**

ఇట్టిదియని వచించపనలవిగాని, ప్రణవమనగా ఓంకారముయొక్క అర్థమునెవ్వడెఱుగునో, వాడే వేదములనెఱిగినవాడు. విష్ణువు– శివుడు బ్రహ్మయను త్రిమూర్తులును ఓంకారమునుండి పుట్టినవారే.

**ప్రణవం హీశ్వరం విద్యాత్సర్వస్య హృది సంస్థితమ్ ।**
**సర్వవ్యాపిన మోంకారం మత్వా ధీరో న శోచతి ॥**

మనుజుడు స్మరణజ్ఞానమునకు స్థానమైన హృదయమందున్న యీశ్వరుని ఓంకారముగా తెలిసికొనవలయును. ఇట్లు సర్వవ్యాపకమైన యోంకారమును తెలిసికొని పండితుడు శోకమును పొందడు.

**అమాత్రోఽనంతమాత్రశ్చ ద్వైతస్యోపశమ శ్శివః।**
**ఓంకారో విదితో యేన స ముని ర్నేతరో జనః॥**

పూర్వము చెప్పిన ప్రకార మోంకారమును, అకారాది మాత్రలును, విశ్వాదిపాదములును లేనటువంటిదియు, సమస్తద్వైతోప శమము గలదియు నగు పరమ మంగళ స్వరూపమునుగా తెలసుకొన్నవాడే, పరమార్థతత్వమును మననము చేయు మహాముని. ఇతరుడు కానేరడు.

**ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే।**
**అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్॥**

ఓంకారము ధనుస్సు, జీవాత్మ బాణము, బ్రహ్మము దానికి గురి యనిచెప్పబడుచున్నది. లోకములో గురిగొట్టువాడెంత జాగరూకుడై బాణముతో గురిని గొట్టునో అంత జాగరూకత కలిగి జీవుని బ్రహ్మముగా ధ్యానింపవలయును. అపుడే జీవాత్మ పరమాత్మగా మారును.

**ఓంకారధ్వనినాదేన వాయో స్సంహరణాంతకమ్ ।**
**యావద్బలం సమాదద్యాత్సమ్యక్ జ్ఞానలయావధి ॥**

ఓంకారధ్వనియొక్క నాదముతో ప్రాణవాయువును, మనస్సును సమన్వయపరచి, బాగుగా ప్రాణమనస్సులు నాదమందు లయమును బొందు వరకును, బల మున్నంతవరకు సమాధానము చేయవలయును. ( ధ్యానింపవలె ననుట)

**ఆత్మాన మరణింకృత్వా ప్రణవం చోత్తరారణిమ్।**
**ధ్యాన నిర్మథనాభ్యాసా ద్దేవం పశ్యే న్నిగూఢవత్॥**

ఆత్మను క్రింది అరణినిగాను, ఓంకారమును మీది యరణినిగాను చేసి, ధ్యానమనెడి మథనముయొక్క అభ్యాసమువలన లోపల దాగియున్న యగ్నిని వలె స్వయం ప్రకాశమానుడైన పరమాత్మను గనుగొనవలయును.

**మృద్వాసనే సమాసనో యతచిత్తేంద్రియ క్రమః।**
**ఓమిత్యుచ్చారయేత్తావన్మనో యావత్ప్రసీదతి॥**

మెత్తనైన ఆసనమునందు కూర్చున్నవాడై చిత్తమును, ఇంద్రియముల సంచారమును నియమించి మనస్సును ప్రసన్నమగువఱకును ఓంకారము నుచ్చరింపవలయును.

**ఓంకారేణ ప్లవేనైవ సంసారాబ్ధిం తరిష్యతి!**

జీవుడు ఓంకారమనెడి తెప్పచేతనే సంసారసముద్రమును దాటగలడు.

**నాసాగ్రే దృష్టిమారోప్య హస్తపాదౌ చ సంయమేత్।**
**మన స్సర్వత్ర సంగృహ్య ఓంకారం తత్ర చింతయేత్॥**

ముక్కు చివర చూపునుంచి చేతులు, కాళ్ళు నియమింపవలయును. అన్ని విషయముల నుండియు మనుస్సును నిగ్రహించి యప్పుడోంకారమును చింతింపవలయును.

**తమేతచ్చ జపన్నిత్యం బ్రహ్మవిద్బ్రహ్మసంజ్ఞకమ్।**
**సర్వం తద్వేద్య మేవ స్యాత్సమహాత్మా మహాన్పరః॥**

బ్రహ్మమను పేరుగల నీ యోంకారమును, నిత్యమును జపము చేయువాడు బ్రహ్మము నెఱిగినవాడే యగును. అట్టివాని కిదంతయు తెలియదగినదియే యగును. అటువంటి మహాత్ముడు గొప్పవాడు అనగా అందరికంటె పైవాడగును.

**ఓమిత్యేకాక్షరధ్యానా ద్విష్ణు ర్విష్ణుత్వ మాప్తవాన్।**
**బ్రహ్మ బ్రహ్మత్వమాపన్న శ్శివతా మభజచ్ఛివః॥**

ఓంకారధ్యానము వలననే, విష్ణువు ( విష్ణుత్వ) పాలకత్వమును, బ్రహ్మ సృష్టికర్తృత్వమును, శివుడు శివత్వమును పొందియున్నారు.

**ఓమిత్యేకాక్షరో మంత్ర స్సర్వగస్సర్వ సంస్థితః।**
**యశ్చ తం ధ్యాయతే నిత్యం స ద్విజాదధికో భవేత్ ॥**

ఓం అనెడి, ఏకాక్షరమంత్రము సర్వమును బొందియున్నది. అన్నింటియందును నిండియున్నది ఎవడైతే, నిత్యమా యోంకారమును ధ్యానించుచుండునో, వాడు బ్రాహ్మణుడికంటే అధికుడగును.

**ఓమిత్యేకాక్షరం ధ్యాయ న్యతిస్సంగవివర్జితః।**
**జీవన్ముక్తో భవత్యంతే బ్రహ్మభూయాయ కల్పతే॥**

సర్వసంగములను విడుచుకొన్నవాడై ఓంకారమును ధ్యానించుచు జీవన్ముక్తుడై దేహాంతమందు బ్రహ్మమే యగును.

**గాయత్రీ వేదమాతా చ వేదస్య ప్రణవః పితా।**
**ప్రతిమంత్రం ప్రయోక్తవ్య మోమిత్యేతత్పరావరమ్॥**

వేదముల తల్లి గాయత్రి, ఓంకారము వేదములకు తండ్రి, అన్నిటి కంటెను శ్రేష్ఠమైన యోంకారమును, ప్రతియొక్క మంత్రమునందును ప్రయోగించునది.

**నివృత్తే స్సర్వదుఃఖానా మీశానః ప్రభురవ్యయః।**
**అద్వైత స్సర్వభావానాం దేవస్తుర్యో విభుస్స్మృతః॥**

సర్వదుఃఖములు లేనివాడును, ఈశానుడును, ప్రభువును, అవ్యయుడును, సమస్తభావములను రహితమొనర్చువాడును, దేవుడును, విభువును, తురీయుడును అగు నాత్మ ప్రణవము యొక్క నాల్గవ పాదమగును. అట్టిదానియందు నిలకడ కలుగులాగున ముముక్షువులు ప్రయత్నింపవలెను.

**తిలమధ్యే యథాతైలం క్షీరమధ్యే యథా ఘృతమ్**
**పుష్పమధ్యే యథా గంధః ఫలమధ్యే యథా రసః!!!**
**కాష్ఠాగ్నివత్ప్ర కాశేత ఆకాశే వాయు వచ్చరేత్!!**

ఈపై జెప్పినవన్నియు, వానికిచేయవలసిన క్రియలు చేయకపోవుటచే వానిలోగల సారము కనుపించుటలేదు. నువ్వులు గానుగయందాడుటచేత నూనెయును, పాలను పెరుగుచేసి మథించుటచే వెన్నయు, పుష్పమునుండి గంధముతీయు విధానమువల్ల పరిమళము గనుపించునట్లును, ఫలములనుండి

రసమును, కట్టెను అరణిగా జేసి మథించుటవలన నిప్పును, ఆకాశమందు వాయువువలెను, ఆత్మలో చేయవలసిన ధ్యానజ్ఞానమథనాదులచే తనయొక్క బ్రహ్మతత్త్వము గనుగొనదగును.

**తావదేవ నిరోధస్స్యా ద్యావత్తత్త్వం న విందతి।**
**విదితే తు పరే తత్త్వే ఏకమేవానుపశ్యతి॥**

ఎంతపర్యంత మపరోక్షజ్ఞానమెఱుగడో, అంతవరకు ఇంద్రియ నిరోధముగలవాడై ధ్యానానుష్ఠానముల చేయుచుండవలెను. సర్వోత్తమమైన తత్త్వము తెలిసినమీద యొక బ్రహ్మమునే అంతటను జూడగలుగును.

**నవచ్ఛిద్రాన్వితా దేహాః స్రవంతి కళికా ఇవ।**
**నైవ బ్రహ్మ న శుద్ధంస్యాత్పుమాన్బ్రహ్మ న విందతి॥**

దేహములు నవరంధ్రములతోగూడినవి. చిల్లులుపడిన కుండవలె జ్ఞానమును స్రవింపజేయుచున్నవి. కాబట్టి ఆత్మను తెలుసుకొనడు. (అందువలన) బ్రహ్మము శుద్ధమైనదికాదని కాదు. అనగా శుద్ధమే. ఇందువలన నింద్రియ నిగ్రహములేనివారి జ్ఞానమంతయు, బెజ్జము పడిన కుండలోగల జలము కారిపోవునట్లు నశించుచున్నది. అట్టివారికి తన ఆత్మను దర్శించుట కవకాశము కలుగదు. వైరాగ్యముయొక్క ప్రయోజనము దీనివల్ల తెలసికొనవచ్చును. ఇప్పుడు అధర్వశిఖోపనిషత్తున ఈ ప్రణవమే ''తారకము'' ని తెలుపబడినది.

**దేవా శ్చేతి సంధత్తాం సర్వేభ్యో దుఃఖభయేభ్యః**
**సంతారయతీతి తారణాత్తారః॥**

సకల దేవతలును ప్రణవస్వరూపమే. సమస్త దుఃఖములనుండియు, సకల భయములనుండియు తరింపజేయునదిగా యుండుటంబట్టి తారణమనబడును. తారణము చేయుటవలన తారక మనబడును. మరియు శ్రీ కాశియందు

పరమశివుడు అచట ప్రాణము వీడిపోయెడు ప్రాణులకు ఈ ప్రణవమను తారకమంత్రము నుపదేశించియే బ్రహ్మపదమునకు చేర్పించుచున్నట్లు తెలిపెడు శ్రీ పద్మపురాణాంతర్గత శ్రీ మాఘపురాణమున నుపదేశించినది చూడుడు.

కాశీపతిః కారుణికః కరాభ్యా
మాదాయమూర్ధాన మతీవ తాసామ్।
అగమ్య వేగా ద్యుగవచ్చ తాసా
మోంకార మోంకార యతిస్మ కర్ణే ॥

కాశీ విశ్వేశ్వరుడు, మృగశృంగుని భార్యలయందు కనికరముగల వాడై, వారితలలు తన చేతితో లేవ నెత్తి పట్టుకొని, ఆ నలుగురి చెవులయందును ఏకకాలముననే, ఓం, ఓం అని వారి చెవులలో తారకమంత్రమయిన ప్రణవమును ఉపదేశము చేసెను. అపుడు వారు ముక్తులై స్వప్రకాశమగు శివపదము నొందిరి. అనగా మోక్షము నొందిరి. ఇందువల్ల స్త్రీలకు ప్రణవధ్యానము చేయవచ్చునా? యని సందేహముగలవారికి సంశయ నివృత్తి కాగలదు. కావున, సామాన్యులగు మనుష్య ప్రాణుల మాటలను నమ్మవలయునా? లేక సర్వేశ్వరుండగు పరమేశ్వరుని వాక్యముల విశ్వసింపవలయునా? యను తత్త్వము దీనివల్ల తెలసికొనదగును. వేదములున్ను, వేదపురుషుడగు సర్వేశ్వరుడున్ను, స్మృతులున్ను, స్మృతి కర్తలగు పరమ ఋషులున్ను ఇట్లు చెప్పుచుండగా ఇంకను సందేహము ఏల కలుగవలయును?

ఓమ్.

ఓమ్

# అనుబంధము

(పంచప్రాణములు)

శ్రీ భగవద్గీతలో జీవన్ముక్తులు ఏలాగున ద్వంద్వములగు దృశ్య వ్యవహారములనుండి విముక్తులు కావలసియుందురో, దృశ్యవృత్తులగు సుఖ దుఃఖములెట్లు తమలో చేరక యుండవలసియుండునో ఆ విషయమై శ్రీ కృష్ణభగవాను డుపదేశించిన యీ క్రింది శ్లోకముల నప్పుడప్పుడు పఠనము చేయుచుండిన ప్రకాశము దగ్గరకు అంధకార మేలాగున చేరజాలదో, అట్లు స్వమహిమలో నిలచిన, ప్రకృతియొక్క శుభా శుభములచే భావమునకు మార్పు గలుగదు. ఇట్టి అనుసంధానముచేతనే, ప్రకృతిలో తగులుకొనక నిరంతరము అఖండానంద బ్రహ్మభావములోనే కాలము గడుపవచ్చును.

మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽ నిత్యాః తాంస్తితిక్ష స్వ భారత ॥ అ.2శ్లో॥ 14

భరత కులమునందు పుట్టినవాడవగు నో యర్జునా! ఇంద్రియములకు శబ్దము మొదలగు విషయములతో గలిగిన సంయోగము లైతే, శీతము, ఉష్ణము, సుఖము, దుఃఖములను ఇచ్చుచున్నవి. అవి రాకపోకలు గలవి. కావున నశించునట్టివి. అందువల్ల నా శీతోష్ణములను సహింపుము. ఇందువల్ల శీతోష్ణ సుఖదుఃఖములు ప్రపంచములో గలవనియు, అవి దినరాత్రులవలె వచ్చిపోవుచుండు ననియు అందువల్ల స్థిరముగా నుండవనితలంచి సహిచుటయే సంయముల ధర్మము.

త్రైగుణ్యవిషయా వేదాః నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥ అ.2 శ్లో॥45

ఓ యర్జునా! వేదములు త్రిగుణములను బోధించునవి కావున, నీవు త్రిగుణాతీతుడవునన్ను, శీతోష్ణాది ద్వంద్వములు లేనివాడవును, సర్వకాలములయందు సత్త్వగుణము నాశ్రయించి గుణత్రయాతీతాత్మయందు నిలుకడ గలవాడవును, యోగక్షేమముల గూడ తలంపని వాడవును, కేవలము ఆత్మజ్ఞానము మాత్రము గలవాడవు నగుము.

**న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య నోద్విజే త్ప్రాప్య చాప్రియమ్।**
**స్థిరబుద్ధి రసమ్మూ ఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః॥** అ.5 శ్లో।20

అపరోక్ష జ్ఞానమందు స్థిరమైన బుద్ధిగలవాడును, మోహములేనివాడును అయిన బ్రహ్మజ్ఞాని, నిరతిశయానంద బ్రహ్మమునందు ఉన్నవాడునై యిష్టము ప్రాప్తించిన సంతోషింపగూడదు. అనిష్టము సంప్రాప్తమయిన శోకింప గూడదు. ఇది ప్రకృతియొక్క స్వభావమనియో లేక తనయొక్క సంస్కారమనియో తలంచి నిశ్చలముగా నుండవలయును.

**యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।**
**శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్య స్స మే ప్రియః॥** అ.12 శ్లో।17

ఎవడు ఇష్టవస్తులాభమునందు సంతోషింపడో, అనిష్టవస్తుప్రాప్తి యందు ద్వేషింపడో, ప్రియవియోగమునందు వ్యసనము నొందడో, అప్రాప్తమగు దానిని కోరడో, ఎవడు శుభాశుభ కర్మలనుగూడ సమముగా జూచునో, ఎవడు సర్వదా భగవద్భావము గలవాడో వాడు నాకు ఇష్టుడు. ఇచట ''భక్తిమాన్'' అని ప్రయోగించుటచే సదా భగవద్భావములో నిలుకడ గలవానికి ఇతర కర్మలతో సంబంధము అక్కరలేదు. ఇచట ''స మే ప్రియః'' అని ప్రయోగించుటచేత ''నాకు ప్రియుడు'' అంతేగాని నాపై ''ప్రీతిగలవాడు'' అని ప్రయోగించలేదు. ఇందువల్ల భక్తి గలిగి యుండిన చాలదు. భగవంతుడు తనపై ప్రీతిగలిగి యున్నాడా? లేడా? యని బాగుగా జ్ఞాపకము జేసికొనవలయును. అది దీనిలో గల కీలకము.

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి।
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥ అ.18 శ్లో।54

బ్రహ్మసాక్షాత్కారము గల జ్ఞాని పొంద బడిన ఆధ్యాత్మ ప్రసన్నత్వము గలవాడు దేనిని గురించిన్ని దుఃఖింపడు. ప్రాప్తింపని దానిని కోరడు. లేక ప్రాప్తించిన దానిని గూర్చి సంతోషింపడు. సకలములగు ప్రాణులయందు సముడై అనగా సకల భూతములయందలి సుఖమునుగాని, దుఃఖమునుగాని తన సుఖ దుఃఖములవలె జూచువాడై యుండును. అందువల్ల సర్వోత్తమమైన భగవద్భక్తిని పొందుచున్నాడు. ( భగవన్మయుడగుచున్నాడు)

ఓమ్.

ఓమ్

# శ్రీకృష్ణకరుణారసము

**నేహాభి క్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।**
**స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥** అ.2 శ్లో॥40

ఈ గీతాపఠనమునందు క్రమనాశమను దోషము లేదు. అనగా గీతా పఠనము ప్రారంభించి మధ్య కొన్నిరోజులు చేయకపోయినను దోషము లేదు. అంతే గాదు, ఉచ్చారణదోషమేదైనను గలిగిన భగవద్భక్తి గలిగియుండిన అట్టి దోషమున్ను లేదు. కొంద రీలాగునచెప్పుదురు. గీతాపారాయణమును ప్రారంభించిన తప్పక ప్రతిరోజున్ను చేయవలయుననియు, స్పష్టముగా ఉచ్చరింపవలయుననియు, చెప్పుటచే సామాన్యులు భయపడి గీతాపారాయణమును ప్రారంభించకయే కాలము గడుపుచున్నారు. అట్టి భయమక్కరలేదని భగవంతుడే తెలిపియున్నాడు. దీనివలన క్రమముగా పఠనము చేయవలసిన అవసరము లేదని అభిప్రాయము గాదు. అనివార్య కార్యము తటస్థించినచో ఒకవేళ తప్పిపోయినను అది పాపమని తలంపనక్కర లేదు. ఆలాగున అనుష్ఠానములోగూడ తప్పిదము గలిగిన భయపడనక్కరలేదు. ఈ గీతా పఠనము గాని, బ్రహ్మనిష్ఠ గాని మిక్కిలి స్వల్పమైనను అది మిగుల గొప్పదియైన జననమరణ ప్రవాహరూపమగు సంసార భయమునుండి రక్షించుచున్నది. సముద్రము దాటుటకు సముద్రమంత విశాలమగు ఓడ యెట్లు అక్కర లేదో, చిన్నదగు పడవవలన ఎట్లు దాటవచ్చునో, మహారణ్యమును చిన్నదగు నిప్పు ఏలాగున కాల్చివేయునో, ఆలాగున అజ్ఞానారణ్యమును ఈ గీతాపారాయణ జ్ఞానాగ్ని కొంచెమైనను భస్మ మొనర్చును.

**యావానర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే।**
**తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥** 2 శ్లో॥ 46

దాహము గలవానికి ప్రపంచములో గల గంగ, యమున, సింధు, గోదావరి మొదలగు మహానదులలో గల జలమంతయున్ను, అలాగున పుష్కరాది సరోవరములలో గల తీర్థమంతయు, ఇక లోకములోగల కూపాదులలోని జలమంతయు ఎట్లవసరము లేదో ఒక్కలోటా నీళ్ళుమాత్రము చాలునో, ఆ లాగున ఆకలి గలవానికి ప్రపంచములో పండుచుండెడి కోట్లకొలది పుట్ల గోధుమలు గాని, బియ్యము గాని, జొన్నలు గాని, సజ్జలు గాని, రాగులు గాని యెట్లు అవసరము లేదో, యేదైన కొంత అన్నము మాత్రము చాలునో, అదేరీతిగ రోగముగలవానికి ఆయుర్వేదములో చెప్పబడిన ఔషధములన్నియు, పథ్యమంతయు యెట్లక్కరలేదో ఆలాగున, అజ్ఞాన దాహము గలవానికి ఒక్క భగద్భక్తియు, తాపత్రయము గలవానికి ఒక అనుష్ఠానమున్ను, భవరోగముగలవానికి ఒక అభ్యాసమున్ను ఉండిన చాలును. ఇట్టి భగవద్వాక్యములపై విశ్వాసము గలిగి యుండవలయును. అట్లుగాక అపారమగు వేదములలో చెప్పబడిన అనుష్ఠానములన్నియూ చేయవలసిన పని లేదు. ఈ సత్యము తెలియకనే, కొందరు కుయుక్తులు మీకష్టాంగ యోగము వచ్చునా! సప్తజ్ఞాన భూమికలు తెలుసునా! కపాలాది ఆసనములు వచ్చునా! సాంఖ్యతత్వములు 24 నేర్చుకున్నారా! స్మరణాది నవవిధభక్తులు పరిశీలించితిరా! తారక సాంఖ్యామనస్కాదులు తెలుసునా! ఈలాగున చెప్పుచూ, భక్తులను భయపెట్టుదురని తలంచియే భగవంతుడు కరుణించి భయపడనక్కరలేదని తెలుపుటకు కారణమైనది. అయితే దాహము గలవానికి ఒక లోటా తీర్థమున్ను, ఆకలిగొన్నవానికి కొంత అన్నమున్ను, రోగముగలవానికి కొంత ఔషధమున్ను, దానికి తగిన పథ్యమున్ను లేనిచో ఎట్లు దప్పికయు, ఆకలియు, రోగమున్ను శమించదో అదిన్ని జ్ఞాపకము జేసుకొనవచ్చును. అట్టి ఒక్క అనుష్ఠానము మాత్రము గలిగి యుండవలయునని దీనియొక్క భావము.

**యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి।**
**తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥** 2 శ్లో॥ 52.

ఓ యర్జునా! ఎపుడు నీయొక్క బుద్ధి మూల ప్రకృతిని దాటునో అపుడు వినదగిన యర్థమున్ను, ఇదివరలో వినిన యర్థమును పొందగలవు. అపుడే బుద్ధి పర్యంతము గల సమస్త విషయములలోను విరక్తి గలుగును. ఇది ముముక్షువులకు గల సందేహమును నివృత్తింప జేయుచున్నది. ఇంతవఱకు ధ్యానానుష్ఠానములు చేసిన నిర్విషయము, నిశ్చలత్వము గలుగక పోవుటకున్ను, బ్రహ్మసాక్షాత్కారము గలుగకపోవుటకున్ను కారణము దీనియందు నిరూపించడమైనది. బుద్ధి యెంతవరకు త్రిగుణాత్మకమగు మూల ప్రకృతియైన కాలుష్యమును దాటలేదో, అంతవరకు ఆత్మసాక్షాత్కారము గలుగదనియు, ఇదివరలో గురుముఖము నుండి వినిన యర్థము గోచరము కాదనియు, ఎపు డాత్మ మూడు గుణములగు ప్రకృతిని దాటునో అపుడే యిదివరలో శ్రవణము జేసిన దానియొక్క యర్థము గోచరమగుననియు, అపుడు ఇక చూడవలసిన శాస్త్రములు గాని, వినవలసిన భాగములు గాని, చేయవలసిన అనుష్ఠానములు గాని మిగిలి యుండలేదనే అనుభవ జ్ఞానము గలుగును.

**యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః**
**ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 2 శ్లో॥ 58**

ఈ శ్లోకము దృష్టాంతపూర్వకముగా సంయమియొక్క లక్షణమును దెలుపుచున్నది. తాబేలు ఏలాగున తనకు ఇష్టమువచ్చినపుడు కర చరణా ద్యవయవములను లోనికి ముడుచుకొనునో, ఆలాగున ధ్యానయోగి తాను తలంచినపుడెల్ల త్వక్చక్షుః శ్రోత్ర, జిహ్వాఘ్రాణములనెడు జ్ఞానేంద్రియములను, వాక్పాణి పాదపాయు ఉపస్థలనెడు కర్మేంద్రియములను స్వాధీనములో నుంచుకొనుటకు శక్తిగలిగియుండునో, ఆలాగున అంతరింద్రియములను గూడ వశములో నుంచుకొను యోగ్యత గలుగునో అట్టివానియొక్క జ్ఞానము చలనము లేనిదిగా యుండును. ఇట్టి అవస్థ గలుగునపుడే స్థితప్రజ్ఞుడగును. అనగా చలనము లేని జ్ఞానముగలవాడగును. కావున ఇట్టి ఇంద్రియముల నిగ్రహము తమకు

గలిగియున్నదా? యని ప్రతి ముముక్షువున్ను, సాధకులున్ను సదా జ్ఞాపకములో నుంచుకొనవలయునని యుపదేశించడమైనది. తాబేలు ఎండు ఆకులున్న ప్రదేశమున సంచరించునపుడు ఆ శబ్దమును లక్ష్యమును జేసికొని నక్కలు, కుక్కలు మొదలగు జంతువులుగాని లేక కిరాతకులు గాని దానిని పట్టుకొనెడి స్వభావము గలదు. ఈ తత్త్వము నెరింగి యెచట ఎపుడు తన కపాయము గలుగునని తోచునో, అపుడు కూర్మము కరచరణాది అవయవములను లోనికి ముడుచుకొని ఒక రాయివలె నుండును. అందువల్ల దానికి ఏఅపాయమున్ను గలుగదు. మరియు అది నీటిలోను, భూమిలోను సమానముగా జీవింపగలుగును. ఆలాగున ఏ యింద్రియములు ఏవిషయములపై బోవుచున్నవో తెలిసికొని దానిని హృదయములోనికి ఇమిడించు శక్తిగల నిష్ఠగలవాడై యేకాంతములోనూ, లేక సంసారుల మధ్యలోనుండినను సాధకునకు అపాయము గలుగదు.

**ఇంద్రియాణాంహి చరతాం యన్మనోఽనువిధీయతే ।**
**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివామ్భసి ॥** 2.శ్లో॥67

ఎవనియొక్క యింద్రియములు విషయములలో ప్రవర్తించునో వారికి గల అపాయము యీ శ్లోకము తెలుపుచున్నది. సముద్రమున ప్రయాణముచేయు ఓడ, తుఫానులో చిక్కుకొని యెట్లు మునిగిపోవునో, ఆలాగున సంసార విషయసాగరములో ప్రవర్తించువానియొక్క ప్రజ్ఞ నశించిపోవును. నావికులు ఏలాగున తుఫానుయొక్క చిహ్నము కనిపించినపుడు, ఓడను లంగరువేసి నిలుపుటగాని లేక రేవులోనికి చేర్చుటగాని చేయుదురో, ఆలాగున విషయరూప లాంఛనములు గనుపించిన సాధకుడుగూడ అట్టిస్థలమునుండి తప్పించుకొనుట గాని, లేక శక్తి గలిగియుండిన మనోనిగ్రహము చేసికొనుటగాని జేయవలయును. లేనిచో తనయొక్క జ్ఞానము నశించిపోవును. ఈ తత్త్వమెరిగిన మనస్సు గదా ప్రధానము. ఇంద్రియములు ఏవిషయములో ప్రవర్తించిన నేమి దోషమని యడుగువారు కలియుగమున ఏర్పడగలరని తలంచి భగవంతుడు తన భక్తులు,

ఎచ్చోటనైన అజాగ్రత్త గలిగివర్తించి, చెడుపోవుదురేమోయని తలంచి యిట్లు కరుణారసముతో ఉపదేశించడమైనది.

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి! ।
స్థిత్వాఽస్యామ న్తకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి॥ 2 శ్లో॥ 72

ఓ యర్జునా ! ఈ స్థితప్రజ్ఞుని గురించి చెప్పినదంతయు బ్రహ్మవిషయమైనది. ఇటువంటి బ్రహ్మనిష్ఠను బొందినవాడు మరల మోహమును జెందడు. మరియు నో యర్జునా! ఈ బ్రహ్మనిష్ఠను ముసలితన మందవలంబించినను తప్పక మోక్షమును పొందును. ఈ శ్లోకము వృద్ధులగు ముసలమ్మలను గురించియు, ముసలయ్యలను గురించియు కరుణతో జెప్పడమైనది. యౌవన కాలమంతయు సంసారములో గడిపి, ధనమంతయు పుత్రాదులకు స్వాధీనపడిన తర్వాత యేదో ఒక గొప్ప పుణ్యవిశేషముచే జిజ్ఞాసయు, భక్తియు గలిగిన వారిని గురించియు చెప్పడమైనది. భయపడనక్కరలేదు. అంత్యకాలమైనప్పటికైనను బ్రహ్మ చింతన గలిగిన చాలునని అనగా ప్రాణము కంఠగతమైన సమయమందైనను బ్రహ్మవిచారము గలిగిన చాలునని భక్తులపై జాలిగలిగి తెలుపడమైనది. దానిచే గలిగెడు ఫలితము స్వల్ప మైనదిగాదు. ''బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి'' అని తెలుపుటచే సాక్షాద్బ్రహ్మమునే పొందగలుగును అని వచించిరి. అయితే చిన్నకాలమునుండి గాని, యౌవనకాలమందుగాని ధ్యానము చేయువారిని గురించి మఱల జెప్పవలయునా యని భావము. అయితే వారికిన్ని, వీరికిన్ని యేమి భేదమనగా! ఒకడు శ్రీ వేంకటేశ్వర దర్శనమునకు ఉదయమునుండి స్నానాద్యనుష్ఠానములు జేసి దేవాలయములో కూర్చున్నాడు. వానికి తలుపు దీయునపుడు దర్శనము లభించునని నమ్మకము గలిగి యుండును. మరియొకడు దర్శన ఘంటానాదము విని దూరమునుండి పరుగెత్తి వచ్చెను. ఉదయమునుండి నిరీక్షించువానికిన్ని, వీనికిన్ని ఏకకాలముననే దర్శనము లభించెను. అయితే వీడు దర్శనము లభించునా! లేదా! యని భయముతో గూడియుండెను. మొదటి వానికి అట్టిదిగులు మాత్రము ఉండలేదు.

అంతే భేదము. మొదటివానికి భయములేక పోవుటయు, దేవాలయ విభూతులన్నియు చూచి ఆనందించుటయు సిద్ధించెను. రెండవవానికి అది లేదు. అలాగున బాల్యయౌవనాదులనుండి బ్రహ్మవిచారము చేయువారికి ఈ దేహమందుండునపుడే బ్రహ్మానుభవజ్ఞానానందము గల్గును. భగవద్విభూతియు చూచి ఆనందింపవచ్చును. ఇతరులకు గూడ చెప్పవచ్చును. అదే విశేషము. రెండవవానికి అట్టి భాగ్యము లేదు. లేక ఒక అన్న సత్రమునకు ఒక అతిథి ఉదయమున వెళ్ళి తనపేరు దాఖలుచేసుకున్నాడు. వాడు సత్రములోనే స్నాన, ధ్యాన పారాయణలు జేసికొని భోజన విషయములో నిశ్చింత గలిగియుండెను. ఇంకొక బాటసారి దూరమునుండి నడుచుచూ భోజన ఘంటకొట్టిన సమయమునకు పరుగెత్తివచ్చెను. అయితే దారిలో అన్నము దొరుకునా! లేదా యను దిగులుతో వచ్చెను. ఉభయులకున్న భోజనము ఏక కాలములోనే లభించెను. పైజెప్పినభేదము ఉభయులకున్ను గలిగియున్నట్లు, ఈ మోక్షవిషయములో చిన్నకాలమునుండి అనుష్ఠానము గలవానికిని, ముసలితనము వచ్చినతర్వాత అనుష్ఠానముగలిగినవానికిన్ని గలదు. ఈ వాక్యము నాధారము జేసికొని మంచికాలము వ్యర్థముగా బోగొట్టకూడదు. మరియు అంత్యకాలమున మనస్సు భగవద్విషయములో ప్రవర్తించిన యెట్లు మోక్షముగలుగునని భయపడనక్కరలేదు. పరుసవేది సంబంధముచే ఇనుము అపుడే ఎట్లు సువర్ణమగునో, ఆలాగున భగవంతునిలో మనస్సు ఎపుడు లయమగునో అపుడే వానియొక్క జన్మజన్మాంతర కర్మలు నశించి భగవన్మయుడగును. అనగా ముక్తుడగును. అజామిలాదులే దీనికి తార్కాణము.

**ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।**
**తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపంథినౌ ॥** అ.3 శ్లో॥ 34

ఇష్టవస్తువు నందలి ప్రీతియు, అనిష్టవస్తువునందలి ద్వేషమున్ను లేక ఇష్ట మనుష్యునియందు ప్రీతియు అనిష్ట మనుష్యునియందప్రీతియు, ప్రతి

యింద్రియముల యొక్కయున్ను శబ్దాదివిషయముల యందుంటున్నవి. కావున ఏకారణమువలన ఆ రాగద్వేషములు ఈపురుషునికి అన్నిటిలోను అడ్డు తగులుచున్నవో, అందువల్ల అవి శత్రువులుగా తలంచవలయును. ఆ కారణమువలన రాగద్వేషములకు అధీనత్వమును పొందగూడదు. రాగమున్ను, ద్వేషమున్ను ఏకైకాత్మభావమునకు అనగా సమత్వమునకు అడ్డు గలుగజేయుచుండును. అవి అఖండాత్మను వేరుపఱచును. రాగమునకు లోబడినను అదిన్ని బంధము. శ్రీరామచంద్రుడు వనమున బంగారు లేడిన జూచి, దానియందు రాగము గలిగినందుచే క్రమముగా ఆ మృగ మేలాగున, చిన్న చిన్నగ అరణ్య మధ్యములోనికి శ్రీరాములవారిని తీసికొనిపోగల్గెనో, అలాగున దేనియందైనను రాగము గలిగిన అదిన్నీ అజ్ఞానారణ్య మధ్యమునకు తీసికొని వెళ్ళును. ద్వేషముచేత కంసునికి ఎచ్చోటను ఎల్లప్పుడును శ్రీ కృష్ణుడే కనుపించుచుండెను. అట్టి ద్వేషభావనవల్లనే అతడున్ను నశించెను. కావున ముముక్షువులు, విరక్తులు, భక్తులు రాగద్వేషముల పొందనీయక చూచుచుండవలయును. మనస్సు అనెడి పక్షికి 1. రాగము 2. ద్వేషము అను పక్షములు గలవు. వీని వల్లనే మనస్సు రాగము పైకిగాని, ద్వేషము పైకిగాని యెగరిపోవుచుండును. ఆ రెండు రెక్కలను కోసివేసిన ఆ పక్షి యెగర జాలనట్లు, రాగద్వేషములను వివేకఖడ్గముచేత ఛేదించినచో మనస్సు వాటిపైకి నెగురజాలదు.

**తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।**
**పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనమ్.** 3. శ్లో॥ 41

ఓ అర్జునా! ఏ కారణమువలన కోరికలు గలిగి మనస్సునను మోహపెట్టుచున్నవో, ఆ కారణము వలన నీవు మొట్ట మొదటనే యింద్రియ నిగ్రహమును జేసుకొనుము. కోరికయే స్వభావముగాగల ఆ మనస్సు దైవజ్ఞానమును గూడ నశింపజేయును. కావున అట్టి కోరికను ప్రయత్న పూర్వకముగా విడిచిపెట్టుము. దీనియందు కామమును గురించి విస్తరించి

చెప్పడమైనది. అది సామాన్యమైనది గాదు. జ్ఞానమును, విజ్ఞానమును గూడ నశింపజేయును. దీనియొక్క స్వరూపమును గురించి పై శ్లోకమున ''దుష్పూరేణానలేన చ'' అని వర్ణించినారు. కోరికలు కలిగిన అది పూర్తిచేయుటయు సాధ్యము గాదనియు, అది సముద్రమువంటిదనియు, ఎన్నియో మహానదుల జలములచే పూరింపబడినను, ఇకను ఆసాగరము నిండి యుండలేదనియు తెలియవలెను. ఆలాగున నవద్వారములతో గూడిన దశేంద్రియములను నదులచే, సర్వవిషయముల ననుభవించినను దానికి తృప్తి గలుగదు. మరియు దానిని ''అనలేన చ'' అని గూడ భగవంతుడు వర్ణించినాడు. ఆ అగ్నిలో హోమద్రవ్యములు సమిధలు ఎంతకెంతకు వేసెదరో; అగ్ని అంతకంతకు పెరుగునేగాని తరిగే స్వభావము లేదు. ఆలాగున కోరికలు ఎన్నెన్ని అనుభవించినను, లేక యెన్నెన్ని సమకూడినను మరల మరల అవి పెరుగునే గాని, శాంతినొందవు. కట్టెలు వేయనిచో నిప్పు ఏలాగున స్వయముగా చల్లారునో ఆలాగున కోరికలు పుట్టనీయక వైరాగ్యము గలిగి యుండిన మనస్సు శాంతిని పొందును.

**నిరాశీర్యత చిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః।**
**శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥** 4 అ.శ్లో।21

ఆశలేనివాడును, నియమింపబడిన చిత్తమును దేహమును గలవాడును, పరవస్తు పరిగ్రహము మొదలగు సమస్తములను విడిచినవాడును, శరీరము నిలుచుటకు మాత్రము తగిన పాపములేని కర్మమును జేయువాడును అగు జిజ్ఞాసువు సంసారమున బంధమును పొందడు. ముముక్షువైనవాడు భోగములను ఎంతకెంతకు తగ్గించునో, అంతకంతకు యోగమున కనుకూలపడును. ముక్తికి అనుకూలమగు భుక్తి గలిగి యుండవలయును. అట్టి భుక్తికి మాత్రము పాపము లేని కర్మలు చేయుట బంధము గాదు. అదిన్ని దేహతపస్సుగా తలంచవలెను. అదిన్ని జీవించుట కెంతవమాత్రవము గావలయునో అంతవమాత్రవే

సంపాదింపవలయును. అంతేగాని ఆశ పెరిగి సంపాదింపవలయునని తలంపు ఉండరాదు. శ్రీ కబీరుదాసుగారు, శ్రీ తిరువళ్ళూరు నాయనగారు, శ్రీ వీరబ్రహ్మయ్యగారు మొదలగు మహా బ్రహ్మనిష్ఠులు ఈభగవంతుడుపదేశించిన వృత్తిని అవలంబించి జీవించిరి. ఇతరులపై ఆధారపడియుండునట్లుగాని, ఇతరులను యాచించి జీవించుటగాని మంచిది గాదని శ్రీకృష్ణభగవానులు భక్తులపై ప్రేమ గలిగి ఉపదేశించెను. పరవస్తుపరిగ్రముచే దాతల యొక్క పాపము వస్తువులతో గూడ వచ్చును. లేక అస్వతంత్రులై యుండవలయును. అది భూమి మక్తాకౌలుకు జేసెడి కృషివంటిది. లేక వడ్డీధనముచే వ్యాపారము జేయునట్లుండును. చక్కగా వ్యవసాయము చేసి జాగ్రత్తతో వ్యాపారముజేసి సంపాందించినచో అసలుదార్లకు ఇచ్చి మిగిలినదానిచే జీవించుకొనవచ్చును. అలాగున బహుజాగ్రత్త గలిగి వ్రతనిష్ఠతో బ్రహ్మనిష్ఠ జేసినచో అంత లోపము గలుగదు. లేనిచో ముముక్షువులు బద్ధ లగుదురు. జీవితమున సౌఖ్యము జూచుదురేగాని, ఆత్మలో గలిగెడు కొఱతను సామాన్యులు చూడజాలరు. స్వల్ప ధనము గలవారు దానిని ఆడుమానము బెట్టి, ధనము తీసుకొని ఆడంబరముగా వివాహాదులు జరిపి సుఖముగా భోజనము చేసిన ఆ అప్పును తీర్చ శక్తిలేనిచో, క్రమముగా వడ్డీ పెరిగి పూర్వముండిన ధనమును గూడ దావాచేసి అసలుదారుడు స్వాధీనపరుచుకొనును. అలాగున పరుల యాశ్రయముచే భోజనాది సౌఖ్యములతో సంతసించి కాలము గడిపెడు ముముక్షువులు చాల జాగ్రత్తగలిగి వ్రతనిష్ఠలు సల్పవలెను. లేనిచో పూర్వ పుణ్యము గూడ నశించిపోవును–అని శ్రీకృష్ణుడు నిండా జాలిగలిగి తెలిపినాడు.

ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తేస్థితాః॥ 5 అ. శ్లో॥ 19

ఎవరి యొక్క మనస్సు సమస్త భూతములయందును వెలుగుచుండు పరమాత్మయొక్క సమభావమునందున్నదో, వారిచేత ఈ లోకమునందే జనన

మరణములు జయింపబడెను. ఏ కారణమువలన అన్నిటిలోనుండు బ్రహ్మము ఏకమై ప్రకృతి దోషరహితమైనదో ఆకారణమువలన ప్రకృతిని జయించినవారగువారు సదా బ్రహ్మమునందే యున్నవారు. ఈ శ్లోకమునందు 'ఇహ' ఏవ, అని ప్రయోగించుటవల్ల, ఇచ్చటనే యీ దేహ ముండునప్పుడే ప్రకృతి రహితులు కావలయుననియు, ఇచ్చటనే సర్వాత్మకత్వమగు బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము గలుగవలయుననియు ముముక్షువులపై కరుణతో శ్రీభగవంతు డుపదేశించడమైనది. ఇదియే జీవన్ముక్తి యొక్క స్వరూపము. జీవించియున్నప్పుడే బాహ్యాభ్యంతర సకల బంధనముల నుండి విముక్తుడు గావలయును. ఈ విషయమై దార్ఢ్యముకొఱకు మఱియొక శ్లోకముచేతను గూడ బోధింపబడుచున్నది.

శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్।
కామక్రోధోద్భవం వేగం స యుక్త స్స సుఖీ నరః ॥ 5 శ్లో॥ 23

బ్రతికియున్న కాలమునందే యే పురుషుడు దేహమును విడుచుటకంటె పూర్వమునందే, కామక్రోధములు కారణములు గాగల వేగమును సహించుటకొరకు సమర్థుడగుచున్నాడో, అటువంటి సాధకుడు యోగసిద్ధిగలవాడును అనగా ఇంద్రియజయముగలవాడు, జ్ఞానసుఖమునుగల వాడు అగుచున్నాడు. ''శక్నోతీహైవ'' యనియు ''ప్రాక్శరీర విమోక్షణాత్'' అనియు ఉపదేశించుటవల్ల, ఈ లోకమునందే ఈ దేహముతో గూడియున్నపుడే సర్వేంద్రియములను జయించవలయుననియు, అదిన్ని ఇపుడు గలిగియుండు దేహము పడిపోవుటకు ముందుగానే గలుగవలయుననియు శ్రీ భగవంతుడు కరుణతో ఉపదేశించెను. అతడే యోగి యనియు, జ్ఞాని యనియు దెలిపినాడు. కావున ఈ విషయములో భక్తులు, ముముక్షువులు బహు జాగ్రత్త వహించవలయునని యుద్దేశించియే భగవంతుడు ఇట్లు ఉద్బోధమును జేయుటకు కారణమైనది. ఇట్టి స్థితి తమకు గలిగినదా యని ప్రతి ముముక్షువున్ను సదా జ్ఞాపకము నందుంచుకొని ప్రవర్తింపవలయును.

**బాహ్యస్ప ర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్।**
**స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే॥ అ.5 శ్లో॥ 21**

బాహ్యమందలి శబ్దాది విషయములయందు అంటని అంతఃకరణము గల యే ధ్యాననిష్ఠుడు, ధ్యానమువల్ల ఆత్మలో గల యే ఉపరతియగు ఆత్మసుఖ మును పొందుచున్నాడో, అట్టి బ్రహ్మనిష్ఠాపరుడు నాశరహితమైన దైవసుఖమును పొందుచున్నాడు. బాహ్యసుఖము ఒక్క క్షణము ఆనందముగా కనుపించినను క్రమముగా మహాదుఃఖరూపమై పరిణమించును. అది విషము గలిపిన క్షీరాన్నమువంటిదే. భుజించునపుడు తీపిగా ఉన్నను తర్వాత ప్రాణహాని కరమగునుగదా! ఆత్మ సుఖము–రోగియైనవాడు మంచి ఔషధసేవ, కఠినపథ్యముతో చేయునట్లుండును. మొదట కొంచెము కష్టముగా తోచినను తర్వాత రోగరహితుడై ఆరోగ్యవంతుడై యుండునట్లు నియమ నిష్ఠలు గలిగియుండువాడు భవరోగము నశించి, నిరతిశయానంద బ్రహ్మసుఖమును పొందగల్గును.

**యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా ।**
**యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః॥ 6 అ. శ్లో॥ 19**

ఆత్మధ్యానము చేయుచున్నవాడును, మనస్సును స్వాధీనముజేసి కొనిన వాడును అయిన యోగియొక్క చిత్తము, గాలిలేని చోటనున్న దీపమువలె కదలనిదై, వస్తువులను ప్రత్యక్షముగా ప్రకాశింపజేయు విధముగా బాహ్యవిషయ వ్యాపారములేనిదై బ్రహ్మమును సాక్షాత్కరించును. చిత్తైకాగ్రతయు, నిర్విషయ మున్ను గలిగి ధ్యానము జేయు యోగియొక్క లక్షణము జూపడమైనది. గృహాంత రాళమున వెలుగుచుండు దీపము ఏ కిటికీలచేగాని, తలుపులు ద్వారములచేగాని గాలి రానిచో, దీపము యొక్క శిఖ చలింపకుండును. ఏద్వారమువల్ల గాలి వచ్చు ... దీపము చలించుటగాని లేక ఆరిపోవుటగాని గలుగునని తలంచి కిటికీలు

మొదలగు ద్వారములనేలాగున మూసివేతురో, అలాగున స్వప్రకాశమై కేవలము జ్ఞానస్వరూపమై హృదయములో వెలుగుచుండు నాత్మలో యేదైన సంకల్పము గలిగి స్వరూపమునుండి చలించిన ఆయావిషయములో గల భావమును మరుపు జేసికొనుటగాని లేక ఆ విషయములు విడిచిపెట్టుటగాని జేయవలెను. ధ్యానమందున్నపుడు ఏవిషయమువల్ల మనస్సు చలించునో దానిని తెలుసుకొని మాని వేయుటయే సామాన్యోపాయము. లేక మనోనిగ్రహబలముచే ఆ సంకల్పమును గలుగకుండ జేయుటయు విశేషసాధన యగును. అంతః కరణములో సంకల్పము, సంస్కారము, వృత్తి నశించిన హృదయమైనచో గాలిలేని స్థలమున వెలుగుచుండు దీపశిఖవలె జ్ఞేయవస్తువు మాత్రమై నిలకడ గలిగియుండును. అయితే దీపము వెలుగవలసియుండిన ప్రమిద, వత్తి, తైలము ముందుగా నుండవలయును.

అలాగున జ్ఞానజ్యోతి వెలుగవలసియుండిన వైరాగ్యమను ప్రమిద, భక్తియను తైలము, చిత్తైకాగ్రతయను వత్తియు మొదటనే గలుగవలయును. ప్రమిద, వత్తి, తైలము, స్త్రీలుగాని, పురుషులుగాని, బ్రాహ్మణులుగాని, బ్రాహ్మణేతరులుగాని, గృహస్థులుగాని, సన్యాసులుగాని, మఠములోగాని, గుహలోగాని, స్వగృహములోగాని పెట్టి వెలిగించినను ఆ దీపము వెలుగు చుండును. ఆ మూడు వస్తువులు లేనిచో, ఎవరున్ను ఎచ్చటను దీపము వెలిగింప సాధ్యము గానట్లుండును. దీపము వెలిగిన గృహాంతరాళములో నుండు సమస్త వస్తువులును కనుపించును. దీపము లేనిచో, కారుచీకటిలో తమకు ఇతర ఏవస్తువును కనపడనట్లు, అజ్ఞానమనెడి అంధకారములో నుండువారు అతని ఆత్మను దైవమును దైవమహిమను ఎరుంగజాలరు.

శనైశ్శనై రుపరమే బుద్ధ్యా ధృతి గృహీతయా।
ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చిదపి చిన్తయేత్॥ అ.6 శ్లో॥ 25

ధ్యానాభ్యాసి యెట్లుండవలయునో, ఆ విషయమును శ్రీకృష్ణుడు కరుణరసముతో నుపదేశించియున్నాడు. నెమ్మది నెమ్మదిగా అభ్యాసము ప్రారంభింపవలయును, మోక్షమార్గము ఏటవాలుగా నున్నని బండపై పాచిపట్టునపుడు నడచినట్లుండును. కొంచెమైన అజాగ్రతపడిన జారిపడునట్లు పతనము గలుగును. మరియు అది వానాకాలమున మట్టిగోడ కట్టినట్లుండును. తొందరతో కట్టిన అంతయు విరిగిపడిపోవునట్లుండును. ఒక్కొక్క మూరెడు కట్టి అది యెండినతర్వాత మరల కట్టిన యెంత యెత్తైన గృహనిర్మాణమైనను జేసుకొనవచ్చును. అంతేగాక, అగ్గిపుల్ల వెలిగించి పెట్టి చిన్నపుల్లలు వేసి అగ్గి వెలిగించినట్లుండును. మొట్టమొదటనే గొప్ప వైరాగ్యము బూని కఠిన సాధనలు చేసిన విఘ్నము గలుగును. అంతేగాదు, రోగముచే జీర్ణశక్తిలేని రోగికి ఔషధమిచ్చి జీర్ణశక్తిని పరశోధించి కొంచెము కొంచెము ఆహారమిచ్చి సంరక్షించినట్లుండును. అట్లుగాక ఆరోగ్యము గలుగవలయునని ఉత్సాహముతో మంచి మంచి పదార్థముల నిచ్చిన జీర్ణశక్తి లేనందుచే రోగము మరింత అభివృద్ధియగునట్లు, సాధకునకు రోగాదులు గలిగి భంగము గలుగును. కనుకనే "శనైశ్శనైః" అని రెండు సార్లు తెలుపడమైనది. కట్టకడకు దైవచింతన తప్ప మరి యే చింతయు గలుగకూడదని యుపదేశించడమైనది.

**యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్।**
**తే ద్వంద్వమోహనిర్ముక్తాః భజంతే మాం దృఢవ్రతాః॥అ7.శ్లో॥ 28**

చిత్తశుద్ధికి కారణములైన పుణ్యకర్మల నాచరించిన యేజనుల యొక్క పాపమైతే నాశనము పొందినదో అట్టివారు రాగద్వేషములే నిమిత్తముగా గల శీతోష్ణాది ద్వన్ద్వములచేత విడువబడినవారై, దృఢమైన వ్రతనిష్ఠగలవారై నన్ను పొందుచున్నారు. ఈశ్లోకముచే పుణ్యకర్మలవల్లనే పాపమునశింపవలయుననియు, అట్టి పాపరాహిత్యము గలవారికే తన వ్రతము, తన బ్రహ్మనిష్ఠ దృఢముగా నిలుచు ననియు, తక్కినవారి యనుష్ఠానములన్నియు విఘ్నములు గలిగి భ్రష్టత్వమునొంద

గలవనియు నుపదేశించడమైనది. కావున కొందరు ప్రారంభించిన వ్రతముగాని తపస్సుగాని ధ్యానముగాని అనుష్ఠానముగాని అపుడప్పుడు విఘ్నములచే భంగమగుటకు కారణము, అది లోపల పాపముండుటే. మురికిగల వస్త్రము శుభ్రముగా నుతికి అది రంగులోముంచిన ఆ రంగు నిలుచును. అది పోదు. అట్లుగాక యెంత మంచి రంగులో ముంచినను నీటిలోముంచిన వదలిపోవును. ఇది చాలా గొప్ప రహస్యము. ఇదిన్ని ముముక్షవులందరు బహుజాగరూకతతో జ్ఞాపకముజేసుకొన దగినది. ఈ తత్త్వమెరిగిన పుణ్యకర్మమేల జేయువలయునో తెలియగలదు!

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్।**
**యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్॥** అ 8శ్లో 13

అంత్యకాలములో ఎట్టి ధ్యానము గలిగియుండిన పరమాత్మ ధ్యానము గలుగునో లేక పరమాత్మలో నైక్యము గల్గునో యని అర్జునుడు అడిగినదానికి ఓంకారమును ధ్యానము చేయువలయుననియు, అంతటితో తృప్తిపొందగూడదనియు, దైవభావముగలిగి యుండవలయుననియు ఉపదేశించడమైనది. ఈలాగున నెవడైతే శరీరమును వీడిపోవునో వాడు సర్వోత్తమమగు బ్రహ్మపదమును పొందగలడని ముముక్షువులకు ధైర్యము గలిగేలాగున జెప్పబడినది. ఈ విషయమై ప్రణవధ్యానము అందరున్ను చేయవచ్చునా యని యెవరైన అడిగినచో భగవద్వాక్యము నమ్మవలయునా! మీ వాక్యము నమ్మవలయునా? యని శాంతముతో సమాధానము చెప్పిన చాలును. అయితే యీశ్లోకమందొక కీలకము గలదు. అదేమన, ''మామనుస్మరన్'' ప్రణవముతోగూడ పరమాత్మభావము గలిగి యుండవలయునని దెలుపడమైనది. అట్లు కానిచో, మందుమాత్రము వేసుకొని గుండు మాత్రము వేయని మరఫిరంగి శబ్దమువలె నుండును. ఆ శబ్దము లక్ష్యమును భేదింపజాలదు. మరియు లోపల గింజలేని వట్టి టెంకె మాత్రము మొలవేసిన యెట్లు మొలవజాలదో, అలాగున ఏ

మంత్రమైనను ఏ ధ్యానమైనను ఆ మంత్రము యొక్క దైవభావము గలిగి యుండవలయును. అదే దీనిలో గల సారము.

**వేదషు యజ్ఞేషు తపస్సుచైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్।**
**అత్యేతి తత్సర్వమిదం విత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యమ్॥**
అ. 8 శ్లో॥ 28.

చిత్తైకాగ్రతతో పరమాత్మను ధ్యానము చేయువాడు ఏ ఫలము పొందుచున్నాడో దానిని యిచట నిరూపించడమైనది. వేదములన్నియు అర్థముతో కడవలకు చదివిన ఏ ఫలము గలుగునో, యజ్ఞము లన్నియు జేసిన యే ఫలము గలుగునో, తపస్సు లన్నియు నొనర్చిన ఏ ఫలము గలుగునో, దానము లన్నియు జేసిన యే ఫలము గలగునో, ఆ పుణ్యము లన్నిటిని పైభాగమందుండు పరమాత్మను ధ్యానము చేయువాడు పొందగలుగను. ఇది బీద భక్తులు గురించి భగవంతుడు కరుణతో చెప్పడమైనది. కొందరు మేము సంస్కృతము చదువలేదే! గీతోపనిషత్తుల నెట్లుపారాయణము జేయగలము? మాకు ధనము లేదే, యే పుణ్యకర్మచేయుటకు గూడ లేకపోయెను గదా? యని తలంచువారున్ను, మరికొందరు మేమేకాంతమునకు బోయి తపస్సు చేయజాలక పోతిమిగదా యని చింతించువారు కొందరు, మేము కడుదరిద్రులము, ఏ దానధర్మములను జేయకపోతిమిగదా! యని దుఃఖించువారు కొందరు నుందురని తలంచి యీ శ్లోకముల నుపదేశించడమైనది. ''అత్యేతి తత్సర్వం'' అని నిరూపించడమైనది. పై జెప్పిన వాటి అన్నిటి యొక్క ఫలము అతి స్వల్పమైనది. భక్తిచే గలిగెడు ఫలము అధికమైనది అని నిరూపించడమైనది. కావున బీదభక్తులు సంతావ పడనక్కరలేదు. ధ్యానము మనచేతిలో నుంటున్నది గదా! అన్నిటికిన్నీ యెక్కువ ఫలమగు ధ్యానమును మాత్రము చేయుచుండిన చాలును. మరియు మేము వేదములు చదివిన వారము, మేము యజ్ఞములను జేసినవారము, మేము తపస్వులము, మేము గొప్ప దానము చేయువారము అని గర్వించి, ధ్యానము లేనిచో మోక్షము గలుగదని

ఉపదేశించడమైనది. అయితే దీనియందొక రహస్యము గలదు. ఈశ్లోకము నాధారము జేసుకొని కొందరు భక్తులు లోభము గలిగి తమకు సర్వేశ్వరుడిచ్చినంతలో దాన ధర్మము చేయకపోతున్నారు. అది మేము సాధువుల మని చెప్పి, తమకు గల భూమి యొక్క శిస్తును చెల్లించకయున్నట్లుండును. అట్లయిన అది జప్తు చేసి వేలముపాడినట్లుండును. ఇదిన్ని జ్ఞాపకము చేసికొన వలసియుండును.

**అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥**

అ.9 శ్లో॥ 22

ఏ జనులైనను అనన్య చింతగలిగి పరమాత్మను ధ్యానించుచుందురో సర్వకాలముల యందును నిశ్చయాత్మక చిత్తము గలవారైన వారి, యోగక్షేమములను నేను వహించుచున్నాను. అనగా భగవంతుడే నిర్వహించు చున్నాడని భావము. యోగమనగా లేని దానిని కలిగించుట. క్షేమమనగా కలిగిన దానిని కాపాడుట. ఇచట అనన్యచిత్తమునకు అనేక అర్థములు వచింతురు. ప్రతివ్రతయైన స్త్రీ, తన పతిని తప్ప ఎట్లు ఇతరులను చింతన చేయదో, ఆలాగున విష్ణుభక్తిగలవారు శ్రీ మన్నారాయణుని, శివభక్తిగలవారు పరమేశ్వరుని తప్ప, ఇతర దైవములను స్మరించుటగాని పూజించుటగాని చేయరాదని చెప్పుదురు. అట్లు చేసినచో వ్రతభంగముగల స్త్రీని పతి ఉపేక్షించునట్లు ఆ నారాయణుడు గాని, శివుడుగాని, యీ భక్తులను నుపేక్షించుదురనియు, వ్రతహీనురాలైన భార్యను భర్త కోపించునట్లు ఈ భక్తులపై పైజెప్పిన దైవములు కోపముగలిగి యుందురనియు వచింతురు. ఇదిన్ని ఒకవిధమైన భక్తియైనను దీనికి మూఢభక్తి యని పేరు. అట్లు చెప్పువారు చాలసంకుచిత హృదయము గలవారు. అట్లు చెప్పిన మాత్రమే తమ సంఘమునుండి యీ జనులు యితర సంఘములలోనికి పోవక యుందురని తలంపు. ఇంతతో పూర్తిగాక, యితరభక్తులతో మాట్లాడుటగాని,

యితర దైవముల పేర్ల నుచ్చరించుటగాని, యితర దేవాలయములలోనికి వెళ్ళుటగాని కూడదని వచింతురు. ఇది యెటువంటి పతిభక్తియనగా, ఒక మూఢురాలగు స్త్రీ తన ''భర్త'' యొక్క సోదరులు భర్తను ''అన్నా'' యని పిలుచునప్పుడున్ను, మాతాపితరులు ''నాయనా'' యని పిలుచుచున్నప్పుడున్ను, మిత్రులు తన సొంతపేరుతో పిలుచునప్పుడున్ను, ఇక యితరులు వరుసగా నెట్లు పిలువవలయునో ఆలాగున పిలుచునప్పుడున్ను వీర్లపై ఆ స్త్రీ అట్లు పిలువగూడదు భర్త యని పిలువుడు, ''యజమాని'' యనిపిలువుడు, ''స్వామీ''యనిపిలువుడు- అని పోట్లాడుటకు వెళ్ళినట్లుండును.

మంచి వివేకముగల స్త్రీ యైనచో, అత్తమామలను సేవించుట, అతిథి, అభ్యాగతులను ఆదరించుట, బంధుమిత్రులను సత్కరించుట, పెద్దలపై వినయముగలిగి యుండుట, చిన్నవార్లగు మరదులుండినచో వారిని ఉచితానుసారముగా పోషణాదులు చేయుట గలిగియుండును. భర్త విషయములో చేయవలసిన అంతరంగకార్యములు జేసుకొని, తక్కిన కుటుంబకార్యముల నన్నింటిని మేధాశక్తితో నిర్వహించుట గదా తెలిసినందుకు యుపయోగము! ఆలాగున తన యిష్టదైవమునందు చిత్తము నిల్పి ధ్యానించుటయు, ఇతర భక్తులపై ప్రీతిగలిగి యుండుటయు వివేకముతో గూడిన అనన్య భక్తియగును. 2. ఈ చెప్పబోయెడు భక్తి పై జెప్పినవానికన్న వెయ్యిరెట్లు ఎక్కువైనదియున్ను, విశాలమైనదిగాను, ఆత్మశుద్ధిగలదిగాను నైయుంటున్నది. వీరు తమ యిష్టదైవమునందు తన ధ్యానమందు నిశ్చల హృదయము గలవారైయుండి, యితరభక్తులలో, యితర సమాజములలో, యితర దేవతా మందిరములలో ప్రీతి గలిగియుందురు. వీరిది శివభక్తియైనను, శ్రీ కృష్ణభక్తియైనను, శ్రీరామ భక్తియైనను ఉండవచ్చును. ఇది ఒకవిధమగ అనన్య భక్తియొక్క స్వరూపమగును. 3. ఈ చెప్పబోయెడి భక్తి పైజెప్పిన రెండవదానికన్న వెయ్యి రెట్లధికమైనది, పావనమైనది, విశాలమైనది. వీరు అనేకత్వములో ఏకమైయుండు పరమాత్మను జూచువారు. అనేకరకములగు పూసలలో దారమొక్కటియే వ్యాపించియున్నట్లు చరాచర

ప్రాణికోట్లలోను తనయందును అంత ర్యామియై వెలుగుచుండు వాడా సర్వేశ్వరుడే యని జ్ఞానము గలిగి యుందురు. ఇప్పటికి ఇట్టి అనుభవము గలవాడు చాల యెత్తయిన స్థితికి రావడమైనది. ఉపనిషత్తులలో నెక్కువభాగమున ఇట్టి దైవారాధనయే కనుపించుచున్నది. 4. ఇపుడు చెప్పబోయెడు భక్తి ఉపనిషత్తులయొక్క అంతిమభాగము. వేదాంతమున కనందగును. ఈభక్తి పైజెప్పిన 3వ భక్తికన్న సహస్రాధికమైనది. అంత విశాలమున్ను పావనత్వమున్ను దీనియందు గలిగియున్నది. దీనికిపైన మరియొకటి లేదు. ఇది కట్టకడపటి భక్తి యగును. ఇందు అనేకత్వ మనునది లేదు. ఏకత్వమైయుంటున్నది. మృత్పాత్రములు అనేకములుగా కనుపించినను ఒక్క మట్టియే. ఆభరణములు బహువిధములుగా యుండినను ఒక్కసువర్ణమే. యంత్రములు బహుతెరంగులుగా యుండినను ఒక్కలోహమే. ఫల, పల్లవ పుష్ప లతాదులతోను, బహువిధరంగులు గల కుసుమములతోను కనుపించెడు వృక్షము ఒక్కబీజము నుండి యేర్పడినదే. అట్టి నిశ్చయాత్మకమైన జ్ఞానమే అనన్యభక్తి యొక్క అంత్యస్థితి యగును. ఇక ఈ విషయమై అనేక కథలు గలవు. ఈ అనన్య భక్తులలో ఎవరెవరి భక్తి యెంత స్థితికి వచ్చియున్నది యని యాలోచించుకొనవలయును. ఇటువంటి వారి సకల కార్యములను సర్వేశ్వరుడే నిర్వహించును.

**అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।**
**సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥ అ.9. శ్లో॥ 30**

మిక్కిలి నింద్యములైన ఆచారముగలవాడైనప్పటికిన్ని అనన్యభక్తి గలిగి భగవంతుని భజించిన యెడల మంచి విశ్వాసము గలవాడుగనుక అట్టివాడు మంచి సదాచారము గలవాడే యగును అని తలంచవలయును. శ్రేష్ఠమైన దివ్య ఔషధసేవ పథ్యముతో జేసిన ఏలాగున త్వరలో రోగము శమించి ఆరోగ్య వంతుడగునో, ఎంతమురికి వస్త్రము అయినను చవుడువేసి వుడుకబెట్టి చాకలివాడు వుతికినచో శుభ్రమైన వస్త్రమగునో, ఎంతమలినమైన బంగారు అయినను స్పుటము జేసిన

దోషము నశించి యెట్లు శుద్ధమైన సువర్ణమగునో, అలాగున ఎంతపాపియైనను పరమాత్మధ్యానమువలన శుద్ధుడగునని ఇది ఎంతో కరుణతో నుపదేశించెను. కావున జనులారా! మీలో నెవరైన యెక్కువపాపము చేసినవారుండిన, వారు త్వరలోనే భగవచ్చింతన ధ్యానాదులు చేయవలయును. ఎవరి రోగము అపాయస్థితిలో నుండునో వారికే వైద్యులు ముందుగా ఔషధము ఇచ్చేలాగున చూడవలసి యున్నట్లు, ఎవరు మిక్కిలి పాపము జేసినవారుందురో వారికే ముందుగా మహాత్ములు భగవద్భక్తిని బోధింపవలయును.

అయితే ఔషధసేవ చేయ ప్రారంభించిన యే కారణమువల్ల యీ రోగము గల్గినదో, అట్టి కార్యమును చేయనీయక చూడవలయును. పథ్యమున్ను బాగుగా చేయనిచో వైద్యుడు గూడ మంచి మందు యివ్వడు. దీనియం దొక రహస్యము గలదు. కొందరీలాగున చెప్పుదురు. పాపులను దగ్గరకు చేరనీయ కూడదు. కలరా మొదలగు అంటుజాడ్యముల గల వారి దగ్గరకు పోనీయక దూరముగా నుండవలయునని చెప్పుచుందురు. ఈ వచనమువల్లనే అతని యొక్క అసమర్థత బయలుపడుచున్నది. రోగియొక్క సాంకర్యక్రియలు తనలో చేరనీయకుండుటకు, తగిన ఔషధము తనయందు లేదు. అంతేగాదు, ఇతడు యేదియో స్వల్పవైద్యము నేర్చుకున్నవాడు. అదే గవర్నమెంటునుండి అధికారము పొందివచ్చిన డాక్టరు అయినచో అతడు ఎటువంటి రోగియైనను దగ్గరకు వెళ్ళి తగిన మందిచ్చి సంరక్షించుటయే గాక ఆ వ్యాధి తన్ను స్పర్శింపజేయకుండుటకు తగిన ఔషధము వాడుచుండును. అలాగున ఈశ్వరాజ్ఞవల్ల లోకోద్ధారకము కొఱకు జన్మించిన మహాత్ముడైనచో, అతడు పాపులను పవిత్రమొనర్చుటయందే సదా ప్రవర్తించును. అతనిని పాపము స్పర్శింపజాలదు. క్రీస్తు, మహమ్మదు, బుద్ధుడు ఇట్టి తెగలో జేరినవారు. తక్కినవారు వాచావేదాంతులు.

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాః తేఽపి యాంతి పరాం గతిమ్॥
అ.9 శ్లో॥32.

ఓ యర్జునా! పాపయోనులలో జన్మించినవా రెవరు గలరో, అట్టి వారున్ను, స్త్రీలున్ను, వైశ్యులున్ను, శూద్రులున్ను నన్నాశ్రయించి సర్వోత్తమమైన గతిని పొందుచున్నారు. ''కిం పునర్బ్రాహ్మణాః పుణ్యాః భక్తా రాజర్షయస్తథా'' ఇట్లుండ పుణ్యాత్ములగు బ్రాహ్మణులను గురించియు, భక్తులగు రాజులను గురించియు మరల చెప్పవలయునా! ఓహో! భగవంతు డెంత కరణారసముతో ఉపదేశించినాడు. అయితే అది వట్టిమాట మాత్రమా! అనుభవ మేదేని గలదా యని పరిశోధింతుము. ''విభీషణుడు'' ఏ కులములో బుట్టెను ? శబరి యే జాతిలో పుట్టెను? ప్రహ్లాదుడు ఎచ్చట జన్మించెను? కుబ్జ యే వంశములో జన్మించెను? గోపికాస్త్రీలు ఏజాతిలో జన్మించినవారు? ధర్మవ్యాధుడు ఏ జాతిలో పుట్టినవాడు? విదుర, ఉద్ధవ, సూతాదులు ఏ కులమున నుద్భవించిరి? తులాధారాదులు ఏ వంశములో జాతులైరి? వీరందరున్ను మహావేత్తలు, పరమభక్తులు, మహాత్ములు అయిరిగదా! ఎందువల్ల? పరమభక్తి వల్లనే. ఇట్లుండగా క్షత్రియులగు విశ్వామిత్రాదులు, బ్రాహ్మణులగు అగస్త్యాదులు ముక్తులయిరని చెప్పుట యొక యాశ్చర్యమా! ఓహో భక్తులకు ధైర్యము గలగుటకు యెంత దయతో భగవంతుడు చెప్పినాడు. ఇకను సందేహ మని చెప్పిన యెవరు చెప్పగలరు?

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతి పూర్వకమ్।**
**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే॥**

అ.10 శ్లో॥ 10

ఏ జ్ఞానయోగముచేత అనన్య భక్తిగలవారు నన్ను పొందవలయునో ఆ జ్ఞానమును ఏకాగ్రచిత్తులై ప్రేమతో ధ్యానించువారగు నట్టివారికి నేను ఇచ్చుచున్నాను. అనన్య భక్తితో భగవంతుని చెందుటకు ఏ జ్ఞానము గలుగవలయునో, దానిని అంతర్యామియై వారి లోపల బోధము గలుగజేయుటగాని, లేక స్వప్నరూపకమునగాని, లేక మహాత్ములను వారికి తటస్థించేలాగున జేసిగాని, వారిని జ్ఞానవంతులునుగా జేయుదును. లేక ఫలాని స్థలములో ఫలానివారు గలరు.

వారి నాశ్రయించి తరింపవలయునని కలలోనైన చెప్పి భక్తులను తరింపజేయుదును. తోతాపురియను యోగి రామకృష్ణపరమహంసలకు దైవాజ్ఞ కారణమువలననే వచ్చి దైవత్వము నుపదేశించిరి. ఈలాటి గాథ లెన్నియో గలవు. కావున మంచి గురువు దొరకలేదు. శాస్త్రజ్ఞానము దెలియలేదు అని భక్తులు తపింప నక్కరలేదు. భక్తుల భవసాగరమునుండి తరింపజేసెద, అను భగవంతుని ప్రతిజ్ఞారూపకమైన వాక్యముపై విశ్వాసము గలిగి అనుష్ఠానము జేయుచుండిన చాలును.

**కీర్తి శ్శ్రీర్వాక్చ నారీణాం, స్మృతిర్మేధా ధృతిః క్షమా. 22.శ్లో॥ 34.**

స్త్రీలలోగల కీర్తియు, లక్ష్మియు, ప్రేమపరమగు వాక్కున్ను, జ్ఞాపక శక్తియు, మేధాశక్తియు, దైవకార్య నిర్వహణమందుగల ధైర్యమున్ను, కష్టము లను సహించి ధర్మకార్యము నిర్వహించెడు ఓర్పున్ను నా అంశమైయుంటున్నది. మాతృస్వరూపిణులగు తల్లులారా, మీపై భగవంతుని కెంత కరుణారసము గలదు! పురుషులలో, రాజులలో, తపస్వులలో, జ్ఞానవంతులలో ఒక్కొక్క భగవదంశమే చెప్పి, మీయందు నేడంశములు భగవదంశములు గలవని చెప్పుటలో మీయందుగల దయ యేమని చెప్పవచ్చును! అట్టి మిమ్ములను పాపులని చెప్పుటయున్ను మిమ్ములను మీరు పాపులని తలంచుటయు ఎంత పొరబాటో దీనివలన తెలిసికొనవచ్చును గదా! కావుననే మాతాపితరులు, భార్యాభర్తలు, జననీ జనకులు, సీతారాములు, లక్ష్మీనారాయణులు, పార్వతీ పరమేశ్వరులు అనిగల సర్వనామములలోను స్త్రీ శబ్దమే ముందేర్పడి, తర్వాత పురుషశబ్దమేర్పడుచున్నది. దయను గురించి చెప్పునపుడు తల్లితో సమానముగా జూచినారు అని దయావిశేషమును గురించి కొందరు చెప్పుట, మరియు ఒకడు సన్యసించిన, అతని తండ్రియున్ను, తాతయున్నూ, ఆ యతివరునకు నమస్కరింప వలసియుండును. ఆపరివ్రాజకుడున్ను వారల నాశీర్వదింపవలయును. తల్లి కొకతెకు మాత్రమే యతీశ్వరుండు నమస్కరింప వలయును. జననియు అపరివ్రాజక కుమారుని శిరముపై హస్తమునుంచి అనుగ్రహము జేయవల యును. దీనివల్లనే మాతృమహిమ

యెంత గొప్పదో తెలిసికొనవచ్చును. అయితే గోవులుండు ప్రదేశములలోనికి వ్యాఘ్రమువచ్చిన, ఆవులన్నియు పారిపోవునట్లు భగవంతుడు ఏ దివ్యగుణముల నేడింటిని స్త్రీలలో నుంచియున్నాడో, వానికి విరుద్ధమగు క్రూరకోపాదులు హృదయములో ప్రవేశించిన శ్రీమన్నారాయణుడు స్త్రీలపై అనుగ్రహ పూర్వకముగా నుంచియుండు దైవగుణములు పారిపోవును. ఇదిన్ని జాగరూకతతో జూచుచుండవలయును.

నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥ అ.11.శ్లో॥53

భక్త్యాత్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥ అ. శ్లో॥54

ఓ అర్జునా! నన్ను ఇపుడు ఎట్లు విశ్వరూపదర్శిగా జూచినావో, అట్టిది వేదములు అర్థముతో చదివినవారికిన్ని శక్యము గాదు. కేవలము ఫలాపేక్షతో జేయు తపస్సుచేతను జూచుటకు సాధ్యుడను గాను. అనేక దానములచేతను జూచుటకు సాధ్యుడను గాను. అనన్యమైన భక్తి యొకదానిచే మాత్రమే యథార్థముగా నన్ను తెలిసికొనుటకున్ను, దర్శించుటకున్ను, నా యందైక్యమగుటకున్ను సాధ్యమగును. కావున జనులారా, వేదము చదువలేదు, తపస్సు చేయలేదు, దాన మొనర్చలేదు, గాన అట్లుండ మనకెట్లు భగవత్ప్రీతి గలిగి మోక్షము గలుగునని సందేహింప నక్కరలేదు. భక్తికి నిర్మలమైన మనస్సు ఒకటి చాలును, ఆ జాతి యీ జాతి యను భేదము లేదు. అయితే అది నిర్మలభక్తియై యుండవలయును. దానివల్లనే అంతఃకరణము శుద్ధమై భగవతత్త్వము తెలసికొనుటకు, భగవత్సాక్షాత్కారమునకున్ను, భగవంతుని యందైక్యము చెందుటకున్ను కారణమగును. తైల మేలాగున జ్యోతియై మారుచుండునో, వెలుతురులో అన్నియు నెట్లు కనుపించునో, ఆత్తరి చీకటి యేలాగున దగ్గరకు రాజాలదో, ఆలాగున నిర్మలమైన భక్తియే జ్ఞానజ్యోతియై మారి భగవత్సాక్షాత్కారమును

గలుగజేసి మరల అజ్ఞానమును తన దగ్గరకు రానీయక చేయుచుండును.

**ధ్యానేనాఽఽత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా।**
**అన్యేసాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥ అ. 13. శ్లో॥ 25**

**అన్యే త్వేవమజానంత శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।**
**తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతి పరాయణాః॥ అ.13.శ్లో॥26**

భగవంతుని యెన్ని విధములుగా పొందవచ్చునో ఆ విషయ మిచట నిరూపించబడుచున్నది. కొందరు ధ్యానయోగముచేతను, కొందరు ఆత్మానాత్మ విచారణపరమగు జ్ఞానముచేతను, కొందరు సాంఖ్యయోగముచేతను, మరికొందరు నిష్కామ కర్మయోగ నిష్ఠచేతను పరమాత్మను పొందుచున్నారు. కొందరు పరమ భక్తులు ధ్యానయోగ మభ్యసించుటకున్ను, ఆత్మానాత్మ విచారణచేయుటకున్ను 24 తత్వములు శోధించెడు సాంఖ్యయోగముచేయుటకున్ను, ఎల్లప్పుడు పరోపకారపరాయణులై నిష్కామకర్మయోగ మాచరించుటకు సాధ్యములేని వారలై, శక్తిలేనివారలై మోక్షము మాత్రము గావలయునని మిక్కుటముగా ప్రీతి గలిగియున్నారు. వారి గతి యేమి అని అడిగినచో వారికి గూడ మార్గ ముపదేశించినారు.

మంచి బ్రహ్మనిష్ఠులైయుండువారి నాశ్రయించినచో వారు జెప్పెడు ధ్యానాదులందు విశ్వాసము గలిగియుండిన వారున్ను జనన మరణ భవసాగరమును దాటి మోక్షమనెడి భగవంతుని జేరవచ్చును. దీనికన్న నింక కరుణారసమేమి చెప్పవలయును? రోగియైనవానికి వైద్యశాస్త్రము తెలియక పోయినను మంచి వైద్యునాశ్రయించి అతడిచ్చు ఔషధమును మంచి పథ్యముగలిగి సేవించిన నెట్లు రోగవిమోచనము గలుగునో, పైజెప్పినదిన్ని అటువంటిదే. అయితే గొప్ప డాక్టరు పరీక్షలో నుత్తీర్ణుడై నను తనకు రోగము గలిగిన యేమియు చదువురానివారికిచ్చిన ఆ ఔషధమునే తాను కూడా భుజించుచు లెస్సగా పథ్యముగానుండిన మాత్రమే

రోగశాంతి గలుగును. అలాగున శాస్త్రములు మాత్ర మపారముగా జదివినను బ్రహ్మనిష్ఠ అనుష్ఠానమున్ను, వైరాగ్యమున్ను లేనిచో ఎట్టివారికిన్ని భగరోగము శమించదు.

**యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవ స్థితమ్ ।**
**యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్య చేతసః ॥**

అ. 15 శ్లో॥ 11

బుద్ధియందుండు ఆత్మను ధ్యానయోగపరులగు యోగులు పొందుచున్నారు. ఆలాగున పుణ్యాత్ములవలె వేషములు వేసికొని వేదాంతము చెప్పుచుండువారు కొందరాత్మను దర్శింపదలచినను వారు చూచుట లేదు. ఎందుకనగా చెడు సంస్కారములను సంస్కరించుటలో వారు యత్నించుట లేదు. వారు బాహ్యవేషములలో ఆసక్తులైయున్నారే గాని, అంతఃకరణ శుద్ధికొరకు ప్రయత్నించుట లేదు. అందువలన ఆ కపటయోగులు పొందలేకున్నారు. ఎట్లన ఒక కర్షకుడు తన భూమిని బాగుగా దున్ని చక్కని విత్తనము వేసి బాగుగా పైరును పండించెను. దీనిని చూసి మరియొక్కడు సమీపమున కొంతభూమిని కొని దున్ని పై జెప్పిన వాడేసిన విత్తనమునే వేసినాడు. కాని తన భూమి చవిటి ప్రదేశము అగుటచే స్వల్పమైనను పండకపోయెను. మొదటివాని భూమి మంచి సారవంతమైనదిగా నుండెను. ఆలాగున ఆత్మశుద్ధి, విషయ వైరాగ్యము, సత్యము జీవరాసులలో ప్రేమ మొదలగు దైవగుణములులేని బాహ్యానుష్ఠానము లెవ్వియు ప్రయోజకములు కాజాలవు. అయితే అతని జన్మము ఆలాగున వ్యర్థమై పోవలసినదా యని విచారపడనక్కరలేదు. చవుడు విరిగెడు కొన్ని ఆకులు, పట్టలు, కంపెనీ యెరువులు గలవు. వానిని వేసిన చవుడు విరిగి మరల బాగుగా పండును. ఆలాగున కుబుద్ధులు, కుయుక్తులు, మోసముగల బాహ్యాడంబర యోగులు సత్యము, కరుణ, విరక్తి మొదలగు పవిత్రవర్తనము గలిగియుండినచో వారున్ను అచిరకాలములో ధన్యాత్ము లగుదురు. నవీనముగా నేడు పెట్టుచుండిన ఎలక్ట్రిక్

కరెంటు పవరుచే చవుడంతయు భస్మమై అట్టి భూములు మంచి సారవంతములగు పొలములు అగుచున్నవి. ఇదే అనుష్ఠానముయొక్క ప్రయోజనము.

**వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః।**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥ అ.18 శ్లో॥52**

ఈ యధ్యాయమున 50,51,52 ఈ మూడు శ్లోకములున్ను బ్రహ్మవిద్య యొక్క సాక్షాత్కారమును గురించి సంక్షిప్తముగా నుపదేశించడమైనది. ఇది కృష్ణపరమాత్మయొక్క అన్తిమోపదేశమగును. ప్రతిబంధములేని ప్రదేశమం దుండు వాడును, అర్ధ కడుపు శుద్ధాహారము గలవాడును, మనోవాక్కాయ కర్మల స్వాధీనమందుంచువాడును. శ్రేష్ఠమైన వైరాగ్య మవలంబించి ధ్యానయోగ పరుడై యెవడుండునో అతడు బ్రహ్మసాక్షాత్కారము కొఱకు కర్హుడగుచున్నాడు. ''ధ్యానయోగపరో నిత్యం'' అని చెప్పుటచే జీవన్ముక్తి గలుగువరకు నిత్యము ఎడ తెగక ధ్యానము గలిగియుండవలయునని అర్థమైనది. మరియు మంత్ర, లయ, హఠ రాజయోగముల నాల్గింటిలో ధ్యానయోగమే శ్రేష్ఠమైనదని భగవంతుడే తెల్పుడమైనది. ఎందుకనగా! వేదాంత విచారణ పరమగు మేధాసంపత్తి లేని వారికది సాధ్యము గాదు. ప్రాణాయామాది హఠయోగములు పరిశీలించుటకును అందరికిన్ని సాధ్యము గాదు. కావున ధ్యానయోగము సర్వ జనులకు సులభమైనది. కాని ధ్యానముచేయువాడు ధ్యేయాకారము మరుపు గలుగక చూచుచుండవలయును. ధ్యేయాకారము స్పష్టముగా ప్రకాశింప వలసియుండిన హృదయమును యొక్క ఆవరణ లన్నియు తొలగిపోవలయును. ఇది చిరకాలానుష్ఠానముచేతనే సిద్ధించును. ఇన్ద్రియములన్నియూ స్వాధీనములై యుండవలయును. బాణముచే గుఱిని కొట్టతలంచువానికి కరచరణ నేత్రాదు లెట్లు నిశ్చలముగానుండవలసి యుండునో, ఒకవేళ సాధనవల్ల అది కలిగినను, లక్ష్యము ఏలాగున స్పష్టముగా కనుపించవలయునో, లేనిచో నిశ్చలముగా విడచిన బాణము అయినను గురుతులో ప్రవేశింపజాలదో, గురి బాగుగా కనుపించినను

కరచరణములకు నిశ్చలత్వము లేనిచో విడిచిన బాణము గూడఎట్లు గురి తప్పిపోవునో, ఆలాగున సాధన పాటవముచే ఇంద్రియముల యొక్క యేకాగ్రతయను యోగమున్ను, ఆత్మతత్త్వ విచారణపరమగు జ్ఞానమున్ను గలుగునపుడే బ్రహ్మమును పొందగలుగును. అపుడు చలనము లేని వానిచేత స్పష్టముగా దృష్టికి గోచరమగు లక్ష్యమును బాణముచే భేదించునట్లు ప్రకృతికి వేరగు పరమాత్మను పొందగలుగును.

**య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి।**
**భక్తిం మయి పరాం కృత్వా మామేవై ష్యత్యసంశయః॥**
అ. 18 శ్లో॥ 68

ఎవడు సర్వోత్తమమును, అతి రహస్యమును అగు ఈగీతాశాస్త్రమును నాయందు భక్తిగలవారికి జెప్పునో అట్టివాడు నాయందు శ్రేష్ఠమైన భక్తిని జేసినవాడై నన్ను పొందుచున్నాడు. ఇందుకు సందేహము లేదు.

**న చ తస్మా న్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।**
**భవితా న చ మే తస్మాత్ అన్యః ప్రియతరో భువి.** అ.18. శ్లో॥ 69

మనుష్యులలో నా భక్తులకు గీతను చెప్పునట్టివానికంటె అధిక ప్రియమును చేయువాడు మరియొకడు నాకు లేడు. భూలోకమందు వానికంటె ఇతరుడు మిక్కిలి యిష్టుడు నాకు గలుగడు. దీనియందు ఎవడైతే నా భక్తుల కొఱకు గీతను బోధించునో, వానికంటె నా విషయమై మిక్కిలి ప్రీతికరమగు కార్యము జేయువాడు, భూత భవిష్యద్వర్త మానకాలములో గూడ నాకు లేడు- అని చెప్పుటలో గీత నుపదేశించువారిపై భగవంతుని కెంత కరుణారసము గలిగియున్నదో దెలియదగును. దీనియందు ఎవడైనను అని చెప్పుటచే జాతిని గురించి యేమియు ఎత్తలేదు. ఆలాగున ''భక్తేషు'' అని ప్రయోగించుటచే భక్తిగలవారి కెవరికైనను చెప్పవచ్చునని అర్థమగుచున్నది. భగవత్ప్రీతికరమైన పూజచేయువారు కొందరు,

భజనచేయువారు కొందరు, సమారాధనలు జేయువారు కొందరు, తపస్సు జేయువారు కొందరు, యాగము జేయువారు కొందరు ఇంకను పెక్కు విధములుగా అనుష్ఠించువారు గలరు. వీరందరిలోను గీతాప్రబోధము జేయువాడు నాకు మిక్కిలి ప్రియుడని భగవంతుడే స్వయముగా చాటినాడు. రాజు యొక్క ఉద్యోగస్థు లనేకులుండినను, రాజుయొక్క ఆజ్ఞను జనులందరికిని తెలుపువాడు రాజుయొక్క ప్రీతికి ఎట్లు పాత్రుడగునో! అదిన్నీ ఉద్యోగస్థులు జీతము కొఱకు పనిచేయుచుందురు. ఇందువల్ల రాజుయొక్క అత్యంత ప్రీతికి పాత్రులు గారు. సామాన్య ప్రీతిమాత్రమే వారిపై గలుగును. జీతమును గూడ కోరక సదా రాజ ధర్మములనే ప్రజలకు తెలుపువాడుండిన రాజు వానిపై నెంత ప్రీతిగలవాడై యుండునో, నిష్కామకర్మయోగము యొక్క రహస్యమున్ను పవిత్రతయున్ను అట్టిదే. మరియొక రహస్యము గూడగలదు. కూలి కొఱకు పనిచేయువాడు సొంతమువాడు కాడు. సొంతమువాడైన కూలిని కోరడు. కూలివాడు చేయుదానికన్న శుద్ధముగాను, దృఢముగాను ఉండేలాగున జేయును. ఆలాగున ఈశ్వరాంశములలో జన్మించినవారయినచో ఏకొంచెమైనను ఫలమును కోరడు. ఫలాపేక్షతో చేయువారికన్న మిక్కిలి శ్రద్ధగాను, శుద్ధముతోను చేయును. వానికి జీవులు తరింపవలయునని ఒక్క తలంపు మాత్రమే గలిగియుండును. తక్కిన యే తలంపున్ను గలిగియుండడు. అదే దానికి గుఱుతు.

లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు,

ఓమ్ తత్ సత్.

''విద్యలేనివారు పశుప్రాయులని కొందఱు చెప్పుచుందురు. కాని విద్యయుండియు జ్ఞానము లేనివారు పశువులకన్న కనిష్ఠులే''

ఇది మఱువకుడు.

-శ్రీ మలయాళ స్వాములవారు.